# స్వ వి ష య ము

1935 లో విశ్వసాహిత్యమాలను ఆరంభించుటలో మా ఆశయం ఆంధ్రప్రజలకు జాతీయ అంతర్జాతీయ రాజకీయాలపై నా, రాజకీయ సిద్ధాంతాలపై నా ఉత్తమగ్రంథాలను తేట తెలుగులో అందించడమే. అటుతరువాత దేశచరిత్రలు, జీవితచరిత్రలు, వైజ్ఞానిక గ్రంథాలేగాక నవలలు, కథలు, నాటకాలు, మొదలైన వాటిలో సుప్రసిద్ధమైనవి యెంచి, అనువదించి, ప్రచురించాలని నిశ్చయించాము.

విశాలాంధ్రలోని మూడున్నరకోట్ల ఆంధ్రులకు నేడు తమ దేశం, తమ భాష, తమ జీవితం నూతనపంథాలో, క్రొత్త ఆశలతో అభివృద్ధి పరచుకొనేందుకు అవకాశం కలిగింది. అందులకై మంచి గ్రంథాలు ప్రచురించడం ఎంతేనా అవసరం. ఆ విధిని విశ్వసాహిత్యమాలకూడ యథాశక్తిగా నిర్వహిస్తుందని మనవి.

ప్రస్తుత విషయం. విశ్వకవి రవీంద్రుని గ్రంథాలు తెలుగులో ఎందరో ప్రచురిస్తూన్నారు. అదివరలో అనువదింపబడి, ప్రచురింపబడినవికూడ మరల మరల అనువధించి, ప్రచురిస్తూన్నారు. ఎందుకు? లాభంకోసం. సందేహంలేదు. కాని, సాహిత్యరంగంలో కేవల లాభాపేక్షయేగాక లోకకల్యాణం చేకూర్చునుద్దేశ్యముకూడ నుండియేతీరాలి. అట్లుగాక కేవలమూ అర్థాపేక్ష మాత్రం ఉంటే గ్రంథప్రచురణ దుష్ఫలితాలకే దారితీస్తుంది.

"సాహిత్యజగత్తు" అనుపేరు యీ వ్యాసావళికి నేను ఉంచినదే. నా మిత్రులొకరు యీ వ్యాసములను వంగభాషనుంచి

అనువదించి నా చేత నిడి రెండేండ్లు కావచ్చినది. ధనాభావముచే ప్రచురించలేక కొందరు ప్రచురణకర్తలను కోరినా లాభంలేక పోయింది. వారికి కావలసినవి నవలలు, కథలు మాత్రమే. అవైనా గ్రాంథికభాషలో ఐతే లాభంలేదంటూవచ్చేరు. చివరకి నేనే ప్రచురించాలని నిశ్చయించా. గ్రంథస్థమైన భాషను నాయిష్టం వచ్చినట్లు సవరించుకొనే స్వతంత్రం ఉన్నా, యీ గ్రంథంలోని విషయాన్ని బట్టి గ్రాంథికభాషనే ఉంచాలనిన్నీ నిశ్చయించుకున్నాను. వ్రాతప్రతిలో దీనిని చదివిన మిత్రులు యెంతో మెచ్చుకున్నారు. గ్రాంథికం వ్రాయడం, అందులోనూ తప్పులు లేకుండా వ్రాయడం చాలాకష్టం. పండితకవులైన శ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మగారు వ్రాతప్రతిని సరిచూచి, సవరించుటలో ఎంతో శ్రద్ధ వహించేరు. వారి కెంతో కృతజ్ఞుడను. నా కోరికను మన్నించి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు "సాహిత్య జగత్తు" కు "కృతాంజలి" పేరిట పరిచయ వాక్యములను వ్రాసి యిచ్చిరి. అందుకు వారికి కృతజ్ఞుడను.

వంగభాషనుండి యీ వ్యాసముల ననువదించుటకు ఆమోదించిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి (కేంద్రప్రభుత్వపు ఉపమంత్రి) గారికిన్నీ, అనువాదకులకున్నూ నా కృతజ్ఞతాపూర్వక వందనములు. సెలవు.

రాజమండ్రి
15-11-59

మహీధర జగన్మోహనరావు
సంపాదకుడు.

# కృ తా ం జ లి

ఈ గ్రంథమునకు పీఠికాదులైన ఆధునికలాంఛనము లక్కఱ లేదని పూర్తిగా తెలిసియు వ్రాయుచున్నాను. ఇది, అది కానేకాదు. ఏతద్ గ్రంథప్రకాశకుల ప్రేమస్విన్నమైన స్నేహానురోధముముందు నాకు ఒడలు తెలియకపోలేదు. కాని, దీనికి చదువరినై యుండినపుడు నేను నిలచినది భౌతికప్రపంచమునఁ గాదని యిప్పుడు చెప్పుకోగలుగుచున్నాను. విశ్వఖ్యాతమైన యొకానొక 'సాహిత్యవేది' కభిముఖుఁడనై కృతాంజలి నగుట కింతకంటె నావంటి యచ్చతెనుఁగువానికిఁ దరుణము లేదు.

వంగదేశీయుఁడు సుప్రతిష్ఠావంతుఁడు నగు రవీంద్రనాథ టాగూరు సాహిత్యహృదయకలశాబ్ధినుండి చిందిన కొన్ని ఆనంద రసబిందువు లిట్లు గ్రంథాకారము నందినవి. వంగముననో, ఆంగ్ల ముననో చదివి తాను టాగూరుగారి యీ సాహిత్యవిమర్శన విధానమునకు ముగ్ధుఁడై ఒక భావుకుఁడు కొన్ని వ్యాసము లిటు లనువదించి తెలుఁగువారి కిచ్చెను. ఈ యనువాదకర్త కలమునకు యశోవాంఛామషీరసము అంటుకొనకుండుట చూడఁగా, ఈ కాల మునకు మిక్కిలి ఆశ్చర్యముగానే యుండును. పేరునకుఁగాక వస్తుతః ఆయన సహృదయత్వము మనలో నెల్ల తీరులఁ బరిమ ళించుచునే యుండును. అస్తు!

జగన్మోహనమైన కవిత్వము చెప్పి 'నోబులు' బహుమాన మునకు రచితాంజలి యగు రవీంద్రు నంతవాని సాహిత్యసమీక్షా దృష్టి యెట్టిదై యుండెనో తెలుఁగువాఁడు తెలిసికొనుటకు వాంఛించును. ఆ పిపాసను తీర్చుటకే యనువాద మావశ్యకమై చరితార్థ మగుచున్నది. ఇందు, సాహిత్యము - సాహిత్యసామగ్రి- సాహిత్యవిచారకుఁడు - సౌందర్యబోధము - విశ్వసాహిత్యము - సౌందర్యము : సాహిత్యము - సాహిత్యసృష్టి - సాహిత్య తత్త్వము - అను నెన్మిది శీర్షికలు కల వ్యాసము లున్నవి. అన్ని వ్యాసములందును సాహిత్యవిచార మంతర్వాహిని. ఎంత యెవరు చెప్పినను సాహిత్యానందము సహృదయ హృదయానుభవైక వేద్యమే కాని నిర్వచనీయాంశము కాదు. ఈ మాట 'పల్లవి' గాఁ జేసికొనియే మన ప్రాచీనాలంకారికులు సహస్రముఖముల సంపుటములు సృష్టించి, సాహిత్యతత్త్వమును గానము చేసి యున్నారు. వానిలో భిన్నములైన ప్రస్థానము లున్నవి. రవీంద్రున కా యాలంకారికవాదములతోఁ బరిచయము లేకుండుట సంభవము కాదు. ఆయన సంస్కృతభాషలోని రామాయణమును కాళిదాసకృతులను చదివి వెలువరించిన యానందఖేలనము విశ్వ మోహనముగా నున్నది. ఆయన గొప్ప గడుసరిగా సాహిత్య చర్చ చేసి చూపుచున్నాఁడు. రీతి – వృత్తి – వక్రోక్తి – ఔచిత్యము - అలంకారము – రసము – ధ్వని ఇత్యాదులు సంస్కృత సాహిత్యగ్రంథములలో అవిరళముగా వినిపించు పరిభాషాపద ములు. వానిని రవీంద్రుఁడు చాల విరళముగా వాడుకొన్నాఁడు.

సత్యము - శివము - సుందరము - సంగీతము - శిల్పము - చిత్రము - రూపదక్షత - విశ్వసాహిత్యము ఇత్యాదికమైన క్రొత్త నామకరణములతో ఆయన సాహిత్యసమీక్ష నడచుచున్నది. ఆంగ్ల సారస్వతపరిచయము లేనివారిలో నిది నూతనకౌతుకము రేకెత్తించుటకుఁ జేసిన పనితనమా! అనిపించును. రవీంద్రుఁడు ప్రాచ్యభాషాగ్రంథపరిశీలనములో నెట్టి వైదుష్యము గడించుకొనెనో, ఆయన ఆర్జించుకొన్న పాశ్చాత్యవాఙ్మయపాండిత్యమును దాని కిబ్బడి యగు బలము కలది యనుట లోకవిదితము. 'సౌందర్యము' ను గూర్చి ఆయన చేసిన గభీరమైన వ్యాఖ్య నూత్నరమణీయమైనది. ప్రాచ్యసాహిత్యవిమర్శకు లీ పేరితో దాని నింతగా స్తుతింప లేదు. రవీంద్రుఁడు 'రమణీయార్థప్రతిపాదక శబ్దస్వరూపము' సాక్షాత్కరింపఁ జేసికొని, సహజప్రతిభాసౌభాగ్యముతో 'సౌందర్యబోధము' ను గూర్చి పాశ్చాత్యపద్ధతిలో మనకు గొప్ప వ్యాసములు ప్రసాదించెను.

ఈ వ్యాసములలోని చాల వాక్యముల లోఁతు చూచినఁగాని యర్థము కాదు. ఆయన తన వక్తవ్యవిషయము స్పష్టముగా లేదని మరల మరల వివరించుటకు యత్నించెను. ఆయన స్వయము విశ్వకవి యగుటచే కావ్యరచనలోవలె నొక్కొక్కయూహను ఉదాహరణపురస్సరముగా నెట్లెట్లు ఉల్లేఖించిన నది పాఠకుని హృదయమునకు ఒత్తుకొనునో యట్లు వ్యాసరచనలో కవితాలీల ప్రదర్శించెను.

రవీంద్రుని సహజసనాతనహృదయమున కీ క్రిందివాక్యము లుదాహరణముగా భావింపఁగలము:

"భగవానుని యానందసృష్టి తననుండి తానే యుత్సారితమైనది. మానవహృదయసంబంధియైన యానందసృష్టి దాని ప్రతిధ్వని మాత్రమే."

"సాహిత్యము వ్యక్తివిశేషసంబంధి కాదు. అది రచయితది కాదు. అది దైవవాణి."

"వాస్తవమైన సౌందర్యము సమాహితచిత్తుఁడైన సాధకునకుమాత్రమే ప్రత్యక్షవిషయము. లోలుపుఁడైన భోగికికాదు."

"సాహిత్యము సత్యమే యానంద మని, సత్యమే యమృతమని తెలియఁజేయుచున్నది. సాహిత్య మీ యుపనిషన్మంత్రము నహరహము వ్యాఖ్యానము చేయుచున్నది. 'రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి'

ఈ మొదలగు వాక్యములు రవీంద్రుని యంతస్సత్త్వమును పట్టి చూపించుచున్నవి. సరియ. ఇట నొక ప్రసంగాంతరమునకు మన్నింప వేఁడుచున్నాను.

మన తెలుఁగుదేశమును చూచుకొన్నచో నేఁ డీ దేశము ప్రశాంతముగా నున్న దనుటకు వీలు లేదు. ఈ యప్రశాంతి రాజకీయ మని నా యభిప్రాయము కాదు. సాహిత్యప్రపంచమునకు సంబంధించినదే. సాహిత్యమునకును రాజకీయసంబంధము ఏ యత్కించిత్తో సోకుటవలననే యీ యశాంతి యేర్పడె నని

యెవరేని అనినచో, అదియు సులువుగాఁ ద్రోచివైచుటకు వీలు లేని యాలోచనమే. "మా రచనలు ఏల సాహిత్యమున చేరవు? ప్రాచీనకవుల గ్రంథము లన్నియు ఉత్తమసాహిత్య మనుటకు అవకాశ మున్నదా? బంధములలో బిగింపబడుటయే సాహిత్య లక్షణమా? భావాంబరవీధివిశ్రుతవిహారిణి యగు భారతిని నియమశృంఖలములతో బంధించుట ఆనందపుఁ గూటిలో మట్టి కొట్టుట కాదా!" అని, ఈదృశమైన యుద్ఘోషము తెలుఁగు నాట పత్రికలలో ఉపన్యాసవేదికలమీద మనము వినుచున్నాము. ఈ యన్నింటికి సప్రమాణసమాధానములు విద్వాంసులు చెప్పక పోవుట లేదు. పైవారు వినకపోవుటయును లేదు. కాని, అన్య సంస్కారవాసితములై వికసించు వారి మానసముల కది పట్టుట లేదు. అది వారి దోషము కాదు. వారినిగూర్చి రవీంద్రుని మందలింపు ఎట్టి దనఁగా? "సౌందర్యము ననుభవింప నెంతువేని భోగలాలసతను దమించి, శుచివై శాంతచిత్తుఁడవు కావలసి యున్నది." — "ప్రథమ వయస్సునందు బ్రహ్మచర్యపాలన మొనర్చి జీవితమును వికసింపజేసికొన వలయును." ఇట్టి కఠోరోప దేశములు చేసినంత మాత్రమున రవీంద్రుని 'శుష్కవేదాంతి' యని యెవ్వరును అనఁజాలరు గదా!

సాహిత్య మనఁగా నేమి? హిత మనఁగా విధి; అదియే విహితము. సహిత మనఁగా విధిసహితము. తద్ధర్మమే సాహిత్యము. అది బ్రహ్మకంఠోద్గతమైన ఓంకారము కాక మరేమగును! ప్రణ వానందమే సాహిత్యానందముగా వివర్తించుచున్నది. దీనినే

రవీంద్రుఁ డిటులు కవిత్వములో వ్రాసెను. "సమస్తవిశ్వవ్యాప్తముగా నున్న తత్త్వమువలెనే గానమునం దొక తత్త్వ మున్నది. అందుకే అది 'ఓం' ను ఆశ్రయించుకొని నిలిచిపోవును. ఈ గానమును నేను వింటును, వినకపోదును. దానిని ప్రత్యక్షముగా నెవరైన స్వీకరింతురు. అది అమృతస్యందియై శాశ్వతమైనది."

వేదము లనాదిసాహిత్యము. పురాణములు- శాస్త్రములు సాహిత్యాంతర్గతములు. పురాణసాహిత్యము - శాస్త్రసాహిత్యము- కావ్యసాహిత్యము- ఇత్యాదికమైన వ్యవహారము అర్థము లేకుండ జనించినది కాదు. శ్రీనాథుఁడు "వేదపురాణశాస్త్రపదవీ నదవీయసి యైన పెద్దముత్తైదువ" అని యాదిమశక్తి నభివర్ణించెను. ఆమెయే శబ్దశక్తి. ఆ శక్తి వేదపురాణశాస్త్రసాహిత్య పారిజాతప్రసవములోని సౌరభము. ఆమె చరణాబ్జస్పర్శభాగ్యము అసాహిత్యస్థలమునకు పట్టదు. సాహిత్యశబ్దార్థ మంత అణుసూక్ష్మము. తరువాత శబ్దార్థసహితత్వము సాహిత్య మనియు మనవారు చెప్పిరి. ఈ శబ్దమునకు వ్యుత్పత్తి యెట్లు చెప్పినను 'హితము' దానినుండి తొలఁగింపరానిది. హితము మంగళార్థకము, దానిలో పథ్య మున్నది. దానిలో నియతి యున్నది. 'నియతి' శబ్దమునకు 'యినుపసంకెల' యను నర్థము చెప్పు మేధావులకు రవీంద్రుఁడుకూడ నమస్కారము చేయును.

అనపేక్షితవిస్తరముగా సాహిత్యమునుగూర్చి నే నిట కలుగజేసికొంటిని. మన దేశమున ఈనాఁడు కొందఱు కావించు ప్రశ్నముల కీ గ్రంథము సమాధానము. సహృదయుల కీ గ్రంథము

రమణీయమైన కావ్యము. కావ్యముగా నేను చదువుకొంటిని. మరలఁ జదువుకొందును. రవీంద్రుఁడే చెప్పినట్లు "కావ్యమునకుఁ గాని చిత్రమునకుఁగాని సమాప్తియందే సమాప్తి లేదు."

చివర నొకమాట.

ఈ 'సాహిత్యజగత్తు' విశ్వసాహిత్యమాలలో పరిమళము వీడని, వాడని కుసుమరాజము. 'విశ్వసాహిత్యమాలా' ప్రకాశకులు, సాహిత్యభోజనులు, సహృదయులు, బహుగ్రంథరచయితలు నగు శ్రీ మహీధర జగన్మోహనరావు గారు నాచే నీ కొలఁది మాటలు పలికించి 'రవి' ముందు కాగడా పట్టించినారు.

రాజమహేంద్రవరము
వికారి : దీపావళి
**1—11—1959**

మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రి.



# వి ష య సూ చి క

# సాహిత్య జగత్తు

## సాహిత్యము

బహిర్జగత్తు మన మనస్సునందు ప్రవేశించి మరొక జగత్తుగా, సాహిత్యజగత్తుగా పరిణమించుచున్నది. దానియందు కేవలము బాహ్యజగత్తునందలి వర్ణములు, ఆకృతులు, ధ్వనులే కాదు- వానితోపాటు మన బాగోగులు, భయవిస్మయములు, సుఖదుఃఖములతో సంశ్లిష్టమై యది మన హృదయవృత్తికి సంబంధించిన విచిత్రరసముచే ననేకభావములుగ నాభాసితమై యొప్పుచున్నది.

ఈ హృదయవృత్తియొక్క రసముతో జీర్ణింపఁజేసికొని మనము బహిర్జగత్తును విశేషరూపమున స్వకీయ మొనర్చుకొనుచున్నాము.

తగిన పరిమాణములో జఠరరసము కలిగియుండనివారు ఖాద్యవస్తువులను జీర్ణింపఁజేసికొని, శరీరమునకు స్వాస్థ్యకరములుగ నెట్లు పరిణమింపఁజేసికొనజాలరో యట్లే హృదయవృత్తి సంబంధమైన యీ రసమును తగినంతగా జగత్తునందు ప్రయోగింపజాలనివారు బహిర్జగత్తు నంతర్జగత్తుగా, తమదైన జగత్తుగా, మానవజగత్తుగా ననుభవింపఁజాలకున్నారు.

ఒక్కొక్కవ్యక్తి కేవలము జడప్రకృతిగా జన్మించును. జగత్తుసం దత్యంతాల్పవిషయములందే యాతని కౌత్సుక్యము. అట్టి వ్యక్తి ప్రపంచమున జన్మించికూడ యెక్కువభాగము ప్రపంచమునుండి వంచితుడగుచున్నాడు. అతని హృదయగవాక్షము లల్పసంఖ్యాకములు, అవియు విస్తృతములుగాక సంకీర్ణములగుట నీ విశాలవిశ్వమున నతఁడు ప్రవాసితుఁడుగ నున్నాడు.

సర్వత్ర జాగరితమైన విస్మయప్రేమకల్పనావేశములతో సౌభాగ్యవంతులైనవారును లేకపోలేదు- ప్రకృతిలో వారి కడుగడుగునను నిమంత్రణమే. లోకాలయమునందలి 'సర్వములైన యుత్తేజనములును వారి చిత్తవీణను నానారాగిణులతో స్పందింపఁజేయును.

బహిర్విశ్వము వీరి మనస్సునందు హృదయవృత్తికిఁ జెందిన నానారసములచే వర్ణములచే, రూపములచే ననేకవిధములుగ సుసంపన్నమగుచున్నది.

చిత్తవృత్తిప్రభావముచే పొందనగు విశేషత్వప్రయోజనమే మానవుని కన్నిటికినిమించి యుపాదేయమైనది. దీనివలన బహిర్జగత్తునకును, మానవజగత్తునకును గల మహాదంతరము సూచిత మగుచున్నది. తెలుపేదో, నలుపేదో; పెద్దదేదో, చిన్నదేదో; ప్రియమైనదేదో, అప్రియమైనదేదో; సుందరమైనదేదో, అసుందరమైనదేదో; మంచియేదో, చెడ్డయేదో; మానవజగత్తీ విషయము ననేకవిధములుగ నభివర్ణించును.

ఇంక నీ మానవజగత్తు మన హృదయములందుఁ బ్రవ హించుచువచ్చుచున్నది. ఈ ప్రవాహము పురాతనమును, నిత్య నూతనమును. నవనవేంద్రియములు, నవనవహృదయములనుండి యీ సనాతనస్రోతస్సు చిరనవీనముగుచు జాలువారుచున్నది.

కాని, దీనిని పొందగలుగు టెట్లు? దీని నే యుపాయ మున ధారణ చేసికొననగును? ఈ యపురూపమైన మానసజగ త్తునకు రూపము నొసఁగి, తిరిగి బహిర్జగత్తునఁ బ్రకాశింపజేయఁ జాలనిచో, నిది నిత్యసృష్టమై నిత్యము నష్టమగుచుండును. ఐనను నీ వస్తువు నష్టముకా నిచ్చగింపదు. హృదయవస్తువు తన్నుతాను వ్యక్తమొనర్చుకొనుటకై వ్యాకుల మొందుచుండును. అందు వలననే మానవునియందు సాహిత్యమునకై యీ యావేగము.

సాహిత్యమీమాంసయందు రెండువిషయములను లక్ష్య మునం దుంచుకొనవలసియున్నది. విశ్వముపై సాహిత్యకారుని హృదయమునకుఁగల యధికార మెంతటి దనునది మొదటిది; రెండవది యది స్థాయీరూపమున నెంతగా వ్యక్తమైన దనునది.

ఎల్లతావులందు నీ రెంటియందును సామంజస్య ముండదు. ఎచ్చట నట్టిది లభ్యమో యచ్చట సువర్ణమునకు సువాసన యబ్బుటవంటిది.

కల్పనాసచేతనమైన కవిహృదయ మెంతగా విశ్వవ్యాపి యగునో అంతగా నతని రచనాగభీరతయందు మన పరితృప్తి యతిశయించును, అంతగా మానవవిశ్వాంచలములు విస్తారిత ములై మన చిరంతవిహారక్షేత్రము వైపుల్యము నొందును.

కాని రచనాశక్తినైపుణ్యముకూడ సాహిత్యమునం దమూల్యమైనది. హేతు వేమన దేని నాలంబన మొనర్చుకొని యీ శక్తి ప్రకాశితమగునో యది యితరవిషయములతో పోల్చి చూచినప్పు డతిసామాన్యమైనదైనను, కేవలము నశించునది మాత్రము కాదు. అది భాషయందు, సాహిత్యమునందు సంచితమగుచుండును. అది మానవుని ప్రకాశకసామర్థ్యమును వృద్ధిజెందించును. ఈ సామర్థ్యోపలబ్ధికై మానవుఁడు నిరంతరము వ్యాకులితుఁడగుచున్నాఁడు. ఏ కృతిసమూహసాహాయ్యమున నీ సామర్థ్యము పరిపుష్టమగుచుండునో మానవుఁడు దానిని యశస్వంతముగ నొనర్చి ఋణవిముక్తుఁడగుచున్నాఁడు.

హృదయభావోపకరణములవలన నంతరమున సృష్టమగుచున్న మానసజగత్తును బహిఃప్రకాశ మొనర్చు నుపాయ మేమి? భావోద్రిక్తముగ దానినిఁ బ్రకాశింపజేయవలెను. ఈ యుద్దేశింపజేయుట కనేకోపకరణములు కావలయును.

పురుషులయొక్క కచేరీదుస్తు లతిసామాన్యములు - అవి యెంత నిరాడంబరములో యంత యుపయోగకరములును. ఇక స్త్రీల వేషభూషలు, లజ్జావినయములు, భావభంగులు సభ్యసమాజములందెల్ల ప్రచలితములే. స్త్రీల వ్యవహారము హృదయసంబంధి. వారు హృదయము నీయవలయును, హృదయము నాకర్షింపవలయును - అందుచే వారి వేషభూషలు నితాంతము సామాన్యములును నసమగ్రములు నైనచో కుదురదు. పురుషులకు యథాయథముగ నుండుట యావశ్యకము. కాని స్త్రీలు సుంద

రముగ నుండవలయును. పురుషుల వ్యవహారము మొత్తము మీఁద సుస్పష్టమగుటలోనే శోభయున్నది. కాని స్త్రీలవిషయ మున ననేకావరణలు ఆభాసేంగితములు నుండియేతీరవలయును.

సాహిత్యమును నట్లే తన కార్యసాఫల్యమునకై యలం కారములను, రూపకములను, ఛందములను, ఆభాసములను ఇంగితములను ఆశ్రయించును. దర్శనవిజ్ఞానమువలె నిరలంకార ముగనుండుట సాహిత్యమునకు పొసగని విషయము.

అపురూపమును రూపములో వ్యక్త మొనర్చువలె నని వచనమున ననిర్వచనీయమును రక్షించుకొన వలసియున్నది. స్త్రీలకు శ్రీయును, హ్రీయునువలె సాహిత్యమునం దనిర్వచ నీయతయును లక్షింపఁదగియున్నది. అది యనుకరణాతీతము. అది యలంకారము నతిక్రమించి నిలుచును, అలంకారాచ్ఛన్నము కాదు.

భాషయం దీ భాషాతీతమైన దానిని ప్రతిష్ఠిత మొనర్చు టలో సాహిత్యము ప్రధానముగ రెండువస్తువులను సమ్మిశ్రిత మొనర్చును. అందొకటి చిత్రము, రెండవది సంగీతము. మాట లతోఁ జెప్పజాలని దానిని చిత్రముద్వారా వ్యక్త మొనర్ప వలయును. సాహిత్యమునం దీ చిత్రణకార్యమున కవధులు లేవు. ఉపమ - తులన - రూపకముల మూలమున భావములు ప్రత్య క్షము లగుచుండును. 'పరుగులిడు కన్ను దర్శింప పక్షివోలె.' దర్శించుటయందలి వ్యాకులత కేవలము మాటలలో నెట్లు వ్యక్త మగును ? 'దృష్టి పక్షివలె నెగిరిపోయెను' అను నీ చిత్రమునందు

ప్రకాశ మొనర్చుటలో ప్రబలమైన వ్యాకులత ముహూర్తములో శాంతిని పొందినది.

ఇంతేకాక ఛందమునందు, శబ్దమునందు, వాక్యవిన్యాసమునందు సాహిత్యము సంగీతము నాశ్రయించవలసియున్నది. ఏ విధమునను చెప్ప వలనుపడని దాని నీ సంగీతమునే వ్యక్త మొనర్పవలసియున్నది. అర్థవిశ్లేష మొనర్చిచూచిన యతిసామాన్యమగు విషయము సంగీతాశ్రియమును పొంది యసామాన్యమై యొప్పును. శబ్దమునందలి యావేదనను సంగీతమే ప్రసరింపఁజేయఁజాలును.

అందువలన చిత్రసంగీతములు సాహిత్యమునకు ప్రధానోపకరణములు. చిత్రము భావమున కాకృతి నిచ్చును. సంగీతము భావమునకు గతి కల్పించును. చిత్రము దేహము, సంగీతము ప్రాణము.

మానవహృదయముమాత్రమే సాహిత్యమునందు ప్రతిష్ఠితముకాఁదగిన విషయ మనుటకూడ కేవలము సమంజసము కాదు. మానవుని చరిత్ర జడసృష్టివలె నింద్రియాయత్తగమ్యము కాని యొకానొక విలసనము. దానిని నిల్పిపొమ్మనిన నిలిచిపోదు. మానవుని చరిత్రి పరమాత్మునైక్యజనకమైనది. దానిని పశుశాలయందు పశువువలె కట్టివేసి, పంజరమున బంధించి యుంచుటకు వీలులేదు.

ఈ బంధనాతీతమైన విచిత్రి మానవచరిత్రమునుకూడ సాహిత్య మాంతరలోకమునుండి బాహిరమునఁ బ్రతిష్ఠింప

వాంఛించును. ఇది యత్యంత మూహాకందని పని. మానవచరిత్రము స్థిరమైనది కాకపోవుటయే యిందులకు హేతువు. ఇందనేకాంశములు, అనేకస్తరములు. దాని ప్రధానాంతరమునందలి యవారితమైన గమనవ్యవస్థ సహజమైనదికాదు. అదికాక దాని లీల యత్యంతసూక్ష్మము, అత్యంతాభావనీయము, అత్యంతాకస్మికము. దానిని పరిపూర్ణాకారములో హృదయగమ్య మొనర్చుకొనుట కసాధారణమైన సామర్థ్య మవసరము. వ్యాసవాల్మీకులు, కాళిదాసాదిమహాకవు లీ కార్యమును సామర్థ్యముతో నిర్వహించిరి.

మానవచరిత్ర వారిచే నెక్కువగ నభివర్ణింపఁబడినది. వస్తుతః బహిఃప్రకృతియు మానవచరిత్రయు, మానవహృదయమున ననుక్షణము ధరించు నాకృతియు, ధ్వనింపఁజేయు సంగీతము భాషారచితమైనచో నదియే సాహిత్య మనఁజెల్లును.

భగవానుని యానందము ప్రకృతియందును మానవచరిత్రయందును తన్ను తాను రచించుకొనుచున్నది. మానవహృదయ మట్లే సాహిత్యమునందు తన్నుఁ దాను సృజించుకొనుటకును వ్యక్త మొనర్చుకొనుటకును యత్నించుచున్నది. ఈ యత్నమున కంతములేదు. ఇది విచిత్రము. మానవహృదయమునందలి యీ చిరంతనయత్నమునకుఁ గవిలోక ముప లక్ష్యమువూత్రమే.

భగవానుని యానందసృష్టి తననుండి తానే యుత్సారితమైనది. మానవహృదయసంబంధియైన యానందసృష్టి దాని ప్రతి

ధ్వని మాత్రమే. ఈ జగత్సృష్టియొక్క యానందఝంకారమే మన హృదయవీణాతంత్రుల నహరహము స్పందింపఁజేయుచున్నది. ఏ మానసికసంగీతము భగవానుని సృష్టికి ప్రతిఘాతముగ మన యంతరమునందలి సృష్ట్యావేగహేతుకమో దాని యున్మేషమే సాహిత్యము. విశ్వనిశ్వాసము మన చిత్తవేణువునందే రాగిణిని ప్రమోయించుచున్నదో సాహిత్యము దానినే స్పష్టముగఁ బ్రకాశింపజేయుటకు యత్నించుచున్నది. సాహిత్యము వ్యక్తివిశేష సంబంధి కాదు. అది రచయితది కాదు; అది దైవవాణి. బహిస్సృష్టి దాని మంచిచెడ్డలతో అసంపూర్ణతలతో చిరకాల మెట్లు వ్యక్తమగుటకు యత్నించుచున్నదో నీ వాణియు నట్లే దేశదేశములందును సర్వభాషలందును మానవాంతరంగములనుండి బహిర్గతమగుటకు యత్నించుచున్నది.



# సాహిత్యసామగ్రి

కేవలము స్వాత్మానందముకొఱకైన రచన సాహిత్యము కాదు. కవిత్వమునుగూర్చి యనేకుల కనేకాభిప్రాయము లున్నవి. విహంగ మెట్లు స్వకీయోల్లాసమునకై గాన మొనర్చునో, లేఖకుని రచనోచ్ఛ్వాసమును నట్లే యాత్మగతప్రయోజనమాత్రమనియు - పాఠకు లిక చెవులు రిక్కించుకొని దాని నాలకింపదగియున్నా రను భావ మొకటి. విహంగగానమునందు సైతము తత్సమాజాపేక్షితలక్ష్య మసలు లేనే లేదని విస్పష్టముగ చెప్పఁజాలము. లేకున్న లేకుండుగాక. దీనిని పురస్కరించుకొని తర్కించుట వాంఛనీయము. కాని లేఖకుని ప్రధానలక్ష్యముమాత్రము పాఠకసమాజమే. అందువలననే యది కృత్రిమ మనదగియున్న దనుట పొసగనిది. మాతృస్తన్యము కేవలము సంతానముకొరకైనను నది స్వతఃస్ఫూర్త మనుటలో నాటంక మేమున్నది?

నీరవకవిత్వము, ఆత్మగతభావోచ్ఛ్వాసము నను నీ రెండు కొఱమాలిన మాటలు కొన్నికొన్ని తావులందు ప్రచలితముగ నున్నవి. కాష్ఠమును మండింపజాలని దాని నగ్ని యనుట కూడనిదై నట్లే అంతరిక్షమువైపు దృష్టి నిగిడ్చి యాకసమువలెనే నిశ్శబ్దముగ నుండువానిని కవి యనుటకూడ నట్లే యసంగతమైనది. ప్రకాశనమే కవిత్వము. మనస్సునం దేమి యున్నదో యేమి లేదో యోచించుటయం దితరులకు లాభనష్టములు రెండును లేవు.

'మిష్టాన్న మితరే జనాః' అను నుడియున్నది. భాండారమున నిలువయున్న నాహారపదార్థ మెంతయో ఊహించి గణించు టలో నితరులకు సుఖ మేమున్నది? వారికి వలయునది యిష్ట మైన మృష్టాన్నము.

సాహిత్యక్షేత్రమున నాత్మగతభావోచ్ఛ్వాసమును నట్టిదే. రచన రచయిత స్వకీయమునకు కాదనునది గమనింపదగిన విష యము. దానిని పురస్కరించుకొనియే విచారణ చేయవలసి యున్నది. మన మనస్సునం దొక స్వాభావికప్రవృత్తి యున్నది. అనేకమానసములందు తన్ను తా ననుభూత మొనర్చుకొనవలయు నను నది వ్యాప్త మగుటకును స్థాయిత్వము నందుటకును సర్వ ప్రాణులయందును నిరంతరమైన ప్రయత్న మొకం డున్నదనుట ప్రకృతిలో మనము దర్శించుచున్న విషయము. జీవి సంతానము ద్వారా తన్నుతా నెంత, బహుగుణితముగ నొనర్చుకొని యెంత యవకాశము నాక్రమించుకొనునో తన జీవనాధికార మంత యెక్కువ విస్తృత మగుచున్నట్లు భావించుకొనును. తన యస్తిత్వ మును తా నంతయధికముగ సత్య మొనర్చుకొనుచున్న ట్లెంచును.

మానవుని మనోభావమునందు సైత మట్టిదే యొక యత్న మున్నది. భేద మేమన, ప్రాణియొక్క యధికారము దేశకాలము లందు; మనోభావముయొక్క యాధిపత్యము మనఃకాలములందు. మనోభావముయొక్క ప్రయత్నము చిరకాల మనేకమనస్సులను స్వాయత్త మొనర్చుకొనుటకై యున్నది.

కేవల మీ యాకాంక్షను పురస్కరించుకొని ప్రాచీన కాలమునుండి ఎన్ని యింగితములు, ఎన్ని భాషలు, ఎన్ని లిపులు, ఎన్ని శిలాశాసనములు ! చెట్ల బెరడులపై, కాగితములపై, కుంచెలతో, గడ్డపారలతో, కలములతో నెంత ప్రయాసము ! ఎడమవైపునుండి కుడివైపునకు, కుడివైపునుండి యెడమవైపునకు, పైనుండి క్రిందికి, ఒకవైపునుండి మరియొకవైపునకు నెన్ని విధములైన పోకడలు ! నే నేది యోచించితినో అనుభవించితినో యది నశించదు. అది మనస్సునుండి మనస్సునకు, కాలమునుండి కాలాంతరమునకు నాలోచింపఁబడి, యనుభూతవిషయమై ప్రవాహితమై పోవుచుండును. నా యిల్లువాకిలి, నా గృహోపకరణములు, నా మనశ్శరీరములు, నా సుఖదుఃఖవిషయములు, అన్నియు నశించును— కాని కేవలము నేను భావించినది, యవబోధ మొనర్చుకొనినది, చిరకాలము మానవభావనను, బుద్ధిని ఆశ్రయించుకొని ప్రపంచమున నిలిచిపోవును.

మధ్యఆసియాయందలి గోబిమరుభూమియొక్క వాలుకాస్తూపమునుండి విలుప్తమానవసమాజమునకుఁ జెందిన విస్మృత ప్రాచీనకాలమునాటిదైన జీర్ణలిఖితగ్రంథము బయటపడినప్పుడు, ఆ యర్థముకాని భాషలోని యపరిచితాక్షరములలో నెట్టి వేదన ప్రకటమగును ! ఏ పురాకాలమందలి యే సజీవచిత్తప్రియత్నము నేడు మన మనస్సులందు ప్రవేశలాభమునందుటకై వ్యగ్రిత నొందుచున్నదోకదా ! వ్రాసినవా డేమో లేడు. వ్రాయబడిన

క్కాలమునందలి ప్రపంచము లేదు. కాని మానవమానసమునందలి భానముమాత్రము సుఖదుఃఖములమధ్య లాలితమగుటకు యుగ యుగాంతరములవరకు వచ్చి తన పరిచయము సేయఁజాలకున్నది. హస్తద్వయముఁ జాచి ముఖములనైపు లక్షించుచున్నది.

జగత్తునం దశోకచక్రవర్తి సర్వశ్రేష్ఠుడు. ఆయన తన యుపదేశములను చిరకాలము శ్రుతిగోచరము లగునట్లు చేయఁ గోరెను. వాని నాయన శిలలపై చెక్కించెను. శిల లెన్నటికి నశించవని, కదలవని, యనంతకాలపథపార్శ్వమున నచలముగ నిలిచి నవనవయుగముల పథికశ్రేణి కొరకే ప్రబోధమును చిర కాలమువరకు నావృత్తిచేయుచుండు నని భావించెను. శిలల కాయన సంభాషించు భారము నొసఁగెను.

శిలలు కాలాకాలములనుగూర్చిన విచారణ సలుపక నాయనభాషను మోసికొనుచు వచ్చినవి. ఎక్కడి యశోకచక్ర వర్తి! ఎక్కడి పాటలీపుత్రము! ధర్మజాగరితమైన భారతవర్షము యొక్క యా గౌరవదినము లెచ్చట! కాని శిలలుమాత్ర మా కాలమునందలి యా యుపదేశములను విస్మృతాక్షరములతో అప్రచలితమైన భాషలో నేటికిని యుచ్చరించుచున్నవి. ఎంతకాల మరణ్యములలో రోదించినవి! అశోకుని యా మహావాణికూడ నెన్ని వందలయేండ్లు మానవహృదయమును మూగవానివలె కేవలము సంకేతములద్వారమున నాహ్వానించినది! మార్గమునఁ బడి రాజపుత్రు లేగినారు; మొగలులు పయనించినారు; పఠాను లరిగినారు. ఆయా మార్గముల ఖడ్గములు విద్యుత్తులవలె క్షిప

వేగమున ప్రళయఘాతముల నొనర్చి మరలినవి. వా రెవరును నా వాణి యింగితమును పాటించలేదు. సముద్రాంతరముల నున్న నే క్షుద్రద్వీపమునుగూర్చి యశోకు డెన్నఁడును కల్పనఁ గూడ చేసియుండలేదో, ఆయన శిల్పులు శిలాఫలకములపై నాయన యనుశాసనముల నుత్కీర్ణ మొనర్చుచుండిన సమయమున నే ద్వీపమునందలి భాషాహీనప్రస్తరస్తూపమున నరణ్యాచారులైన ద్రావిడులు తమ పూజావేగమును స్తంభిత మొనర్చుచుండిరో, ఆ ద్వీపమునుండి సహస్రవర్షముల తదుపరి యొక వైదేశికుడు వచ్చి యా మూకేంగితపాశమునుండి యా భాష నుద్ధరించెను. చక్రవర్తియైన యశోకుని యాకాంక్ష యిన్ని శతాబ్దములకు తరువాత నొకానొక వైదేశికుని సాహాయ్యమున సార్థక మొనర్పఁబడినది. ఆ యాకాంక్ష వేరేమియు కాదు. తా నెంతటి సామ్రాట్టు కానిమ్ము. తన కేది యిష్టమో ఏది యనిష్టమో, తన దృష్టియం దేది మంచిదో యేది చెడ్డదో, దానిని సామాన్యపథికునికిఁగూడ తెలియజేయవలయును. ఆయన మనస్సునందలి భావము లన్నియు నిన్ని యుగములనుండి సర్వమానవుల మనస్సుల యాశ్రయము నభిలషించి పథప్రాంతమున నిలచి యున్నవి. చక్రవర్తిదైన యా యేకాగ్రమగు నాకాంక్షవైపు మార్గగాములలో నెవ రే నొకరు చూచుచున్నారు, వేరొకరు చూడకయే యేగుచున్నారు.

ఇట్లనుటలో నశోకుని యనుశాసనములను నేను సాహిత్య మనుచున్నా నని కాదు. మానవహృదయమునందలి యొకానొక

ప్రధానాకాంక్ష యిందు ప్రమాణిత మగుచున్నది. మన మొక మూర్తిని నిర్మాణించుచున్నాము, చిత్రమును గీయుచున్నాము, కవిత నల్లుచున్నాము, ప్రస్తరమందిరమును నిర్మించుచున్నాము. దేశదేశములందు చిరకాలాగతముగ అవిరామముగ నిట్టి యొకానొక యత్న మొనర్పబడుచునే యున్నది. దీని భావము మరేమియు కాదు. మానవహృదయము మానవహృదయమున నమరత్వమును కాంక్షించుచున్నదన్న మాట.

ఏది చిరకాలీనమానవహృదయమున నమరత్వసిద్ధి నభిలషించుచున్నదో యది సాధారణముగ క్షణకాలీనమైన మన ప్రయోజనమునుండి, ప్రయత్నమునుండి యనేకవిధములుగ పార్థక్యమును వహించును. మనము వత్సరమాత్రప్రయోజనము నాశించి ధాన్యము, యవలు, గోధుమ మొదలైన యోషధీబీజములను నాటుచున్నాము. కాని యరణ్యమును ప్రతిష్ఠింప నెంచినచో వనస్పతిబీజములను సమకూర్చుకొనవలసియుండును.

సాహిత్యమునం దట్టి చిరస్థాయిత్వమునకైన యత్నమే మానవునికి ప్రియమైన క్రియ. అందుచేతనే దేశహితైషులైన విమర్శకు లెంతయో యుత్తేజనము నిచ్చుచున్నారు. సారవంతమైన సాహిత్య మభావమగుచున్నది; కేవలము నాటకము-నవల-కావ్యములతో దేశ మాక్రమితమగుచున్న దని వాపోవుచున్నారు. అయినను రచయితలకు చైతన్య" మొదవుటలేదు. సారవంతమైన సాహిత్యమునం దుపస్థితమైన ప్రయోజనము లభిం

-చును. కాని యప్రయోజనకరమగు సాహిత్యమునం దస్థాయిత్వ మున కవకాశము మెందు.

జ్ఞానవిషయము ప్రచారితమగుచో దాని యాశయము సఫలీకృతమై ముగిసిపోవును. మానవవిజ్ఞానసంబంధముగ నూతనావిష్కారముతో పురాతనావిష్కార మాచ్ఛన్నమైపోవుచున్నది. నాడు పండితుని కేది యగమ్యమో నే డది బాలునికైన తము క్రొత్తవిషయ మగుటలేదు. నూత్నవేషమున విప్లవమును తెచ్చి పెట్టుచున్న సత్యమే పురాతనవేషమున నంత యుద్రేకమును కలిగించుటలేదు. నే డే తత్త్వము లన్నియు మూఢునికైన త మపరిచితములు కావో ఒకానొక కాలమున నవి పండితునికైన తము దురవగాహములుగ నుండెను. ఇదియే లోకమునం దాశ్చర్య మొదవించును.

కాని హృదయభావవిషయము ప్రచారవశమున పురాతనము కానేరదు. జ్ఞానవిషయ మొకమారు తెలిసికొన్నచో మరి తెలియనక్కరలేదు. నిప్పు వేడిగ నుండును, సూర్యుడు గుండ్రముగ నున్నాడు, జలము తరళము; ఈ విషయము లొకపర్యాయము తెలిసికొన్నచో నంతటితో సరి, రెండవమా రీ విషయమును తిరిగి చెప్పు నగత్య ముండదు. కాని భావవిషయము నెన్నిమా ర్లనుభవించినను తృప్తి కలుగదు. సూర్యుడు ప్రాగ్దిశయం దుదయించు నను విషయ మిక మన మనస్సు నాకర్షింపం జాలదు. కాని సూర్యోదయసౌందర్యము జీవసృష్ట్యారంభమునందుండి నేటివరకును మన కనూనానందము నొసంగుచునే యున్నది.

ఇంత యేల! ఎంత ప్రాచీనకాలమునుండి, ఎంత లోకపరంపరపై యనుభూతి ప్రవాహితమగుచు, నెంత గభీరతను పొందుచుండునో యది యంతగా సహజముగ మనల నావిష్టమొనర్చుకొన జాలును.

మానవు డీ కారణమున నే విషయము నేని చిరకాలము మానవదృష్టియం దుజ్జ్వలమైన నవీనభావముతో నమర మొనర్చి నిలుపఁగోరు నేని యతడు భావవిషయమునే యాశ్రయింపవలసి యుండును. కనుకనే సాహిత్యమున ప్రధానాలంబనము జ్ఞానవిషయము కాదు, భావవిషయము. అదియుఁగాక జ్ఞానవిషయమును భాషాంతరీకరింప వచ్చును. మూలరచననుండి దాని నుద్ధరించి యన్యభాషలో నివిష్ట మొనర్చుచో పలుతావులందు దాని యౌజ్జ్వల్యము వృద్ధిగాంచును. ఆ విషయమును తీసికొని లోకు లనేకభాషలందు నానావిధములుగ ప్రచార మొనర్పఁజాలుదురు. ఈ రీతిని దాని యుద్దేశ్యము సఫల మగుచుండును.

కాని భావవిషయసంబంధమున నీ పద్ధతి నర్తించదు. అది తా నాశ్రయించిన మూర్తినుండి మరి యెడబాటును పొందజాలదు. జ్ఞానవిషయమును ప్రమాణీకరింపవలయును. భావవిషయము సంచరింపఁజేయ దగినది. అందులకై పలువిధములైన యాభాసేంగితములు, పలురకములైన ప్రతారణకళ యవసర మగును. దానిని కేవలము తెలియఁజెప్పిన చాలదు. దానిని సృష్టించి గ్రహించవలసియున్నది.

ఈ కళాకౌశలపూర్ణమైన రచన భావమునకు దేహము వంటిది. ఈదేహమునందు భావప్రతిష్ఠ యొనర్చుటలోనే సాహిత్య

కారుని పరిచయము లభించునది. ఈ దేహప్రకృతిఘటనము ననుస రించియే, దాని కాశ్రితమైన భావము మానవుని యాదరమును పొందగోరును. దీని శక్తి ననుసరించియే యది హృదయము నందును, కాలమునందును వ్యాప్తిని పొందజాలును.

ప్రాణవస్తువు కేవలము దేహముపై నిర్భరపడియుండును. జలమువలె దాని నొక పాత్రనుండి వేరొక పాత్రలోనికి పోయ జాలము. దేహప్రాణము లొకదాని నొకటి గౌరవాన్విత మొనర్చి యేకాత్మభావమున ప్రకాశించును.

భావము, విషయము, తత్త్వము మానవసాధారణమైనది. దాని నొకడు బహిర్గత మొనర్చినచో కాలక్రమమున వేరొకడు బాహిరిలజేయును. కాని రచన కేవలము రచయితకు స్వవిష యము. అది యొకని కెట్లు సంభవమో యదేరీతిని వేరొకనికి సంభవముకాదు. అందుచే రచయిత తన రచనయందే యదార్థ రూపమున సజీవుడై యుండును. భావమునందు కాదు, విషయము నందును కాదు.

రచనయందు భావము, భావప్రకాశోపాయము రెండును సమ్మిశ్రితములై యుండును. ఉపాయముమాత్రము విశేషించి రచయితదే యనవలయును.

'దీర్ఘిక' యనినంతనే నీరు, త్రవ్విన జలాధారము రెండు నొకసారి యవబోధ మగును. కాని కీర్తి దేనిది? జలము మాన వుని సృష్టి కాదు, అది చిరంతనము. ఆ జలమును విశేషభావ

మున సర్వసాధారణముగా నుపయోగించుకొరకు సుదీర్ఘకాలము రక్షణయొనర్చు నుపాయ మేదియో, అదియే కీర్తిమంతుఁడైన మానవుని స్వయంకృషి. భావ మట్లే మనుష్యసాధారణమైనది. కాని దానిని విశేషమూర్తిత్వముతో సార్వజనీనముగ విశేషానంద కరసామగ్రిగ నొనర్చు రచనావిశేషమే రచయితకీర్తికి నిదానము.

పర్యవసానమున భావమును తా ననుభవించి సర్వుల కంద జేయుటే సాహిత్యము. ఇదియే లలితకళ. అంగారము జలము నందు, స్థలమునందు, గాలియందు, నానాపదార్థములందు సర్వ సాధారణముగ లభించునదే. చెట్టుచేమలు నిగూఢమైన శక్తితో విశేషాకృతిలో దానిని స్వాధీన మొనర్చుకొనును. అందుచే నవి సుదీర్ఘకాలము విశేషముగ సర్వులకు భోగద్రవ్యములై వర్ధిల్లును. వానినుండి సౌందర్యము, ఛాయ, స్వాస్థ్యము వికీర్ణము లగుచుం డును. దీనివలన తేలిన దేమన మానవసామాన్యమైన వస్తువునే విశేషభావమున స్వీయ మొనర్చుకొని యదేపద్ధతిలో తిరిగి దానిని విశేషించి జనసాధారణ మొనర్చుటయే సాహిత్యము యొక్క యుద్యమము.

కావుననే జ్ఞానవిషయము సాహిత్యమునుండి స్వాయము గనే విడివడిపోవును. ఆంగ్లభాషయందు మనము 'ట్రూత్' అను దానికే సంస్కృతమున 'సత్యమ్' అను నామ మున్నది. అనగా బుద్ధి కధిగమ్యమైన విషయమును వ్యక్తివిశేషత్వవర్జిత మగున ట్లొనర్చుటయే యత్యన్త మవసరమైనది. సత్యము సంపూర్ణముగ

వ్యక్తి నిరపేక్షము, శుద్ధము, నిరంజనము. భూమ్యాకర్షణశక్తి నా కొక తీరు, వేరొకనికి మరొక తీరు కానేరదు. ధానిపై హృదయ వైచిత్రికిఁ జెందిన నూత్న వినూత్న వర్ణచ్ఛాయలు పడునవకాశము లేదు.

ఏ యే విషయములు అన్యహృదయముల సంచరించుటకై ప్రతిభాశాలియైనవాని హృదయమున, స్వర, వర్ణేంగితముల నర్థించునో, ఏది యట్టివాని హృదయమున సృష్టింపఁబడక పోయిన-చో నన్యహృదయములందుఁ బ్రతిష్ఠింపబడజాలదో యదియే సాహిత్యముయొక్క సామగ్రి. అది ఆకారప్రకారములందు, భావమునందు, భాషయందు, స్వరఛందములందు మిళితమైమాత్రమే జీవింపఁజాలును. అది మానవునికి పూర్తిగా స్వీయమైనది. అది యావిష్కారము కాదు. అనుకరణమును కాదు. అది సృష్టి. అందుచే నది యొకపర్యాయము ప్రకాశితమగు-చో దానికి రూపాంతరము నవస్త్రాంతర మొనర్చుట పొసగని విషయము. దాని ప్రత్యేకాంశపై దాని సమగ్రత పూర్తిగ నాధారపడియుండును. ఎచ్చట దానికి వ్యత్యయము కనఁబడునో యచ్చట సాహిత్యాంశమునం దది హేయమైన దనవలయును.



# సాహిత్య విచారకుడు

ఇంటియందు కూర్చుండి యానందముతో నవ్వ నవ్వు డును, దుఃఖముతో నేడ్వ నప్పుడును, ఇంకను కొంచె మెక్కు వగ నవ్వ టవసర మని కాని, ఏడ్పుటయందు కొంచెము తూకము తక్కువ యైన దని కాని, మనస్సునం దీ విషయచర్చ యుదయిం చనే యుదయించదు. కాని యితరుల సమక్షమున నానందమును గాని దుఃఖమును గాని ప్రదర్శింపవలసిన యవసర మొదవినప్పుడు మనస్సునందలి భావము సత్యమైన దైనను, బహిఃప్రకాశము సంపూర్ణముగ తదనుగుణ్యముగ నుండకపోవచ్చును.

ఇంత యెందుకు - తల్లియైనను రోదనధ్వనితో గ్రామము నకు నిద్రాభంగమగున ట్లేడ్చుటలో నామె పుత్రశోకమును మాత్రమే ప్రకటించుటలేదు. పుత్రశోకముయొక్క గౌరవమును ప్రకటించుటకుఁగూడ నభిలషించుచున్నది. తనకై తాను సుఖ దుఃఖములను ప్రకటించుకొన నక్కఱలేదు. ఇతరులకొఱకై వానిని ప్రకటింపవలసివచ్చును. అందుచే శోకప్రకాశమున కెంతటి రోదనము స్వాభావికమో, శోకప్రమాణమున కంతకంటె స్వరము నతిశయింపజేయకున్న కుదురదు.

దీనిని కృత్రిమ మని యెగురఁగొట్టినచో నన్యాయమగును. శోకప్రమాణము శోకప్రకాశమున కొక స్వాభావికాంగము, నా పుత్రునియొక్క విలువ నా దృష్టిలోనే యెక్కువ. అతని విచ్ఛేద మెంత వేదనాకరమో పృథ్వియం దెకనెవ్వరికిని తెలియదు. అతని

యభావమునందు సైతము పృథ్వియందలి జను లెల్లరు నత్యం తము స్వచ్ఛందచిత్తములతో ఆహారనిద్రల ననుభవించుచున్నారు. కచేరీలకు వెళ్లివచ్చుచున్నారు. శోకాతురురాలైన తల్లి కామె పుత్రుని విషయమున జగత్తునకుఁగల యీ యవజ్ఞాభావ మాఘాత మిచ్చుచుండును. అప్పు డామె తన శోకప్రాబల్యమున నీ దుర్యోగ ప్రాచుర్యమును విశ్వము సమక్షమున ఘోషించి, యామె పుత్రుని గౌరవాన్వితుని చేయ వాంఛించుచున్నదా యన్న ట్లుండును.

శోక మెంతవరకు స్వీయమో యంతవరకు సంయమ ముండును. ఇతరులకొరకైన ఘోషలో విశేషించి యవధుల నతిక్రమించును. పరుల యనుభూతిశూన్యమైన మనస్సులను తన శోకముద్వారమున విచలిత మొనర్చుటకైన స్వాభావికేచ్ఛలో తన యత్న మస్వాభావికోద్యమము నవలంబించును. కేవలము శోకమే కాదు. మన హృదయభావములలో నించుమించు చాల వర కీ రెండుభాగము లున్నవి - ఒకటి స్వీయము, రెండవది పర కీయము. మన భావములను సర్వసాధారణముగ నెల్లర భావము లుగ పరిణమింపజేయఁజాలినచో నదియొక సాంత్వనము లభిం చును, దానియం దొకగౌరవ మున్నది. నే నే విషయమున విచలితుడనో నీ వా విషయమున నుదాసీనుడవగుచో నాకు రుచించదు. అనేకుల సమక్షమున ప్రమాణితముకానిచో సత్య ప్రతిష్ఠ జరుగకుండుటయే దీనికి హేతువు. నేనుమాత్రౌ మాకస

మును పసుపురంగుగ చూచి మిగిలిన పలువు రట్లు చూడజాల నిచో దానియందు నా వ్యాధిమాత్రమే తెలియనగుచున్నది. అది నా దౌర్బల్యసూచకము.

నా హృదయవేదనతో పృథ్వియం దెంత యెక్కువమంది సమవేదన ననుభవింతురో నా వేదనయందలి సత్య మంత ప్రతిష్ఠిత మగును. నేను దేని నై కాంతికముగ ననుభవించుచున్నానో యది కేవలము నా దౌర్బల్యము, వ్యాధి. అది నా వెఱ్ఱితనముకాదు, సత్య మను సంగతిని జనసామాన్యముయొక్క హృదయమున ప్రమాణిత మొనర్చి, నే నధికమైన సాంత్వనమును, సుఖమును పొందుదును.

ఏది నీలమో, దాని నీలిమమును పదిమందిలో ప్రచార మొనర్చుట కఠినము కాదు. కాని ఏది నాకు సుఖమో దుఃఖమో, ప్రియమో అప్రియమో, అది పలువురకు ప్రతీత మొనర్చుట దురూహము. ఆ స్థితియందు స్వీయభావమును ప్రకటించినంత మాత్రమున ముక్తి లేదు. స్వీయభావము నితరులకుఁగూడ యదార్థముగ ననుభూత మగునంతగా ప్రకాశింపజేయవలసి యుండును.

ఇచ్చటనే ప్రసారావసర మేర్పడుచున్నది. దూరమున నుండి యేదేని వస్తువును చూపించవలసినచో దానిని కొంచెము పెద్దదిచేసి చూపించు టావశ్యకము. గొప్పదైన సత్యానురోధము వలననే యట్లు చేయవలసియున్నది. లేనియెడల వస్తు వే నిష్పత్తిలో

చిన్నదిగ కనిపించునో యా నిష్పత్తిలోనే మిథ్యాభిభూతమగును. దానిని పెద్దదిగా నొనర్చియే సత్యవంతముగా చూపించవలసి యున్నది.

నా సుఖదుఃఖములు నాయెడల నవ్యవహితములు. వే రొకరియెడ నవ్యవహితములు కావు. నానుండి నీవు దూరముగ నున్నావు. ఆ దూరత్వమును గణించి నా మాటను నీకు కొంచె మెక్కువధ్వనితో చెప్పవలసియుండును.

సత్యరక్షాపూర్వకమైన, యీ పెద్దదిగ నొనర్చి చూపించు సామర్థ్యమునందే సాహిత్యకారుని యదార్థపరిచయము మనకు లభించుచున్నది. ఏది యెట్లున్నదో సరిగ నట్లే లిపిబద్ధ మైన ర్చుట సాహిత్యము కానేరదు. కారణ మేమన బ్రకృతిలో నేను దర్శించునది నాకు బ్రత్యక్షవిషయము. నా యింద్రియములు నాకు దాని సాక్ష్యము నొసఁగును. సాహిత్యమున నగుపించునది బ్రాకృతికమయ్యును బ్రత్యక్షవిషయము కాదు. అందుకే సాహి త్యమునం దా బ్రత్యక్షాభావమును పూరణ మొనర్పవలసి యున్నది.

బ్రాకృతికసత్యమునకును సాహిత్యకసత్యమునకును నిచ్చ టనే యంతర మారంభ మగుచున్నది. సాహిత్యజనని యెంతగా రోదించునో బ్రాకృతికమాత యంతగా రోదించదు. అట్లని సాహి త్యమునందలి తల్లియొక్క రోదనము మిథ్యకాదు. బ్రథమతః బ్రాకృతరోదన మెంతో బ్రత్యక్షమై యాకారమున, నింగితమున,

కంఠస్వరమున, నాల్గువైపులగల దృశ్యములో, శోకసంఘటనయం దలి నిశ్చయప్రమాణమున, మనకు ప్రతీతి, సమవేదన, యుద్రే కము నొదవించుటలో విలంబన మొనర్చదు. ద్వితీయతః, ప్రాకృతజనని తన శోకమును సంపూర్ణముగ వ్యక్తమొనర్పఁ జాలదు. ఆమె కంతటి సామర్థ్యము లేదు. ఆమె యవస్థయు నట్టిది కాదు.

అందుచేతనే సాహిత్యము కేవలము ప్రకృతికి దర్పణము కాదు. సాహిత్యమే యననేల ? ఏ కళయు ప్రకృతికి యథాతథ మైన యనుకరణము కాదు. ప్రకృతియందు మనము ప్రత్యక్షము ననుభవింతుము. సాహిత్యమునందును, లలితకళలందును నప్రత్య క్షము మనకు ప్రతీయమాన మగును. అందుచే నిచ్చట నొకదాని కొకటి దర్పణమై యే కార్యమును నిర్వహింపఁజాలదు.

ఈ ప్రత్యక్షాభావవశమున సాహిత్యమునందు ఛందో బంధమును, భాషారూపముల ననేకప్రకారములైన కళాకౌశల మును నవలంబించవలసి యున్నది. ఈ రీతిగ రచనావిషయము బాహిరమున, కృత్రిమమై, అంతరమున ప్రాకృతముకంటె నధిక తరమైన సత్యమై యలరారుచున్నది.

ఇచ్చట 'నధికతరసత్యము' అని వ్యవహరించుటలో విశే షమైన తాత్పర్య మున్నది. మానవుని భావసంబంధముగా ప్రాకృతసత్య మావేష్టితము, మిశ్రితము, భగ్నము, ఖండము, క్షణికము నై యున్నది. సంసారతరంగములు క్రమాగతముగ

పొంగుచున్నవి, క్రుంగుచున్నవి - చూచుచుండగనే యొకదాని మస్తకముపై నొకటి వచ్చిపడుచున్నది. అందు ప్రధానాప్రధాన ముల విచారణ లేదు. సామాన్యము, అసామాన్యము పెనవేసు కొని పయనించుచున్నవి. ప్రకృతియందలి యీ విశాలరంగస్థల మున మానవుని భావాభినయమును మనము దర్శించునప్పుడు అనేకము మినహాయించి, ఎన్నుకొని, అన్వేషించి, పూరించి, కల్పనచే ననేకమును నిర్మించుకొనుచుందుము. మనకు పరమాత్మీ యుడైనవాడుసైతము తన సర్వస్వముతో సమగ్రముముగ మనకు పరిచితుడుకాడు. స్మృతినై పుణ్యము కలిగిన మన సాహిత్య రచయితవలె తనయందలి యధికాంశము నాతడు మన యవ గాహామున కావలనుంచును. అతనియందలి అల్పానల్పాంశము లన్నియు నొకవేళ సమానముగ నిష్పాక్షికముగ మన స్మృతిపథ మున సంచరించుచో నా స్తూపమునందలి యసలైన వ్యక్తిత్వ మంతరించును. అంతను రక్షించుకొన జూతుమేని మన యాత్మీ యుని మనము యదార్థముగఁ జూచుకొనఁజాలము. వర్జనీయాం శములను వర్జించి, గ్రహణీయములను గ్రహించుటయే పరిచయ మున పరమార్థము.

విషయమును కొంచెము వివరించవలసి యున్నది. మనము ఆత్మీయునియందుసైతము మొత్తముమీఁద కొంతభాగమునే దర్శించుచుందుము. అతని జీవితమునం దధికాంశము మన కగోచ రము. మన మాతని ఛాయకాము. మన మాతని యంతర్యామి కూడ కాము. అతనియం దనేకములను మనము చూడలేదు.

ఆ శూన్యముపైననే మన కల్పన పనిచేయును. వ్యవధానమును పూరించుకొని మనము మనస్సునం దొకానొక పూర్ణచిత్రమును రచించుకొందుము. ఏ వ్యక్తి విషయమున మన కల్పన నడవదో, ఎవని వ్యవధానము మనకు వ్యవధానమాత్రముగనే నిలిచి పోవునో, ఎవనియందలి ప్రత్యక్షగోచరాంశములుమాత్రమే మనకు ప్రకటితములో, అప్రత్యక్షాంశములు మన కస్పష్టములు నగోచ రములో యతనిని మన మెఱుఁగము. మన కతనితోఁటిదైన పరి చయ మత్యల్పమైన దన్నమాట. ప్రపంచమునందలి మానవులలో నత్యంతాధికసంఖ్యాకు లిట్లే మనకు ఛాయాసదృశులుగను, అసత్య ప్రాయులుగను నుందురు. వారియం దనేకులను మనము న్యాయ వాదులుగ నెఱుఁగుదుము, దుకాణదారులుగ నెఱుఁగుదుము - మనుష్యులనుగ నెఱుఁగము. అనగా మనతో వారికిఁగల బహి ర్విషయసంబంధమునే యన్నిటికంటె ప్రముఖముగ మన మెఱుఁ గుదుము - వారియం దంతకంటె నున్నతమైన దేదో యది మన యం దెట్టి ప్రశ్రయమును పొందదు.

మనకుఁ దెలియఁజేయఁ దలచుకొన్న దానిని సాహిత్యము సంపూర్ణముగ తెలియజేయును. అనగా స్థాయీభావమును రక్షించి, అవాంతరమును వర్జించి, అల్పము నల్పముగ, అధికము నధికముగ నొనర్చి, వ్యవధానమును పూరించి, పృథగ్విషయము లను సంశ్లేషించి నిలుపును. ప్రకృతియందలి యపక్షపాతప్రాచు ర్యమునందు మనస్సు దేనిని నిర్వహింపనెంచునో సాహిత్య మదియే యొనర్చుచుండును. మనస్సు ప్రకృతికి దర్పణము కాదు. సాహి

త్యమును ప్రకృతికి దర్పణము కాదు. మనస్సు ప్రాకృతవస్తువులను మానసికములనుగా నొనర్చును, సాహిత్య మా మానసిక వస్తువులను సాహిత్యకములనుగా నొనర్చును.

రెండిఁటి కార్యప్రణాళికయు నించుమిం చొకేరకమైనది. రెండిఁటికిని కొన్ని విశేషకారణములనుబట్టి ప్రభేదము కలిగినది. మనస్సు దేనిని నిర్మించినను నది తన యవసరముకొరకు, సాహిత్యము దేనిని నిర్మించినను యది సర్వుల యానందముకొరకు. స్వప్రయోజనమునకై నచో నొకటిరెండు సంకేతముల నేర్పరచుకొన తీరిపోవును. ఎల్లరకొరకై నచో నాద్యంతము సుసంబద్ధముగ నుండునట్లు చూడవలసియున్నది. అంతేగాక దాని నెల్లరకు దృష్టిగోచరమగు తావునం దుంచి సర్వులకు సంపూర్ణముగ నందుబాటులో నుండునట్లు చేయవలయును. మనస్సు సాధారణముగ ప్రకృతిలోనుండి సంగ్రహణ మొనర్చును. సాహిత్యము మనస్సునందుండి సంచయ మొనర్చును. మనోవస్తువును బాహిరమున ప్రకటింపవలయు ననినచో సృజనశక్తి విశేషముగ నుండవలయును. ఈ రీతిని ప్రకృతినుండి మనస్సులోనికి, మనస్సునందుండి సాహిత్యములోనికి నేది ప్రతిఫలిత మగుచున్నచో యది యను కరణమునకు దూరగమ్యమైనది.

వాస్తవమైన సాహిత్యమునందు మనము మన కల్పనలను, మన సుఖదుఃఖములను, కేవలము వర్తమానమునందే కాదు, చిరంతనకాలమునందు ప్రతిష్ఠింప వాంఛింతుము. అందుచే నంతటి సువిశాలక్షేత్రముతో దానికి పరిణామసామంజస్యమును సంపా

దింపవలయును. క్షణికమునుండి యుపకరణముల సంగ్రహించి చిర కాలముకొఱకు నిర్మాణించునప్పుడు క్షణకాలసంబంధియైన కొలత బద్ధతో పని సాగదు. అందుచే ప్రచలితకాలముతో సంకీర్ణప్రపంచముతో యున్నతసాహిత్యపరిమాణమునకు గల ప్రభేద మల్లే నిలిచిపోవును. అంతర్వస్తువును బహిర్వస్తువుగ, భావవిషయమును భాషయందు; స్వవిషయమును విశ్వమానవవిషయముగ, క్షణిక విషయమును సార్వకాలికముగ నొనర్చి నిల్పుటయే సాహిత్యము యొక్క పరమాశయము.

జగత్తుతో మనస్సునకుఁ గల సంబంధ మెంతటిదో మనస్సుతో సాహిత్యకారునియొక్క ప్రతిభకుఁగల సంబంధ మంతటిది. ఈ ప్రతిభకు విశ్వమానవమానస మని నామకరణ మొనర్చిన-చో నష్టములేదు. జగత్తునుండి మనస్సు విషయసంగ్రహణ మొనర్చుచున్నది. అదే మనస్సునుండి విశ్వమానవమనస్సు తిరిగి స్వవిషయమును,నిర్వాచన మొనర్చుకొని స్వీయప్రయోజనమునకై నిర్మాణించుకొని గ్రహించుచున్నది.

విషయ మించుక యస్పష్ట మగుచున్నదివలె నున్నది. ఇంకను పరిస్ఫుట మగున ట్లొనర్చుటకు యత్నింతును.

మన మాంతర్యమున రెండంశముల యునికి ననుభవింపగలము. ఒకటి యస్తిత్వము, రెండవది మానవత్వము. నా గృహము సచేతనమైన దగు-చో నది తనయందలి ఖండాకాశము, దానితోబాటు పరివ్యాప్తమైన మహాకాశము, యీ రెండిఁటిని ధ్యానములో నుపలబ్ధి యొర్చుకొనఁజాలెడిది. మనయందలి స్వీయత్వమానవత్వములుకూడ నట్టివే. ఆ రెండిటి నడుమ దుర్భే

ప్యమైన కుడ్యము నిర్మింపఁబడినచో నాత్మ యంధకూపమధ్యమున వసింపవలసివచ్చును. యదార్థమైన సాహిత్యకారుని యంతఃకరణమున స్వీయత్వమానవత్వములమధ్య నేదైన వ్యవధానముండుచో నది కల్పనాసంబంధమైన స్వచ్ఛమగు గాజుతలుపువంటిది. దానిలో నుండి పరస్పరము తెలిసికొనుటకును పరిచయమునకును వ్యాఘాతమెన్నటికిని కలుగదు. ఈ యద్దము దూరవీక్షణాణువీక్షణాల కనువైన రీతి నుపకరించును. ఇది యదృశ్యమును దృశ్యముగ, దూరము నంతికముగ నొనర్చును.

సాహిత్యకారునియందలి మానవత్వమే సృజనకర్త. రచయిత యస్తిత్వము నది తనదిగా జేసికొనును. క్షణికము నది శాశ్వతముగా దిద్దును. ఖండమున కది పూర్ణత్వము నొసఁగును. జగత్తుపై మనస్సంబంధమైన కార్ఖానా యున్నది. మనస్సుపై విశ్వమనస్సంబంధియైన కార్ఖానా - దాని యుపరితలమునుండి సాహిత్యోపలబ్ధి.

మనోరాజ్యవిషయమున సత్యసంధానము క్లిష్ట మని తొలుతనే వచించియుంటిని. నలుపును నలుపుగా ప్రమాణీకరించుట సహజము. సర్వుల కది యట్లే యగుపించును. కాని మంచిని మంచిగా ప్రమాణీకరించు టంత సహజము కాదు. కారణమేమన నిచ్చట పలువురి సాక్ష్య మొకే రీతిగ నుండునని చెప్పుట కష్టము. ఇందనేక చిక్కు లున్నవి. బహుసంఖ్యాకులకు మంచిదైనదే నిజమునకు మంచి దనవలయునా? విశిష్టసంప్రదాయానుగతమైన దానిని మంచి దనవలయునా?

విజ్ఞానవిషయమును వీడి మాట్లాడినచో ప్రాకృతవస్తుసంబంధమున నెక్కువమందికి నలుపుగా నగుపించిన వస్తువు నిజముగ నలుపే యనుట యుచితముగ నుండును. ఇది పరీక్షితమైన విషయము. ఇచ్చట మతభేదమున కవకాశమే లేదు. ఎక్కువ సాక్ష్యసంగ్రహణ మొనర్చుటలో విశేషప్రయోజనము నిందులేదు. మంచి దెన్నడును మంచిదే కాని యెంతవరకు మంచి యను విషయమున నెంత యభిప్రాయైక్య మొదవునో, యా సంబంధముగ నెట్టి సాక్ష్యసేకరణ మొనర్చవలయునో నిర్ధారించు టతిక్లిష్టమైనది.

ఎందువలన నన సాహిత్యకారుల కృషి కేవలము వర్తమానకాలముకొఱకే గాదు. చిరకాలసంబంధియైన మానవసమాజము వారికి లక్ష్యము. వర్తమానభవిష్యత్తులకై రచింపబడిన దాని విషయమున వలయునంతమంది సాక్షులు కేవల వర్తమానమునందే యెట్లు సమకూడెదరు ?

తత్కాలీనమై, తత్స్థానికమైనదే ప్రజాబాహుళ్యము యొక్క దృష్టియందు సర్వప్రధానస్థాన మాక్రమించుచున్నట్లు కనిపించుచున్నది. ఒక కాలమునందలి సంఖ్యాబాహుళ్యమును మాత్రమే గణించి సాహిత్యవిమర్శ కుద్యమించినచో నది యవిమర్శగా పరిణమించు సంభావన లేకపోలేదు. కావున వర్తమానకాలము నతిక్రమించి యనంతభవిష్యముపై పునకే సాహిత్యలక్ష్యమును నివేశింపఁజేయవలసియున్నది.

కాలభేదము ననుసరించి విచిత్రముగ మానవవిద్యాభావయవస్థాపరివర్తనములు జరుగుచున్నను, ఏ రచన లన్నియు

తమ మహిమను రక్షించుకొనుచు వచ్చినవో వాని కగ్నిపరీక్ష జరిగిపోయినది. మనస్సు మనకు సహజముగ గోచరించునది కాదు. కొలదికాలమునకే యాబద్ధమొనర్చి చూచినచో నవి క్రామగతిచాంచల్యమునందు దాని నిత్యానిత్యతను గ్రహింప గల్గు టసాధ్యము. అందుచే సువిపులమైన కాలమునకుఁ జెందిన పరిదర్శనశాలయందే మనుష్యుని మనోవస్తువును పరిశీలించిచూడ వలసియున్నది. ఇట్లుగాక వాస్తవముగ నవధారణమున కనువగు నన్యోపాయము కానరాదు.

కాని కార్యనిర్వహణమున కుపాయము లేనిచో సాహిత్యమునం దరాజకత సంభవించును. జడ్జికోర్టులోని తీర్పు హైకోర్టులో విపర్యస్త మగుననుట దేమియులేదు. సాహిత్యమునందు నట్లే. జడ్జికోర్టులో వ్యవహారము పూర్తి కాదు. అప్పీలుసంబంధమైన శేషమీమాంస యతిదీర్ఘకాల సాపేక్షము. అంతవరకు విమర్శ మొత్తముమీఁద నొకవిధముగ జరుగుచునేయుండును. అది యవిమర్శయైనను యుపాయాంతరము లేదు.

సాహిత్యమున స్వీయరచనయం దొక్కొక్కని ప్రతిభ యెట్లు సార్వకాలికప్రతినిధిత్వమును వహించి శాశ్వతసింహాసమున నధివసించునో విమర్శకుని ప్రతిభయు నట్లే. ఒక్కొక్కని పరిశీలనాశక్తి స్వభావసిద్ధముగ నసామాన్యమై వెలుఁగొందును. క్షణికము, సంకీర్ణము నైనది వారిని మోసగించలేదు. ఏది శాశ్వతమో, ధ్రువమో దానిని వా రిట్టే గ్రహింపజాలుదురు. సాహిత్యమునందలి నిత్యవస్తువుతో పరిచయలాభమును పొంది,నిత్యతా

లక్షణములను తెలిసియు వా రశ్రమమున నంతఃకరణముతో మిశ్రణ మొనర్చుకొనిరి. స్వభావముచేతను, అభ్యాసవశముననను వారు సార్వకాలికవిమర్శకపదము నధిష్ఠించుటకు యోగ్యులై వెలసినారు.

ఇక విమర్శన వృత్తిగా కలవారును గలరు. వారి విద్య పుస్తకగత మైనది. వారు సారస్వతప్రాసాదముయొక్క ద్వార దేశమున నుపవిష్టులై యరచుట, తర్జనభర్జనముల నొనర్చుట, లంచములు పట్టుట, ముష్టియుద్ధ మొనర్చుట మొదలైన కార్య ములకు సిద్ధ మగుదురు - అంతఃపురముతో వారికి పరిచయము లేదు. వారు శకటవాహనములను, గడియారపు గొలుసును చూచియే మోహితు లగుదురు. కాని సరస్వతి కాత్మీయులైన యంతఃపురచారణశీలురు సహజవేషములతో దీనులవలె తల్లిని సమీపింతురు. ఆమె వారల నంకమునఁ జేర్చుకొని మస్తకా ఘ్రాణ మొనర్చును. వా రప్పుడప్పు డామె వసనాంచలములపై కొంచెము ధూళినిక్షేపముఁగూడ చేయవచ్చును. ఆమె దానిని చిరునగవుతో దులిపివేసుకొనును. ఈ ధూళి పడుచున్నను దేవి యనుగ్రహపూర్ణముగ నెవరిని యంకమునఁ జేర్చుకొనునో ద్వారసంచారులు వారి నెట్లు గుర్తింపఁజాలుదురు! వారు దుస్తు లనే యెఱుఁగుదురు. మానవుల నెఱుఁగరు. వా రుత్పాతమును సృష్టింపగలరు. విచారణ చేయవలసిన భారము వారిపై లేదు. సారస్వతేయుల నాహ్వానించి అభ్యర్థించి తీసికొనిరావలసిన భార మెవరిపై నున్నదో వారును సరస్వతీదేవి సంతానమే. వారింటి మనుష్యులు. కనుకనే వారి కింటిమనుష్యుల మర్యాద తెలియును.

—ం౦ం—

# సౌందర్య బోధము

ప్రథమవయస్సునందు బ్రహ్మచర్యపాలన మొనర్చి నియమసంయమములతో జీవితమును వికసింపజేసికొనవలయును. భారతవర్షమునందలి యీ ప్రాచీనమైన యుపదేశమునుగురించి ప్రస్తావించిన యనేకుల మనస్సులందు దది కఠోరసాధనగ ననిపించును. దీనివలన మానవుడు బలిష్ఠుడగును, కాకున్న వాసనాశృంఖలములనుండి ముక్తుడైన యొక గొప్పసాధుపురుషుడు కావచ్చును. కాని యీ సాధనయందు రసస్థాన మెచ్చట నున్నది? సాహిత్యమేమైపోయినది? చిత్రసంగీతము లేమైనవి? మానవుని సమగ్రముగా తయారుచేయవలె ననిన సౌందర్యచర్చను వదలివేసినచో పొసగదు.

ఇది సమంజసమైన మాట. సౌందర్యము కావలసినదే కదా! ఆత్మవికాసమే సాధనకు లక్ష్యము. వస్తుతః, విద్యాభ్యాస కాలమున బ్రహ్మచర్యపాలనము శుష్క-సాధన కాదు. క్షేత్రమును మరుభూమి నొనర్చుటకై వ్యవసాయదారుడు కష్టించడు. అతడు నాగలిచే భూమిని బ్రద్దలుచేయు నప్పుడు, కలుపు తీసి గడ్డిని, గుల్మములను పెరికివేసి క్షేత్రమును శూన్య మొనర్చునప్పుడు భూమిపై నత్యాచారము జరుగుచున్న ట్లజ్ఞాని భావించవచ్చును. కాని సస్యశ్యామల మొనర్చుటకుమాత్రము ప్రాతిపదిక యిదియే. అట్లే వాస్తవమునకు రసగ్రహణాధికారి కావలయునన్నచో ప్రథమమున కఠినవ్యవసాయ మవసరమగును. రసమార్గమునందే

మార్గమును విస్మరింపఁజేయు ననేకవిఘ్నము లున్నవి. ఆ మార్గము నందలి విపత్తుల నన్నిఁటి నతిక్రమించి పూర్ణలాభము పొందగోరు వానికి నియమసంయమముల యావశ్యకత యెంతయైన గలదు. రసముకొఱకే యీ నీరసతను స్వీకరింపవలసియున్నది.

ఉపలక్ష్యములో లక్ష్యము మరుగునఁబడిపోవుటయందే మానవుని దురదృష్టము గోచరించుచున్నది. గానము నేర్చుకొన నెంచును. శిక్షకుడై కూర్చొనును. ధనవంతు డగుటకు వాంఛించును. రూకలను పోగుచేయుటలో కృపాపాత్రు డగును. దేశ హితము నభిలషించును. సంస్థలలో తీర్మానము చేయించి కృతార్థుడై న ట్లెంచుకొనును. అట్లే యుపలక్ష్యములైన నియమసంయమములు చరమలక్ష్యముయొక్క స్థానము నాక్రమించుకొని కూర్చున్నరీతిని మనము తరచు గమనించుచున్నాము. నియమమే పరమప్రయోజనము, పుణ్యావహ మని భావించువారు నియమలోభమున లుబ్ధులైపోయెదరు. నియమలోలుపత యరిష డ్వర్గమునకు సప్తమశత్రువును సమకూర్చును.

ఇది మానవుని జడత్వమున కొక లక్షణము. సంచయ మొనర్ప నారంభించినచో మానవు డేక నాగిపోఁజాలఁడు. విదేశములందు కొంద రున్మత్తులవలె దేశవిదేశములందు ముద్రింపఁ బడిన తపాలాబిళ్ళలను ప్రోగుచేయుదురట! వాని సంధానము నకై చేయు కర్చున కంతులేదట. ఈ సంగ్రహాణప్రభంజనముచే నాహతులై కొందరు చైనాపాత్రలను, కొందరు పురాతనపాద రక్షలను సంపాదించుటలో వెతలఁబడుచున్నారు. ఉత్తరమేరువును

ఖచ్చితముగ కేంద్రస్థానమున నొక ధ్వజమును పాతిరావలయును. అదికూడ నిట్టిదే యొక వ్యాపారము. అచ్చట హిమక్షేత్రము తప్ప మరేమియు లేదు. కాని మనస్సు నివృత్త మగుటలేదు - ఎవ రా మేరువు కేంద్రబిందువున కెన్నిమైళ్ళు సమీపమున కేగుచున్నారు? వారిని గూర్చి యోజించు నిషాలో కూర్చొని యుండువారు కొందరు. ఎవ డెన్ని యెక్కువ యడుగు లధిరోహించగల్గిన నంత గొప్పగా భావించుచున్నాడు. ఈ శూన్యలాభమునకై తాను బలియగును. ఇచ్ఛలేని కూలీల నెందరినో బలిపెట్టును. ఐనను యుద్యమవిరమణముమాత్ర మొనర్పడు.

అపవ్యయము, క్లేశము నెంత యెక్కువో ప్రయోజనహీనమైన సంచయమును పరిణామహీనజయలాభగౌరవములు నంతటివే యనిపించుచున్నవి. నియమపాలనాలోభము క్లేశపరిమాణమును కొలిచి యానందించుచున్నది. కఠినశయ్యపైఁ బరుండ నారంభించి నేలపై పరుపుఁ బరుచుకొని తదుపరి కంబళమునుమాత్రము పరచుకొని, ఆ పిమ్మట కేవలము నేలమీఁదనే పండుకొను లోభము క్రమముగ పెరుగనారంభించును. కృచ్ఛ్రసాధనయే లాభ మని భావించిన తుదకు ఆత్మహత్యకు దిగి యురిత్రాడు బిగించుకొనవలసివచ్చును. ఇది మరేమియు కాదు, నివృత్తినే ప్రచండప్రవృత్తిగ నొనర్చుకొని, కంఠమునఁ దగుల్చుకొనిన యురిత్రాటిని త్రెంపివేసుకొను యత్నమునందే త్రాడు బిగుసుకొనిపోయి చచ్చుట వంటిది.

కావున నియమపాలనమే కేవలము లోభనీయ మగుచో నిశ్చిత కఠోరతను ప్రచుర మొనర్చుకొని స్వభావమునుండి సౌందర్య బోధమును చూర్ణ మొనర్చుకొని విరజిమ్ముట యగును. అందు సందేహ మేమియులేదు. కాని పూర్ణత్వలాభమువైపునకే దృష్టి నుంచి సంయమచర్చనుగూడ సక్రమపద్ధతిలో సంయత మొనర్చి యుంచుకొనఁజాలినచో మనుష్యత్వముపందలి యే భాగమునకు నాఘాతము కలుగదు. మీదుమిక్కిలి పరిపుష్టిని కలిగించును.

పర్యవసాన మేమన పునాది గట్టిగ నుండవలయును. లేనిచో నదియాశ్రయము నీజాలదు. ధారణ చేయవలసినది, ఆకృతి నొసంగ వలసినది కఠినముగ నుండును. మానవశరీర మెంత మెత్తనిదైనను గట్టి యెముకలపై నది నిర్మాణింపబడకుండినచో నది యొక ముద్దయై యుండెడిది. అట్లే జ్ఞానమునకైన పునాదియు కఠినము గనే యుండును. ఆనందమునకైన పునాదియు కఠినమే. జ్ఞానము యొక్క పునాది కఠినముకానిచో, బలిష్ఠముకానిచో నది కేవల మసంబద్ధమైన స్వప్నముగ పరిణమించెడిది. ఇక యానందము యొక్క పునాది బలముగ నుండకున్నచో నది నితాంతము భ్రమాత్మకమైన మాదకత యైపోయెడిది.

ఈ కఠినమైన పునాదియే సంయమము. దీనియందు యోచన యున్నది. బలమున్నది, త్యాగ మున్నది. నిర్మమమైన దృఢత యున్నది. ఇది దేవతవలె నొకచేతఁ వరమును ప్రసాదించును, వేరొక చేతితో సంహార మొనర్చును. ఈ సంయమమును నిర్మించు వయస్సెంత దృఢమైనదో, వికలమొనర్చు వయస్సు

గూడ నంత దృఢమైనదే. సౌందర్యమును పూర్ణముగ ననుభవింప వలయు ననిన నీ సంయమ మెంతేని ప్రయోజనకారి యగును. ప్రవృత్తి యసంయతముగ నుండిపోయినచో శిశు వన్నపు కంచమును చేత నుంచికొని అంటుపదార్థముల నొంటికి రాచు కొనియు, నేలపై విరజిమ్మియు విపరీతముగ వర్తించును. అత్యల్ప భాగమైన యాహారముమాత్రమే యతని యుదరమునఁ జేరును. భోగసామగ్రిని తీసికొనిన మన యవస్థయు నట్లేయగును. మనము దానిని కేవలము మన శరీరములకు పూసికొందుము, అనుభవింపఁ జాలము.

సౌందర్యమును సృష్టించుటయు నసంయతకల్పనావృత్తి సంబంధమైన కర్మ కాదు. ఇంటికి చిచ్చువెట్టి సంధ్యాదీపము నెవ్వ డును వెలిగించడు. దివ్వెను వెలిగించుటకు తావన్మాత్రమైన యగ్ని చాలును. ఆ వెలుగు నింటికి సమకూర్చుట కగ్నిపై మన కధికార ముండవలయును. ప్రవృత్తిసంబంధమునకు యీ విష యము వర్తించును. ప్రవృత్తి నొకేసారిగ పూర్తిగ రగుల్కొల్పితి మేని, యే సౌందర్యమున కౌజ్జ్వల్యము నొసఁగుట దానికి ప్రయో జనమో యది యీ సౌందర్యమును మంటబెట్టి బూదియొనర్చి వదలును. పుష్పాపచయమునకై పోయి వానిని చిదిమి ధూళి ధూసరిత మొనర్చుటవంటి దగును.

ఇది పరమసత్యమైన విషయము. ప్రపంచమునందు క్షుధిత ప్రవృత్తి యాకువేసుకొని కూర్చున్న చోటునకు సన్నిహితముననే యొకానొక సౌందర్యయోజనమును మనము దర్శించగలము.

ఫలము కేవలము మన క్షుధానివారణకుమాత్రమే కాదు. అది రుచిలో సువాసనలో దర్శనీయతలో సుందరముగ నుండవలయును. ఇంచుకేని సౌందర్యము దానియం దభివ్యక్తముకానిచో దానిని కేవలము మనము పొట్టకక్కుఱితికై మాత్రమే తినగలము. మన యావశ్యకత యింతటిదైనను కేవల ముదరపూరణవిషయమే గాక సౌందర్యభోగముపైపునుండి కూడ నది మన కానందము నీయవలయును. ఇది మనకు ప్రయోజనాతిరిక్తమైన లాభము.

అవసరమును మించి పొందుట, అనగా సౌందర్యము మన మనస్సుల నే వైపునకుఁ బ్రసరింపఁజేయుచున్నది? క్షుధాతృప్తియం దాసక్తియే పరమాత్మస్వరూపమై కూర్చుండక, దాని పాశమునుండి కొంచెము విడివడి యుందుమేని సౌందర్యము యొక్క మహిమను మనము దర్శింపఁజాలుదుము. చండీస్వరూపిణియైన క్షుత్తు అగ్నిమూర్తియై ఘోషించుచున్నది. 'నీవుభుజించి తీరవలయును. దీనికిమించి మఱేమియు లేదు' అని. వెంటనే సౌందర్యలక్ష్మి మందహాసవదనముతో సుధాసేచన మొనర్చును. అత్యుగ్రమైన ప్రయోజనీయతయొక్క యారక్తనేత్రముల యభ్యంతరమునుండి కడుపుకక్కుర్తి నధఃకరించి పైయంతస్థున నానందభోజనమునకై యామె మనోహరమైన యత్న మొనర్చుచున్నది.

అనివార్యప్రయోజనమునందు మానవుని కొకానొక యవమాన మున్నది. కాని సౌందర్యము ప్రయోజనాతీతమైన దగుటచే నది యా యవమానమును దూరీకృత మొనర్చును. క్షుధాతృప్తికి

వెనువెంటనే సౌందర్యము సర్వదా యొకానొక యుచ్చతరభావ మును లగింపఁజేయుచున్నది. గనుకనే యొకనాఁ డసంయతులై మూర్ఖులుగ నున్నవారే నేఁడు మానవులై వర్తిల్లినారు. ఇంద్రియ ప్రామాణ్యమును మాత్రమే స్వీకరించినవారు ప్రేమప్రామాణ్య మును స్వీకరించినారు. నే డెంత క్షుధార్తులమైనను మనము కేవ లము పశువులవలె రాక్షసులవలె నేదో యొక రీతిగ భుజింప నాయ త్తులము కాజాలము. శోభనత రక్షింపఁబడనిచో మనకు భుజించుట యందలి ప్రవృత్తి కూడ నశించును. శోభనత భోజనప్రవృత్తిని మంజుల మొనర్చి మించినది.

మనము పసిపిల్లలను లజ్జింపజేయుటకై 'ఛీ - ఛీ' ఫలానా లోభివలె తినుచున్నాఁడందుము. అట్లు భుజించుట చూచుట కేహ్య ముగ నుండును. సౌందర్యము మన ప్రవృత్తిని సంయత మొనర్చి నది. జగత్తుతో మనకుఁగల సంబంధమును ప్రయోజనమాత్రము గనే గాక యానందసంబంధముగఁ బరిణమింపఁజేసినది. ప్రయో జనముమాత్రమే లక్ష్య మగుటలో మన దైన్యము, దాసత్వము గోచరించును. ఆనందసంబంధములో మనకు ముక్తి లభించును.

ఇందు విదితమైన దేమన, సౌందర్యము పరిణామమునందు మానవుని సంయమమువైపునకే యాకర్షించుచున్నదని. మాన వుని కది యొసఁగు నమృతపానముద్వారా నతఁడు క్షుధాప్రాబల్య మును దినదినమును జయించగలుగుచున్నాఁడు. అసంయమమునమ జ్ఞళమని పరిత్యజించుట కెవ్వని మనస్సంగీకరించెడిది కాదో యతఁడే

దానిని సౌందర్యహీన మని బుద్ధిపూర్వకముగ త్యజించుట కిచ్ఛ గించుచున్నాడు.

సౌందర్య మెట్లు మనలను క్రమక్రమముగ శోభనతవైపు నకు సంయమము వైపునకు నాకర్షించివేయుచున్నదో, సంయమము నట్లే మన సౌందర్యానుభవముయొక్క గభీరతను వృద్ధి పొందింపఁజేయుచున్నది. విశుద్ధభావమునందు నివిష్టుల మగుట తెలియనిచో మనము సౌందర్యముయొక్క నిభృతస్థానమునుండి రసస్థితిని బొందలేము. పతిపరాయణ యగు సతియే ప్రేమయొక్క యథార్థసౌందర్యోపలబ్ధి నందజాలును. కాని స్వైరిణి కది సాధ్యమా? సతీత్వమే యచంచలమైన సంయమము. తన్మూలము ననే ప్రేమయొక్క నిగూఢమైన రసలాభమును గభీరముగ పొంద సాధ్యమగును. సౌందర్యప్రియత్వమునందు సతీత్వసంయమము లేనిచో నేమగును? అది కేవలము సౌందర్యమునకు బాహిరముగ చంచలమై సంచరించుచుండును. మత్తతనే యానందమునుగ భ్రమించును.

వాస్తవమైన సౌందర్యము సమాహిత చిత్తుడైన సాధకు నికి మాత్రమే ప్రత్యక్షవిషయము, లోలుపుడైన భోగికి కాదు.

పౌష్యరాజు ఋషికుమారుఁడైన నుదంకునితో ననినాడు. 'అంతఃపురములోని కేగుము' అచ్చట పట్టమహిషిని చూడగలవు, అని. ఉదంకు డంతఃపురములోని కేగెను. కాని పట్టమహిషి కని పించలేదు. అశుచియైనవానికి సతి కనబడెడిది కాదు. ఉదంకుఁ డా సమయమున నశుచియై యుండెను.

విశ్వమునందలి సౌందర్యమహిమల యంతఃపురమున విరాజమానయగు లక్ష్మీసతి మన సమ్ముఖముననే యున్నది. కాని మనము శుచిగా నుండనిచో చూడఁజాలముకదా! మనము విలాసములలో మునిగి తేలుచు, భోగమత్తతలో నున్మత్తుల రీతిని సంచరించునప్పుడు విశ్వాంతర్యామియు తేజోమూర్తియునైన లక్ష్మీసతి మన దృష్టియందుండి యంతర్ధాన మగుచుండును. ఇది ధర్మనీతి ప్రచారమునకై చెప్పు మాటకాదు. ఆనందదృష్టితో చెప్పుచున్న విషయము. ఆంగ్లభాషయందు 'ఆర్ట్' అనుదాని దృష్ట్యా చెప్పుచున్నాను. మన శాస్త్రములందున్ను కేవలము ధర్మబుద్ధితో కాకున్నను సుఖముకొఱకైన సంయతుడు కావలయు నని చెప్పఁబడియున్నది. అనగా నీ యిచ్ఛ చారితార్థ్యము నొందవలె నేను కొందువేని దానిని నీవు శాసింపవలయును. సౌందర్యము ననుభవింప నెంతువేని భోగలాలసతను దమించి శుచివై శాంతచిత్తుడవు కావలసియున్నది. ప్రవృత్తిని నిగ్రహింపనేర మేని మన మిక ప్రవృత్తిచారితార్థ్యమునే సౌందర్యబోధముయొక్క చారితార్థముగ భ్రమపడెదము. సౌందర్యబోధమునుగూర్చిన యుద్బోధనకై మాత్రమే బ్రహ్మచర్యావశ్యకతనుగూర్చి చెప్పవలసి వచ్చినది.

సందేహించువారు దీనిని కవిత్వముగ నెగురగొట్టుదురు. వారనున దేమన 'ఇదిగో! ప్రపంచమును మన మనుదినము చూచుచున్నాము. కళాకౌశలము కల్గినవారెల్లరు సౌందర్యసృష్టి నొనర్చియున్నారు. వారందరు సంయతమనస్కులేనా?' యని.

వారి జీవితచరిత్రము మనకు పఠనీయము కాదే! అందుచే కవిత్వము నటుంచి యదార్థసత్యమునుగూర్చి యాలోచింపవలసి యున్నది. వస్తువ్య మేమన వాస్తవమునందు మన కెంత విశ్వాస మేల సని! అది ప్రత్యక్షగోచర మగుటవలన. కాని పలుతావు లందు మానవుల విషయమున మనము దేనిని వాస్తవ మని భావించుచున్నామో యందధికభాగ మప్రత్యక్షమైనది. కొంచెము చూచితిమిగదా యని యంతను చూచినట్లు తలంతుము. ఇందువలన మానవనిర్మితమైన వాస్తవవస్తువును తీసికొని యొకడు తెలుపనిన చో మరియొకడు మట్టిరం గనినను పరవాలేదేమో కాని, దాని నతడు కేవలము నలు పనినచో చేయవలసిన దేమి? నెపోలియన్ను కొందరు దేవత యందురు, కొందరు దానవుం డందురు. అక్బరునుగూర్చి కొంద రుదారప్రజాహితైషి యనుచుండగా కొంద రతనినే హిందూప్రజానీకమునెడల సర్వానర్థదాయకు డందురు. వర్ణభేదమే హిందూసమాజమునకు రక్ష యని కొంద రనుచుండ, అదియే యనర్థహేతు వైన దని మరికొంద రందురు. ఉభయపక్షములవారును యదార్థ ప్రమాణమునే యొనర్తురు.

వస్తుతః మానవనిర్మితవ్యవస్థయం దొకేచోట మన మనేక విపరీతపద్ధతులను చూడగలము. మానవుడు చూడగల్గిన యంశములయందలి వైపరీత్యముల కాతడు చూడజాలని యంశములం దొక నిగూఢసమన్వయ మున్నది. అందువలన సిసలైన సత్యము ప్రత్యక్షముమీాదనే తేలియాడుచున్న దనజాలము. అది యప్ర

త్యక్షమునందే మునిగియున్నది, కనుకనే దానినిగూర్చి యింత తర్కము, యిన్ని వర్గములు.

కళానైపుణ్యముతోపాటు సుగుణసంపదయు గలిగినవారి విషయమునందుసైతము మనము వైపరీత్యమును దర్శించినప్పుడు వాస్తవసత్యమునుగూర్చి గర్వించి హఠాత్తుగా విరుద్ధమైనమాట నని కూర్చొనజాలము. సౌందర్యసృష్టి దౌర్బల్యమునుండి, చంచలతనుండి, అసంయమము నుండి జరుగు ననున దత్యంతస్వభావ విరుద్ధమైన మాట.

సత్యమే తానై సాక్ష్య మొసఁగినను, మనము 'సాక్షులందు హాజరుకాలేదు. అసలైన సాక్షి తప్పించుకొనిపోయినా' డందుము. ఒకానొక బందిపోటుముఠా గొప్పయున్నతి నందుచున్నదన్నచో, యా వాస్తవికతను పురస్కరించుకొని దస్యువృత్తియే యౌన్నత్యమున కుపాయమని సిద్ధాంతీకరింపజాలముకదా. ప్రమాదవిరహితముగ మన మనగలిగిన దేమన, దొంగలయం దాపాతతః లభించిన ట్లగుపించిన యున్నతికి వారియందలి యైక్యతయే హేతువని. అనగా నా దళమునం దొకరిపై నొకరికె గల ధర్మరక్షయే యీ యున్నతికి దారితీసినది. కాని, యీ యున్నతి యవనతిగా పరిణమించినచో యీ యైక్యతాభావమునే నష్టమునకు హేతువనజాలము. అప్పుడు మన మిక నితరులయెడల వారి యధర్మాచరణమే వారికి పతనహేతువైనదని తీర్మానింతుము. ఒకడు వ్యాపారమునం దెంతో గడించి భోగవిలాసములలో నంతయు వమ్మొనర్చినచో నపవ్యయముచేయగలిగినవారే సముపార్జన చేయఁజాలినవా

రందుమా ? - ధనార్జన యొనర్చు విషయమున నా వ్యక్తి కొక యంచనా యుండెననియు, అందితరులకంటె నీవ్యక్తికి సంయమ మును వివేచనయు నధికముగ నుండెననియు, అపవ్యయముచేయు వేళ నతని నిర్లక్ష్యము లక్ష్యముదృష్టి నతిక్రమించిన దనియు నందుము.

కళానిష్ణాతులైన గుణసంపన్నులును నెచ్చట యోగ్యులో వచ్చట వారు తపస్వులే. ఆచోట యథేచ్ఛాచరణము వర్తింపజాలదు. అచ్చట సాధనాసంయమము లుండనే యున్నవి. నూటికి నూరుపాళ్ళు ధర్మము నాచరింప జాలినవారు లోకమునం దెచ్చటనో గాని యుండరు. ఏ కొంచెమో భ్రష్టత వచ్చియేపడును. మన మెల్లరము క్షుద్రత్వమునుండి పూర్ణత్వము వైపున కగ్రగసరుల మగుచుండుటయే దీనికి హేతువు. ఎవ్వరమును చరమస్థానమునకు వచ్చి నిలిచినవారము కాము. లోకమునం దేదేని శాశ్వతమైన గొప్పవిశేషమును మనము నిర్మింతుమనిన నది మన యంతరమునందలి ధర్మబుద్ధిసహాయముననే సంఘటించును. భ్రష్టత నుండి కాదు. గుణవంతులై కళారచన యొనర్చినవారైనను వారి చరిత్రనే యందు ప్రదర్శించినారు. జీవిత మే యంశమున భ్రష్టతం జెందినదో యచ్చట నదియే ప్రకటమైనది. నిర్మించుటలో సంయమ మవసరమగును. నష్ట మొనర్చుట కసంయమము చాలును. ధారణ యొనర్చుటకు సంయమము కావలయును. మరచిపోవుట కసంయమము చాలును.

ఇచట నొక విశేషమును గమనించవలసియున్నది. మానవునియందు సౌందర్యవికాససామర్థ్యము చరిత్రయందసంయమమును పెనవైచుకొనియుండగల్గుటాలోచ్యము. పులియు నావు నొకే తీరమున జలముఁ ద్రోలుటను జూచుచున్నాముగదా! పులి పూర్తిగా పులి, ఆవు పూర్తిగా నావైనప్పు డది పొసఁగని విషయము. పసితనమున నవి రెండు నొకే తావునం దాడుకొనవచ్చును. పెరిగి పెద్దనైన తరువాత పులియు చంగున పైకురుకును, ఆవును పరుగెత్తిపోయి తప్పించుకొన యత్నించును.

ఇట్లే సౌందర్యజ్ఞానముయొక్క పరిణతభావ మెన్నఁడును ప్రవృత్తివిక్షోభితచిత్తముయొక్క యసంయమస్థితితో నొకే క్షేత్రమున మనఁజాలదు. అవి పరస్పరము విరోధులు. ఎందువలన నన, దానికిని హేతు వున్నది. విశ్వామిత్రుఁడు విధాతతో ప్రతిద్వందిత వహించి వేరొక జగత్తును సృజించెను. అది తనక్రోధముతోనైన సృష్టి. అందుచే నా జగత్తు విధాతృజగత్తుతో కలియలేదు. దానిని స్పర్ధించి యాఘాతము కలిగించుచుండెను. అది యసంబద్ధము నతిరిక్తము నైపోయెను. చరాచరములతో నది శ్రుతి కలుపుకొనజాలకపోయెను. తుదకది వేధించి, వేధింపఁబడి నశించిపోయెను.

మన ప్రవృత్తి యుగ్రమై నిల్చినచో విధాతృసృష్టికి విరుద్ధముగ తానే సృష్టి యొనర్చు నన్నట్లుండును. అప్పుడును దానికి శ్రుతి కుదురదు. మన క్రోధము, మన లోభము, మనచుట్టూ ననేక వికారములను సృష్టించి, అల్పము నధికముగను, యధికము నల్పమైనదిగను పరిణమించున ట్లొనర్చును. క్షణకాలీనమైనది

సార్వకాలికమునవలె తోచును. సార్వకాలికమైనది కంటికే కానరాదు. మనకు లోభనీయమైన దానిని మన మెంతటి యసత్యముగఁ జిత్రించుకొందు మనిన, జగత్తునందలి మహాసత్యములను గూడ నది యాచ్ఛన్న మొనర్చివేయు నంతగ. సూర్యచంద్రనక్షత్రములు దానిముందు మ్లానములగును. ఇచ్చటనే మన సృష్టి విధాతృసృష్టితో విరోధము వహించును.

నది ప్రవహించుచున్నది. దానియందలి ప్రతి యలయు స్వతంత్రముగ తల యెత్తుచున్నను నన్నియు కలిసి యొకే సముద్రమునై పునకు గాన మొనర్చుచు నరుగుచున్నవి. ఏదియు దేనికి నష్టుపడుట లేదు. కాని నదియందొక సుడి యేర్పడెనేని చూసుడి యొకచోటనే నిలిచి యున్మత్తునివలె తిరుగుచుండును. గమించుట కాటంకము నొదవించి ముంచివేయుటకు యత్నించును. నది గతి యందంతయు, నభిప్రాయమునం దంతయు వ్యాఘాతమును కలుగ జేయును. అది స్థిరముగ నుండనుజాలదు, ముందున కేగను జాలదు.

మనయం దే ప్రవృత్తియైన యున్మత్తమై విజృంభించు చో నదియు మనలను నిఖిలమునై పునకైన ప్రవాహమునుండి వెనుకకు లాగి యొకే కేంద్రముపైన త్రిప్పుచు నాహత మొనర్చుచుండును. మనసచిత్త మా కేంద్రముచుట్టును బంధింపఁబడి దానియందే సమస్తమును విసర్జించి తదన్యము నంతను నష్ట మొనర్ప నెంచును. ఈ యున్మత్తతయందే కొందరొకరకమైన సౌందర్యమును దర్శింతురు. ఇంత యెందుకు? ఐరోపీయసాహిత్యమునం దీ ఘూర్ణనప్రవృత్తికి జెందిన బృందనృత్యమురొక్క ప్రళయోత్సవమున కంతము లేదు.

శాంతియులేదు. దానియందే వారి కధికసుఖ మున్న దనిపించును. కాని దీనిని మన మభ్యాసముయొక్క సంపూర్ణత యనజాలము. ఇది స్వాభావవికృతి. సంకీర్ణపరిధియం దేది హృన్మనోహరముగ భాసిల్లునో నిఖిలముతో జోడించి చూచిన దాని సౌందర్యము నందు వైరుధ్యము దృగ్గోచరమగును. పానశాలయందలి త్రాగు బోతులు, విశ్వమును విస్మరించి స్వీయసభనే వైకుంఠధామముగ తలంతురు. కాని యప్రమత్తులైన చుట్టును గల దర్శకలోకముతో సరిపోల్చి చూచినచో దాని బీభత్స మవగత మగును. మన ప్రవృత్తియం దుత్పాత మెప్పుడు ఘటిల్లునో యప్పు డొక యస్వా భావికదీప్తి లాభ మొదవినను విశాలవిశ్వమున నుపలక్షించి చూచితిమేని దానియందలి వికృతి వెంటనే మన కన్నులకుఁ గట్టును. ఈ రీతిని స్థిరభావముతో నే వ్యక్తి, గొప్పదానితో కొద్ది దానిని, సమగ్రమైన దానితో ప్రత్యేకమైన దానిని పోల్చిచూచు కొనజాలడో, నతఁ డుత్తేజననే యానందముగను, వికృతినే సౌం దర్యముగను భ్రమించును. అందుచేత సౌందర్యమును పూర్ణ ముగ ననుభవించుటకు చిత్తశాంతి కావలయును. అది యసంయ మముచే పొందరానిది.

సౌందర్యముయొక్క పరిపూర్ణత యే వైపునకు ప్రసరించి నదో చూడవలసియున్నది. అసభ్యజాతి దేనిని సుందరముగ నాద రించినదో, సభ్యజాతి దానిని దూరమున వదలివేయును. అసభ్య మానవుని మనస్సు వర్తించు సంకీర్ణక్షేత్రమునందు మాత్రమే సభ్యమానవుని మనస్సు సంచరించుట లేదు. బాహ్యాభ్యంతరము

లందు, దేశకాలములందు సభ్యజాతియొక్క జగత్తు విపులమైనది. దాని యంగప్రత్యంగములు విచిత్రమైనవి. అందువలననే సభ్యా సభ్యజాతుల స్వరూపనిర్ణయము నందు పరిమాణమాపకము గాని తులామాపకము గాని యొక్కటే కాజాలదు.

చిత్రకళ నెఱుఁగని వ్యక్తి చిత్రపటమునందలి వర్ణముల తారళ్యమును, ఆకృతిని జూచి ముగ్ధు డగును. అత డా చిత్ర మును విపులక్షేత్రమునుండి చూచుటలేదు. ఇచ్చట నాతని యింద్రియగాంభీర్యము నాకర్షించి నిలుపునంతటి మహోన్నతమైన విచారబుద్ధి లేదు. తొలుతనే యతని నాహ్వానించు వస్తువునకు తాను వశుడై పోవును. రాజమందిరమునందలి సింహద్వారమునం దుండు ద్వారపాలకుని బిరుదపట్టమును, సవరించుకొనిన గడ్డమును చూచి యతనినే సర్వప్రధానమైన వ్యక్తిగ భావించి యతడు ముగ్ధుఁ డగును. ద్వారము నధిగమించి సభాప్రవేశ మొనరించు ప్రయోజన మాతని దృష్టికే రాదు. కేవలము గ్రామీణుడుతప్ప నంత పొఱపాటు జెందడు. ఎక్కువైన ఘనత యతనియందు లేకుండుటచేతనే యతని యాధిక్య మంత హఠాత్తుగా కంటబడు నన్న విషయ మాత డెఱుఁగడు. రాజునందలి ఘనత కేవలము చక్షుర్గోచరవిషయమే కాదు. దానిని యోచించి మరియు దర్శించ వలసి యున్నది. రాజుగారి యాధిక్యమునం దొక శక్తి, శాంతి, గాంభీర్యము నున్నవి.

వివేచనాశీలుడు చిత్రపటమునందలి చిత్రవిచిత్రవర్ణసంయో జనమును చూచినంతనే ముగ్ధుడు కాడు. అతడు ముఖ్యమైన

దానితో గౌణమునకును, కేంద్రముతో పరిసరములకును, సమ్ముఖమైన దానితో తిర్యఙ్ముఖమైనదానికిని గల యొకానొక సామంజస్యము నన్వేషించుచుండును. చిత్రవిచిత్రవర్ణములు నేత్రాకర్షకములు కావచ్చును. కాని సామంజస్యసుషమను దర్శించుటకు మనస్సు కావలయును. అందులకు గభీరదర్శన మవసరము. అట్టి దర్శనమునం దానందమును గభీరతర మగును.

ఈ హేతువువలన వివేచనాశీలురు క్షుద్రమైన బాహ్యవస్తువుల లాలిత్యమునకు ప్రశస్తియ మీయ నిచ్చగింపరు. వారి సృష్టియం దొకానొక కఠోరత కానవచ్చుచున్న ట్లుండును. వారి స్థైర్యమునందు సందేహమునకు స్థానము లేదు. వారియం దాకస్మికముగ బహిర్వ్యక్తమగు రిక్తత నవలోకించి సామాన్యులు వారినుండి దూరముగ నుండగోరెదరు. కాని యా నిర్మలమైన రిక్తతయందలి గభీరతరై శ్వర్యమే విశిష్టజనుల చిత్తముల కానందము నొసగును.

కేవల నేత్రదృష్టినే గాక,మనోదృష్టితోకూడ లక్షించినచో మనము సౌందర్యము నతిశయముగ దర్శింపజాలము. ఈ మనోవీక్షణము నార్జించుకొనుట కెంతో సాధన యవసరము.

మనస్సునందును ననేకయరము లున్నవి. బుద్ధికి హృదయమును జోడించినచో జ్ఞానక్షేత్ర మింకను విస్తరిల్లును. ధర్మబుద్ధి కూడ యొనగూడిన నింకను మెంతో విషయము నయనగోచర మగును. ఆధ్యాత్మికదృష్టి వికసించినచో దర్శనక్షేత్ర మింకను నిరవధికమై విరాజిల్లును. అందువలన నే చూపు మనస్సుపై నెక్కువ

యధికారము వహించునో యా చూపునందే మన మొక్కవ తృప్తిని జెందుదుము. కుసుమసౌందర్యముకంటె మానవ సౌందర్యము మనల నధికముగ నాకర్షించును. కారణ మేమన మానవ వదనమున మన కాకృతియొక్క సుషమయే కాదు. దానియందు చేతనాదీప్తి, బుద్ధిస్ఫూర్తి, హృదయలావణ్యము నున్నవి. అది మన చైతన్యమును, బుద్ధిని, హృదయమును స్వాధీన మొనర్చుకొని కూర్చొనును. అవి మనలో నంత శీఘ్రముగ వివర్ణమగుట కిచ్చగింపవు.

ఇక మానవోత్తములు, ఈశ్వరుని మంగళరూపప్రకాశ స్వరూపులైనవారు, మన మానసములను మనకే యంతుపట్ట నంతగా నాకర్షింతురు. మానవదుఃఖవిమోచనమునకై రాజ్య త్యాగ మొనర్చి నిర్గమించిన రాజపుత్రునియందలి మనోహర త్వము మానవుని కెన్ని కావ్యములం దెన్ని చిత్రరచనలయం దాభిముఖ్యమును గలుగజేసినది !

సౌందర్యచర్చ, ధర్మనీతివిషయములోనికి దిగుచున్న దని సందేహమనస్కులైన వారిచ్చుట నభియోగము తేవచ్చును. ఈ రెంటిని కలిపి మలిన మొనర్చు నగత్య మేమి? మంచి యెట్లును మంచిదే. సుందర మెన్నడును సుందరమే. మంచి మన మనస్సుల నొకవిధముగ నాకర్షించును. సుందరము మరొకవిధముగ నాక ర్షించును. రెండిటి యాకర్షణప్రణాళికలందు భిన్నత్వ మున్నది. గనుకనే భాషయందు వానికి వేరువేరు నామములు లొసగబడినవి. మంచిదానియందలి ప్రయోజనీయత మనల నాకర్షించును,

సుందర మైనది మనల నేల ముగ్ధుల నొనర్చుచున్నదో యది మన మెరుగము.

మంగళకరమైనది మనకు మంచి నిచ్చును గనుక దానిని మంచి దందు మనుటలో సమగ్రత లేదు. మంగళకరమైనది మన ప్రయోజనమును సాధించి యిచ్చును, అది సుందరము నగును. అనగా ప్రయోజనసాధనను మించి దానియం దొక యహేతుక మైన యాకర్షణ యున్నది. నీతికోవిదులు జగత్ప్రయోజనము దృష్టినుండి నీత్యుపదేశ మొసంగి శుభప్రచార మొనర్ప యత్నింతురు, కవులిక మంగళకరమైనదానియందలి యనిర్వాచనీయతను లోకముముందు ప్రకాశింపఁజేయుదురు.

మంగళకరమైనది సుందరమగుట మన ప్రయోజనమును సాధించిపెట్టు ననికాదు. పాదరక్షలు మనకు ప్రయోజనకరములు, వస్త్రములు మనకు ప్రయోజనకరములు, అందుచేత నవి మన మనస్సులను సౌందర్యపులకాంకితములుగ నొనర్చుటలేదే! కాని లక్ష్మణుడు రాము ననుగమించి వనమున కేగె నను విషయము మన మనోవీణాతంత్రియం దేదో స్పందనము నొదవించుచున్నది. దీని నందమైన భాషలో సొగసైన ఛందములో సుందర మొనర్చి దిద్ది స్థాయీభావమున నుంచుకొనవలసిన విషయము. అనుజుఁ డగ్రజు ననుగమించుటలో సమాజశ్రేయ మున్నదని కాదు, దీని నుల్లేఖించుట. ఇది సుందర మగుటచేతనే, యిట ప్రస్తావింపబడినది. ఎందుచే సుందరమైనది? మంగళకరమగుటయందే సమస్త జగత్తుతో నొకానొక గభీరతమసామంజస్య మున్నది. సర్వమానవ

వుల మనస్సులతో దాని కొక నిగూఢమైన కలయిక యున్నది. సత్యముతో శివమునకుఁ గల పూర్ణసామంజస్యమును దర్శించి నప్పుడే సౌందర్యముయొక్క పూర్ణరూపము మనకు గోచరించును. కరుణ సుందరము, క్షమ సుందరము, ప్రేమ సుందరము - శతదళ పద్మమువలె, పూర్ణిమాచంద్రునివలె స్వీయముగను, జగత్పరీతము గను వీనియం దొక స్పర్ధాహీనమైన సుషమయున్నది. అది నిఖిల మున కనుకూలము, నిఖిలము దాని కనుకూలము. మన పురా ణములందలి లక్ష్మి కేవలము సౌందర్యరాశియు నైశ్వర్యపరసీమ యునే కాదు. ఆమె మంగళదేవతకూడ నైయున్నది. సుందర మూర్తియే పూర్ణమంగళమూర్తి, మంగళమూర్తియే సౌందర్య పూర్ణస్వరూపము.

సౌందర్యమాంగళ్యముల సామంజస్యస్థాన మెచ్చట? సౌంద ర్యము ప్రయోజనాతీతవిషయ మని తొలుతనే తెలిసికొన్నాము. దాని నైశ్వర్యముగ గణింతుము. అది మనలను సంకీర్ణస్వార్థ సాధనాదారిద్ర్యమునుండి యుద్ధరించి మనకు ప్రేమయందు ముక్తి నొసఁగును. మంగళమునందు మన మా యైశ్వర్యమును దర్శిం తుము. ఒకానొక వీరపురుషుడు ధర్మముకొరకాత్మత్యాగ మొన ర్చుట గాంచినప్పుడు మన కాశ్చర్య మొదవును. అది మన సుఖ దుఃఖములకంటె నధికము, మన స్వార్థముకంటె యున్నతము, మన ప్రాణముకంటె మహత్తరమునై మనల సమాకర్షించును. మంగళము తన యైశ్వర్యబలమున కష్టనష్టములను కష్టనష్టములుగ గణించనే గణించదు. స్వార్థనాశమునందు వాని కెట్టి నష్టము నగు

సంభావన లేదు. సౌందర్య మెట్లు మనలను స్వేచ్ఛాకృతత్యాగము నందు ప్రవృత్త మొనర్చునో, మాంగళ్యము నట్లే యొనర్చును. సౌందర్యము జగద్వ్యాపారమున నీశ్వరుని యైశ్వర్యమునే ప్రకాశింపఁజేయును. మంగళముకూడ నదే రీతిని మానవజీవితమున నైశ్వర్యమును ప్రకాశింపజేయును. మంగళము సౌందర్యమును వ్యాపక మొనర్చి, గభీరతర మొనర్చి మానవుని సమీపమునకుఁ దెచ్చినది. అది యీశ్వరవస్తువును మానవవస్తువుగ నొనర్చిమించినది. వస్తుతః మంగళము మానవునికి సమీపవర్తియైన యంతరతమసౌందర్యము. అట్లగుటచేతనే మనము దానిని తరచు సహజసుందరముగ గుర్తింపజాలకున్నాము. కాని యభిజ్ఞ యొదవినప్పుడు మన ప్రాణ మానందముతో వర్షాతరంగిణివలె కూలంకషమగుచున్నది. అప్పుడు మనము దానిఁ మించిన రామణీయకతనెందును దర్శింపజాలము.

పత్రపుష్పములతో, ప్రదీపమాలలతో, రజతస్వర్ణపాత్రలతో భోజనశాల నలంకరింపగల్గినదో మంచిదే కాని నిమంత్రితవ్యక్తి గృహయజమానినుండి సమాదరమును పొందని-చో, హృద్యతను పొందని-చో నా సమస్తైశ్వర్యమునూ, సమస్తసౌందర్యమును నతని దృష్టియం దకించిత్కరమైపోవును. ఈ హృద్యతయే యాంతర్యమునందలి యైశ్వర్యమును, ప్రాచుర్యమును నొయున్నది.

హృద్యతాసంబంధమైన మధురహాసము, మధురసంభాషణ, మధురస్వీకృతి యత్యంతమనోహరమై కదళీపత్రమును సైతము కనకపళ్ళెరముకంటె నమూల్య మొనర్చును. అందరి

యెడ నీడ వర్తించు ననజాలము. అవమానముతోనైనను సరే, ఆడంబరపూర్ణమైన భోజనము నాశించువారును గలరు. వారు భోజనముయొక్క తాత్పర్యమును, అందలి మహాసౌందర్యము నెఱుఁగనివారు. భుజించుటయు, నలంకరణమునే భోజనక్రియా కలాపమునఁ బ్రధానాంశములు కావు. ముకుళమునందలి దళములు తమలో తామే కుంచితములైనట్లు స్వార్థరతుడైన మానవుని శక్తి స్వీయమువైపునకే సర్వదా సంకుచితమై యుండును. ఆతని బంధమును విదల్చి, పరాభిముఖ మొనర్చినంతనే వికసిత కుసుమమువలె విశ్వమువైపున కాతని మధురమైన సుందర ప్రవృత్తి విస్తారితమగును. ఆంతరికమును, గభీరమును నగు యజ్ఞ సంబంధమైన మంగళపూర్ణసౌందర్యమును సంపూర్ణముగ దర్శించని వ్యక్తి దృష్టియందు, అన్నపానప్రాచుర్యము, అలంకారాడంబరము ఘనములై వెలుఁగొందును. అతని యసంయత ప్రవృత్తిలో భోజనభాజనముల విషయమునను, దానదక్షిణల విషయమునను గల లోభ మంతులేనిది. అది యజ్ఞసంబంధమైన యుదారమాధుర్యమును సమ్యగ్రూపమున దర్శింపనీయదు.

క్షమాభావము శక్తిమంతునికి భూషణ మని శాస్త్రము నుడువుచున్నది. కాని క్షమాప్రకాశమునం దెల్లరకును శక్తిసౌందర్యానుభవము సాధ్యము కాదు. మీదుమిక్కిలి శక్త్యుపద్రవ దర్శనమునందే మూఢులు శ్రద్ధాన్వితు లగుదురు. లజ్జ స్త్రీలకు భూషణము. కాని వేషభూషలకంటె నధికమైనదిగ నీ లజ్జాసౌందర్యమును దర్శించగలిగినవా రెవరు? సౌందర్యమును సంకీర్ణ

మొనర్చి దర్శించనివారు. సంకీర్ణప్రకాశతరంగభంగములు విస్తీర్ణ ప్రకాశమునందు శాంతించినప్పుడా మహాత్సౌందర్యము నున్నతతలమునుండి ప్రశస్తభావమున చూడఁదగియున్నది. అట్లు చూడ గల్గుటకు మానవునికి శిక్షాసంయమములు కావలయును, గాంభీర్యము కావలయును, శాంతి కావలయును.

మన దేశమునందలి ప్రాచీనకవిపుంగవులు గర్భిణీస్త్రీల సౌందర్యవర్ణన మొనర్చుట కెచ్చుటను సంకోచింపలేదు. ఐరోపీయకవు లీ విషయమున నించుక లజ్జాదీనతల కధీనులైరి. నారీత్వమునందలి చరమసార్థకతాలాభ మాసన్నమైనప్పుడు దాని ప్రతీకస్త్రీమూర్తిని గౌరవపూర్ణముగ నొనర్చును. ఈదృశ్యము నందు చక్షుర్విలాస మే కొంచెము కొరవడునో మానసికమైన భక్తియంతకంటె నెక్కువ పూరించును. వృష్టియంతయు ధారాపాతముగ పడిపోయి, లఘువులైన శరన్మేఘము లకారణముగ శరీరములందు శీతలవాయువులను పూరించుకొనుచు గగనతలమున సంచరించుచుండ వానిపై నస్తమితసూర్యుని యరుణకాంతులు పడినచో నా కాంతులలో కండ్లు మెరసిపోవును. కాని యాషాఢఘనఘనాఘనము పయస్వినియైన కపిలగోవువలె నాసన్న వృష్టిభారముచే మంథరమైపోయినప్పు డణువణువున జలప్రపూర్ణమై వర్ణవైచిత్ర్యచాపల్య మెచ్చటను కనిపించనీయదు. అది మన మనస్సుల ననేకరీతులుగ నాకర్షించును. దానియందు శూన్యత మృగ్యము. ధరణికి తాపశాంతి, సస్యక్షేత్రముల దైన్యనివృత్తి, నదీసరోవరముల కృశతామోచనము లందలి యుదారాశ్వా

సము దాని స్నిగ్ధసలిలమునం దలముకొని మంగళమయపరిపూర్ణ గంభీరమాధుర్యమున నది స్పష్టమై కనుపట్టును.

మహాకవి కాళిదాసు వసంతసమీరమును విరహియైన యక్షుని దౌత్యకార్యమున నియుక్తమొనర్చఁగలిగి యుండెడి వాఁడే. అం దాతని హస్తనైపుణ్యము ననేకులు కొనియాడెడివారు కూడ. విశేషించి దక్షిణసమీర ముత్తరమున కత్యంతసహజగతి నేగఁజాలెడిది. కాని కవికులగురువు ప్రథమాషాఢనూత్న మేఘమునే యిందులకు వరించినాఁడు - అది మరి జగత్తాపనివారకము కద ! దాని కర్తవ్యము ప్రణయివార్తను ప్రణయిని చెవిలో నూదుట మాత్రమేనా ? అది మార్గమునం దంతటను నదీగిరికాననములపై విచిత్రమైన పూర్ణతాసంచార మొనర్చుచు పయనించును. కదంబము వికసించును, జంబూకుంజము పరిప్లుతమగును, బలాక యెగిరిపోవును, కూలంకషమైన నదీజలములు పలపల కొట్టుకొనుచు తటమునందున్న వేత్రవనమునఁ బ్రవేశించి ప్రతారించును, జానపదవధువుల భ్రూవిలాసహీనప్రీతిస్నిగ్ధలోచనముల దృష్టిపాతమున ఆషాఢాకాశ మింకను ఘనీభూతమైపోవును. విరహియొక్క వార్తా ప్రేరణమును సమస్తపృథ్వియందలి మంగళకరవ్యాపారముతో నల్లియల్లి సౌందర్యపిపాసియైన కవిచిత్తము తృప్తిఁజెందినది.

కుమారసంభవకవి యకాలవసంతమునందలి యాకస్మికోత్సవములో పుష్పశరుని మోహావర్షణమునందు హరపార్వతుల మిళనమును పర్యవసింపఁజేయలేదు. స్త్రీపురుషసంఘాతమునుండి ప్రజ్వరిల్లిన ప్రళయాగ్నియం దాతఁడు మొదట శాంతివర్షణ మొన

ర్చెను. అప్పుడే మిథునము సార్థకమైనది. కవి, ప్రేమకంటే సర్వవిధముల కమనీయమైన తపోగ్నిద్వారముననే గౌరీమూర్తి నుజ్జ్వలమొనర్చి చూపించెను. అచ్చట వసంతసమయపుష్పసంపద మ్లానము, పికకూజితము స్తబ్ధము. అభిజ్ఞానశాకుంతలమునందును ప్రేయసి జననియైన తావునందు విషయవాసనాచాంచల్యము వేదనాతపశ్చర్యలో గాంభీర్యము వహించిన చోట, అనుతాపస్థానమున, క్షమాభావము నిలిచిన నదనున, రాజదంపతుల సమాగమము సార్థకమైనది. ప్రథమసమాగమమున ప్రళయము. ద్వితీయసమాగమమున పరిత్రాణము. ఈ కావ్యద్వయమునందు శాంతియందు, శుభమునందు కవి సౌందర్యమును ప్రదర్శించిన తావులందెల్ల నతని తూలిక విరళమును, నతని వీణ యప్రమత్తమును నై విలసిల్లినది.

సౌందర్యము పరిణతమైన తావులందెల్ల నది తన ప్రాగల్భ్యమును దూరీకృత మొనర్చెను. అచ్చట పుష్పము తన వర్ణగంధముల బాహుళ్యమును ఫలముయొక్క గూఢతర మాధుర్యమునందు పరిణత మొనర్చెను. ఆ పరిణతియందే సౌందర్యమాంగళ్యములు రెండును పెనవేసుకొని వర్ధిల్లినవి.

సౌందర్యమాంగళ్యముల సమైక్యమును దర్శించినవాడు భోగవిలాసములతో సౌందర్యము నెన్నడు ముడివెట్టఁజాలడు. అతని జీవికానిర్వహణమునకైన యుపకరణము లతిసామాన్యములై యుండును. అది సౌందర్యబోధముయొక్క యభావమునుండి కాదు. ప్రకర్షనుండియే యగును. అశోకుని లీలోద్యాన

నెచ్చటను నుండెను? అతని రాజప్రాసాదముయొక్క పునాది చిహ్నమునై తము కనిపించుటలేదు. కాని యశోకరచితములైన స్తూపములును, స్తంభములును బుద్ధగయయందు బోధివృక్ష మూలమునకు సమీపమున నిలిచియున్నవి. ఆయన శిల్పకళయు అసామాన్యమైనది. మానవదుఃఖనివృత్తిపథమును బుద్ధభగవాను డావిష్కరించిన తావున, ఆ దివ్యమంగళస్వరూపుని స్మరణక్షేత్రము నందు అశోకచక్రవర్తి కళాసౌందర్యప్రతిష్ఠ నొనర్చెను. స్వీయ భోగమున కీపూజార్ఘ్యము నాయన యొసఁగలేదు. భారతవర్ష మున నెన్ని దుర్గమగిరిశిఖరములయందు, ఎన్ని నిర్జనసముద్ర తీరములందు, ఎన్ని దేవాలయములు ఎంత కళాశోభనమైన పుణ్యకీర్తిని దర్శించగలము! కాని హిందూచక్రవర్తుల విలాస వైభవముల స్మృతిచిహ్నము లెచ్చటి కేగెను? రాజధానీనగర ములను వదలి అరణ్యములందును, పర్వతములందును యీ సమస్తసౌందర్యమును నెలకొల్పుటకుఁ గల హేతు వేమి? అచ్చట మానవుడు స్వీయసౌందర్యసృష్టిద్వారమున తనకంటెను శ్రేష్ఠ మైన దానియందు విస్మయపూర్ణమైన భక్తిని ప్రకాశ మొనర్చి నాడు. మానవరచితసౌందర్యము నిలిచి తనకంటె మహత్తరమైన సౌందర్యమునకు హస్తద్వయము నెత్తి యభివాదన మొనర్చు చున్నది. మానవు డీ సమస్తమును శిల్పప్రపూర్ణమైన నిస్తబ్ధభాషా ద్వారమున ఘోషించియున్నాడు. 'చూడుము! ఆకృష్టుడవై దర్శింపుము. సుందరమైన దానినవలోకింపుము, మహానుభావుని దర్శింపుము!' అని. తా నెంతటి గొప్పభోగియో చూడు మని

చెప్పలేదు. తాను జీవితకాలమున విహరించిన తావులను దర్శింపు
మని చెప్పలేదు. మృతావస్థయం దెచ్చట మట్టియందు జీర్ణించి
పోయినాడో యచ్చట తన మహిమను దర్శింపు మని చెప్పలేదు.
ప్రాచీనహిందూరాజులు తమ విలాసభవనముల నంతగా యలంక
రించెడివారో కారో తెలియదు. ఎవరి గౌరవప్రచారముకొఱ
కవి ప్రతిష్ఠింపఁబడినవో యవి యన్నియు వారితోనే ధూళిలో
కలిసిపోయినవి. కాని మానవుని శక్తియు, భక్తియు నెచ్చట స్వీయ
సౌందర్యరచనను భగవానుని మంగళరూపముయొక్క వామ
పార్శ్వమున న్యస్త మొనర్చి ధన్య మయ్యెనో యచ్చట నా సమా
గమమందిరముల నతిదుర్గమస్థానములందును మనము రక్షించు
కొనుచువచ్చుచున్నాము. మంగళముతో సుందరముయొక్కయు,
విష్ణువుతో లక్ష్మియొక్కయు మిళనము సంపూర్ణము. ఎల్ల సభ్య
తలయందును నీ భావము ప్రచ్ఛన్నముగ నున్నది. సౌందర్యము
వ్యక్తిగతస్వార్థమున బద్ధమును, యీర్ష్యచే ననువిద్ధమును,
భోగముద్వారా జీర్ణమును కాక శాంతిమంగళములందు వినిర్మల
భావమున స్ఫూర్తిని గను నొకానొక సమయము తప్పక రాగ
లదు. విషయవాసననుండి, లోభము నుండి వేరుపరచి చూడనిచో
సౌందర్యమును పూర్ణభావమున చూచుట పొసగదు. ఆ యశి
క్షిత అసంపూర్ణదర్శనమునందు మనకు తృప్తి యొదవదు. తృష్ణయే
మిగులును. అది ఖాద్యము నీయదు. మద్యము నొసఁగి యాహా
రమునందలి స్వాస్థ్యకరమైన యభిరుచినికూడ నష్ట మొనర్చును.

ఇందులకే ధర్మప్రచారకులు సౌందర్యమునకు దూరము నందుండి నమస్కరింపు డని యుపదేశింతురు. నష్టమే రావచ్చునేమో యని లాభమార్గమున సంచరించుటనే నిషేధించెదరు. కాని యుచితమైన యుపదేశ మేమనిన సౌందర్యముయొక్క పూర్ణాధికారమునకై సంయమసాధన మొనర్పవలయు ననునదే. బ్రహ్మచర్య మందులకే యైయున్నది. పరిణామమునందు శుష్కత కొఱకు కాదు బ్రహ్మచర్యము.

సాధనవిషయప్రసక్తి వచ్చినప్పు డీ సాధనయొక్క సిద్ధియేమను ప్రశ్న యుదయించును. దీని కంత మెచ్చట ? మన మితరేతర కర్మేంద్రియజ్ఞానేంద్రియముల యుద్దేశ్యమును తెలిసికొనగలము. కాని సౌందర్యజ్ఞాన మెందులకు మన మనస్సున స్థానమును పొందిన దను ప్రశ్నకు సమాధానము నిచ్చుటలో సౌందర్యబోధము మార్గ మెటు లేగుచున్న దను విషయము నొకపర్యాయము . సంక్షేపముగ యోజించి చూచుకొను టవసరము.

సౌందర్యజ్ఞానము కేవల మింద్రియనిష్ఠమైనప్పుడు విస్పష్టముగ నుండును. చూచినంతనే కంటి కగుపడును. సౌందర్యాసౌందర్యముల ద్వంద్వభావ మొకేతూరి మనకు మనస్సునందు పొడకట్టును. బుద్ధికూడ తోడ్పైనచో సుందరాసుందరముల భేదము దూర మగును. ఆ యవస్థయందు మన మనస్సు నాకర్షించు వస్తువు కన్ను తెరచిన వెంటనే దర్శనయోగ్యమైన దని మనస్సునం దనిపించకపోవచ్చును. ఆరంభముతో పర్యవసానము

నకును, ప్రధానముతో నప్రధానమునకును, ఒక యంశముతో వేరొక యంశమునకును గల గూఢతరసామంజస్యమును లక్షించి మన మానందమును పొందు తావునందు మన కన్నులను గప్పు సౌందర్యముయొక్క చేవ్రాలును మనము మన్నించము. ఇక కల్యాణబుద్ధికూడ సమకూడిన చోట మనస్సుయొక్క యధికార మింకను హెచ్చిపోవును. సుందర అసుందరముల మధ్య యంతర మింకను లుప్తమగును. అచ్చట కల్యాణిమైన సతి సుందరముగ దర్శన మొసఁగును. కేవలము రూపసిగ కాదు. ధైర్యము, వీర్యము, క్షమ, ప్రేమ దీప్తిప్రసార మొనర్చు తావునందు రంగు రంగుల యత్నాడంబరములయం దెట్టి ప్రయోజనమును మనకు గోచరించదు. కుమారసంభవ కావ్యమున ఛద్మవేషియైన మహా దేవుడు తపస్వినియైన యుమాదేవి సమీపమున శంకరుని రూప గుణవయోభిజాత్యములను నిందించును. అప్పు డుమాదేవి యనిన దేమన- 'మమాత్ర భావైకరసం మనస్థితమ్' - ఆయనయందు నా మనస్సు కేవలము భావరసమున స్థితమై యున్నది. కావున నానందముకొరకై నే యుపకరణప్రయోజనమును లేదు. భావ రసమునందు సుందరాసుందరముల కఠినవిచ్ఛేదము దూరీకృత మగును.

మంగళమునందు నొకానొక ద్వంద్వ మున్నది. మంగళ జ్ఞానము మంచిచెడ్డల కలయిక నపేక్షించును. ఈ ద్వంద్వమునం దేదియు పరిసమాప్తి నొందజాలదు. పరిణామమునం దొకటే, రెండు కావు. నది ప్రవహించు నంతవర కుభయతటములు నవ

పరమే. కాని, గమన మాగిపోవు చోట నకూలమైన సముద్రము మాత్రమే. నదికి గమనదృష్ట్యా ద్వంద్వము, సమాప్తి దృష్ట్యా ద్వంద్వావసానము. అగ్నిని జ్వలింపఁజేయుటకు రెండు కాష్ఠముల ఘర్షణ కావలయును. జ్వలించిన వెంటనే ఘర్షణ మాగిపోవును. మన సౌందర్యబోధమునను నట్లే యింద్రియసుఖకరము, నసుఖకరము; జీవితమున మంగళకరము నమంగళకరము - యీ రెంటి ఘర్షణ ద్వంద్వమున స్ఫులింగముల వెలార్చుచు, పూర్ణముగ జ్వలించిన పిమ్మట వాని యాంశికతయు, నాలోడనమును నిరస్త మగును. అంతట ద్వంద్వము సమసిపోయి సమస్తమును సుందర మగును. సత్యమును సుందరము నొకటే యగును. అప్పుడే సత్యోపలబ్ధియే యానందోపలబ్ధి యని, యదియే చరమసౌందర్య మని తెలిసికొనఁజాలుదుము.

ఈ చంచలమైన జగత్తునందు సత్యాస్వాదము మన మెచ్చట పొందెదము? మనస్సు లగ్నమైన చోట. మార్గము వెంట జనులు వచ్చుచున్నారు, పోవుచున్నారు. వారెల్లరు మన దృష్టిలో ఛాయాసదృశులు. వారి యుపలబ్ధి మనయందతిక్షీణము కనుకనే వారియందు మన కానందము లేదు. మిత్రుని విషయము మన యెడల నత్యంతసత్యము, గభీరము. అది మన మనస్సున కాశ్రయ మిచ్చును. మిత్రు నెంత సత్యముగ భావింతుమో యతడు మన కంత యానందము నిచ్చును. మన భూగోళాంతర్గతమైన నామ మాత్రవిషయమైన దేశముకొఱకు కా దేశమునందలి ప్రజ లవసర మైనచో ప్రాణములనైత మిత్తురు. వా రా దేశము నత్యంతసత్య

రూపమున నెఱుంగజాలుదురు. కనుకనే దానికొఱకై యసువుల నవలీలగ కోల్పోగలరు. మూఢునికి బిభీషికాసదృశమైన విద్య విజ్ఞానికి పరమానందవిషయము. విద్వాంసుడు దానిని పురస్కరించుకొని జీవితమును గడుపుకొనుచున్నాడు. ఇందువలన సత్యోపలబ్ధి యొదవు తావుననే యానందమును ప్రతీయమాన మగుచున్న దనుట స్పష్ట మగుచున్నది. సత్యముయొక్క యసంపూర్ణోపలబ్ధియే యానందాభావము. ఏ సత్యమునందు మన కానంద మొదవుట లేదో యా సత్యము మన కజ్ఞాతము కాదు కాని యనుపలబ్ధము. నా పక్షమున నిరతిశయమైన సత్యమునందే నా ప్రేమ, నా యానందము. సత్యానుభూతియు సౌందర్యానుభూతియు నొకటియేయై భాసిల్లు నని తెలియుచున్నది.

సంగీతము, సాహిత్యము మొదలైన లలితకళ లన్నియు జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో నీపై పునకే పర్యవసించుచున్నవి. కావ్యమునందు, శిల్పమునందు, చిత్రమునందు మానవు డీ సత్యమును మాత్రమే యుజ్జ్వల మొనర్పం చున్నాడు. మన కంటం బడకుండుటచే మన దృష్టియం దసత్యముగ నుండిన దానిని కవి మన దృక్పథమునకుఁ దెచ్చి, మన సత్యరాజ్యముయొక్క ఆనంద సామ్రాజ్యముయొక్క పరిధిని విపులతర మొనర్చుచున్నాడు. అల్పము ననాదృతమునైన సర్వమును మానవసాహిత్య మను దినము సత్యగౌరవమున నావిష్కరించి కళాసౌందర్యముచే చిహ్నిత మొనర్చుచున్నది. కేవలము పరిచితముమాత్రమే యైన

దానిని మిత్రముగ నొనర్చుచున్నది. చక్షుర్గోచరమేమైన దాని మీఁదికి మనస్సు నాకర్షించుచున్నది.

ఆధునికకవి యనినాఁడు, - 'సత్యమే సుందరము, సౌంద ర్యమే సత్యము' అని. శుభ్రవసనయైన కమలాలయాదేవి సరస్వతి ఒకే దశయందు 'సత్యము' ను, విశిష్టమూర్తియు నై యున్నది. ఉపనిషన్నిర్వచనముగూడ తదనుగుణ్యముగ నున్నది - 'ఆనంద రూప మమృతం యద్విభాతి'- ప్రకాశించునది యాతని యానంద రూపము, ఆతని యమృతరూపము. మన పదతలమునందలి ధూళి నుండి విహాయసమునందలి నక్షత్రముల పర్యంతము సమస్తమును సత్యము, సమస్తమును సుందరము, సమస్తము నానందరూప మమృతమే.

సత్యముయొక్క యీ యానందరూపమును అమృత రూపమును దర్శించి వ్యక్త మొనర్చుటయే కావ్యసాహిత్యము యొక్క లక్ష్యము. సత్యమును కంటితో చూచి నప్పుడును, బుద్ధితో పొందినప్పుడును కాదు. హృదయముతో పొంది నప్పుడే దానిని సాహిత్యమునఁ బ్రకాశింపఁజేయగలము. ఐనచో సాహి త్యము కళాకౌశలముయొక్క సృష్టి కాదు, అది హృదయావి ష్కారము. దీనియందు సృష్ట్యంశము కూడ నున్నది. ఆ యావి ష్కారవిస్మయమును, ఆవిష్కారానందమును, హృదయము తన యైశ్వర్యము ద్వారమున భాషయందో ధ్వనియందో వర్ణము నందో చిహ్నిత మొనర్చియుంచుటయందే సృష్టినై పుణ్యము

వ్యక్త మగుచున్నది. ఇదియే సాహిత్యము, యిదియే సంగీతము, యిదియే చిత్రకళ !

మరుభూమియందలి వాలుకామయమైన యెడారియందు నిలిచి మానవుడు దానిని రెండు సూచీస్తూపముల(పిరమిడ్స్)యొక్క విస్మయావహమైన చిహ్నములతో చిహ్నిత మొనర్చినాడు. నిర్జన ద్వీపమునందలి సముద్రతటమును, పర్వతదేహముపై తన శిల్ప కౌశలమున తొలిచి గుహాయందు చిహ్నిత మొనర్చినాడు. ఇదియే బొంబాయిప్రాంతమందలి 'హస్తిగుహ.' పూర్వాభిముఖ ముగ నిలిచి మానవుడు సముద్రమధ్యమున సూర్యోదయమహి మను దర్శించినాడు. వెంటనే బహుశతక్రోశములదూరమునుండి శిలలను తెచ్చి, యచ్చట తన వినయపూర్వకమైన ముకుళితహస్త చిహ్నమును నిక్షేపించినాడు. అదియే కోణార్క మందిరము. సత్యమును నిబిడముగ నానందరూపమున నమృతరూపమున దర్శిం చిన తావునం దెల్ల మానవుడు తన చిహ్నము నొకదానిని నెల కొల్పినాడు. ఆ చిహ్నమెక్కచో నొకమూర్తి, ఒక్కయెడ నొక మందిరము, వేరొక తావునం దొకతీర్థము, యింకొక ప్రదేశమున నొక రాజధాని! సాహిత్యమును ఇట్టి చిహ్నమే. విశాలవిశ్వమున నే తీరమున మానవహృదయ ముపస్థితమై యానందస్పర్శ ననుభ వించినదో యచ్చటనెల్ల నది భాషద్వారమున నొక చిరస్థాయియైన తీర్థమును రచించుటకు యత్నించుచున్నది. విశ్వాంచలములందలి సర్వస్థానముల నది యాత్రికులకు హృదయాకర్షణ నొనర్చి మించి నది. జలమునందు, స్థలమునందు, ఆకాశమునందు, శరత్తున, వసం

తమున, వర్షాకాలమున, ధర్మకర్మలయందు, ఇతిహాసమునందు, అపురూపచిహ్నములతో రచించి రచించి సత్యముయొక్క సుందర మూర్తిత్వమువై పునకు మానవహృదయమును నియతముగ నాహ్వానించుచున్నది. దేశదేశములందును సర్వకాలములందు నీ చిహ్నము, యీ యాహ్వానము కేవల మభివృద్ధినందుచు వచ్చినది. జగత్తునం దీ రీతిని సర్వత్ర సాహిత్యముద్వారమున నీ హృదయసంబంధమగు చిహ్నములను మానవుడు నెలకొల్పకున్నచో నప్పు డీ జగత్తు మన దృష్టియం దెంత సంకుచితమై యుండెడిదో యది మన యూహ కందని విషయము. నే డీ నేత్రములతో దర్శించు, శ్రోత్రములతో నాకర్ణించు జగత్తు సర్వాతిశాయిగ మన హృదయ సంబంధిగఁ బరిణమించుట, మానవసాహిత్యము హృదయావిష్కారచిహ్నమునందు దీనిని మండిత మొనర్చుట చేతనే సాధ్యమైనది. సత్యము వస్తుసమూహముయొక్క స్థితిగతుల సామంజస్యము. సత్యము కార్యకారణపరంపర. దీనిని తెలియఁజేయుటకు శాస్త్ర మున్నది. కాని సాహిత్యము సత్యమే యానంద మని, సత్యమే యమృత మని తెలియఁజేయుచున్నది. సాహిత్య మీ యుపనిషణ్మంత్రము నహరహము వ్యాఖ్యానించుచు వచ్చినది.

'రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వా నన్దీ భవతి' అతడే రసము. ఈ రసమును పొందియే మానవుఁ డానందితు డగుచున్నాడు.



# విశ్వసాహిత్యము

మన యంతఃకరణమునందలి వృత్తు లన్నియు సర్వపదార్థములతో సంబంధమును స్థాపించుకొనుటకై యున్నవి. ఈ యోగమువలననే మనము సత్య మగుదుము, సత్యమును పొందుదుము. లేనిచో, నే నున్నాను, అది యున్నది యను వాని కర్థమే యుండదు.

సత్యముతో మనకుఁగల సంబంధము త్రివిధ మైనది. బుద్ధిసంబంధము, ప్రయోజనసంబంధము, ఆనందసంబంధము. వీనిలో బుద్ధిసంబంధము నొక ప్రతిద్వంద్వత యనవచ్చును. అది వేటకానికిని మృగమునకును గల సంబంధము వంటిది. బుద్ధి స్పర్ధాభావముతో సత్యము నొక దారునిర్మితమైన వేదికపై నిల్పి విచారణ యొనర్చి దాని హృదయగర్భితమైన విషయమును బయటకు లాగున ట్లనిపించును. దీనిచే సత్యమువిషయమున బుద్ధియం దొక యహంకారము నిలిచిపోవును. బుద్ధి సత్యము నే పరిమాణమున దర్శించునో యదే పరిమాణమున తన శక్తి ననుభవమునకుఁ దెచ్చుకొనును. ఇక ప్రయోజనసంబంధము. ఈ సంబంధమున సత్యముతో మన శక్తి కొక సంయోగము కలుగును. ఈ స్వార్థసంబంధమున సత్య మింకను ప్రబలముగ మనకు సన్నిహితమగును. ఐనను దానితో మనకుఁగల పార్థక్య మింకను నిశ్శేషము కాదు. ఆంగ్లవణిజుఁ డొకానొక దినమున నవాబు సమ్ముఖమునకు నతమస్తకుఁడై యరుగుదెంచి, కార్యసాధన యొనర్చుకొని కృత

కార్యస్థైన పిమ్మట తుదకు సింహాసనమునే యధిష్ఠించిన రీతిని సత్యమును వ్యవహారమున లగించి, కార్యనిర్వాహణ మొనర్చుకొని తుదకు మనమే జగత్తున కధిపతుల మని భావింతుము. అప్పు డిక మనము, ప్రకృతి మనకు దాసి, జలాగ్నివాయువులు వేతనము లేని మన నౌకరు లనుటకు సంకోచింపము.

అటుతరువాత నిక యానందసంబంధము. ఈ యానంద యోగము లేక సౌందర్యయోగమునందు పార్థక్యమంతయు పటా పంచ లగును. ఇచ్చట నిక యహంకారమునకు తావే లేదు. ఇచ్చట నితాంతము తన్ను తాను సామాన్యునియందు దుర్బలుని యందు సంపూర్ణముగ సమర్పించుకొనుట కేమియు నాటంక ముండదు. ఇచ్చట మధురాధిపుడు బృందావనమునందలి గోపవని తల చెంగట తన రాచమర్యాదను గోపన మొనర్చుకొనుటకు మార్గము లేదు. ఆనందయోగమున మన బుద్ధిశక్తి గూడ మన యనుభవమునకు రాదు. కర్మశక్తియు నట్లే మన యనుభవము నకు దూరమందు నిలిచిపోవును. అచ్చట మనలను మనమే స్వాయ ముగ ననుభవమునకుఁ దెచ్చుకొందుము. మధ్య నెట్టి యావరణ ముండదు.

సత్యముతో బుద్ధియోగము పాఠశాలవంటిది. ప్రయో జనయోగము మన కచ్చేరి సదృశము, ఆనందయోగము మన గృహతుల్యము. బడియందు మనము సంపూర్ణత ననుభవింపము. కచ్చేరియందును నట్లే సంపూర్ణముగ పట్టుబడము. గృహమునందే మనము నిర్బాధముగ సమస్తము నుత్సర్జన మొనర్చి బ్రదుక

గలము. పాఠశాల నిరలంకారము, కచ్చేరి నిరాభరణము. ఇఁక గృహము నెన్ని యుపకరణములతో నలంకరింతుము !

ఈ యానందయోగము వ్యాపారస్థలమా ? కాదు. ఇతరుని తనవాని నొనర్చుకొని యెఱుఁగుట. అట్లు తెలిసికొన్నప్పుడిక ప్రశ్నయే యుదయింపదు. నేను నన్నేల ప్రేమింతు నను విషయము మన కెన్నడు నాలోచ్యమే కాదు. నాకు స్వీయానుభవమునం దానందమే కదా! ఆ యనుభూతి నితరుని యందుకూడ పొందినప్పుడు, అత డెందులకు ప్రేమపాత్రు డగుచున్నా డని ప్రశ్నించుటయు నిష్ప్రయోజనమే యగును.

యాజ్ఞవల్క్యుడు గార్గితో ననినాడు:-

న వా అరే పుత్రస్య కామాయ పుత్రః ప్రియో భవతి ।
ఆత్మనస్తు కామాయ పుత్రః ప్రియో భవతి ।
న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియో భవతి ।
ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియో భవతి ॥

పుత్రునికొఱకే, పుత్రుని కోరెదను కనుకనే పుత్రుడు ప్రియమగుట లేదు. ఆత్మను కోరెదను కనుకనే పుత్రుడు ప్రియమగుచున్నాడు. విత్తమును కోరుచుంటిని గనుకనే విత్తము ప్రియమగుట లేదు. ఆత్మ నభిలషించుచుంటిని గనుకనే విత్తము ప్రియమగుచున్నది.

దీని పరమార్థ మేమన ఎవనియందు నన్ను నేను పూర్ణముగ ఎఱుఁగుచున్నానో నేను వానినే కోరెదను. పుత్రుడు నా యభావమును తొలగించును. అనగా నేను పుత్రునియందు

న న్నతిశయముగ పొందెదను. ఆతనియందు నే నింకను నధికతరమై భాసింతును. నా యాత్మ నాతడు బాహిరమునందును సత్య మొనర్చివైచినాడు. ఇందుచేతనే యతడు నా కాత్మీయుడు. నాయందు నే నే సత్యము నత్యంతనిశ్చితరూపమున దర్శించి ప్రేమ ననుభవింతునో పుత్రునియందును ఆ సత్యమునే యత్యంతముగ ననుభవించుటచే యాతని యందలి నా ప్రేమ పరివర్ధితమై విరాజిల్లును. అందువలన నొకవ్యక్తి నత డేదియో సంపూర్ణముగ తెలిసికొనవలయుననిన-చో నతడు దేనిని ప్రేమించునో దాని నెఱుంగవలయును. జగత్తులో దేనియందు తన్ను తా నుపలబ్ధి యొనర్చుకొనినాడు, ఎంత దూరమువరకు తన్ను తాను విస్తరింపఁజేసికొనినా డనునది దీనియందు మనకు వ్యక్త మగును. నాకు ప్రీతి లేని తావున నా యాత్మ తన వేష్టనరేఖ తుదిదాక వచ్చి నిలిచిపోవును.

బయట నేదైన వెలుఁగును చూచినను, ఏదే నటునిటు కదలుచుండుటను చూచినను శిశువు ఆనందముతో పొంగిపోవును. కలరవ మొనర్చును. తా నా యాలోకమున నా చాంచల్యమునందు తన చైతన్యమునే యధికతరముగ పొందును. అందువలననే యతని కంతటి యానందము.

కాని యింద్రియజ్ఞానము నతిశయించి క్రమక్రమముగ తన చైతన్యము మనోహృదయములయొక్క నానాస్తరములందును వ్యాప్తమగుచుండు నప్పు డీమాత్రపు టాందోళన మతని

కానందహేతువు కాజాలదు. పూర్తిగ కానే కాదని కాదు, అల్ప ముగ నగును.

ఈ రీతిగ మానవుడు తన వికాసము వృద్ధి జెందుచున్న కొలది, ఆ యభివృద్ధిలో తన సత్యత్వమున ననుభవ మొనర్చుకొనన నభిలషించుచుండును.

ఈ స్వీయమైన యంతరాత్మను బాహ్యమున ననుభవించు టలో ప్రథమమున మానవుడు తనయందే యతిసహజముగ పూర్ణరూపమున ననుభవించగలడు. చూపులో, వినికిలో, భావ నలో, కల్పనాఖేలనములో, నానారూపమైన హృదయాకర్షణ లలో మానవుడు స్వభావముగనే తన్ను తాను సంపూర్ణముగ పొందును. అందుచేత మానవుని తెలుసుకొని మానవు నాకర్షించి మానవుని సేవించి యతం డంచలములదాక పొంగిపోవును. దేశ కాలములందు మానవు డెంత యధికముగ మానవజాతియందు స్వీయాత్మను మేళన మొనర్చి స్వీయోపలబ్ధితో ప్రకాశింపఁగలుగు చున్నాడో యంతగా నతడు మహామానవుడై వెలుఁగొందు చున్నాడు. అతడు యథార్థముగ మహాత్ముడు. ఏ వ్యక్తి సర్వ మానవులందును యాత్మసార్థకతాభావము నేదే నొక పుణ్యావశ మున కించిత్తైన తెలుసుకొనఁజాలడో యా వ్యక్తి యదృష్టమున మానవాంశ యల్పిష్ఠమైన దన్నమాట. ఆత్మను కేవలము తన యందే నివిష్ఠ మొనర్చుకొని దర్శించుటలో నతడు దాని నల్ప మొనర్చి తెలుసుకొనుచున్నా డనవలయును.

సర్వులలో తన్ను దా నెఱుఁగు టనునది మానవాత్మ యందలి స్వాభావికధర్మము. ఈ ధర్మము నవగత మొనర్చుకొను టలో ననేకాటంకము లున్నవి. స్వార్థ మొక యాటంకము, అహంకార మొక యాటంకము. ప్రపంచమునందలి యిట్టి నానావిధ ములైన యాటంకములలో మన యాత్మయొక్క స్వాభావిక ప్రవాహగతి ఖండఖండములై పోవును. మానవత్వమునందలి సంపూర్ణసౌందర్యమును మనము నిర్బాధముగ దర్శింపఁజాల కున్నాము.

మానవత్వమున కింత స్వాభావికమైన ధర్మమునం దింత లాంఛన మేలయని కొంద ఱనవచ్చును. దేని నాటంకమని, స్వార్థ మని, యహంకారమని, యెగురగొట్టుచున్నావో దానినే యేల స్వాభావికధర్మ మనరాదని వీరు వాదింతురు.

పలువుర దృష్టియం దదియే స్వభావమైనది. స్వభావము కంటె స్వభావమునందలి యాటంకమే బలవత్తరమై కనఁబడు చుండుటయే యిందులకు హేతువు. మానవుఁడు మొట్టమొదట సైకిలు త్రొక్కుట మొదలిడినప్పుడు కదలి ముందునకు సాగుట కంటే యడుగడుగున పడిపోవుచుండుటయే యతని నొసట వ్రాయఁబడియుండును. అట్టి తఱి యెవరేని యా వ్యక్తి సైకిలు నెక్కుట నభ్యసించుటలేదు, పడిపోవుచుండుటనే యభ్యసించు చున్నాఁ డనిన నది యర్థరహితమైన మాటయేగద! ప్రపంచము నందు స్వార్థాహంకారముల తాఁకిడి యడుగడుగున సంభవించు చునే యుండును. కాని యందే మానవునియందలి నిగూఢమైన

స్వార్థరక్షణయత్నమును అనఁగా సర్వులలో విస్తరించుప్రయత్నమును దర్శింపఁజాలమేని, పడిపోవుచుండుటయే స్వాభావికమని వాదింతుమేని యది కేవలము కలహించుటకే యగును.

వస్తుతః మనకు స్వాభావికధర్మమైన దానిని స్వాభావికముగ తెలిసికొనుటకే, పూర్ణవ్యక్తిత్వముతో కార్యకారిగ నొనర్చుకొనుటకొఱకే దాని కాటంకములను కలుగఁజేయవలెను. ఆ యుపాయముననే యది తన్నుతాను సచేతనముగ నెఱుఁగఁజాలును. ఆ చైతన్య మెంత పూర్ణమగుచుండునో దాని యానందము నంతగ ఘనతర మగుచుండును. సర్వవిషయములందు నిట్లే తెలియఁదగియున్నది.

బుద్ధి యున్నది. కార్యకారణసంబంధమును నిర్ణయించుట బుద్ధి కొకధర్మము. ప్రత్యక్షవస్తువులయం దది యెంతవరకు సహజముగనే వర్తించునో యంతవరకు తన్నుదాను పూర్ణముగ చూచికొనఁజాలదు. కాని విశ్వమునందు కార్యకారణసంబంధము లతినిగూఢములు. వాని నుద్ధరించుటలో బుద్ధి ప్రాణపణముగ శ్రమించవలసియున్నది. ఈ యాటంకములను తొలగించుట యను పరిశ్రమయందే బుద్ధి విజ్ఞానదర్శనమున తన్నుతాను ఘనముగ ననుభవించును. దీనియందే తన గౌరవము వృద్ధిఁజెందును. సమ్యగ్రూపమున యోజించి చూచినయెడల విజ్ఞానదర్శన మనిన మఱేమియు కాదు. విషయములందు బుద్ధి స్వీయోపలబ్ధిని పొందుటే విజ్ఞానదర్శనము. అది స్వీయనియమముల దర్శించుతావునందు పదార్థములను, తనను ఏకత్ర మొనరించియే దర్శించును.

దీనికే తెలిసికొనుట యనిపేరు. ఈ దర్శనమునందే బుద్ధి కానందము కలుగును. లేనిచో ఆపిల్ ఫల మే కారణమున భూమిపైఁ బడునో సూర్యుఁ డదే కారణమున పృథ్వి నాకర్షించుచున్నాఁ డను విషయమును వెలువరించి మానవుఁ డంత సంతుష్టుఁ డగుటకు హేతువే లేదు. ఆకర్షించిన నాకర్షింపనిమ్ము, దానితో నా కగునదేమి ? నాకొరఁగున దేమన నీ చరాచరజగత్తునందీ వ్యాపక వ్యాపారమును నా బుద్ధియందు పొందినాను– నా బుద్ధిని సర్వత్ర నేకముగ ననుభవించినాను. నా బుద్ధియందు సూర్యచంద్రనక్షత్రము లన్నియు నేకమైనవి. ఈ యీ విధముగ ననంతమైన జగ్రద్రహస్యము మానవుని బుద్ధిని బయటికి కాకర్షించి తెచ్చి యాతనియందు దాని నతిశయముగఁ బ్రకాశింపఁజేయుచున్నది. నిఖిలచరాచరములతో సమ్మిళన మొనర్చి దానిని తిరిగి మానవుని కిచ్చివేయుచున్నది. సమస్తముతో నీ బుద్ధియొక్క యోగమే జ్ఞానము. ఈ యోగమునందే మన జ్ఞానశక్తి కానందము.

ఇట్లు, సమస్తమానవులయందును స్వీయమనుష్యత్వమును యోగించుటయందే మానవాత్మయొక్క స్వభావధర్మము సంపూర్ణత నందుచున్నది. దీనియందే దానికి యథార్థమైన యానందము. ఈ ధర్మమును సచేతనముగ పొందుటకొఱకే బాహ్యాభ్యంతరములందు కేవలము విరోధావరోధములనుండియే యది నడువవలసియున్నది. ఇందులకే స్వార్థ మింత ప్రబలము, ఆత్మాభిమాన మింత యతలము, సంసారపథ మింత దుర్గమము నైనవి. ఈ సమస్తాటంకములనుండి మానవధర్మ మెచ్చుట సము

జ్వలమై పూర్ణసుందరరూపమున దృశమగ తన్ను తాను ప్రకాశ మొనర్చుకొనునో యచ్చట నెల్ల మహానందమే భాసిల్లును. అందు మన కుజ్జ్వలమైన ఆత్మోపలబ్ధి.

మహాపురుషుల జీవితచరిత్రములను చదువుట కిందులకే మన ముత్సహించునది. ఆ చరిత్రములందు మనము మన బాధాచ్ఛన్నప్రకృతినే ముక్తరూపమునను, ప్రసారితముగను దర్శింపఁ జాలుదుము. ఇతిహాసమునందు మనము మన స్వభావమునే నానా ప్రజలయందు, నానాదేశములందు, నానాకాలములందు, నానా సంఘటనలయందు, నానాపరిమాణములలో, నానారూపములుగ దర్శించి రసానుభూతిని పొందుచున్నాము. స్పష్టముగఁ దెలిసినను తెలియకున్నను మనస్సునందు సర్వమానవులతో కూడిమాత్రమే మనలను మనమే యామోదించుచుందుము– ఆ యైక్యము నెంత స్పష్టముగ ననుభవింతుమో మన కంతశుభము, అంతయానందము!

కాని, జీవితచరిత్రలందును, ఇతిహాసమునందును మనము సమస్తమును ఆదినుండి యంతమువరకును స్పష్టముగ చూడఁ జాలముకద. అవియు ననేకాటంకములలో ననేకసంశయములతో మూతవడి మనకుఁ గానవచ్చును. ఐనను వానినుండి మనము పొందు మానవపరిచయము చాల యున్నతమైనది, సందేహము లేదు. కాని యీ పరిచయమును మన మనస్సుల కనుగుణముగ దిద్దుకొని, దానియందు మన యభిలాషను పూరించుకొని యలంకరించి చిరకాలము నిల్చియుండునట్లు భాషయందు న్యస్త మొనర్చి యుంచుటకొఱకు మన యంతరంగమునం దొకానొక యత్న

మున్నది. అట్లొనర్పఁజాలిననే యది విశేషముగ మన దైనట్లుం డును. దానియందు సుందరమైన భాషలో రచనానైపుణ్యమున నా ప్రీతిని ప్రకాశ మొనర్చుటలోనే యది మానవహృదయసం బంధియైన సామగ్రియైనది. ఇఁక నది ప్రపంచముయొక్క గమనా గమనస్రోతస్సునందు కొట్టుకొనిపోలేదు.

ఈ రీతిగ బాహ్యమునం దే సమస్తమైన యపురూప ప్రకాశము కలదో - యది సూర్యోదయకాంతి కావచ్చును, మహచ్చరిత్రయొక్క దీప్తి కావచ్చును, స్వీయాంతర్యమునందలి యావేగము కావచ్చును, - ఏది మన హృదయమునకు క్షణ క్షణము చైతన్య మొసఁగినదో హృదయము దానిని స్వీయమైన యొకానొక సృష్టితో జతపఱచి తనదానినిగ బంధించియుంచును. ఈ సకలమునందును హృదయము తన్నుతాను విశేషముగఁ బ్రకాశింపఁజేయును.

ప్రపంచమున మానవుఁడు తన్నుతాను ప్రకాశింపఁజేసు కొనుటలో రెండు గతు లున్నవి. అందొకటి మానవుని కర్మ ప్రవాహము, రెండవది సాహిత్యప్రవాహము. ఈ రెండు ధారలు పూర్తిగ నొకదానిప్రక్క నొకటి ప్రవహించినవి. మానవుఁడు స్వీయకర్మరచనయందును, భావరచనయందును తన్నుతా నొలుకఁ బోసికొనినాఁడు. ఈ రెండు నొకదాని నొకటి పూరణ మొనర్చు కొనుచు నడచినవి. ఈ రెండిటినుండియే యితిహాసమునందును, సాహిత్యమునందును మనము మానవుని పూర్తిగ తెలుసుకొన వలసియున్నది.

కర్మక్షేత్రమునందు మానవుఁడు తన దేహమనోహృదయములయొక్క సమస్తశక్తిని, యభిజ్ఞతను తీసికొని, గృహమును; సమాజమును, రాజ్యమును, ధర్మసంప్రదాయమును సృష్టించుకొనుచున్నాఁడు. ఈ నిర్మాణములో మానవుఁడు తెలిసికొనినది, పొందినది, యభిలషించునది, సమస్తమును ప్రకటమగును. ఇట్లు మానవప్రకృతి జగత్తునందు లీనమైపోయి నానారూపముల ధరించి సకలమునందు తన్నుదాను నిల్పుకొనుచున్నది. ఈ రీతిగ భావమునం దస్పష్టమైనది ప్రపంచమునం దాకృతి నొందుచున్నది. ఏకమునందు క్షీణగతి నందినదే యనేకమునందు నానాంగవిశిష్టమై ఐక్యము నొందుచున్నది. బహురూపముల క్రమముగ బహుజన నిర్మితమైన గృహ, సమాజ, రాజ్య, ధర్మసంప్రదాయములనుండి కాక స్వతంత్రముగ, ప్రత్యేకముగ మానవుఁడు తాను స్పష్టరూపమున ప్రకాశింపఁజాలకపోవుట తటస్థించుచున్నది. ఈ సమస్తమే మానవుని సమ్ముఖమున మానవుని ప్రకాశరూపమై యొప్పుచున్నది. ఇట్టి స్థితి లేనిచో మనము దానిని సభ్యత లేక పూర్ణ మనుష్యత్వము నని చెప్పనేలేము. రాజ్యమునందే కానిమ్ము, సమాజమునందే కానిమ్ము, యే విషయమున మన మొక్కొక్కరముగ సంపూర్ణముగ స్వతంత్రులమో, ఒకరితో నొకరికి పరస్పరత లేదో యా విషయమున మన మసభ్యుల మనవలసి యున్నది. ఇందువలననే సభ్యసమాజమునందు రాజ్యమునకు దెబ్బ తగిలినచో నా రాజ్యమునందలి ప్రతివ్యక్తి బృహత్కళేబరమునకును దెబ్బ తగిలితీరును. సమాజ మెచ్చట సంకీర్ణమో

అచ్చట నా సమాజమునందలి ప్రతివ్యక్తి యాత్మవికాసమును ముకుళితమైయుండును. మానవప్రపంచమునందలి రచన లన్నియు నే పరిమాణమున నుదారము లగునో యా పరిణామమున నా రచయిత తన మనుష్యత్వమును నిరాటంకముగ ప్రకాశ మొనర్చు కొనినాఁ డనవలయును. ఏ పరిమాణమున రచన సంకుచితమో ప్రకాశాభావమున రచయిత యా పరిమాణమున దీనుఁడై పోవు చున్నాఁడు. హేతు వేమన, ప్రపంచము కర్మను పురస్కరించు కొని మానవుని ప్రకాశింపఁజేయును. ఈ ప్రకాశముమాత్రమే యానందము.

కర్మక్షేత్రమున మానవుఁడు తన్ను తాను ప్రకాశింపఁ జేసుకొనుటలో ప్రకాశమే తన అసలు లక్ష్యము కాదు. అది కేవలము గౌణమైనది. గృహిణి గృహకృత్యములందు తన్ను తాను ప్రకాశ మొనర్చుకొనును. కాని ప్రకాశ మగుటయే యామె మనస్సునందలి స్పష్టమైన యభిప్రాయము కాదు. గృహ కృత్యములలోనుండి యామె స్వీయాభిప్రాయముల నన్నింటిని సాధించుకొనును. అవి యన్నియు కర్మమీఁదినుండి విక్షీర్ణములై వచ్చి యామె ప్రకృతిని మనకు బహిర్గత మొనర్చును.

కాని మానవుఁడు తన్ను తాను ప్రకాశ మొనర్చుకొన వాంఛించుసమయమును కలదు. ఊహించి చూడుము. గృహము నందు వివాహదినమున నొకవైపు వివాహమునకైన పను లన్నియు చక్కఁబెట్టుకొనుటకు యత్నములు జరుగుచుండును. వేఱొకవైపున కేవలము పనులు చక్కఁబెట్టుకొనుటయే గాదు,

హృదయమును ప్రకటించుకొను ప్రయోజనమును ఘటిల్లును. ఆ రోజున గృహమునందలివా రందఱు, నా గృహసౌభాగ్యమును ఆనందమును సర్వుల సమక్షమునఁ బ్రకటింపకుండ నుండఁజాలరు. ప్రకటించు నుపాయ మేమి? వేణువు నూదెదరు. దీపములఁ బ్రజ్వలింపఁజేయుదురు. మంగళవాద్యములు మ్రోయుచుండును. పూలమాలలతోను, ఆకులతోను తోరణములను కట్టి గృహము నలంకరింతురు. మధురధ్వని, దివ్యపరిమళము, సుందరదృశ్యముల ద్వారా, ఔజ్జ్వల్యముద్వారా, హృదయము శతధారాప్రవాహ మువలె తన్ను తాను నలువైపులందును విస్తరింపఁజేసికొనుచుం డును. ఈ రీతిని నానాప్రకారములైన ఇంగితములతో స్వీయా నందము నితరులయం దుద్బుద్ధ మొనర్చి దానిని సర్వులయందును సత్యమగునట్లొనర్చుటకు మానవులు వాంఛింతురు.

తల్లి తన యంకమునందలి శిశువును సేవించకుండ నుండ జాలదు. కాని యంతేకాదు. కేవలము సేవయందే కాదు— మాతృప్రేమ దానికదే నిర్హేతుకముగ బాహిరమున వ్యక్త మొనర్చుకొనఁగోరును. అప్పు డది యెన్ని యాటలలో, పాట లలో, ఎంత యాదరములో, భాషలో ముద్రితమై పొంగివచ్చు చున్నది! ఆమె శిశువునకు పలురంగుల దుస్తులను తొడిగి, యలం కారము లుంచి, యెట్టి ప్రయోజనము నాశింపకయే స్వీయప్రాచు ర్యమును, ప్రాచుర్యముద్వారా మాధుర్యమును బహిర్గత మొనర్చకుండ నుండఁజాలదు.

దీనివలన మానవహృదయధర్మము వ్యక్త మగుచున్నది. అది స్వీయావేగమును బాహ్యజగత్తునందు మిశ్రిత మొనర్పఁగోరు చున్నది. అది స్వయంసంపూర్ణము కాదు. ఆంతరసత్యము నేదో విధముగ బాహిరమున ప్రకటించుకొన్ననే దానికి పరిత్రాణము. ఏ యింటియందు హృదయముండునో ఆ యిల్లు కేవలము యిటుకలతోను కలపతోను నిర్మింపఁబడుటయే కాదు- దానికి వాస్తు నేర్పఱచి హృదయము దానికి తన రంగును పులుమును. హృదయ మే దేశమునం దుండునో యా దేశము కేవలము పృథ్వ్యాకాశజలసంపూర్ణమే కాదు - అది తనయం దీశ్వరుని జీవధాత్రీ రూపమును జననీభావమును చిత్రించుకొని యానందించును. లేని యెడల హృదయము తన్నుతాను బయట చూచికొనలేదు. కానిచో హృదయ ముదాసీన మగును. ఔదాసీన్య మిఁక హృదయమునెడల మృత్యుసదృశము.

సత్యముతో హృదయ మీ రీతిని కేవలము రససంపర్కమును స్థాపించుకొనును. రససంబంధ మున్న తావునం దెల్ల నా దానప్రదాన మున్నది. మన హృదయలక్ష్మి జగత్కుటుంబమున నే గృహమునుండి యెట్టి యుపహారమును పొందునో యా గృహమునకు దాని కనురూపమైన యుపహారమును తిరిగి పంపఁ జాలనిచో గృహిణీధర్మమున కాఘాతము తగులును. ఇట్టి యుపహారమునందు స్వకుటుంబధర్మమును ప్రకాశింపఁజేసికొనుట కనేకోపకరణములను తీసికొని, భాషను తీసికొని, స్వరమును సమకూర్చికొని, కుంచెను తీసికొని, శిలను గ్రహించి, సృష్టించ

వలసియున్నది. దీనితోపాటు స్వీయప్రయోజన మేదైన యొనఁగూడుచో మంచిదే. కాని తఱుచు స్వీయప్రయోజనమును నష్టపెట్టుకొనికూడ కేవలము స్వయంప్రకాశమునకే వ్యగ్రమగును. తాను దివాలా తీసికూడ స్వయంప్రచార మొనర్చికొనుటకు వాంఛించును. మానవప్రకృతియం దీ ప్రకాశకవిభాగ మాతని దుర్వ్యయవిభాగము. ఇం దనేకసమయములందు చేతులతో నెత్తి బాదుకొనవలసి వచ్చును.

అంతరమునం దెట్లో బాహ్యమునం దట్లే యుండు నని హృదయ మనును. అట్టి సామగ్రి, అంత సుయోగము బాహ్యమునం దెచ్చట నున్నది ? తన్ను తాను బాహ్యమునందు ప్రకటించుకొనఁజాలనైతి నని హృదయము వేదన పడుచుండును. ధనవంతుఁడు హృదయమునందు తన సౌభాగ్యము ననుభవించి ప్రకటించుకొనుటలో కుబేరుని వైభవమునుగూడ ఫూత్కార మొనర్చును. ప్రేమికుఁడు హృదయమునందు యథార్థమైన ప్రేమ ననుభవించు నప్పుడు, ఆ ప్రేమప్రకటనమునందు, అనగా ప్రేమను బాహ్యమున సత్యమైనదిగఁ బ్రకాశింపఁజేయుటకొరకు ధనప్రాణముల నొక్క త్రుటికాలమున బలిపెట్టఁగలఁడు. ఈ రీతిగ బహిర్వస్తువు నంతర్వస్తువుగ, నంతర్వస్తువును బహిర్వస్తువుగ రూపొందించు వ్యాకులత హృదయమునం దెంతకును సమాప్తిఁ జెందఁజాలదు. బలరామదాసు పద మొకఁ డున్నది. 'తోమాయ్ హియార్ భితర్ హారాయితే కే కొయిలో బాహిరే' అనగా ప్రియమైనది హృదయాంతర్వస్తువై నట్లును, దాని నెవరో బహిర్గత మొనర్చి

నటులను, అందుచే దానిని తిరిగి లోనికి మఱలించుటకొఱ కింతటి యాకాంక్షయు ప్రదర్శితమైనది. తిరిగి దీనికిని వైపరీత్య మున్నది. హృదయము తన యంతరమునందలి యాకాంక్షను, ఆవేగమును బాహిరముగ దేనియందును ప్రదర్శింపఁజాల నప్పుడు కసీస మది నానాపరికరములద్వారమున స్వహస్తముతో తన ప్రతిరూపము నొకదానిని నిర్మించుటకై ప్రాణపణముగ యత్నించును. ఇట్లు జగత్తును తనదిగ, తనను జగత్సంబంధిగ నొనర్చుకొనుటకై హృదయమునందలి వ్యాకులత పనిచేయుచున్నది. తన్ను తాను బాహిరమున ప్రకాశింపఁజేసికొనుట యీ కార్యమునం దొక యజ్ఞము. అందుచే నీ ప్రకాశకవ్యాపారమున హృదయము మానవునికై సర్వస్వమును కోల్పోవుటకైన నిచ్చగించును. అనాగరకసైన్యము యుద్ధమున కేగునపుడు శత్రుపక్షము నోడించుటయందే వ్యస్తమగుట లేదు. అది సర్వాంగములందును రంగును పూసికొని చీత్కార మొనర్చుచు, వాద్యములను ప్రయోగించుచు తాండవ నృత్య మొనర్చుచు నడచును. ఇది యాంతరమునందలి హింసాభావమును మూర్తిమంత మొనర్చుటవంటిది. ఇట్లు చేయనిచో హింస పూర్తి కానట్లు - హింస యాశయసిద్ధికై యుద్ధ మొనర్చును. ఆత్మప్రకాశమునందలి తృప్తికొఱకే యీ నిరర్థక కాండ నొనర్చుచుండును.

నేటి పాశ్చాత్యయుద్ధప్రణాళికయందుసైతము జిగీషయందలి యాత్మప్రకాశముకొఱకు వాద్యములను ప్రయోగించుట మొదలైన హంగామా పూర్తిగ లేనేలే దనఁజాలము. కాని యీ

యాధునికమైన యుద్ధము లన్నింటియందును బుద్ధిచాకచక్యమే ప్రధానముగ నున్నది. క్రమముగ మానవహృదయధర్మము దీని నుండి జరిగివచ్చుచున్నది. ఈజిప్టునందలి ఫకీరుల దళము లాంగ్ల సైన్యముల నాక్రమణ మొనర్చినప్పుడు వారు కేవలము యుద్ధ మొనర్చి విజయమునందుటకుమాత్రమే మరణించలేదు. వారి యంతరములం దుద్దీప్తమైన తేజమును ప్రకాశింపఁజేయుటకొరకే తుదివ్యక్తివరకు ప్రాణోత్సర్జన మొనర్చినారు. యుద్ధమునందు కేవలము జిగీషులగువా రిట్టి యనావశ్యకమైన కాండను జరుపరు. ఆత్మహత్య యొనర్చుకొనియైనను మానవహృదయము తన్నుతాను ప్రకటించుకొనఁ గోరును. ఇంత వ్యర్థమైన యపవ్యయ విషయము నెవరు భావింపగలరు ?

మనము పూజ లొనర్చుచున్నాము గద. ఆ పూజను బుద్ధిమంతు లొక విధముగ చేయుదురు. శక్తిపరులు వేఱొకవిధ ముగ చేయుదురు. బుద్ధిమంతులు పూజ లొనర్చి భగవానుని యొద్దనుండి సద్గతిని పొందవచ్చు నని భావింతురు. భక్తిపరులు పూజ లొనర్పనియెడల తమభక్తి సంపూర్ణము కాదని యెంచె దరు. దీనియందు ఫలిత మేమియు లేకపోవచ్చును. హృదయ మందలి భక్తికి బయట స్థాన మిచ్చి, పూర్తిగ నాశ్రయ మీయఁ బడినది. ఈ భక్తియందు తన్నుతాను ప్రకాశింపఁజేసుకొని సార్థక మొనర్చుకొనుట యున్నది. బుద్ధిమంతుని పూజ వడ్డీవ్యాపారము వంటిది. భక్తిపరుని పూజ పూర్తిగ ప్రయోజన నిరపేక్షము.

హృదయము స్వీయప్రకాశ మొనర్చికొనుటయందలి నష్టమును గణించనే గణించదు.

జగత్తునందును మన మెచ్చుట నీ హృదయధర్మమును గుర్తింతుమో యచ్చట మన హృదయము తన్నుతానుగ సమర్పించుకొని నిలిచిపోవును. ఏ విషయమును పృచ్ఛింపదు. జగత్తునందు గణనకురాని యీ నిరర్థకమైన వ్యయవిషయమే సౌందర్యము. పుష్పము కేవలము బీజముగ పరిణమించుటకే త్వరపడుట లేదు. తన సమస్తప్రయోజనమును మూసియుంచి సుందరమై వికసించుచున్నది. మేఘము కేవలము జలమును వర్షింపఁజేసి స్వకార్యమును నిర్వహించుకొని త్వరత్వరగా విరమించుటలేదు. పీఠము పెట్టుకొని కూర్చుండి ప్రయోజనరహితముగ రంగురంగుల కాంతులవైపు మన కన్నుల నాకర్షించుచున్నది. వృక్షపల్లవాదులు కేవలము కాష్ఠములై శీర్ణమైన దరిద్రులవలె వృష్ట్యాలోకనమునకై చేతులు చాచుకొని నిలిచియుండలేదు. హరిద్వర్ణశోభలతో నైశ్వర్యపుంజములను దిగ్వధువుల కొఱకు కొమ్మలలో నింపుకొనుచున్నవి. సముద్రము కేవలము జలమును మేఘరూపమున పృథ్వియందు నలుదెసలను ప్రచార మొనర్చుకొనుటకది గొప్ప కార్యాలయముకాదు. అది తరళతరళమైన నీలిమతో యతలస్పర్శమై భీషణముగ నుండి మనలను సమాకర్షించును. పర్వతము కేవలము ధరాతలమునందు జలమును సమకూర్చి నివృత్తినొందుట లేదు. అది యోగనిమగ్నుఁడైన రుద్రునివలె భయంకరమై యాకాశపర్యంతవ్యాప్తమై నిస్తబ్ధముగ నుండుటను

దర్శించినప్పుడు మనము జగత్తునందు హృదయధర్మముయొక్క-దర్శనమును పొందుదుము. అప్పుడు ప్రవీణమైన బుద్ధి తలపంకించి జగత్పూర్ణమైన యింతటి యనావశ్యకాపవ్యయ మెందుకని ప్రశ్నించును. చిరనవీనమైన హృదయము 'నాకు కేవలము సాంత్వన మొసఁగుటకే. మఱేకారణమును కనిపించుట లేదు' అని సమాధాన మొసఁగును. జగత్తునందు హృదయము తన్నుతాను ప్రకాశ మొనర్చుకొనుచున్న దను విషయము హృదయమునకే తెలియును. లేనిచో సృష్టియం దిన్ని రూపములు, యింత గానము, యిన్ని హావభావములు, యిన్ని యాభాసేంగితములు, యిన్ని దుస్తులు నెందుల కన్నవి ? హృదయము వ్యాపారస్థుని కృపణత్వములో విస్మరింపఁజాలదు. అందులకే దానిని మఱపించు టకు జలమునందును, స్థలమునందును, ఆకసమునందును, అడు గడుగునను ప్రయోజనమును గోపన మొనర్చు యింత యనా వశ్యకమైన ప్రయత్నము. జగత్తు రసమయము కానిచో మనము నితాంత మల్పులమై యవమానితులమై పోయియుందుము. జగత్తునందు మనకు నిమంత్రణము లేదని మన హృదయము మనకుఁ జెప్పివేసెడిది. కాని సమస్తవిశ్వమును తన యసంఖ్యాక మైన కార్యములందును రసప్రపూర్ణమై యొప్పుచు హృదయము నకు 'నేను నిన్ను వరింతును. సర్వవిధముల నీవు నాకు కావల యును. మందహాసమునందు కావలయును, రోదనమునందు కావలయును, సంక్షోభమునందు కావలయును, శాంతియందును కావలయును, భయమునందును కావలయును, నిర్భరతయందును

కావలయు' నను మధురసందేశము నొసఁగుచున్నది. ఈ రీతిగ జగత్తునందు మనము రెండుక్రియలను దర్శించుచున్నాము. ఒకటి ప్రయోజనప్రకాశము, రెండవది భావప్రకాశము. కాని ప్రయోజనమునుండి ప్రకాశితమగుదానిని సమగ్రరూపమున దర్శించుటయు నెఱుంగుటయు మనపని కాదు. దీనియందే అమేయమైన జ్ఞానశక్తి కలదో మన జ్ఞానముతో దాని పారమ్యమును మనము చేరలేము.

కాని భావప్రకాశము ప్రత్యక్షప్రకాశము. సుందరమైన దెన్నడును సుందరమే. విరాట్టెన్నఁడును మహిమాన్వితమే! రుద్ర మెన్నడును భయావహమే. జగత్తునందు రసమయవస్తువు మన హృదయమునఁ బ్రవేశించి మన హృదయరసమును వెలుపలికి తీసికొని వచ్చుచున్నది. ఈ సమావేశమునందే రహస్యఖేలన మెంతయైన నుండనిమ్ము, బాధావిఘ్నము లెన్నియేని సంభవించనిమ్ము. ప్రకాశము లేక, కలయిక లేక, దేనిని అన్వేషించి పొందఁజాలము.

జగత్తునందు మానవజగత్తునందును నొకానొక సాదృశ్యమిందువలననే గుర్తింపఁగల్గుచున్నాము. ఈశ్వరునిదైన సత్యస్వరూపము, జ్ఞానస్వరూపము, జగత్తునందలి నానారూపములలో ప్రకాశించుచున్నది. ఇఁక నాయన యానందరూపము నానారసములలో ప్రత్యక్ష మగుచున్నది. కార్యమునం దాయన జ్ఞానస్వరూపము నాయత్త మొనర్చుకొనుట దుస్తరము, రసమునం దాయన యానందస్వరూపము ననుభవించుటలో జటిలత లేదు.

కారణ మేమన రసమునం దాయన తన్ను తానే ప్రకాశింపఁజేసి కొనుచున్నాడు.

మానవజగత్తునందును మన జ్ఞానశక్తి పనిచేయుచున్నది. మన యానందశక్తి రసస్పృష్టి యొనర్చుచున్నది. కర్మయందు మన యాత్మరక్షణకైన శక్తియు, రసమునందు మన యాత్మప్రకాశక శక్తియు ద్యోతకమగుచున్నవి. ఆత్మరక్షణ మన కెంతయు ప్రయోజనీయమే, ఆత్మప్రకాశము మన ప్రయోజనమును మించి యధికము.

ప్రయోజనము ప్రకాశమును, ప్రకాశము ప్రయోజనమును బాధించును. స్వార్థ మపవ్యయ మొనర్ప నిచ్ఛగించదు. కాని యపవ్యయమునందే యానంద మాత్మపరిచయము నొసఁగును. ఇందులకే స్వార్థక్షేత్రమైన కార్యాలయమునందు మన యాత్మప్రకాశ మెంత యల్పమో యంత శ్రద్ధేయ మగుచున్నది. అందులకే యానందోత్సవమునందు స్వార్థము నెంత విస్మృత మగుటను దర్శింతుమో యుత్సవ మంత యుజ్జ్వలమై భాసిల్లు చుండును.

అందుకే సాహిత్యమునందు మానవుని యాత్మప్రకాశమున కెట్టి యాటంకమును లేదు. స్వార్థము దానికి చాలదూరమున నిలిచిపోవును. దుఃఖ మచ్చట మన హృదయముపై నశ్రు బిందువులను సృజించునే కాని మన సంసారముపై హస్తక్షేప మొనర్పఁజాలదు. భయముతో మన హృదయమున కాందోళన కలుగఁజేయునే కాని మన శరీరమున కాఘాతమును కలిగించదు.

సుఖము మన హృదయమును పులకిత మొనర్చునే గాని మన లోభమును కదలించి జాగరిత మొనర్పదు. ఈ రీతిగ మానవుఁడు తన ప్రయోజనీయప్రపంచమునకు ప్రక్క-ప్రక్కనే ప్రయోజనమునకు రాని సాహిత్యప్రపంచమును రచించుకొనుచు వచ్చినాఁడు. అచ్చట నాతఁడు తనదైన దేవిని నష్ట మొనర్చుకొనక నానారసములలో తన ప్రకృతిని నానారూపములం దనుభవించు నానందమును పొందును. స్వాత్మప్రకాశమును నిరాటంకముగ దర్శించును. అచ్చట కర్తవ్యము లేదు, అచ్చట స్వయముగ మహారాజై వెలుగొందును.

ఇక సాహిత్యమునందు మానవుడు పొందున దేమి? మానవునియం దేది ప్రాచుర్యమో, ఏది యైశ్వర్యమో, ఏది తన సమస్తము నాక్రమించుకొని నిలిచినదో, ఏది తన ప్రపంచమునందుమాత్రమే నిశ్శేషముకాదో దాని పరిచయమును పొందును.

అన్నరసము పృథ్వియందు శిశువు మొదలుకొని వృద్ధునివరకు పరిచితమైనను సాహిత్యమునం దది ప్రహసనమున గాక నెచ్చటను స్థానమును పొందలేదు. కారణ మేమన నా రసమాహారమునందలి తృప్తి నణఁచును. కాని దాని నధిగమించి పైకివచ్చుట లేదు. పొట్ట నింపుకొని సంతోషమున చేతులతో దానిని నిమురుకొనుచు జలదగంభీరస్వరమున వహ్వా యనియూరకొందుము. సాహిత్యముయొక్క రాజద్వారమున దానికి దక్షిణతాంబూలములకై న యామంత్రణపత్రము నీయము. కాని యేది మన భాండారగృహమునందలి భాండమునందు పర్యాప్తము

కాదో, ఆ రసప్లుతియే సాహిత్యమునందు తరంగితమై కలధ్వని యొనర్చుచు ప్రవహించిపోవును. మానవుఁడు దానిని కర్మల యందే నిశ్శేష మొనర్చికొనఁజాలకపోవుటచేతనే పూర్ణమైన హృదయావేగములో దానిని సాహిత్యమునందుఁ బ్రకాశింపఁ జేసికొని మనఁగలుగుచున్నాఁడు.

ఇట్టి ప్రాచుర్యమునందే మానవుని యథార్థప్రకాశము. మానవుఁడు భోజనప్రియుఁ డనునది సత్యమే, కాని మానవుఁడు వీరుఁ డనునది సత్యతమము. మానవునియందలి యీ సత్యప్రాబల్యము నెవరు నిరోధించగలరు? అది భాగీరథివలె శిలలను కర్షించుచు, నైరావతమును తేల్చుచు, గ్రామనగరముల తృష్ణ నపనయించుచు సరాసరి సముద్రమున పడును. మానవుని వీరత్వమట్లే మానవప్రపంచమునందలి సమస్తకర్మలను సమాప్తమొనర్చి వాని నధిగమించి నిలిచినది.

ఈ రీతిని స్వభావముగనే మానవునియం దేది గొప్పదో, యేది నిత్యమైనదో, దేనిని కర్మకలాపమునందుమాత్రమే యాబద్ధ మొనర్పఁజాలమో, యదియే మానవుని సాహిత్యమునకు వశమై తనకుతానై మానవుని విరాడ్రూపమును నిర్మించును.

వేఱొక కారణముకూడ నున్నది. ప్రపంచమునందు మనము దర్శించుదానిని అక్కడ కొంచెము, యిక్కడ కొంచెము, అప్పుడు కొంచెము యిప్పుడు కొంచెము వెదఁజల్లుకొని చూచెదము. దాని నింకను పదింటితో మిశ్రణ మొనర్చి చూచెదము. కాని సాహిత్యమునం దా వ్యవధానములు మిశ్రణములు నుండవు.అచ్చట ప్రకా

శింపఁజేవలసిన విషయమునందే సమస్తదీప్తియును ప్రసరింపఁ జేయబడును. అందులకై యెంతో కౌశలముతో అదిమాత్రమే దీప్తిమంత మగుటకు తగిన యేర్పాటు చేయఁబడును.

ఈ స్థితిలో నిట్టి దృఢతరస్వాతంత్ర్యమునం దింత ప్రఖరమైన యౌజ్జ్వల్యము దేనిని శోభింపఁజేయదో, దానిని మనము సాహిత్యమునందు నిలుపము. కారణ మేమన నీ స్థానమునం దయోగ్యమును నిల్పినయెడల దానిని లజ్జాన్విత మొనర్చుట యగును. ప్రపంచమునందలి నానారూపమైన యాచ్ఛాదనములలో కుక్షింభరుఁ డంతగా కంటఁబడఁడు. కాని సాహిత్యవేదికపై యతని నేకాగ్రమైన దీప్తియందు ప్రదర్శించినచో నది హాస్యభాజనమై నిలుచును. అందుచే మానవునియందలి యే ప్రకాశ మల్పముకాదో - మానవహృదయము దేనిని కరుణయందు, వీరమునందు, రౌద్రమునందు లేక శాంతమునందు తన కుపయుక్తమైన ప్రతినిధిగ స్వీకరించుటయందు కుంఠితముఁ కాదో, దేనిని కళానైపుణ్యావేష్టనమునందు నిలిపి సార్వకాలికానిమేషదృష్టిపాతమున శిరము నెత్తి సహించుకొనఁజాలునో, స్వభావముగ మానవుడు దానికే సాహిత్యమునందు స్థాన మొసఁగును. లేనిచో దాని యనుపయుక్తత మనకు పీడాజనకమగును. రాజును కాక ఇతరుని సింహాసనమునందు చూచినచో మన మనస్సునందు విద్రోహము జనించును.

కాని సర్వమానవులయందలి విచారశీలమును ఘనమైనది కాదు. అన్ని సమాజములును గొప్పవి కావు. ఒక్కొక్కసమయ

మున క్షణికమును క్షుద్రమునైనదే మానవు నల్పునిగఁ జేసి వేయును. ఆ దుస్సమయమునందలి వికృతదర్పణమునందు సామాన్యమైన వస్తువే యసామాన్యముగ కనబడును. అది తన కళంకము పైననే స్పర్థాభావమున వెలుఁగులఁ జిమ్మును. అప్పుడేఁక కళాస్థానమున కౌశలము, గౌరవస్థానమునందు గర్వము, నావిర్భవించును. టెన్నిసన్ స్థానమును కిప్లింగ్ ఆక్రమించును.

కాని మహాకాలుఁడు కూర్చుండియున్నాఁడు. ఆయన సమస్తమును వడపోసి గ్రహించును. దానియం దేది యల్పమో, యేది జీర్ణమో, అది కరఁగి ధూళియందు పడి దుమ్మైపోవును. సర్వులును వేనియందు తమ్ము తాము దర్శింపఁజాలుదురో యట్టి వస్తువు లన్నియు సార్వకాలికములై నానామానవుల హస్తములయందు మూఁతవడియుండును. ఈ విధముగ నిర్వాచింపఁబడి నిలిచినది మానవునికిఁ జెందిన సార్వదేశికమైన సార్వకాలికమైన సంపద.

ఈ విధమున విశ్లేష మొనర్చి నిర్మించిన సాహిత్యమునందు, మానవప్రకృతియొక్క, ప్రకాశముయొక్క, యొకానొక సార్వకాలికమైన నిదర్శనము సంచితమై యొప్పుచున్నది. ఈ నిదర్శనమే నూత్నయుగ సాహిత్యస్థితికిఁగూడ మూల మగును. ఈ దృష్టితో మనము సాహిత్యపరిశీలన మొనర్చుచో సమగ్రపరిశీలనావివేచనసాహాయ్యమును పొందగలము.

సాహిత్యమును దేశకాలపాత్రములందు సామాన్య మొనర్చి చూచినచో నది చూచుటయే కాఁజాలదు. సాహిత్యమునందు విశ్వమానవుఁడే స్వయంప్రకాశము నొందుచున్నాఁ డని

తెలియఁజాలిన వో సాహిత్యమునందు మనము దర్శింపవలసిన దానిని దర్శించితి మన్నమాట. సాహిత్యరచనయందు వస్తువు ఉపలక్ష్యముమాత్రమే కానిచోట రచన నష్టమైపోయినట్లు గుర్తింప వలయును. ఎచ్చట రచయిత స్వీయరచనయందు సమగ్రమానవ భావము ననుభవించినాఁడో, స్వీయరచనయందు సమగ్రమానవ వేదనను ప్రకాశ మొనర్చినాఁడో, యచ్చటనే యతని రచన సాహిత్యమునందు స్థానమును సంపాదించుకొనినది. విశ్వమానవ నిర్మాతయైన శిల్పి సాహిత్యమందిరమును నిర్మించుచున్నాఁ డనియు, నానాదేశములంచు నానాకాలములందు రచయితలు జన్మించి యీ నిర్మాణమునందు పారిశ్రామికులై పనిచేయుచున్నా రను భావమున సాహిత్యమును దర్శింపవలసియున్నది. మందిరము యొక్క పథకమంతయు మన మెవరి దృష్టియందును లేదు నిజమే. కాని, నిర్మాణమునందు యే కొంచెము పొఱపాటు సంభవించి నను అది యడుగడుగునను విఱిగిపడిపోవును. ప్రతి పారిశ్రామికుఁ డును స్వీయస్వాభావికశక్తి నుపయోగించి తన రచనను సమగ్ర రచనతో సుసంలగ్న మొనర్చి యా యదృశ్యమైన పథకముతో సుసంబద్ధ మొనర్చుచు పోవలయును. దీనియందే యతని సామ ర్థ్యము ప్రకటమగును. మఱియు నతని సామర్థ్యమునకు సామాన్య మైన కూలివానికివలె వేతనము నొసఁగరు. అతనిని ప్రవీణునివలె సమ్మానించెదరు.

నాపై నే సమాలోచనభారమును మోపినారో దాని కాంగ్లమునందు 'కంపారెటివ్ లిటరేచర్' అని నామ మిడినారు.

మనభాషయందు దానినే నేను విశ్వసాహిత్య మందును. కర్మవిష యమున మానవుఁడు చెప్పెడి దేమి? దాని లక్ష్య మేమి? యత్న మేమి? దీనిని తెలిసికొనవలె ననినచో సమగ్రమైన మానవేతి హాసమునందు మానవుని యభిప్రాయము ననుసరింపవలసియుం డును. అక్బర్ పరిపాలన లేక గుజరాత్ యొక్క యితివృత్తము, లేక ఎలిజబెత్ చరిత్రము, యీ విధముగ విడివిడిగ చూచినచో కేవలము విషయగ్రహణమునందలి కౌతూహలముమాత్రము నివృత్తమగును. అక్బర్ లేక ఎలిజబెత్, ఉపలక్ష్యము మాత్ర మని యెవ్వఁ డెఱుఁగునో, మానవుఁడు యితిహాసమునుండి స్వీయగంభీరతమాభిప్రాయమును నానాసాధనములద్వారా పలు పాటుపాట్లనుండి, నానాసంశోధనలచే సిద్ధ మొనర్చుటకు కేవలము యత్నించుచున్నాఁ డని యెవ్వఁ డెఱుఁగునో, స్వాతంత్రిముగ నాతడు, రాజతంత్రమునందును, రాజతంత్రమునుండి గణతంత్రము నందును సార్థక మొనర్చుకొనుటకై యుద్ధ మొనర్చి మరణించు చున్నా డని యెవ్వఁ డెఱుఁగుచున్నాఁడో, విశ్వమానవునియందు తన్ను వ్యక్త మొనర్చికొనుటకు, వ్యష్టి సమష్టియందు తన్నుప లబ్ధ మొనర్చుకొనుటకుగాను, తనకు తానే కేవల మెవఁడు భం గించుచు నిర్మించుచున్నాఁడో, ఆ వ్యక్తి మానవేతిహాసమునుండి లోకవిశేషములను కాదు, ఆ నిత్యమానవుని నిత్యమైన యత్న మును, అభిప్రాయమును దర్శించుటకే యత్నించును. అతఁడు కేవలము యాత్రియందలి యాత్రికులను మాత్రమే చూచి తిరిగి రాఁడు- యాత్రికులందఱే యేకైకదేవతాదర్శనముకొఱకు నానా

ప్రాంతములనుండి వచ్చుచున్నారో దానిని దర్శించి యప్పు డిం టికె తిరిగిపోవును. అట్లే సాహిత్యమునందును మానవుఁడు తన యానందము నెట్లు ప్రకాశింపఁజేయుచున్నాఁడో, యీ ప్రకాశ ముయొక్క విచిత్రమూర్తి యందు మానవాత్మ తనదైన యే నిత్యరూపమును ప్రదర్శింపఁగోరునో యదియే విశ్వసాహిత్యము నందు యథార్థముగ దర్శింపవలసిన విషయము. అతడు తనొక రోగిగనో, భోగిగనో, యోగిగనో, ఎట్టి పరిచయ మొనర్చుటలో నానందమును పొందుచున్నాఁడో, జగత్తునందు మానవుని యాత్మీ యత యెంతదూరము సత్యమై నిలిచినదో, అనఁగా సత్య మెంత వరకు తనకు స్వీయమై పరిణవిల్లినదో, దీనిని తెలిసికొనుటకే సాహిత్యజగత్తునందు ప్రవేశింపవలసియుండును. దీనిని కృత్రిమ రచనగా నెంచఁగిన కుదురదు. ఇది యొక జగత్తు. దీని తత్త్వము మనయందలి వ్యక్తివిశేషమున కాయత్తాధీనము కాదు. వస్తు ప్రపంచమువలెనే దీని సృష్టియు జరుగుచునేయున్నది. ఐనను నీ యసమాప్త సృష్ట్యంతరస్థానమునం దొకానొక సమాప్తి యొక్క యాదర్శ మచలమై కన్పట్టుచున్నది.

ఆదిత్యమండలమునందలి పదార్థము తరళముగ కఠినముగ ననేకరీతులుగ తయారగుచున్నది. దానిని మనము దర్శింపజాలము. కాని దానిని పరివేష్టించి యా లోకమండల మా సూర్యుని జగ త్సమక్షమున వ్యక్త మొనర్చుచున్నది. ఇచ్చటనే యది తన్ను తాను కేవలము వితరణ మొనర్చుకొనుచున్నది. సకలముతో తన్ను తాను సంయుక్త మొనర్చికొనుచున్నది.

మానవుని మన మిట్లే సమగ్రమైన దృష్టితో దర్శింపఁ జాలితిమేని యతనిని సూర్యునివలె చూడఁగల్గియుండెడివారము. మానవుని యంతరమున నెమ్మది నెమ్మదిగ నీ పదార్థసంచయము నానాపదార్థములందు విన్యస్తమై వెలయుచున్నట్లును, దానిని పరివేష్టించి యొకానొక ప్రకాశముయొక్క జ్యోతిర్మండలి నియతము తన్ను తాను నలుదెసలందును వికీర్ణ మొనర్చుకొని యానందించుచున్నట్లును దర్శించెడివారము. సాహిత్యమును, మానవునికి నలుదెసలయందును భాషారచితప్రకాశమండలీరూపమున నొక మారు లక్షింపుము. ఇచ్చట నొక జ్యోతిఃప్రభంజనము వీచుచున్నది. జ్యోతిఃప్రవాహము ప్రవహించుచున్నది, జ్యోతిర్బాష్ప సంఘాతము సంఘటించుచున్నది!

మానవవాసస్థానములం దడుగిడుచు ముందున కేగుచున్న కొలఁది యవిరామమైన మానవుని ప్రవృత్తియందలి నిష్ఠ మనకు కన్నులఁ గట్టును. పచారీవర్తకుఁడు దుకాణము నడుపుచుండుటను, కమ్మరి లోహమును కరఁగించుచుండుటను, కూలివాఁడు బరువును మోయుచుండుటను, ధనికుఁడు తన కాతాను సరి చూచుకొనుచుండుటను గాంతుము. దీనియందు మఱొక విశేష మగుపడుటలేదా? ఈ బాట కిరువైపులందును నింటింటియందును, ప్రతి దుకాణమునందును, సందుగొందులందును నెన్ని శాఖా ప్రశాఖలుగ రసప్రవాహ మెన్ని మార్గములలో నెంత మాలిన్యములో నెంత సంకీర్ణతలో నెంత దారిద్ర్యముపై కేవలము తన్ను తాను ప్రసార మొనర్చుకొనుచున్నది! రామాయణమహాభారత

ములయందలి గాథలు, కీర్తనలలో, హరికథలలో, విశ్వమానవుని హృదయసుధను ప్రతిమానవునియందును దివారాత్రములు క్రుమ్మరించుచున్నవి. నితాంతము హీనుఁడైన మానవుని వెనుక రామలక్ష్మణులు వచ్చి నిలుచుచున్నారు. అంధకారగృహమునందు పంచవటియందలి కరుణామయమైన మారుతము వీచుచున్నది. మానవహృదయసృష్టి, హృదయప్రకాశమును, మానవుని కర్మక్షేత్రమునందలి కాఠిన్యమును, దారిద్ర్యమును నతని సౌందర్యమంగళములను, కంకణవిభూషితములైన వారి హస్తములనుండి జాలువార్చుచున్నవి. సమస్తసాహిత్యమును, సకలమానవులను పరివేష్టించి యొకసారి యట్లు చూడవలసియున్నది. మానవుఁడాతని వాస్తవమైన బలమును భావబలముగ తనచుట్టు నింకను చాలాదూరమువరకు విస్తరింపఁజేసికొనుచు పోయెను. వర్షాసమయమునం దతనికి నలుదెసలందును నెంత గానవర్షము, కావ్యవర్షము, ఎన్ని మేఘదూతలు, ఎందరు విద్యాపతులు విస్తరిల్ల లేదు! తన చిన్నిగృహమునందలి సుఖదుఃఖముల నెన్నిఁటి నాతడెన్ని సూర్యచంద్రవంశీయులైన రాజుల సుఖదుఃఖపూరితములైన గాథలలో వివృద్ధ మొనర్చుకొనలేదు! తన గృహమునందలి బాలికలచుట్టును గిరిరాజకన్యయొక్క కరుణ సర్వదా సంచరణ మొనర్చుచున్నది! కైలాసమునందలి దారిద్ర్యదేవతయొక్క మహిమయందు తాను తన దారిద్ర్యదుఃఖములను ప్రసారితమొనర్చికొనెను! ఈ తీరున మానవుఁ డనవరతము తన చుట్టును నెట్టి వికీర్ణసృష్టి నొనర్చికొనుచున్నాఁడో దానియందు బాహి

రమునఁ దన్నుతాను వికీర్ణ మొనర్చుకొని తనయందు తానే వృద్ధి నొందుచు వచ్చుచున్నాఁడు. ఏ మానవుఁడు స్థితిగతులందు సంకీర్ణుఁడో యతఁడు భావసృష్టియందును తనదైన యే విస్తారమైన రచన నొనర్చుచున్నాఁడో, ప్రపంచముచుట్టును నేది మఱియొక ప్రపంచమో యదియే సాహిత్యము.

ఈ విశ్వసాహిత్యమునందు నేను మీ కెల్లరకు పథప్రదర్శకుఁడ నగుదు నని మనస్సునందుసైత మూహింపకుఁడు. ఎవ రెవరి కెంతెంత సాధ్యమో యంతంతగ నెల్లరును వారి వారి మార్గముల నేర్పరచుకొనవలసియున్నది. నేను చెప్పఁదలచుకొన్నది కేవల మింతమాత్రమే. పృథ్వి యెట్లు నీ క్షేత్రము నాక్షేత్రము నతని క్షేత్రమును మాత్రమే కాదో, పృథ్వి నట్లుగ భావించుట యెట్లత్యంత గ్రామ్యముగ నెఱుఁగుటయో యట్లే సాహిత్యమును నీ రచన, వాని రచనయు నని వేర్పఱచుట. కాని సాధారణముగ సాహిత్యము నిట్లే గ్రామ్యభావమున దర్శించుచుందుము. ఆ గ్రామ్యసంకీర్ణత నుండి తన్ను నిస్తారిత మొనర్చుకొని విశ్వసాహిత్యమునందు విశ్వమానవుని దర్శించు లక్ష్యమును మనము స్థిర మొనర్చుకొందుము. ఆ సమగ్రతలో సమస్త మానవప్రకాశయత్నముయొక్క సంబంధమును దర్శింతుము. ఈ సంకల్పమును స్థిర మొనర్చుకొనవలసిన సమయ మాసన్నమైనది.



# సౌందర్యము - సాహిత్యము

సౌందర్యబోధము, విశ్వసాహిత్యము నను వ్యాసము లందు నా వక్తవ్యవిషయము స్పష్టము కాలే దను అపవాదము ప్రచారమగుటచే యథాసాధ్యముగ పునరుక్తిని పరిహరించుచు, మూలవిషయమును పరిష్కార మొనర్చు ప్రయత్నమునందు ప్రవృత్తుఁడ నగుదును.

జగత్తునం దొకానొక సంఘటన కేవలము ఘటించు చున్నదనిమాత్రమే తెలిసికొని, అది యెందుకు జరుగుచున్నది, దాని పూర్వాపరము లేమి, జగత్తునందలి యితరసంఘటనలతో దానికి సంబంధ మెచ్చట ? మొదలగు విశేషములను తెలిసి కొనకపోయినచో ఆ ప్రత్యేకమైన సంఘటననుగూర్చి పూర్ణముగ నెట్లు తెలిసికొనినవారము కామో, యట్లే జగత్తునందు సత్య మున్నదని మాత్రమే యెఱుఁగుదు మేని దానియందు మన కెట్టి యానందమును లేదు. అది మన హృదయసంబంధిగ లేనేలే దని నను సరిపోవును. ఇంత విశాలమైన యీ విశ్వమునందు మనము నివసించుచున్నాము. దీనియం దత్యంతాధికభాగమును మన మెఱిఁగియున్న జగత్తుతో సంపూర్ణముగ సదృశ మొనర్చుకొన జాలమైతిమి. ఇది మనకు పరిజ్ఞాతమైన జగత్తునందు భుక్తమై స్వీయమైనది కాలేదు.

ఐనను జ్ఞానముచే జగత్తునందు నే నెంత తెలిసికొను చున్నానో, హృదయముతో నెంత పొందుచున్నానో యంత

వరకే నా వ్యాప్తి, నా విస్తృతి. ఏ పరిమాణమునందు నాకీ జగత్తు అతీతమో, ఆ పరిమాణమునందు నే నల్పుఁడను. అందుచే నా మనోవృత్తి, హృదయవృత్తి, నా కర్మశక్తి, నా జ్ఞానపరిధిని కేవల మధిక మొనర్చి, యధికారము వహించు యత్న మొనర్చు చుండును. ఇట్లొనర్చుటయందే మన శక్తి సత్యమునందును, పటిష్ఠతయందును విస్తృతమగును.

ఈ వికాసవ్యవహారమునందు, మన సౌందర్యజ్ఞానము వలన ప్రయోజనమేమి ? అది సత్యమునందలి విశేషాంశమును, మన హృదయములం దుజ్జ్వల మొనర్చి మిగిలిన యంశమును మ్లాన మొనర్చి తిరస్కరించునా ? అట్లేయగుచో సౌందర్య మిఁక మన వికాసమున కవరోధ మన్నమాట. నిఖిలమైన సత్యము నందు మన హృదయమును వ్యాప్త మొనర్చుకొనుటలో అది మన కంతరాయమును కలుగఁజేయును. అది యప్పుడు సత్యము మధ్య వింధ్యాచలమువలె నెదిగి దానిని సుందరము నసుందరము, ఆర్యావర్తము దక్షిణాపథము,- అను రెండుభాగములుగ విభ జించి, పరస్పర మొకప్రదేశమునుండి వేఱొకప్రదేశమునకు గమ నాగమనమార్గమును దుర్గమ మొనర్చియుంచినది. జ్ఞానము క్రమ క్రమముగ సమస్తసత్యమును మన బుద్ధిశక్తిలోని కాయత్త మగున ట్లొనర్చుటకై నిరత మెట్లు యత్నించుచున్నదో సౌందర్య బోధము నట్లే సమస్తసత్యమును క్రమక్రమముగ మన యానం దముయొక్క యధికారములోనికిఁ దెచ్చుటకై యత్నించు చున్నది. ఇది దాని కేకమాత్రమైన సార్థకత. సమస్తమును

సత్యము. అందుచే సమస్తమును మన జ్ఞానమునకు విషయము. సమస్తమును సుందరము, అందుచే సమస్తమును మన కానంద సామగ్రియే !

గులాబిపూవు మన కే హేతువున సుందరమైనదో సమగ్ర విశ్వమునం దా హేతు వెంతో యతిశయించియున్నది. విశ్వము నం దట్టి యుదారమైన ప్రాచుర్యమును, అట్టిదేయైన కఠినసం యమమును, దాని కేంద్రానుగశక్తి యసీమమైన వైచిత్రియందు తన్నుతాను నలుదెసల సహస్రముఖములుగ ప్రకాశింపఁజేయు చున్నది. దాని కేంద్రానుగశక్తి యీ యుద్దామవైచిత్ర్యో ల్లాసము నొకేయొక పరిపూర్ణసామంజస్యమునందు మిళితమొనర్చి యుంచినది. ఈ యొకవైపున వికసించుట, వేఱొకవైపున ముకు ళించుటలయందే ఛందచ్ఛందమునను సౌందర్యము. విశ్వమునం దీ త్యాగ మొనర్చుట, నిరోధించియుంచుట యను నిత్యలీల యందే సౌందర్యము తన్నుతాను సర్వత్ర ప్రకాశమొనర్చుకొను చున్నది. ఐంద్రజాలికుఁ డనేకకందుకములను తీసుకొని యాడు చున్నప్పుడు వాని నన్నింటి నొకేసారిగ నెగురవేయుటయు, పట్టు కొనుటయు చూడ నాశ్చర్యకరమైన చాతుర్యమును సౌందర్య మును సృష్టించుచున్నట్లుండును. ఈ ఖేలనమునం దొకానొక కందుకముయొక్క క్షణకాలీనమైన స్థితి మన కంటఁబడినచో దాని మెగయుటనో, పడిపోవుటనో మనము చూడఁజాలుదుము. కాని, దానియందు పూర్ణదర్శన మొదవదు. కనుక యానందము నందు పూర్ణత ఘటించదు. జగత్తునందలి యానందలీలనుకూడ

మన మెంత పూర్ణరూపమున దర్శింతుమో యంతగానే దాని నవగత మొనర్చికొందుము. మంచిచెడ్డలు, సుఖదుఃఖములు, జీవనమృత్యువులు, సమస్తము నెగయుచు దిగుచు, విశ్వసంగీత ఛందమును రచించుచున్నవి. సమగ్రభావమున దర్శించినచో నీ ఛందమునందు విచ్ఛేద మెచ్చటను లేదు. సౌందర్యమున కెచ్చటను లఘుత్వము లేదు. జగత్తునందు సౌందర్యము నీ రూపమున సమగ్రభావమున దర్శించు నభ్యాసమే సౌందర్యజ్ఞానముయొక్క చరమలక్ష్యము. మానవుఁ డిట్లు చూచుటయం దెంతఁ యగ్రసరు డగుచున్నాఁడో, యతని యానందము నంతగా జగత్తునందు ప్రసారిత మొనర్చుకొనఁగలుగు చున్నాఁడు. అప్పు డిఁక పూర్వ మేది నిరర్థకముగ నుండెనో క్రమముగ నది సార్థకమై యొసఁగు చున్నది. పూర్వము దేనియం దౌదాసీన్య ముండెనో క్రమముగ నతఁడు దానితో కలిసిపోయి దర్శించుచున్నాఁడు. దేనిని విరుద్ధముగ నెఱిఁగియుండెనో దానిని బృహద్వస్తువునందు దర్శించి దానికి సరియైన స్థానమును చూచుచు తృప్తిఁజెందుచున్నాఁడు. సమగ్రవిశ్వమునందును, మానవుని యీ సౌందర్యమును దర్శించు వృత్తాంతము, జగత్తును తన యానందముద్వారా స్వవశ మొనర్చుకొను నితిహాసము, మానవసాహిత్యమునందు స్వభావముగ రక్షిత మగుచున్నది.

కాని సౌందర్యమును మన మనేకసమయములందు నిఖిల సత్యమునుండి వేఱుచేసి చూచెదము. దానిని గ్రహించి సంపత్తి దాయమును నిర్మించివేయుదుము. ఇది మనకు నిత్యానుభవ

విషయము. యూరోపునందు సౌందర్యచర్చయు, సౌందర్యారాధ నము నను నొక సాంప్రదాయికప్రథ యున్నది. సౌందర్యమును గూర్చిన విశేషభావానుశీలనము తెలివితేటలతోఁ గూడిన నొకానొక కార్యముగ వారు భావింతురు. ఇట్టి చాతురితో కొందఱువ్యక్తులు వారి జయపతాకము నెగురవేయుచు తిరుగుదురు. ఈశ్వరునిఁగూడ నీ రీతిని తమ సమాజమునం దొక వ్యక్తిగ నొనర్చి యాడంబరముతో నితరసమాజములవారితో పోరాట మొనర్చుచు తిరుగుచుండుట మానవులలో కాననగుచున్నది.

సౌందర్యమును నాల్గుదెసలనుండి విశేషించి గ్రహించి, జగత్తునం దిక సర్వము నుల్లంఘించి, కేవలము దాని వెనువెంటనే చుట్టి తిరుగుచుండుట ప్రపంచమునందు నూటికి తొంబదిమందికి సంబంధించిన పనికాదు. కేవలము, సుందరము నసుందరమును తీసికొని జైనతపస్వులవలె ప్రతిపదక్షేపమును గణించుకొని నడవవలసివచ్చి నచో నడకయే సాగదు.

పృథ్వియందు సౌందర్యమున నేమి, శుచిత్వమున నేమి, నిరతిశయమైన సూక్ష్మవిచార మొనర్చువారు సామాన్యమానవుల నవజ్ఞచేయుదురు. వారిని గ్రామీణు లందురు. వారు దానిని సంకోచముతో స్వీకరింతురు.

ఐరోపీయసాహిత్యమునందు సౌందర్యపరిశీలన మొనర్చి, యేది ప్రచలితమో, ప్రాకృతమో, దానిని నీచ మని, పూర్ణముగ నూడ్చిపెట్టు ప్రయత్న మొక్కొకచో కాననగును. చాలకాలము క్రిందట నొక ప్రఖ్యాతుఁడైన ఫ్రెంచి రచయిత గ్రంథముయొక్క

యాంగ్లానువాదమును చదివినట్లు జ్ఞాపకమున్నది. ఆ పుస్తకము ప్రసిద్ధమైనది. స్విన్‌బరన్ కవి దానికె 'గాస్పెల్ ఆఫ్ బ్యూటీ' అనగా సౌందర్యదర్శనశాస్త్ర మని నామకరణ మొనర్చెను. దాని యం దొకవైపున నొక పురుషుఁడును, వేఱొకవైపున నొక స్త్రీయు తమకు సంపూర్ణముగ మనస్సునకు నచ్చిన వ్యక్తిని, పృథ్వియందలి సమస్తమైన స్త్రీపురుషులయందును నన్వేషించుచు తిరుగు నుద్యమమునే జీవితమునందు వ్రతముగ స్వీకరించిరి.

ప్రపంచమునం దేది యనుదినము సంభవించునదో, నలు దెసల లభించునదో, సాధారణమైనదో దానినుండి తమ్ముద్ధరించు కొని, జనసామాన్యముయొక్క జీవనయాత్రయందలి ఆ సామా న్యత నడుగడుగునందును అవమానించుచు, దానియందు భాషా చాతుర్యమున, రంగుమీఁద రంగు, రాగముమీఁద రాగము పులిమి, సౌందర్యమునం దొకానొక దుర్లభమైన యుత్కర్షలో నతితీవ్రమైన యౌత్సుక్యము ప్రకాశింపఁజేయఁబడినది. ఇంత నిష్ఠురమైన పుస్తకమును నే నెన్నఁడును చదివియుండ లేదు. సౌంద ర్యాకర్షణ మానవు నీ విధముగ ప్రపంచమునుండి లాగివేసినచో, మానసోద్వేగములను పలు దెసలందు నేదోవిధముగ సుసంబద్ధ మొనర్చుకొననిచో ప్రచలితమైన దానిని అకించిత్కర మని ప్రచార మొనర్చుచు, అహితకరమైన దానిని గ్రామ్యమని పరిహాసించుచు వచ్చినయెడల అట్టి సౌందర్యము గర్హింపఁబడుగాక. ఇది ద్రాక్ష పండ్లను పిండి, వానియందలి శోభను, రసగంధములను వదలివేసి

కేవల మందలి మాదకతనుమాత్రము వడకట్టి గ్రహించుటవంటి దగును.

సౌందర్యము కులానుగతము కాదు. అది సర్వాలయం దును నిహితమై యున్నది. అది క్షణికమైన దానియందే చిరంతన మును, సామాన్యసౌందర్యమునందే చిరవిస్మయమును సముజ్జ్వల మొనర్చి దర్శన మొసఁగును. సమస్తజగత్సౌందర్యమునకు నేది మౌలికమో దానిని మన మనస్సులకు పట్టియొసఁగును. సమస్త సత్యమును దాని సాహాయ్యమున ఘనముగ చూడఁగలుగు చున్నాము. ఫాల్గుణమాసమునం దొకానొక సందెవేళ నొక కుగ్రా మముగుండ నడచివెళ్లితిని. వికసితసర్షపక్షేత్రమునుండి సుగంధము బయలుదేరి యా వంకరదారిని, ఆ చెరువుగట్టును, ఆ యుజ్జ్వల మైన సాయాహ్నసమయమును హృదయమునందు చిరకాలము విరాజిలఁజేసినది. దేనిని లక్షించెడివాఁడను కానో దానిని విశ్లే షించి చూపించినది. ఏది విస్మృతపథమునఁ బడెడిదో దానిని విస్మరింపనీయలేదు. సౌందర్యమునందు మనము దేనిని దర్శింతుమో దానినిమాత్రమే దర్శింతు మనున దేమియు లేదు. దానితో కలిపి మిగిలిన దంతయు చూచెదము. మధురమైన సంగీతము పృథి వ్యాపస్తేజోవాయ్వాకాశముల యస్తిత్వముననే మాన్యత నొసఁ గును. సాహిత్యయోధులు అస్తిత్వమాత్రమైన దాని గౌరవ మును చాటు భారమును వహించినారు. వారు భాష, ఛందస్సు, రచనారీతు లందలి సౌందర్యముద్వారా ఆ సకలవస్తువులను మనకు గోచరింపఁజేయుదురు. ప్రత్యక్షములగుటఁ జేసి మనము వానిని

లక్షించనే లక్షించము. అభ్యాసవశమున సామాన్యమును మన మనజ్ఞాపూర్వకముగ చూచెదము. ఆ సామాన్యమునే వారు తమ రచనా సౌందర్యముచే సమాదరించుటలో, దాని సౌందర్యమును, మూల్యమును మనము గుర్తింతుము. సాహిత్యలోకమున అతిపరి చితమును నూతనముగ దర్శింతుము. సుపరిచితమును అపరిచిత మును మన మొకే విస్మయపూర్ణమైన యపూర్వతయందు గంభీర భావమున నుపలబ్ధ మొనర్చికొందుము.

మానవునికి వికృతి ఘటిల్లిన యదనున సౌందర్యము నాతఁడు దాని పరివేషమునుండి విడఁదీసి దానిని విపర్యస్తమైన కార్యమునందు సంలగ్న మొనర్చును. మస్తకమును దేహము నుండి వేఱుచేసినచో నెట్లో యిదియు నట్లే విరుద్ధముగ నుండును. సామాన్యమును విశేషించి గ్రహించుటలో దానికి విరుద్ధముగ సౌందర్యమును నిల్పుట యగును. దానిని సత్యమునకు శత్రువు నొనర్చి దాని సాహాయ్యమున సామాన్యమైన దానియెడల మనకు నిస్పృహ జనింపఁజేయు ప్రయత్న మొనర్చుటయగును. అప్పుడిఁక నా వస్తువు సౌందర్యధర్మమునే పరిహరించును. ధర్మ మనుము, సౌందర్య మనుము, ఎంతటి మహత్తరవస్తువైన కానిమ్ము, మనము దానిచుట్టును ఆవరణమును కల్పించి కొంచె మెక్కువగ దానిని గ్రహింపయత్నింతు మేని దాని స్వరూపమే నష్టమైపోవును. నదిని మనదిగా నొనర్చికొనుటకు బంధించివేసితి మేని యది యిఁక నది గానే యుండదు, కాసార మైపోవును.

జగత్తునం దనేకు లిట్లే సౌందర్యమును సంకీర్ణ మొనర్చి, దానిని భోగవిలాసాహంకారములయొక్కయు మత్తతయొక్కయు సామగ్రిగ నొనర్చికొనుటచేతనే కొన్నికొన్ని సంప్రదాయములు సౌందర్యమును విపత్కరముగనే గ్రహించినవి.

ఈశ్వరప్రసాదమునందు విపత్తెచ్చట లేదు ? జలమునందు విపత్తు, స్థలమునందు విపత్తు, అగ్నియందు విపత్తు, వాయువు నందు విపత్తు. విపత్తే మనకు ప్రతివస్తువుయొక్కయు సత్యపరి చయము నిచ్చును. దాని సరియైన వ్యవహారమును మన కవబోధ మొనర్చుచుండును.

జలస్థలాగ్నివాయువులు లేకున్న మన మొక్కక్షణమును మనఁజాలము. కనుక వీని యందలి సమస్తవిపత్తులను స్వీకరించియే వీని ననేకవిధములుగ పరిచయ మొనర్చికొనవలసియుండును. కాని సౌందర్యరసభోగము మన కంత యత్యావశ్యకమైన విషయము కాదు. అది కేవలము విపత్కరమనవచ్చును. కాని దీనికిని ప్రయో జన మున్నది. ఈశ్వరుఁడు మన మనస్సును పరీక్షించుటకే సౌందర్యపూర్ణమైన మాయామృగమును మన సమక్షమున పరు గెత్తించుచున్నాఁడు. దీని ప్రలోభనమున మన మనావధానుల మైతిమేని మన జీవితములందలి యనర్ఘమైన ధన మపహృతమై పోవును.

"ఈశ్వరుఁడు పరీక్షకుఁడు, ప్రపంచము పరీక్షాస్థలము." ఇట్టి మిథ్యాబిభీషికాసంబంధములైన మాట లింక దుస్సహ ములు. మన నకలువిద్యాలయములతో నీశ్వరుని విశ్వవిద్యాలయ

మును పోల్చరాదు. ఆ విశ్వవిద్యాలయమునందు పరీక్షలు లేవు. అందు పరీక్షల కెట్టి ప్రయోజనమును లేదు. అచ్చట కేవల మధ్యయనముమాత్ర మున్నది. అచ్చట సర్వమును వికాసము నకే దారితీయు చున్నది. మానవుని మనస్సునందు వికాసమును ఘటింపఁజేయును గనుకనే సౌందర్యబోధ మతని మానసమునం దంత ప్రబలమై నిలిచినది. విపత్తుండిన నుండనిమ్ము. అందువలన వికాసపథమును పూర్ణముగ త్యజించివేసినచో నది శుభావహము కానేరదు.

వికాసమన నేమియో పూర్వమే తెల్పితిని. సమగ్రము నందు ప్రత్యేకతయొక్క సామంజస్య మెన్ని విధములుగ నెంత దూరము వ్యాప్త మగుచుండునో, నంతవరకే ప్రతివస్తువు యొక్క వికాసము నుండును. విపత్తుండుగాక, అందులకై వికాస పథమును పరిత్యజించినచో నది మంగళకరమైనది కాదు. స్వర్లోక ప్రభువైన దేవేంద్రుఁడు మన యోగసాధనయందు విఘ్నమును ఘటించుటకుమాత్రమే సౌందర్యమును మర్త్యలోకమునకు పం పించునేమో! అట్లగుచో నింద్రదేవుని కీ ప్రపంచమునుండి నమ స్కార మొనర్చి రెండుకన్నులు మూసికొనుట మేలు. ఈ మాట స్వీకరింపదగినది.

కాని దేవేంద్రునియందు నాకు లేశమైన సందేహము లేదు. ఆయన దూత నెవనిని తాడించి యేడ్పింపవలయు నని నేను కోరను. సత్యముతో మన హృదయముయొక్క ప్రగాఢ మైన, యఖండమైన మేళనమును సంఘటించుటకే సౌందర్య

బోధము మందహాసవదనముతో మన హృదయమునం దవతీర్ణ మైన దను విషయము నాకు నిశ్చయముగ తెలియును. అది కేవలము ప్రయోజనమాత్రమైన మేళనము కాదు. అది యానం దావహమగు మిళనము. నీలాకాశము నితాంతము ప్రయోజన రహితముగ మన హృదయము నాయత్త మొనర్చికొని, శ్యామల పృథ్వి పై తన జ్యోతిర్మయమైన పీతాంబరమును పరచివేయు నప్పుడు మనము దానిని సుందర మందుము. వసంతకాలమున కిసలయములు వనలక్ష్మి యంగుళులవలె యనావశ్యకముగనే మన నేత్రద్వయము నింగితముతో నాహ్వానించు నప్పుడు మనస్సు నందు సౌందర్యరసము పొంగిపొరలును.

కాని సౌందర్యబోధము కేవలము సుందరనామకసత్యము యొక్క యొకానొక యంశము వైపునకే మన హృదయము నాకర్షించును. మిగిలిన యంశములనుండి మన హృదయమును ప్రత్యావృత్త మొనర్చు నను నన్యాయమైన యపప్రథ నెట్లు కడిగి వేయవలయు నను విషయమే యోచింపఁదగినది.

మన జ్ఞానశక్తిమాత్రమే జగత్తునందలి సమస్తసత్యము నీ క్షణమందే మన పరిచయములోనికిఁ దెచ్చినదా ? మన కర్మ శక్తి జగత్తునందలి సమస్తసత్యమును నేఁడే మన వ్యవహారమునం దాయత్త మొనర్చినదా ? జగత్తునందలి యొక్క యంశమే మన యవబోధమున నున్నది. మిగిలిన దంతయు మన కపరిచితము. విశ్వశక్తియందలి సామాన్యాంశము మన కార్యములందు విని యోగమునకు వచ్చుచున్నది. అధికాంశమును మనము మన

వ్యవహారములందు లగింపఁజేసికొనఁజాల కున్నాము. ఐనను మన జ్ఞానము పరిచితాపరిచితజగత్తులయందలి ద్వంద్వమును కొంచెము కొంచెముగ నపవారించుచు వచ్చుచున్నది. యుక్తిసమూహ మావరణమును విస్తరింపఁజేసి జగత్తునందలి సమస్తసత్యమును క్రమముగ మన బుద్ధియొక్క యధికారమునకు వశ మొనర్చు చున్నది. భౌతికజగత్తును మానసికజగత్తుగ, జ్ఞానజగత్తుగ పరివర్తింపఁజేయుచున్నది. మన కర్మశక్తి జగత్తునందలి సర్వశక్తిని వ్యవహారమున క్రమక్రమముగ మనదిగ దిద్దుచున్నది. విద్యుత్తు, జలము, అగ్ని, వాయువు దినదినము మనకు బృహత్కర్మశరీరమై నిలుచుచున్నవి. మన సౌందర్యబోధమును క్రమక్రమముగ సమస్త జగత్తును మన కానందజగత్తుగ పరిణమింపఁజేయుచున్నది. అద్వైపునకే దాని గతి. జ్ఞానముద్వారా సమస్తజగత్తునందును మన మనస్సు వ్యాప్తమగును. కర్మద్వారా సమస్తజగత్తునందును మన శక్తి వ్యాప్తమగును. సౌందర్యబోధముద్వారా సమస్తజగత్తు నందును మన యానందము వ్యాప్తమగును. మనుష్యత్వమున కిదియే పరమలక్ష్యము- అనగా జగత్తును జ్ఞానరూపమునను, శక్తిరూపమునను, ఆనందరూపమునను పొందుటయే మానవ జీవితమునకు పరమార్థము.

కాని యీ పొందుట, పొందకుండుట యను విరోధము నుండియే అది సాధ్యము. ద్వంద్వమునుండి కాక వికాసమును పొందుటయే దుర్లభము. సృష్టిమూలమునందే యీ నియమ

మున్నది. ఒకటి రెం డగుటయు, రెండు ఒకటి యగుచుండుటయే వికాసము.

విజ్ఞానము దృష్ట్యా చూడుము. మానవుఁ డొకకాలమున వృక్షమునందు, శిలయందు, మనుష్యునియందు, పర్వతమునందు, ప్రాణిఅప్రాణిభేదమును దర్శింపనే లేని స్థితియం దుండెను. అప్పు డతనికి సర్వమునందును సమానధర్మమే గోచరించెను. క్రమముగ నాతని బుద్ధికి ప్రాణులయందును అప్రాణులయందును భేదము ప్రస్ఫుటమగుట ప్రారంభమయ్యెను. ఇట్లే యభేదమునుండి ప్రథమమున ద్వంద్వసృష్టి జరిగినది. అట్లు కానిచో ప్రాణియొక్క ప్రకృతలక్షణమును మానవుఁ డెన్నటికిని తెలిసికొనఁజాలెడివాఁడే కాఁడు. అతఁడు లక్షణముల నెంత సత్యముగ తెలిసికొన మొదలిడెనో ద్వంద్వ మంతదూరమునకు జరిగిపోవుచుండెను. ప్రథమమున ప్రాణి- ఉద్భిదములమధ్య వ్యవధానము స్పష్టమగుచు వచ్చినది. ఎచ్చట యుద్భిదములకు పర్యవసానమో, ప్రాణుల కారంభమో దానిని నిర్ధరించుకొనుటయే తొలుత దుర్లభ మయ్యెను. ఇఁక నేఁడు మన మే ధాతువును జడమని భావించుచున్నామో దానియందుకూడ ప్రాణలక్షణమును విజ్ఞాననేత్రము పట్టియిచ్చుట కుపక్రమించుచున్నది. అందువలన ఏ భేదబుద్ధి సాహాయ్యమున మనము ప్రాణవస్తువును తెలిసికొన్నామో, తెలిసికొనుట యను వికాసమునందే యా భేదము క్రమముగ లుప్త మగుచుండును. అభేదమునుండి ద్వంద్వము, ద్వంద్వమునుండి యభేదము బహిర్గత మగును. అవశేషమున నొకనాఁడు విజ్ఞానము, ఉపనిషదృషు

ఒతో సమస్వరమున చెప్పితీరును. 'సర్వం ప్రాణ ఏజతి'- సమస్త మును ప్రాణమునందు కంపిత మగుచున్నది, అని.

సమస్తమును ప్రాణమునందు కంపిత మగుచున్న దని యెట్లు చెప్పినదో యట్లే సమస్తమును నానంద మనికూడ ఉపని షత్తు చెప్పినది. జగత్తునందలి యీ నిరవచ్ఛిన్నమైన యానంద రూపమును దర్శించు పథమునందు సుందరము - అసుందరము నను భేదము తొలుత తానై తలయెత్తును. లేనియెడల సుందరము యొక్క పరిచయ మగుటయే దుర్లభ మగును.

సౌందర్యబోధమునందలి ప్రథమదశయందు, సౌందర్యము యొక్క స్వాతంత్ర్యము మనల నాహత మొనర్చి జాగరిత మొన ర్పఁ జూచుచున్నది. వైపరీత్య మిందుచే దానికి ప్రథమాస్త్రము. ఉజ్జ్వలవర్ణము, ఘటనావైచిత్రియు తన చుట్టునున్న మ్లానతనుండి యుచ్చలితమై మనల నాహ్వానించును. సంగీతము కేవలము ధ్వని యొక్క యుత్తేజనము నాశ్రయించుకొని యాకాశతరళమగుటకు యత్నించుచుండును. తుదకు సౌందర్యబోధ మెంత వికాసముఁ జెందునో యంత, స్వాతంత్ర్యము గాక సుసంగతి - ఆఘాతము గాక యాకర్షణము, ఆధిపత్యము గాక సామంజస్యము - మన కానంద మొసగును. ఈ రూపమున సౌందర్యమును నలుదెసల నుండి వేఱుపరచి గ్రహించి యవబోధ మొనర్చుకొనుటకు యత్నింతము.

నియమము సర్వత్ర వ్యాపించియుండును. మనస్సు నెల్ల యెడల నఖండముగ మేళన మొనర్చి దర్శించిననే నియమము

మనకు పట్టువడును. అప్పు డాకాశమున కెగిరినను, భూమిపై బడినను, తామరతూడు నీటిపై తేలినను, లోహము నీటిలో మునిగినను, యీ సమస్తమునందును భారాకర్షణముయొక్క నియమమున నెచ్చటను విచ్ఛేదమును దర్శింపము.

జ్ఞానమును భ్రమవిరహిత మొనర్చు నీ యుపాయమ వలెనే యానందమును విశుద్ధ మొనర్చుటయందును, దాని ఖండమునుండి ముక్తి నొసంగి, యఖండమున సంలగ్న మొనర్ప వలసి యున్నది. ఉన్నదున్నట్లుగ గ్రహించుట విజ్ఞానమునకు బాధ హేతు వైనయట్లు, ఉన్నదున్నట్లుగ దర్శించి ముగ్ధులమై యదియే సుందరమని పట్టుకొని యూగులాడుచో నానందమునకు విఘ్నమ కలుగును. మన యనుభవము ననేకదిశలనుండి యన్నివిధముల బరిశీలించి గ్రహించి నప్పుడే దాని సత్యత స్థిర మగును. అట్లే మన యనుభూతిసైతము ప్రపంచమునం దెల్లయెడల మిళితమై నప్పుడే దాని నానంద మనంజాలుదుము. త్రాగుబోతు మద్య పానమున నెంత సుఖమైన బడయనిమ్ము. ఎల్లయెడల నా సుఖ మునకు విఘ్నమే ఘటిల్లును. అతని స్వీయసుఖ మితరులకు దుఃఖ హేతువు. అతని నేటి సుఖము యతని రేపటి దుఃఖము. అతని ప్రకృతియందొక యంశమునందలి సుఖము వేఱొక యంశమ నందు దుఃఖము. ఈ సుఖమునందు సౌందర్యమునకు విఘాత మేర్పడును. ఆనందమునకు భంగపాటొదవును. ప్రకృతియందలి సమస్తసత్యముతో దీనికి సంగతి కుదురదు.

నానాద్వంద్వములనుండి సుఖదుఃఖములలో మానవుఁడు సౌందర్యమును ఆనందమును సత్యమున కన్నివైపులను చల్లుకొని దాని కొక యున్నతరూప మిచ్చి పరిచయ మేర్పరచుకొను చున్నాఁడు. అతని దాని సర్వపరిచయ మెచ్చట సంచిత మగు చున్నది? జగద్వ్యాపారసంబంధమున మానవజ్ఞాన మనంతకాలము నుండి యజస్రప్రజానీకముద్వారా స్మృతిబద్ధమగుచు విజ్ఞానభాండా రమును నింపివేయు చున్నది. అందువలననే, ఒకని దర్శనమును మరియొకని దర్శనముతోను, ఒక కాలమునందలి దర్శనమును వేఱొక కాలమునందలి దర్శనముతోను సరిపోల్చి గ్రహించుట కవకాశ మేర్పడుచున్నది. ఇట్లే జరుగనిచో విజ్ఞానవికాసమే దుర్లభ మయ్యెడిది.

ఈ రీతిగ మానవునికి సౌందర్యముతోనైన పరిచయము, ఆనందముతోనైన పరిచయము, దేశదేశములందును సర్వకాలము లందును సాహిత్యమునందు సంచిత మగుచున్నది. సత్యముపై మానవహృదయమున కధికార మే మార్గమునుండి యెట్లు విస్తృత మగుచున్నది? సుఖజ్ఞాన మే రీతిగ నింద్రియపరితోషమునుండి క్రమముగ ప్రసారితమై, మానవుని మనోసర్వస్వమును, ధర్మ బుద్ధిని, హృదయమును ఆక్రమించుకొనుచున్నది? క్షుద్రమును మహత్తుగా, దుఃఖమునుగూడ ప్రియముగా నెట్లొనర్చుచున్నది? మానవుఁడు నిత్యము దాని యడుగుజాడలను తనసాహిత్యమునం దంకిత మొనర్చికొనుచున్నాఁడు. విశ్వసాహిత్యపాఠకులు వారి సాహిత్యమునందు సమస్తమానవహృదయమునుండి దేనిని వాం

ఘించుచున్నారో, తమ తమ హృదయములందు దేనిని పొందు
చున్నారో, సత్య మే కీర్తిని మానవునియెడల మంగళరూపమును,
ఆనందరూపమును ధరించుచున్నదో, దానిని సంధాన మొనర్చు
కొని యనుభవించి కృతార్థు లగుదురు.

మానవుఁడు తా నెఱిఁగిన దానినుండి కాక దేనియందు
తా నానందము ననుభవించుచున్నాఁడో దానియందే పరిచయ
మును పొందుచున్నాఁ డనునది మనస్సునం దుంచుకొనవలసిన
విషయము. మానవుని పరిచయమే యాత్మైక్యజనకము. సత్యము
కొఱకై యొకానొకఁడు నిర్వాసమును స్వీకరించుచున్నాఁ డని
గమనించినప్పుఁడా వీరపురుషునియొక్క యానందపరిధి మన హృద
యమునందు పరిస్ఫుటమై విలసిల్లును. ఆ యానంద మెంతటి స్థాన
మాక్రమించినదో కాని యతఁ డా నిర్వాసక్లేశమును ననాయా
సముగ తనలో నొక భాగమైనట్లుగ ననుభవించును. ఈ దుఃఖము
ద్వారముననే యానందమునందలి మహత్త్వము ప్రమాణిత మగు
చున్నది. ధనమునందే యానందము ననుభవించువా రా ధనము
వ్యయ మగునను భయముతో నసత్యమును నవమానమును
ననాయాసముగ స్వీకరింతురు. వారు దాసత్వమును నిల్పుకొను
టలో, నన్యాయ మొనర్చుటలో వెనుకాడరు. మానవుఁ డెన్ని
పరీక్షలయందైన నుత్తీర్ణుఁడు కావచ్చును. ఇతని కెంత విద్యయైన
నుండవచ్చును, కాని యానందశక్తి పరిమితియం దీతని యథార్థ
పరిచయమును పొందనగును. బుద్ధభగవానుని కెంతటి యానం
దాధికార ముండెడిదో కాని, దానిముందు రాజ్యసుఖానంద

మాతని బంధించియుంచఁ జాలక పోయెను. దీనిని దర్శించినప్పుడు ప్రతిమానవుఁడును మనుష్యత్వసంబంధి యగు నానందపరిధియొక్క విపులత్వమును చూచి స్వీయమైన గుప్తధన మితరులయం దావిష్కారమగుచున్నట్లును, స్వీయమును, నిర్బాధకమునైన పరిచయము నన్యత్ర దర్శించుచున్నట్లును భావించును. ఈ మహాచ్చరిత్రమునందు ఆనందము ననుభవించుటలో మనము మనలనే స్వయముగ నావిష్కరించుకొందుము.

ఇట్లే మానవుఁడు తన యానందప్రకాశముద్వారా సాహిత్యమునందు కేవలము తనదైన నిత్యరూపమును, శ్రేష్ఠమైన రూపమును ప్రకాశ మొనర్చికొనుచున్నాఁడు.

సాహిత్యమునుండి చిన్నచిన్న ప్రమాణముల నేర్చి తెచ్చి సంక్షేపముగ విషయమును ఖండఖండములుగ నొనర్చుట అత్యంత సహజము. సాహిత్యమునం దెచ్చట నే యల్పాంశము స్థానమును పొందినదో దాని కంతకును సమాధాన మిచ్చు బాధ్యతను నాపై వేసినచో నా కది సామాన్యమైన భారము కాదు. కాని మానవుని సమస్తమైన వ్యవహారములందును శతానేకములు ఆత్మవిరోధము లుండును. జపానీయులు నిర్భీకమైన సాహసముతో పోరాడిరని చెప్పుటలో, జపాన్‌సైన్యమునందలి ప్రతివ్యక్తియొక్క సాహసమునుగూర్చి యుగ్గడించ నారంభించినచో పలుతావుల పొరపాటుగ తోఁచును - కాని సత్య మేమన ఆ సమస్తమైన వ్యక్తి విశేషమునకుఁ జెందిన భయమును తమలో నిముడ్చుకొని జపానీయులు సాహసముతో యుద్ధమునందు జయింపఁజాలి రనవల

యును. సాహిత్యమునందు మానవుఁ డమోఘముగ తన్ను తాను ప్రకాశ మొనర్చుకొనుచున్నాఁడు. అతఁడు క్రమముగ తన యానందమును ఖండమునుండి యఖండమువైపునకు ప్రసారమొనర్చుచు వ్యక్త మొనర్చుకొనుచున్నాఁడు.

ఒక్క విషయమును మనము మనస్సునం దుంచుకొనవలయును. సాహిత్యము రెండువిధముల మన కానందమును సమకూర్చుచున్నది. అది సత్యమును మనోహరమైన రూపమున మనకు ప్రదర్శించును. దానిని మనకు గోచరమగున ట్లొనర్చును. సత్యమును గోచరింపఁజేయుట అతికఠినమైన కార్యము. హిమాలయశిఖర మెన్ని వేలయడుగుల యెత్తు, దాని శిరస్సుపై నెంత హిమ మున్నది, దానియం దే భాగమున నే శ్రేణికిఁ జెందిన యుద్భిదములు జన్మించును, దీని నతిసూక్ష్మముగ విచారించి చెప్పినను హిమాలయము మనకు గోచరించదు. ఎవఁడు కొన్ని మాటలలో నీ హిమాలయమును మనకు గోచరింపఁజేయగలడో వానిని మనము కవి యందుము. హిమాలయమువర కెందుకు? ఒక జలాశయమును మన మనశ్చక్షువుముందు ప్రతిభాతమగు నట్లొనర్చిచో మన కానందము కలుగును. మన మనేక కాసారములను చూచినాము. కాని, వానినే భాషలోనుండి చూచినచో నూతనముగ చూచుట యగును. మనస్సు చక్షురింద్రియముతో దేనిని చూచునో, భాష యింద్రియస్వరూపమై దానినే చూపించఁగల్గినచో దానియందు నూతనమైన యొక రస ముద్భవించును. ఇట్లు సాహిత్యము మనకు నూత్నమైన యొకానొక యింద్రియము

వలెనే జగత్తును మన కభినవస్వరూపమున ప్రదర్శించును. కేవలము నూతనమేకాదు. భాషయం దొకవైశిష్ట్య మున్నది. అది మానవుని కాత్మీయమైన వస్తువు. అం దెంతయో మన మనోనిర్మితము. అందుచే బాహ్యమునందలి యే వస్తువునైనను అది మన కత్యంత సమీపమునకుఁ దెచ్చును. దానిని విశేషరూపమున మానవుని స్వీయవస్తువుగ మార్చును. భాష చిత్రించు చిత్రములు నిజమైన వని, మన యాదరమును పొందునని కాదు. భాష తనయం దొకా నొక మానవరసమును కలుపును. అందుచే నా చిత్రము మన హృదయమునం దొకానొక యాత్మీయతను పొందును. జగత్తును భాషద్వారమున మానవుని యంతరంగమునుండి పారఁద్రోలి చూచినచో నది మన కత్యంతసమీపమునకు వచ్చిపడును.

కేవల మంతేకాదు. భాషయం దే చిత్రము మన సమ్ముఖమునకు వచ్చినిల్చునో యది సమస్తసూక్ష్మాంశములను తీసుకొని రాదు. అది కేవల మెంతలో నొకవిశేషమైన సమగ్రతను పొందునో యంతగానే వచ్చును. అందుచే దానినొక యఖండరసము నందు దర్శింతుము. అనావశ్యకమైన బాహుళ్య మేదియు నా రసమును భంగింపఁజాలదు. ఆ సంపూర్ణరసమునుండి చూచిననే, యా చిత్రము మన యంతఃకరణమునం దంత ప్రముఖముగ గోచరమగును.

రామాయణమునందలి రాముఁడు కేవలము మహాత్ముఁడు గనుకనే మన కానంద మిచ్చుటలేదు. ఆయన మనకు సుగోచరుఁడను కారణముకూడ నిందున్నది. రాము నే కొంచెము

చూచినను ఒకానొక సమగ్రమైన రసములో నాయన మనకన్ను లకు కట్టిన ట్లగుపడును. సమస్త విక్షేపములను తొలఁగించి రామా యణము కేవల మంతమాత్రము మన జ్ఞానములోనికిఁ దెచ్చినది. అందులకే యింత స్పష్టముగ నాయనను దర్శించుటయే మానవు నికి విశేషమైన యానందము. స్పష్టముగ దర్శించుటయనిన ఒకా నొక సమగ్రభావమున చూచుట, లేక యంతరాత్మను చూచుట వంటి దనవచ్చును.సాహిత్య మట్లే యొకానొక సామంజస్యసుషమ యందుసమస్తచిత్రముల నంకిత మొనర్చును గనుకనే మనము దాని యం దానందము ననుభవింతుము. ఈ సుషమయే సౌందర్యము.

సాహిత్యమునందు దర్శింపఁదగిన వేఱొక గొప్ప యంశ మున్నది. అది దానియొక్క యుపకరణవిభాగము. సాహిత్య రాజ్యమున నీ యుపకరణముల విలువ అనల్పమైనది. పలుతావులం దిందులకే రచనానైపుణ్యము సాహిత్యమునందు సమాదరము నందినది.

హృదయమునందలి భావమును వ్యక్త మొనర్చుటకుగాను మానవుఁ డెంత వ్యాకులపడునో యది యవర్ణ్యము. హృదయ ధర్మమే యట్టిది. అది స్వీయభావము నితరుల భావముగ నొన ర్పఁజాలినచో బ్రతికిపోయినట్లే. కాని యీ కార్య మత్యంతకఠి నము గనుక దానియందలి వ్యాకులతయు నత్యంతమధికమే. అందుచే నొకానొకఁ డొక విషయము నత్యంత చమత్కార మొనర్చి ప్రకాశ మొనర్చినప్పుడు మన కెంతో యానంద మొద వును. ప్రకాశమున కడ్డులేకుండుటయే మన కమూల్యమగు విష

యము. దీనియందు మన శక్తి వృద్ధిఁజెందును. ప్రకాశ మొనర్పఁ బడు విషయ మమూల్యమైనది గాకున్నను, యా ప్రకాశవ్యాపారమున నేదేని యసామాన్యత గోచరించుచో మానవునికి దాని యం దాదర మేర్పడును. లీలావశమునవైన ప్రకాశము సాహిత్యమునం దాదృతిని పొందలేదు. దానియందు మానవుఁడు కేవలము తన క్షమాబుద్ధిని వ్యక్త మొనర్చి యానందము నొసఁగునని కాదు. ఏదోయొక యుపలక్ష్యమును పురస్కరించుకొని, యొకానొక కఠినకార్యము నవలీలగ నిర్వహించుచుండుటను దర్శించినప్పుడు దానియందు మన కానంద మొదవును. ఒకఁడు తన శరీరము నతిలాఘుముగ నై పుణ్యముతో చలింపఁజేయుచుండుటను మనము దర్శించినప్పు డట్టి సామాన్యోపలక్ష్యముయొక్క గతిభంగిలోనే యా మానవుని ప్రాణవేగమును, ఉద్యమోత్సాహమును ప్రకాశమగును. అది మన యాంతరప్రాణమును చంచల మొనర్చి మనకు సుఖమును కలిగించును. సాహిత్యమునందు హృదయప్రకాశధర్మముయొక్క లక్ష్యహీనమైన నృత్యచాంచల్యము యథేష్టమైన స్థానమును పొందినది. స్వార్థ్య శాంతిహీనమైన కర్మనై పుణ్యమునందును అది తన్ను తాను ప్రకాశింపఁజేసికొనును. సాహిత్యమునం దట్లే మానవుఁడు కేవలము తన భావప్రాచుర్యమును ప్రకాశ మొనర్చుననియే కాదు. అతఁడు తన ప్రకాశకశక్తియొక్క యుత్సాహమునుమాత్రమే వ్యక్త మొనర్చి యానందించుచుండును. కారణ మేమన ప్రకాశమే యానందము. ఇందుకే యుపనిషత్తు నిర్వచించుచున్నది. 'ఆనందరూప మమృతం

యద్విభాతి' - ఏది ప్రకాశించుచున్నదో అదియే యానందము. అదియే యాయన యానందరూపము, అమృతరూపము.

సాహిత్యమునందును మానవుఁ డెన్ని విచిత్రభావముః లందు నియతముగ తన యానందరూపమును, అమృతరూపమును వ్యక్త మొనర్చుచున్నాఁడో యదియే మనకు దర్శనీయమైన విషయము.



# సాహిత్యసృష్టి

ఒక యాధారమును మధ్యగా గ్రహించి, శర్కరాఖండ ములు దానిచుట్టును ప్రోగుపడునట్లు మన మనస్సునందుకూడ నొక సూత్రము నవలంబన మొనర్చుకొనఁజాలినచో విచ్ఛిన్నము లై యున్న యనేకభావములు దానిచుట్టును జేరి యొక యాకృతి ధారణ జేయు యత్న మొనర్చును. అస్ఫుటతనుండి పరిస్ఫుటత కొఱకును, విచ్ఛిన్నతనుండి సంశ్లిష్టతకొఱకును మన మనస్సునం దొకయత్నము నిరంతరము నెలకొనియున్న ట్లనిపించును. స్వప్న మునందును చూడగలము, ఒకానొక సూచన నించుక పొంది నంతనే, నలువైపులనుండి యెన్నెన్ని భావము లాకృతిధారణ మొనర్చుచుండును! అవ్యక్తభావనాసమూహము మూర్తిలాభ మును పొందు నవకాశనిరీక్షణలో నిద్రయందును, జాగృతియం దును మనస్సునందు ఆశవలె చుట్టుకొని తిరుగుచున్నది. పగటివేళ మనకు కర్మసమయము. అప్పుడు బుద్ధియొక్క కఠోరమైన రక్షణ. అది మన కార్యాలయమునందు వ్యర్థముగా గుంపును జేర్చి యే విధముననను కర్మను నష్ట మొనర్చుట కిష్టపడదు. దాని శాసనమున మన భావనలు కేవలము కర్మసూత్రము నవలంబించి యత్యంతము సుసంగతముగ తమ్ముతాము ప్రకాశ మొనర్చుకొనితీరును. అవసర సమయమున మెదలక కూర్చుండినను, అప్పుడుసైత మా వ్యాపా రము నడచుచునే యున్నది. ఒకానొక పుష్పగంధస్పర్శ ననుభ వించినంతనే యెన్ని దినముల స్మృతి నలుదెసలందును చూచు

చుండగనే మూఁగి యెగయుచున్నది! ఒక్కమాట పైకి వచ్చి నదో లేదో వెంటనే దాని నాశ్రయించుకొని యెన్నెన్ని విధము లుగ నెన్నెన్ని మాటలు రూపధారణ మొనర్చుకొని నడచునో వానికి వివరణమే లేదు. ఇఁక నేమియులేదు. ఏదో యొకటి చేసి యేదో కావలయు నని ప్రయత్నము. భావరాజ్యమునం దీ ప్రయత్నమునకు విరామముండదు.

ఈ యేదో కావలయు నని యొనర్చు యత్నము సఫల మైన తదుపరి యొకేస్థలము నంటిపెట్టుకొని నిత్యలాభమునకై న ప్రయత్నభాగము. పనసచెట్టునకు యుక్తకాలమునం దనేకము లైన పిందెలు పడినవి. చిన్నకొమ్మల నంటిపెట్టుకొనియున్నవియు, నితాంతము దుర్బలమైన వృంతములు కలిగినవియు నైన పిందెలు తమ జీవితలీల నారంభించికూడ నవ్యక్తమునం దంతర్ధానమైనవి.

మన భావనాసమూహవిషయమునందును యిదియే వర్తిం చును. ఏది యేదో విధముగ నిల్లే యొకసూత్రమును పొందినదో, యేది స్థాయీభావమును పొందినదో దాని పరిమాణము వృద్ధిఁ జెందును. దానియందలి పొర లన్నియు యుక్తరీతిని సుసజ్జితమై నిండిపోవుచుండును, దాని పరిణామము సార్థక మగును. ఏది కేవల మించుక యాలంబనమాత్రము పొందినదో యది యత్యంతము వంకరటెంకరగ అసంయతమై యూడిపడిపోవుటలో విలంబనము జరుగదు.

కొన్ని చెట్లున్నవి. అవి నామమాత్రములుగనే విశీర్ణమై పోవును. ఫలోదయ మగువరకు బ్రతుకనే బ్రతుకవు. అట్లే

కొన్ని మనస్సులందును భావము లుదయించును, అస్తమించును. కాని యాకృతిధారణ మొనర్చుటకు ప్రాణావకాశమును పొందవు. ఐతే భావుకుని చిత్తమునందు భావములు పటిష్ఠములై నిలువఁ గల్గిన రస మున్నది, అట్టి తేజ మున్నది, అవశ్యము వానియందు పెక్కులు విశీర్ణములై పోవు ననుట యథార్థము, కాని యందు కొన్ని ఫలించనూ ఫలించును.

చెట్లునందు ఫలించు ఫలములయందు దర్బారు జరుగును. కొమ్మల నంటుకొని కూర్చుండినమాత్రమున మనకు సరిపోదు - మనము పండి, రసముతో నిండి, రంగుతో మెఱసి, సుగంధమున మత్తిలి, టెంక ముదిరి, చెట్టునుండి విడివడి బయటపడెదము. అందును సరియైన స్థానమునందు పడమేని మనకు సార్థకత లేదు. భావుకుని మనస్సునందలి భావనలు భావమై నిల్చుచో వాని యందు నిదే దర్బారు - ఏదో పుణ్యావశమున ఆకృతిగొన్నాము. ఇప్పు డీక విశ్వమానవమనోభూమియందు నవజన్మ మెత్తి చిర జీవనలీలకొఱకై బయటపడెదము. తొలుత రూప మెత్తు సుయో గము, తదుపరి ఫలించు సుయోగము, తరువాత బాహిరిలి యథార్థస్థానమును పొందు సుయోగము,- ఈ మూడు యోగము లును సిద్ధించిన వెనుక మానవుని మనోభావమునకు కృతార్థత వొడమును. భావసమూహము సజీవవస్తువువలె నా కృతార్థతను మానవుని స్మృతిపథమునకుఁ దెచ్చును. స్వీయభావముల భార మును దించుకొనుటకుఁగ నొక మనస్సు వేఱొక మనస్సు నన్వే షించుచున్నది. ఇందులకై స్త్రీలు నదీతీరములందు కూడెదరు,

మిత్రుని సమీపమునకు మిత్రుఁడేగును, లేఖలను పరస్పరము పంపుకొనుచుందురు; ఇందులకే సభాసమ్మేళనములు, తర్కవితర్కములు, వ్రాఁతకోఁతలు, వాదప్రతివాదములు - ఇంత యేల ఇందులకే దెబ్బలాటలు, అస్త్రాఘాతములలో నిఁక మిగిలిపోవున దేదియుఁ లేదు. మానవుని మనస్సునందలి భావసమూహముఁ సఫలత నొందుటకై లోపల లోపల మానవుని కెంత జాగృతి నొసఁగు ననిన, నతని నొంటరిగ నుండనీయదు. దీని తాడనము ననే పృథ్వి నాక్రమించుకొని మానవుఁడు సశబ్దముగ నిశ్శబ్దముగ నెన్ని ప్రగల్భములు పలుకుచున్నాఁడో వాని కంతమే లేదు. ఆ ప్రగల్భము లన్నియు వార్తాపత్రికలలో, కథలలో, గాథలలో, లేఖలలో, మూర్తులలో, చిత్రములలో, గద్యములో, పద్యములో పనులలో, పాటలలో, నెంత విచిత్రమైన రీతులలో నెన్ని యనా కృతులలో, ఎన్ని యెన్ని సుసంగతాసంగతోద్యోగములలో మానవప్రపంచమునందు ప్రోవులై మొరసికొనిపోవుచున్నవో మనోదృష్టిని వీక్షించుచో నిశ్చేష్టులము కావలసివచ్చును.

ఒక మనస్సునందలి భావమును వేఱొక మనస్సునందు సార్థకత యొనర్చుటకు చేయు నీ యత్నము మానవసమాజము నంటిపెట్టుకొని వచ్చుచున్నది. ఈ ప్రయత్నమువశమున మన భావములు స్వాభావికముగ కేవలము భావుకుని కొఱకుని కే స్వత్వములు కావనియు గ్రహింపఁదగియున్నది. ఇవి యన్నియు తరచు మన కపరిజ్ఞాతముగనే ఘటించుచుండును. మన మొక మిత్రునితో సంభాషించుచుండునప్పు డా మాట. లా మిత్రుని

ఘూకృతియందు కొంచెమో గొప్పయో తమ్ముతాము నిర్మించు కొను నను విషయము విచారించిచూచిన నెల్లరు నంగీకరింతు రను కొందును. మన మొక మిత్రుని కే పద్ధతిలో లేఖను వ్రాయు దుమో సరిగ నదే పద్ధతిలో వేఱొక మిత్రునికి వ్రాయఁజాలము. అధికమైన మైత్రిగల మిత్రునియం దధికముగ సంపూర్ణ ప్రయో జనమును పొందుటకుచేయు గూఢక్రియలో విశేషముగ మన మనఃప్రకృతితో కొంతపరిమాణములో మనభావము పరస్పరతను గుర్తించును. వస్తుతః మన సంభాషణ శ్రోతను, వక్తను, యిరువు రను పురస్కరించుకొనియే నడచుచుండును.

అందువలన రచయిత సాహిత్యరచన నెవని సమక్షమున నిల్పుచున్నాఁడో మనస్సునం దజ్ఞాతసారముగగూడ నతని ప్రకృతితో తన రచనను మేళగించి తీసికొనును. దాసురాయని పాంచాలి, దాశరథి పాంచాలితో పూర్తిగ సరిపోలదు. ఏసమాజ మా పాంచాలి నాకర్ణించుచున్నదో ఆ సమాజమును దృష్టియం దిడుకొని యది నిర్వహింపఁబడినది. అందువలన నా పాంచాలి యందు దాశరథియొక్కని మనోవిషయమును మనము పొందఁ జాలము. దీనియందు ఒకానొక విశేషకాలమునందలి విశేషజన మండలి యనురాగ విరాగములు, శ్రద్ధావిశ్వాసములు, అభి రుచులు తమంతతామై ప్రకాశము నందును.

ఈ రీతిగ రచయితలు కొందఱు మిత్రులకును, కొందఱు తమ సమాజమునకును, కొందఱు సర్వకాలసంబంధులైన మాన వులకును తమ రచనలను వినిపింపఁగోరెరి. వారంద ఱు స్లే కొం

చెమో గొప్పయో అందు కృతకృత్యులైరి. సాహిత్యము కేవలము రచయితకు చెందినదిమాత్రమే కాదు. ఎవరికొఱకది రచియింపఁబడినదో వారి పరిచయమునుకూడ పొందును.

భౌతికజగత్తునందు తగినవస్తువును తగినచోట తీర్చిదిద్దినచో నలుదెసల నానుకూల్య మేర్పడి, యది స్థాయిత్వమును జెందును. సాహిత్యమునందుకూడ నిట్లే. స్థాయిత్వముగల వస్తువెన్నడును స్వీయపరిచయమునుమాత్రమే యీయదు. అది తన పరిసరముల పరిచయమునుగూడ నిచ్చును. కారణమేమన నదిస్వీయ గుణముచేతనేగాక పరిసరముల ప్రభావముచేఁగూడ భాసిల్లును.

ఎన్ని నూత్న వర్షామేఘములు, బలాకాశ్రేణులు, తప్త ధరణిపై వారిసేచనముయొక్క సుగంధములు, ఎన్ని పర్వతారణ్యములపైనుండి, గిరినిర్ఝరములపైనుండి, నగరములపైనుండి, గ్రామసీమలపైనుండి గమ్భీరమైన యాషాఢ మేఘపుంజముల స్నిగ్ధసంచారము - కవి మనస్సునం దెంతకాలమునుండి, ఎన్ని భావచ్ఛాయలు, సౌందర్యపు పులకలు, వేదనయొక్క యాభాసములు వదలి చనినవి! ఎవ్వరు వీనిని మనస్సునందు నిలుపక పోవచ్చును. జగత్తు రాత్రిందివములు మన మనస్సును స్పృశించి చనును. ఆ స్పర్శయందు మనోజంత్రముపై కొంచెమో గొప్పయో ధ్వని స్పందన జరుగుచునే యున్నది.

ఒకదినమున కాళిదాసుని మనస్సునం దదియే జరిగినది. బహుకాలమునందలి బహుతరమైన ధ్వను లొకసూత్రము నవలంబన మొనర్చుకొన్నంతమాత్రమున నొకటిపై నొకటిగ మూఁగి

సుస్పష్టమై యెగసి యెంత సుందరమైన సస్యమును ఫలింపఁజేసి నవి! అనేకకాలములందలి యనేకభావచిత్రములు కాళిదాసు మనస్సునం దీ శుభముహూర్తముకొఱకై ప్రత్యాశించి సంచరించినవో, నే డవి స్తబకస్తబకములుగ ఘనీభవించి మించినవి. నే డవి యొకదానితో నొకటి, సమస్తముతో ప్రతియొక్కటి సంధానితమై రక్షింపఁబడినవి.

సతీ లక్ష్మి యనిన హిందువుల మనోవీథులం దే యున్నతమైన భావనజాగరితమై విలసిల్లునో యది యెల్ల రెఱిఁగిన విషయమే. ఒకానొక స్త్రీని దర్శించినప్పుడు, మన మనస్సునందు మూర్తీభవించిన సతీత్వము గోచరించును. గృహస్థుల యిండ్లయందు, దైనికవ్యాపారములందు ఆ కల్యాణమయియైన దివ్యమూర్తిని మన మనుక్షణము దర్శింపఁజాలుదుము. ఆ దర్శనసంబంధమైన స్మృతి యిఁక మన మనస్సులందు స్పష్టముగ భాసించుచుండును.

కాళిదాసుని కుమారసంభవమునందు, పతివ్రతాసంబంధముగ నే భావములు సర్వత్ర వ్యాప్తములై యున్నవో యవి యన్నియు నొక్కమూర్తిగ దృఢమై స్థిరపడినవి. ఇంటింటను నిష్ఠావతులైన స్త్రీలయొక్క యే సమస్తమైన కఠోర తపస్సు గృహకార్యావరణమునుండి యాభాసముగ కన్నులఁబడునో యదియే మందాకినీధారాధౌతదేవదారువనచ్ఛాయలయందు హిమాచలశిలాతలమునందు, భవానీదేవియొక్క తపస్యాచిత్రమునందు శాశ్వతౌజ్జ్వల్యమును వెలయించినది.

విద్యాపతి గీతికావ్యమునందు రచించినాడు—
'భరా బాదర మాహాభాదర
శూన్యమందిర మోర్.'

మనస్సునం దెన్ని యోదినముల యవ్యక్త భావముల సమష్టి నాశ్రయించుకొనియే యిదియు వికసించినది. సజలమేఘముల యందు భాద్రపదమాసమున శూన్యగృహమునందలి వేదన యెం దఱు మానవుల మనస్సులందు నిర్వాక్కుగ నెంతకాలము సంచ రించి సంచరించి వెనుదిరిగినది! తగిన ఛందమునందు తగినభాషా సౌందర్యము బయలువెడలినవెంటనే యెల్లరసంబంధమైన చిర కాలమునాటి వేదన మూర్తీభవించి స్థిరత్వమును దాల్చినది.

బాష్పము వాయువునందు తేలుచు సంచరించుచున్నది. కాని పుష్పదళముయొక్క శీతలస్పర్శను పొందినంతమాత్రమున ప్రోఁగై శిశిరమై కనుపట్టును. ఆకాశమునందు బాష్పము [ఆశిరె] తేలిపోయినది, కనఁబడుట లేదు. పర్వతదేహముపై వచ్చి తాకి నంతనే మేఘము ప్రోఁగువడి, వర్షావేగమున నదీనిర్ఝరములను ప్రవహింపఁజేసెను. అట్లే గీతి కవితయందలి యొకే యొక భావము ప్రోఁగువడి ముత్యమువలె చెదరి చెదరి పోవును. గొప్పగొప్ప కావ్యములందు భావసంచయము జలప్రపాతమువలె దుముకుచు పడిపోవుచుండును. కాని విషయ మేమన బాష్పమువలె నవ్యక్త మైన భావములు కవికల్పనయం దెట్టి స్పర్శ ననుభవించు ననిన చూచు చుండగనే దానిని పరివేష్టించి విచిత్రమైన సుందరమూర్తిని రచించుచు ప్రత్యక్షమై గోచరించును.

వర్ష ఋతువువలె మానవసమాజమునం దొక్కొక్క సమయమున వాయువునందు భావబాష్పము ప్రచురరూపమున విచరణ మొనర్చుచుండును. చైతన్యుని యనంతరము వంగదేశమున నట్టి స్థితి యొదవినది. అప్పుడు సమస్తాకాశమును ప్రేమరసమున నార్ద్రమైపోయెను. అందుచేతనే దేశమునం దెచ్చట నెంతమంది కవు లుండిరో వారందఱును రసబాష్పమును ఘనీభవింపజేసి, యెంత యపూర్వమైన భాషను నూత్నఛందమున నెంత ప్రచురముగనో దిశదిశయందును వర్షణమొనర్చి యుండిరి.

ఫ్రెంచి విప్లవసమయమునందును నిట్లే మానవప్రేమసంబంధమైన భావతరంగములు మిన్నుల కెగసినవి. సర్వకవుల మనస్సులయం దదియే యాఘాతమై యొక్కచో కరుణగ, వేఱొకచో విద్రోహస్వరముగ తన్ను దాను నానామూర్తులయం దజస్రభావమున ప్రకాశ మొనర్చుకొనియుండెను. విషయ మేమన, మానవమనస్సు సకలమైన యవ్యక్తభావనలను నిరంతరము నుచ్ఛ్వసిత మొనర్చి యొసఁగుచున్నది. అది యనవరతము క్షణికవేదనలో, క్షణికభావనలో, క్షణికమైన మాటలో విశ్వమానవుని సువిశాలహృదయాకాశము నాచ్ఛన్న మొనర్చి చుట్టుకొని తిరుగుచున్నది. ఒక్కొక్క కవి కల్పన యొక్కొక్క యాకర్షణకు కేంద్రమై వారియం దొక్కొక్క సమూహమును కల్పనాసూత్రమున నొక్కటిగ నొనర్చి మానవుని సమ్ముఖమున సుస్పష్ట మొనర్చును. దానియందే మన కానంద మొదవును. ఆనంద మేల జనించుచున్నది ? స్వస్వరూపదర్శనమునకై న యనేకయత్న

ములు సమస్తమానవసమాజములందును పనిచేయుచున్నవి. ఇందుకే యెచ్చట నొక సమైక్యమునందు స్వీయమైన వికాసమును దర్శించునో, అచ్చటనే దాని యీ నియతమైన యత్నము సార్థకమై యతని కానందము నొడఁగూర్చుచుండును. కేవల మిట్టిది సాహిత్యమునందే కాదు, దర్శనేతిహాసములందు నిట్లే. దర్శనశాస్త్రమునందలి సమస్తమైన ప్రశ్నలును, సమస్తయోజనలును, అవ్యక్తభావమున సర్వమానవుల మనస్సులందును వ్యాప్తములై యున్నవి. దార్శనికుని ప్రతిభ వానిలో నేదో యొక సమూహమున కేదే నొక సమన్వయము నొసఁగినంత మాత్రమున దాని కొక రూప మేర్పడి యొక మీమాంస మనకు వ్యక్తమైపోవును. మనము స్వీయమానసమునందలి యోజనయందొకానొక మూర్తిని దర్శింతుము. ఇతిహాసము లోకులయందాముఖమున నా ముఖమున జనశ్రుతిరూపమున వ్యాపించియుండును. ఐతిహాసికుని ప్రతిభ వాని నొక సూత్రమున నలుదెసల బంధించివేసినమాత్రమున నింతకాలము నవ్యక్తముగ నిలిచిపోయిన యితిహాసముయొక్క వ్యక్తమూర్తి మనకు ప్రత్యక్షమై పట్టువడును.

కవి కల్పనయందు మానవహృదయము ఘనీభూతమై తన యనంతవైచిత్ర్యము నపురూపముగ ప్రకాశింపఁజేయును. ఈ వికసితసౌందర్యమును సాహిత్యసమాలోచకుఁడు విశేషించి దర్శింపవలసియుండును. కాళిదాసుని యుపమ సర్వశ్రేష్ఠము, లేక భాష సరసమైనది, లేక యభిజ్ఞానశాకుంతలమునందు చతుర్థాంక

మున కరుణరసము ప్రచురముగ నున్నది, అను నిట్టి యాలోచ
నమే యభీష్టము కాదు. కాని ఆయన సమస్తకావ్యములందును
మానవహృదయమునందలి యొకానొక విశేషరూపము స్థగితమై
యున్నది. ఆయన కల్పన యొక విశేషమైన కేంద్రస్వరూప
మగుచు నాకర్షణవికర్షణ గ్రహణవర్జనముల నియమానుసారము
మానవుని మనోజగత్తునందలి యవ్యక్తము నొక విశేషసౌందర్య
మున వ్యక్త మొనర్చును. ఇదియే సమాలోచకుఁడు విచారించ
వలసినది. కాళిదాసు జగత్తునందు జన్మించి, చూచినాఁడు,
భావించినాఁడు, సహించినాఁడు, కల్పనను గావించినాఁడు. ఆయన
యీ భావనామయ వేదనామయ కల్పనామయ జీవితము మాన
వుని యనంతరూపములం దొక విశేషరూపమునే తన వాణిలో
మనకు వ్యక్త మొనర్చినాఁడు. మనలో ప్రతి యొక్కరము నొక
మహాకవియై యుందుమేని మన మన హృదయముల నెట్లు వ్యక్త
మొనర్చి మూర్తిమంతముగ నిల్పుకొనఁగల్గెడివారమో! మన
యం దొక యపూర్వత కనఁబడెడిది. ఇట్టి యపూర్వమై చిత్రియే
యనంతమును ఎకైకముగ ప్రకాశింపఁజేసెడిది. కాని మనయం
దట్టి ప్రతిభ లేదు. మనము విరిచి విరిచి మాట్లాడుదుము. మనము
మనలనే సరిగ నెఱుఁగము. ఏది సత్యమని మనము ప్రచార
మొనర్తుమో యది యసలు మన ప్రకృతిగతసత్యమే కాదేమో!
అది పలువురి మనస్సుల కభ్యస్తమైన యావృత్తియే నేమో!
నేను నా సమస్తజీవితమునుండి యేమి దర్శించినాను, ఏమి తెలిసి
కొన్నాను, ఏమి పొందినాను? దానిని సమగ్రముగ సుస్పష్టముగ

ప్రదర్శించనే చాలును. కవులైనను చూపఁగల రనుటకూడ చెల్ల
నిది. వారి వాణియు సంపూర్ణముగ స్పష్టము కాదు, సుందరము
కాదు. వారి యత్నము వారి ప్రకృతియందలి గూఢాభిప్రాయ
ముల నన్నింటిని సర్వవేళలందును సార్థక మొనర్పదు. కాని వారి
కగోచరముగ వారి యత్నమున కతీతప్రదేశమునం దుండి విశ్వ
వ్యాప్తమైన యొక నిగూఢచేష్టయొక్క ప్రేరణచే సమస్తమైన
యాటంకముల అస్పష్టతలలోనుండి యొకానొక మానసరూప
మును 'పట్టుకొందును, పట్టుకొందును' అని భావింతుము. పట్టు
కొనఁబోవుచో నీక నది యందదు. ఒకప్పు డల్పముగ ఒకప్పు
డధికముగ నది ప్రకాశ మగుచుండును. ఏ గూఢదర్శియైన భావు
కుఁడు కవి కావ్యమునందుండి యీ సమగ్రరూపమును దర్శించునో
యతఁడే యథార్థమైన సాహిత్యవిమర్శకుఁడు.

ఇట్లనుటయందు నా తాత్పర్య మేమన, మన భావసృష్టి
యొక నిరర్థకమైన కల్పనావ్యాపారము కాదు, యిది వస్తుసృష్టి
వలెనే యొక యమోఘనియమాధీనమైన విషయమని తెలియఁ
జేయుట. స్వీయప్రకాశమునందలి యాకాంక్ష బహిర్జగత్తునందు
సమస్తాణుపరమాణువులయందును తిలకించుచున్నాము. ఆ యొకే
యావేగము మన మనోవృత్తియం దప్రతిహతముగ పనిచేయు
చున్నది. అందువలన నే నేత్రములతో మనము పర్వతకాననదీ
నదమరుత్సముద్రములను చూచెదమో సాహిత్యమునుగూడ నవి
యే నేత్రములతో చూడవలయును. ఇది నీదియు నాదియు
కాదు. ఇది నిఖిలసృష్టియందలి యొకానొక యంశము.

ఈ దర్శనమునందు సాహిత్యమునందలి మంచిచెడ్డలను మాత్రము విచారించి తృప్తిఁజెంది యూరకుండ లేము. దీనితో పాటు దానియందలి యొకానొక వికాసప్రణాళికను, కార్య కారణసంబంధమును దర్శించుటకై న మనఃప్రవృత్తి జనించును. నా యీ మాట నొక దృష్టాంతముచే స్పష్టీకరింపయత్నింతును.

గ్రామ్యసాహిత్య మను పేరు గల నా వ్యాసమునందు వివరించియున్నాను. దేశమునందలి సర్వసామాన్యజనులలో ప్రథ మమున కొన్ని భావములు చిన్న చిన్న కావ్యరూపములు దాల్చి సమూహసమూహముగ తిరుగుచుండును. ఒకానొక మహాకవి యా క్షుద్రకావ్యముల నొక పెద్ద కావ్యసూత్రమున నేక మొనర్చి యొక పెద్ద సమష్టిని తయారుచేయును. ఏ పురాణమునందును కానరాని శివపార్వతుల గాథ, రామాయణమున మూలము నందు లేని సీతారాములను గూర్చిన యెన్నో గాథలు, గ్రామ ములయందలి గాయకుల ముఖమునను కథకుల ముఖమునను పల్లెలయందలి యంగణములందు భ్రష్టమైన ఛందములలో గ్రామ్యభాషావాహనమునం దెంత కాలమునుండి యూతేగుచు వచ్చుచున్నవి!

ఈ స్థితిలో నే రాజాస్థానమునందలి కవియో కుటీరప్రాం గణమునందుఁ గాక, ఏదే నొక విశిష్టమైన సభయందు గాన మొనర్చుట కాహూతుఁడై నప్పుడు, ఆ గ్రామ్యకథల నాహరించి యూర్జితమైన ఛందమునందు, గంభీరమైన భాషలో, గొప్పగ చిత్రించి నిలిపినాఁడు. పురాతనమును నూతన మొనర్చి, విచ్ఛి

స్నము నేక మొనర్చి చూపిననే సమస్త దేశము తన హృదయము నందు స్పష్టముగను ప్రశస్తముగను దర్శించి యానందోపలబ్ధి నొందును. ఈ కృషియందు కవి స్వీయజీవితపథమునందు మఱి యొక పర్వము నధిగమించి పోవును. ముకుందరాయని చండియు, ఘనరాముని ధర్మమంగళమును నీ శ్రేణికిఁ జెందిన కావ్యములు. అది వంగదేశమునందలి యల్పాల్పమైన పల్లిసాహిత్యమును బృహ త్సాహిత్యమునందు లగింపఁజేయు కృషి, ప్రయాసము. ఇట్లు గావించి యొక్క గొప్ప తావునందు తన ప్రాణవస్తువును మేళ గించి పల్లీసాహిత్యఫలమును పట్టుకొనఁ గల్గినను పుష్పమునందలి ఱేకులవలె నది రాలి పడిపోవును.

పంచతంత్రము, కథాసరిత్సాగరము, అరేబియన్ నైట్స్, ఆర్థర్ కథలు, స్కాండినేవియా యందలి సాగా సాహిత్యము,- ఇట్లే జనించినవి. వానియందు లోకుల ముఖవిక్షిప్తములైన కథల నొక్కచో బృహదాకారమున బంధించు యత్న మొనర్పఁ బడినది.

ఈ రూపముగ వ్యాప్తిఁగాంచిన భావము లేకమైపోవు యత్నము మానవసాహిత్యమునందు కొన్ని తావులం దత్యంతా శ్చర్యకరమైన వికాసమును పొందినది. భారతదేశమున రామా యణమహాభారతములు, గ్రీసుదేశమున హోమర్ మహాకవి కావ్యములు నిట్టివి.

ఇలియడ్, ఒడిస్సీ లయందు నానారూపములైన ఖండ గాథలు క్రమక్రమముగ ఒకే బృహత్కథగా పెనవేసుకొనిపోయి

నవి. ఇట్టి దించుమించు సర్వత్ర జరుగుచునే వచ్చినది. లిఖితగ్రం థములు గాని ముద్రితగ్రంథములు గాని వ్యవహారమునందు లేని కాలమునందు గాయకులు, చారణులు కావ్యగానమును వినిపిం చుచు తిరిగెడువారు. ఆ కాలమున నొకే కావ్య మనేకసందర్భ ముల, అనేకుల హస్తములం దనేకరూపములు ధరించి వెలుఁ గొందుచుండెడిది. ఇం దాశ్చర్యపడవలసిన దేమియు లేదు. కాని యే బిగింపులో నీ కావ్యములు నిల్చియుండుటకు స్థానమును పొందినవో, అది యొక మహాకవియొక్క రచన యనుట నిస్సం శయము. కారణ మేమన ఈ బిగింపు ననుసరించి నూత్నవినూత్న ముగ ననుసంధింపఁబడినవి యైక్యతాక్షేత్రమునుండి భ్రష్టములు కాలేదు.

మిథిలయందలి విద్యాపతి గాన మే రీతిని వంగపదావళిగా పరివర్తన చెందెనో చూచినయెడల తెలియఁగలదు. వంగదేశము నందు ప్రచలితమైన విద్యాపతి పదావళి విద్యాపతిసంబంధమైన దని చెప్పుట పొసఁగనిది. విద్యాపతిసంబంధమైన దేమియు నించు మించు చాతని యధికాంశపదములందు లేనేలేదు. క్రమముగ వంగ గాయకులు శ్రోతలును జేరి దానియందలి భాషను, అర్థమును, రసమును సైతము పరివర్తన మొనరించి, దాని నొక క్రొత్తవస్తు వుగ చొనరించి నిలిపినారు.

గ్రియర్సన్ ప్రకటించిన విద్యాపతి పదావళితో వంగ పదావళిని పోల్చి చూచిన నే రెండుమూడు పదములో దానితో సరిపోలును. ఎక్కుపభాగమునకు మూలముతో సంబంధమే లే

దనవచ్చును. ఐనను అనేకకాలములం దనేకులద్వారా పరివర్తితము లయ్యు నా పదము లసంబద్ధప్రలాపములై పోలేదు. ఒకానొక మూలస్వరము వానియందు నిలిచిపోయి, సమస్తపరివర్తనలను తనదిగ నొనర్చుకొని గ్రహించుటకై నిరంతరము జాగరితమై కూర్చున్నది. ఆ స్వరముయొక్క శక్తిచేతనే యీ పదములను విద్యాపతిపదావళి యనఁగలుగు చున్నాము. కాని యాదినుండి యంత్యమువరకు పరివర్తనఁ జెందియుండుటవలన వీనిని వంగ సాహిత్య మనుటకు వెనుదీయవలసిన కారణము కనుపించదు.

దీనినుండి తెలియవచ్చున దేమన ప్రథమమున నానాముఖములనుండి, ప్రచలితములైన ఖండగానము లొక కావ్యమునందు నిబద్ధములై ఆ కావ్యము తిరిగి బహుకాలమునుండి సర్వసామాన్యుల సమక్షమున గాన మొనర్పఁబడుచుండు నప్పుడు, దానిపై తిరిగి నానాదిశలనుండి నానాకాలముల హస్తక్షేప మగును. ఆ కావ్యము దేశమునందలి మూలమూలలనుండి దాని పుష్టి నది సంగ్రహణ మొనర్చుకొనును. ఇట్లది క్రమశః సమస్తదేశమునకుఁ జెందిన వస్తువై యొప్పును. దానియం దిఁక సమస్తదేశమునకు సంబంధించిన యంతఃకరణముయొక్క యితిహాసము, తత్త్వజ్ఞానము, ధర్మబోధము, కర్మనీతి, తనంత తానై వచ్చి మిళితమగును. ప్రారంభమునందు దీనికి పునాదిని వేసిన మహాకవియందలి యాశ్చర్యకరమైన క్షమతాబలముననే యిది సంభవము కాఁగలదు. ఆయన యిట్టి స్థలమున నిట్టి రీతిగా తొలుత విస్తరింపఁజేసినాఁడు. ఆయన పంథా ప్రశస్తమైనది. ఎంతోకాలముగ

సమస్త దేశమును తన స్వకార్యమునందు పరిశ్రమించునట్లు చేసిన దా శక్తి. బహుకాలాగతమగుటచే అనేకుల హస్తములు దీని మీద పడినను దీనియం దెచ్చటను వికృతి యొదవనే లే దని చెప్పఁ జాలను. కాని మూలఘటనమునందలి మాహాత్మ్యమునం దది యంతయు పరాభూతమై నిలిచిపోయినది.

మన రామాయణమహాభారతములు, అందును విశేషించి మహాభారత మిందులకు దృష్టాంతస్థానము.

ఈ రీతిగ, కాలక్రమమున నొక సమగ్రజాతి యే కావ్యమును, ఒకానొక కవియొక్క కవిత్వపు పునాది నాశ్రయించుకొని ఆవిష్కరించినదో దానినే యథార్థమైన మహాకావ్య మన వచ్చును.

దానిని నేను గంగ, బ్రహ్మపుత్ర మొదలైన నదులతో పోల్చెదను. ప్రథమమున పర్వతములయందలి నిభృతగుహాలనుండి నానాప్రవాహము లొక్కచో సమావేశమై గొప్ప నదిగా పరిణమించును. తదుపరి అది మార్గమునందు ప్రవహించిపోవు నప్పుడు నానా దేశములనుండి యనేకములైన యుపనదులు దానియందుఁ జేరి లీనమైపోవును.

కాని భారతవర్షమునందలి గంగానది, ఈజిప్టునందలి నైలునది, చైనాయందలి యాంగ్ సికియాంగ్ వంటి మహానదులు జగత్తునందు చాల తక్కువగనే యున్నవి. ఈ నదులు మాతృమూర్తులవలె ఒక గొప్ప దేశమునందలి దొక ప్రాంతమునుండి వేఱొక ప్రాంతమును పాలించుచు నరుగుచున్నవి. వీనియం

వొక్కొక్కటి యొక్కొక్క ప్రాచీనసభ్యతకు స్తన్యదాయిని యైన ధాత్రివంటిది.

మహాకావ్యములుసైత మట్లే మనకు తెలిసినంతలో నాలు గున్నవి. అవి, రామాయణము, మహాభారతము, ఇలియడ్, ఒడిస్సీ. అలంకారశాస్త్రముయొక్క కృత్రిమనియమముల బలముననే భారవి, మాఘము; మిల్టన్‌యొక్క పారడైజ్ లాస్ట్; భట్లేయార్ యొక్క హారియాడ్ లను మహాకావ్యముల శ్రేణిలో బలపూర్వకముగ కూర్చుండఁబెట్టుచుందురు. ఇఁక ఈ నాటి ముద్రణయంత్రాధికారమున మహాకావ్య ముద్భవించు సంభావన కూడ లుప్తమైపోయినది.

రామాయణము విరచితము కాకపూర్వమే రామచరిత్ర సంబంధముగ ప్రచలితమైయున్న పురాణకథ లాదిమమానవుల యంతరంగములం దవ్యాహతముగ నివిష్టమై యుండెను. ఇప్పుడా గాథను వెదకి పొందఁజాలము. కాని వానియందు రామాయణమునకు పూర్వసూచన యొకటి దేశవ్యాప్తముగ నుండి యుండె ననుటలో నెట్టి సందేహమును లేదు.

మన దేశమునం దే యే వీరపురుషు లవతారములుగ గణ్యులైనారో వా రెల్లరు నిశ్చయముగ జగద్ధితములైన అనేకములగు ననామాన్యకార్యముల నొనర్చియుండిరి. రామాయణము రచింపఁబడకపూర్వమే దేశమున రామచంద్రుని సంబంధముగ నట్టి జనశ్రుతి నిస్సందేహముగనే ప్రచలితమై యుండెను. ఆయన పితృవాక్యపరిపాలనకై వనభూముల కేగియుండెను.

భార్యాపహారియైన వానిని నశింపఁజేసి ధర్మము నుద్ధరించియుం డెను. దీనియం దాయన చరిత్రయొక్క మహత్త్వము ప్రమాణ మగును. నిజమే. కాని యే యసాధారణమైన లోకహితసాధన యొనర్చి యాయన ప్రజాహృదయమును శాసించియుండెనో, రామాయణమున అది కేవలము దృశ్యాదృశ్యముగ మాత్రమే యున్నది.

ఆర్యులు భారతవర్షము నాక్రమించుకొనక పూర్వమే ద్రావిడులు ఆదిమనివాసులను జయించి యీ దేశమును స్వాధీన మొనర్చుకొని కూర్చుండిరి. వారు కేవల మసభ్యులుగ నుండి యుండ లేదు. వా రార్యులకు సహజముగ లొంగిపో లేదు. వారు ఆర్యుల యజ్ఞములకు విఘ్న మొనర్చెడువారు. వ్యవసాయమును భంగించెడువారు. కులపతులు అరణ్యమును ఛేదించి యొక్కొక్క యాశ్రమమును స్థాపించుచుండ నా యాశ్రమములందు వారు కేవల ముత్పాతములు కలుగఁజేసెడివారు.

దాక్షిణాత్యమున నీ ద్రావిడజాతీయరాజవంశ మత్యం తము పరాక్రాంతమైపోయి యొకానొక దుర్గమస్థానమున నొక సమృద్ధిశాలియైన రాజ్యమును స్థాపించుకొనెను. తత్ప్రేరితమైన దళములు, బలములు హఠాత్తుగ వనాంతరములనుండి బయటికి వచ్చి, ఆర్య ఉపనివేశములకు ప్రమాదమును ఘటిల్లఁజేయు చుండెను. రామచంద్రుఁడు వానరగణమును అనగా భారతవర్షము నందలి యాదిమనివాసులను దళబద్ధ మొనర్చి యెంతో కాలమున నైన యత్నముతో, కౌశలముతో నీ ద్రావిడప్రతాపమును నశింపఁ

జేసెను. ఈ కారణమువలననే ఆయన గౌరవగానము ఆర్యుల యందు ప్రచలితమైపోయెను. శకవంశీయుల యుపద్రవమునుండి హిందువుల నుద్ధరించి విక్రమార్కుఁడు యశస్వి యైనట్లే, అనార్యుల ప్రభావమును ఖర్వ మొనర్చి ఆర్యులను నిరుపద్రవముగ నొనర్చిన రామచంద్రుఁడును జనసామాన్యము దృష్టిలో నత్యంత ప్రియతముఁడును, పూజ్యుఁడునై విలసిల్లెను.

ఈ యుపద్రవమును దూర మొనర్చు నను నాలోచన యా కాలమున నలుదెసలందును వ్యాప్తమగుచుండెను. బాల్య వయస్సునందే శ్రీరామచంద్రుని సులక్షణములను గుర్తించిన విశ్వామిత్రుఁడు, ఆయననే యోగ్యమైన పాత్రగ స్థిరీకరించు కొనెను. కిశోరవయస్సునుండియు రామచంద్రుఁ డీ విశ్వామిత్రుని ప్రోత్సాహమునను, శిక్షణలోను, శత్రువులతో యుద్ధ మొనర్చుటలో నియుక్తుఁ డయ్యెను. ఆ సమయముననే ఆయన ఆరణ్యకుఁ డైన గుహునితో బంధుత నెఱపి, శత్రువులను జయించు ప్రణాళిక సూచనలను చేయుచుండెను.

ఆ కాలమున గోవులు ధనముగను, కృషి పవిత్రమైన కర్మరూపముగను గణింపఁబడెడివి. జనకుఁడు స్వహస్తముతో వ్యవసాయ మొనర్చెను. ఆనాటి యార్యులు నాగలి సాహాయ్యముననే భారతవర్షమునందలి క్షేత్రమును క్రమశః స్వాధీన మొనర్చుకొనిరి. ఈ నాగలిముఖమున నరణ్యములు నిరస్తములై కృషి క్షేత్రములు వ్యాప్తములైనవి. రాక్షసు లీ వ్యాప్తి కంతరాయముగ నుండిరి.

ప్రాచీనమహాపురుషులలో జనకుఁ డార్థసంపదయందు ధురంధరుఁడై యుండెను. నానాజనప్రవాదము లీ విషయమును సమర్థించును. భారతవర్షమునందు కృషికార్యములు విస్తరింపఁ జేయుటలో నాయన యెంతో యుద్యమశీలుఁడై యుండెను. ఆయన తన కొమార్తెకుఁగూడ సీత యని నామకరణ మొనర్చెను. ఏ వీరుఁడు ధనువును విఱిచి యసామాన్యమైన బలపరిచయము నిచ్చునో ఆయనకే కన్య నిచ్చెద నని శపథ మొనర్చెను. ఆ యశాంతిదినములలో నిట్టి యసామాన్యబలిష్ఠపురుషుని కొఱ కాయన యపేక్షించెను. ప్రబలశత్రువులకు విరుద్ధముగ నే వ్యక్తి నిలువఁజాలునో యాతని నెన్నుకొనుట కిది యొక యుపాయముగ నుండెను.

విశ్వామిత్రుఁడు రామచంద్రుని యనార్యపరాభవవ్రతము నందు దీక్షితు నొనర్చి, ఆయనను జనకుని పరీక్షాస్థలమునం దుప స్థితునిఁ జేసెను. అచ్చట రామచంద్రుఁడు ధనువును భంగించి, ఆయన వ్రతగ్రహణమున కధికారిగ తన పరిచయ మిచ్చెను.

తదుపరి యాయన తన సోదరుఁడైన భరతునిపై రాజ్య భారము నుంచి మహాప్రతిజ్ఞాపాలనకొఱకై యడవుల కేగెను. భరద్వాజుఁడు అగస్త్యుడు మొదలైన ఋషీశ్వరు లందఱు దుర్గ మమైన దక్షిణదేశమునందు ఆర్యనివాసవిస్తరణ మొనర్చుటలో ప్రవృత్తులై యుండిరి. వారి యుపదేశానుసారము, అనుచరుఁడైన లక్ష్మణునితో నపరిచితమైన గహనారణ్యమధ్యమున నాయన యదృశ్యుఁడై పోయెను.

అచ్చట వాలిసుగ్రీవు లను ప్రతిద్వంద్వులైన ఇరువురు సోదరులలో నొకనిని తుదముట్టించి, వేఱొకనిని తన దళమునఁ జేర్చుకొనెను. వానరులను వశపఱచుకొనెను. వారికి యుద్ధవిద్యలో శిక్షణ నొసఁగి సైన్యనిర్మాణ మొనర్చెను. ఆ సైన్యమును తీసికొని శత్రుపక్షమునందు కౌశలముతో నాత్మవిచ్ఛేదమును ఘటింపఁజేసి లంకాపట్టణమును నాశన మొనర్చెను. ఈ రాక్షసులు స్థాపత్యవిద్యయం దారితేరి యుండిరి. యుధిష్ఠిరుని యాశ్చర్యకరమైన ప్రాసాదమును నిర్మించినది మయ దానవుఁడు. అతఁ డొక మహాశిల్పియై యుండెను. మందిరనిర్మాణమునందును ద్రావిడుల కౌశలము నేటివరకు భారతవర్షమున విశిష్టతను గడించుకొన్నది. ద్రావిడులు ప్రాచీన ఐగుప్తీయులకు సజాతీయు లని కొందఱూహింతురు. అది యంత సంగతముగ తోచదు.

ఏది యెట్లైనను యీ రాక్షసులుమాత్ర మసభ్యులుగ నుండియుండ లేదనుట నిర్వివాదాంశము. మీఁదుమిక్కిలి శిల్ప విలాసమునందు వా రార్యులకంటెను శ్రేష్ఠులుగ నుండిరి. రామచంద్రుఁడు శత్రువులను వశము చేసికొనెను. వారి రాజ్యమును హరించలేదు. విభీషణుఁ డాయనకు మిత్రుఁడై రాజ్యముఁ జేయ దొడగెను. కిష్కింధను వానరుల పాలనయందే యుంచి, చిరకాలము తాను వారిని తన వశమునం దుంచుకొనెను. ఈ రీతిగ రామచంద్రుఁడు ఆర్యులతో ననార్యులకు మేళనమును ఘటించి పరస్పరము, ఆదానప్రదానముల సంబంధమును స్థాపించెను. దాని ఫలితముగనే ద్రావిడులు క్రమముగ నార్యులతో నొకే సమాజ

వర్తులై హిందూజాతిని రచించిరి. ఈ హిందూజాతియం దుభయ పక్షముల యాచారవిచారములును, పూజాపద్ధతియు కలిసిపోయి, భారతవర్షమున శక్తి స్థాపితమైనది.

క్రమక్రమముగ ఆర్యానార్యసమ్మిళనము సంపూర్ణమై నప్పుడు ధర్మమును విద్యయు నొకరి దొకరు పరస్పరము వినిమయ మొనర్చుకొనుచుండిరి. ఆ సమయమున రామచంద్రుని గాథలు ప్రతిముఖమునుండి రూపాంతరములతో భావాంతరములతో వృద్ధిఁజెందుచుండెను.

దేశప్రచలితములైన చరిత్రగాథల మహాకావ్యముగ నల్లిన మహాకవి, యీ యనార్యవశీకరణవ్యాపారమున కందు ప్రాధాన్యము నీయక మహచ్చరిత్రముయొక్క సంపూర్ణాదర్శమునే యందు సుప్రసిద్ధముగ నభివర్ణించెను. ఆయన యట్లొనర్చె ననుట కంటె, రామచంద్రుని పూజ్యస్మృతి క్రమక్రమముగ కాలాంతరములను అవస్థాంతరములను అనుసరించి సామాన్యుల కాయనపట్ల భక్తిప్రవృత్తికి హేతువయ్యె ననుట యుక్తముగ నుండును. కవి తన ప్రతిభాప్రాగల్భ్యముచే వాని నొకచో ఘనీభూత మొనర్చి సుస్పష్ట మొనర్చెను. అంతట సర్వసాధారణుల భక్తి చరితార్థ మయ్యెను. కాని ఆదికవి దాని నేస్థానమున నిల్పియుండెనో తదుపరి అది యా స్థానమునందే స్థిరముగ నిలిచియున్న దనఁజాలము.

ఆదికవి హిందూసమాజమునందలి గార్హస్థ్యధర్మమున కంతకును నిదానముగ రాముని, మూర్తీభవించిన యవతార మొనర్చి చూపియుండెను. పుత్రరూపమున, భ్రాతృరూపమున,

పతిరూపమున, మిత్రరూపమున, బ్రాహ్మణధర్మముయొక్క రక్ష కుని రూపమున, తుదకు రాజు రూపమున, వాల్మీకియొక్క రాముఁడు తన లోకపూజ్యతను సప్రమాణ మొనర్చుకొనెను. అతఁడు రావణుని చంపెను. అదియు కేవలము ధర్మపత్నీ సము ద్ధరణమునకు. తుద కా పత్నిని త్యజించివేసెను. అదియు ప్రజా రంజనముయొక్క యనురోధమున. తనసహజప్రవృత్తులను శాస్త్ర బుద్ధితో కఠినముగ శాసించికొని సమాజరక్షాదర్శమును నిరూ పించెను. స్థితిప్రధానమైన మన సభ్యతయం దడుగడుగున ప్రయో జనీయములగు త్యాగము, క్షమ, ఆత్మనిగ్రహము, శ్రీరాముని చరిత్రమునందు వికసించి, రామాయణము హిందూసమాజము యొక్క మహాకావ్యమై వెలసినది.

ఆదికవి రామాయణమును రచించుటలో రాముని చరి త్రమున ప్రకృత్యతీతమైన దెంతో మిశ్రితమైనది. ఐనను ఆయన రామాయణమును మానవుని కాదర్శయోగ్య మగునట్లు చిత్రిం చెను. కాని ప్రకృత్యతీతమున కొకచో తావిచ్చినచో దాని నిఁక నిరోధించి యుంచఁజాలము. అది క్రమముగ పెరిగిపోవును. ఈరీతిని క్రమముగ రామచంద్రుఁడు దేవతాపీఠము నలంకరించెను.

రామాయణముయొక్క మూలస్వరమునందే వేఱొక పరివర్తనము ప్రవేశించినది. కృత్తివాసరామాయణమునందు దీని పరిచయమును పొందవచ్చును. రాముని దేవుఁ డనినచో ఆయన సాధించిన యతిమానుషకార్యములయందలి దుస్సాధతకు ప్రా ముఖ్యమే మిగులదు. అందువలన శ్రీరాముని చరిత్రమును

మహత్త్వపూర్ణ మొనర్చుటలో యా కార్యముల వర్ణనయు నిఁక యభీష్టము కాదు. అప్పు డే భావముదృష్ట్యా చూచినచో దేవచరిత్రము మానవునికి ప్రీతికరమగునో, కావ్యమునం దా భావమే ప్రబలమై నిలుచును.

ఆ భావము భక్తవాత్సల్యము. కృత్తివాసుని రాముఁడు భక్తవత్సలుఁడైన రాముఁడు. అత డధములైన పాపుల నెల్లర నుద్ధరించును. ఆయన గుహాక నిషాదుని మిత్రునిగ నాలింగన మొనర్చుకొనును. అరణ్యమునందలి పశువులను, వానరములను ఆయన ప్రేమతో ధన్య మొనర్చును. భక్తుఁడైన హనుమంతుని జీవితమును భక్తితో నార్ద్ర మొనర్చి సార్థక మొనర్చెను. విభీషణుఁ డాయన భక్తుఁడు. రావణుఁడును శత్రుభావమున నాతని చేతిలో వినాశము నొంది యుద్ధరింపఁబడెను. ఈ రామాయణము నందు భక్తిలీలయే యధికముగ గోచరించును.

భారతవర్షమున నొకానొక కాలమున నిట్టి తరంగ మొకటి పై కెగసినది. ఈశ్వరునిపై నధికారము కేవలము జ్ఞానులకుమాత్రమే కాదు. ఆయనను పొందుట కెట్టి మంత్రతంత్రములును, విశేషవిధులును అగత్యములు కావు. కేవలము సరళమైన భక్తిద్వారముననే పామరులైన చండాలురుసైతము భగవానుని పొందఁజాలుదురు. ఈ విషయము హఠాత్తుగ నొకానొక నూతనావిష్కారమువలె వచ్చి భారతవర్షమునందలి జనసామాన్యముయొక్క దుస్సహమైన హీనతాభావమును విమోచన మొనర్చివేసెను. ఆ మహానందము దేశవ్యాప్తమై యెసఁగినప్పుడు

ప్రాదుర్భవించిన సాహిత్యము సామాన్యమానవులకుఁ జెందిన గౌరవపూర్ణమైన సాహిత్యము. కాలకేతువు, ధనపతి, చాంద్ సదాగర్ మొదలైన సాధారణజనులే దానికి నాయకులు. బ్రాహ్మణులు కారు, క్షత్రియులును కారు; మానవంతులును, జ్ఞానులును, సాధకులును గారు. సమాజమునందు నీచస్థానమున పడియున్నవారికి సైతము దేవుఁడు దేవుఁడే యను విషయము నీ సాహిత్యము ప్రచార మొనర్చుచుండెను. కృత్తివాసరామాయణమునందును ఈ భావమే కాననగును. భగవానుఁడు శాస్త్రజ్ఞానవిహీనులకును, అనాచారపరులైన వానరులకు సైతము మిత్రుఁడే. ఉడుతయొక్క యతిసామాన్యమైన సేవకూడ ఆయన కగ్రాహ్యము కాదు. పాపిష్ఠులగు రాక్షసులను సైతము యథోచితశాస్తిద్వారా పరాభూత మొనర్చి ఆయన యుద్ధరించును. ఈ భావములే కృత్తివాసునియందు ప్రబలములై భారతవర్షమున రామాయణకథాధారను గంగానదికి శాఖయైన భాగీరథివలె వేఱొక విశేషపథమునఁ బ్రివర్తింపఁజేసెను.

రామాయణగాథయం దత్యంతాధునికమైన ధార మేఘనాథవధయందు వ్యక్తమగుచున్నది. ఈ కావ్య మా పురాతన గాథ నవలంబించియు వాల్మీకికృత్తివాసులనుండి యొకానొక విభిన్నమైన ప్రకృతిని ధరించినది.

మనము తలఁచుగ నాంగ్లభాషాభ్యసనప్రభావితులమై రచించినది విశుద్ధముగా దంచుము. అందుకే దీనికి దేశీయసాహిత్యమునందు గణ్యత లే దనవలయును. ఏ వస్తువు స్థాయిత్వ

లాభము నందినదో, దేని కేక నెట్టి పరివర్తనమునకు సంభావ్యతయే లేదో, దానినే విశుద్ధవస్తువుగ స్వీకరించవలసియున్నచో నిక సజీవప్రకృతియం దట్టి వస్తు వెచ్చటను కానరాదు.

మానవసమాజమునందు భావముతో భావము మిళిత మగును. ఆ మేళనమునందు నూత్ననూత్నమైన వైచిత్రియొక్క సృష్టి జరుగుచుండును. భారతవర్షమునం దిట్టి సమ్మిళన మెంత ఘటించినదో, మన కెన్ని పరివర్తనములమధ్యనుండి ప్రవహించి నదో దాని కేమైన నంత మున్నదా? కొలఁదికాలముక్రిందటనే ముసల్మానులు మన దేశమున రాజసింహాసనము నధిష్ఠించి యున్న ప్పుడు వారు మన మనస్సులను స్పృశించలేదా? వారి సెమెటిక్ భావములతో హిందూభావముల కేదో సమ్మిశ్రణము పొసగ లేదా? మన శిల్పసాహిత్యములు, వేషభూషలు, రాగరాగిణులు, ధర్మకర్మలయందు ముసల్మానుల సామగ్రి కలిసిపోయినది. మనస్సు నకు మనస్సుతో నిట్టి మిళనము కాకుండ నుండఁజాలదు. అట్లే మన సంస్కృతియు వారిని ప్రభావాన్వితుల నొనర్చకపోలేదు.

యూరోపునుండి యొక భావప్రవాహము వచ్చినది. స్వభావతః అది మన మనస్సుల కాఘాత మిచ్చుచున్నది. ఇట్టి ఘాతప్రతిఘాతములవలన మన చిత్తము జాగరితమగుచు వచ్చి నది. ఈ విషయమును స్వీకరించమేని స్వీయచిత్తవృత్తి యెడల నన్యాయాపవాద మొనర్చుటవంటి దగును. ఇట్టి భావసమ్మిళన మున నొక వ్యాపార ముత్పన్న మగుచున్నది. కొలఁదికాలమైన

తెదుపరి దాని మూర్తిని స్పష్టముగ చూడనగు సమయ మాసన్న మగును.

యూరోపునుండి వచ్చిన నూతనభావసంఘాతము మన హృదయమునకు చైతన్యము నొసఁగినది. ఈ మాట యథార్థ మగునేని మనము విశుద్ధముగ నుండుటకు వేయివిధముల యత్నింతుముగాక, మన సాహిత్య మే యింతయో నూతనమూర్తిని ధరించి యీ సత్యమును ప్రకాశింపఁజేయకుండఁజాలదు. సరిగ నదే వస్తువుయొక్క పునరావృత్తి యెంతమాత్రమును కాఁజాలదు. అట్లగుచో నిఁక సాహిత్యము మిథ్య యనియు కృత్రిమమైన దనియు ననవలసి వచ్చును.

మేఘనాథవధ కావ్యమునందు కేవలము ఛందోబంధమునను, రచనాప్రణాళికయందును మాత్రము కాక దానియందలి భావరసములయం దొక యపూర్వపరివర్తనమును దర్శింపనగును. ఈ పరివర్తన మాత్మవిస్మృతి కాదు. దీనియం దొక విద్రోహమున్నది. కవి పద్యమునందలి ఛందోశ్శృంఖలములను భంగించెను. రామాయణముసంబంధముగ నెంతోకాలమునుండి మన మానసములందు ప్రతిబింబిత మగుచువచ్చిన సంశ్లిష్టభావశాసనమును స్పర్థాపూర్వకముగ భంగించివేసెను. ఈ కావ్యమున రామలక్ష్మణులకంటె నింద్రజిద్రావణులు గొప్పవారుగ చిత్రింపఁబడినారు. ఏది యెంతవఱకు మంచిదో చెడ్డదో, యా ధర్మము నతిసూక్ష్మభావమున తూచి నడచుకొనుచుండు ధర్మభీరుని యాత్మత్యాగము దైన్యము, ఆత్మనిగ్రహము, ఆధునికకవిహృదయము నాకర్షింపఁ

జాలకపోయెను. అయన స్వతఃస్ఫూర్తమైన శక్తియందలి ప్రచండ లీలయం దానందమును దర్శించినాఁడు. ఈ శక్తికి నలుదెసలను ప్రభూతైశ్వర్యము. దీని హర్మ్యశిఖరము మేఘపథము నడ్డి నిలిచి నది. దీని రథరథకాశ్వగజములతో పృథ్వి కంపించిపోయినది. ఇది స్పర్ధాద్వారమున దేవతల నభిభూత మొనర్చి ఇంద్రాగ్ని వాయువులను దాసత్వమున నియుక్త మొనర్చుకొనినది. దేని నభిలషించునో దానికొఱకు శస్త్రాస్త్రములనుసైతము మన్నిం చుట కిది సమ్మతించదు. ఇంతకాలము సమకూర్చుకొనిన యభ్ర భేదియైన యైశ్వర్యము నలుదెసలందును విఱిగి విఱిగి పడిపోయి ధూళిధూసరిత మగుచున్నది. ప్రవాసియగు రాఘవునితో యుద్ధ మునందు ప్రాణాధికప్రియులైన పుత్రపౌత్ర, ఆత్మీయస్వజను లంద ఱొక్కరొక్కరే మరణించుచున్నారు. వారి జనయిత్రులును ధిక్కార మొనర్చుచు నేడ్చుచున్నారు. ఐనను ఏ దృఢశక్తి భయంకరమైన సర్వనాశనమునం దుపవిష్టయైకూడ నే విధము నను అపజయమును స్వీకరించుట లేదో, కవి ఆ ధర్మవిద్రోహి యైన మహాదంభముయొక్క పరాభవమును సముద్రతీరమునందలి శ్మశానభూమియందు దీర్ఘనిశ్వాస మొనర్చి కావ్యోపసంహార మొనర్చెను. ఏ శక్తి యతిజాగ్రత్తతో సమస్తమును మన్నించి నడచునో దాని మనస్సునం దవజ్ఞను ప్రకటించి, యే శక్తి స్పర్ధా భరమున దేనిని మన్నించ నెంచదో పరిత్యాగకాలమున కావ్య లక్ష్మి తన యశ్రుసిక్తహారమును దాని కంఠసీమయందే ధరింపఁ జేసెను.

యూరోపీయశక్తి దాని విచిత్రప్రహరణమునను, అపూర్వైశ్వర్యమునను పార్థివమైన మహిమయొక్క శిఖరముపై నిలిచి నేఁడు మన సమ్ముఖమున నావిర్భూతమైనది. దాని విద్యుత్ఖచితవజ్రము మన నతమస్తకములపైనుండి యవిచ్ఛిన్నమైన గర్జన మొనర్చుచు వెడలిపోయినది. ఈ శక్తినిగూర్చిన స్తవగానముతో నాధునికకాలమునందలి రామాయణకథ కొకానొక నూతననిర్మితి దాని యంతరాంతరమున శ్రుతి కలుపుకొన్నది. ఇది యేమైన వ్యక్తివిశేషమైన కల్పనచే నైనదా? దేశము నాక్రమించి దీని యత్నము నడచినది. దుర్బలాభిమానవశమున దీనిని మనము స్వీకరింప మని చెప్పినను, అడుగడుగున దీనిని స్వీకరింపక తీరుటలేదు. అందుచే రామాయణగాన మొనర్పఁబోయికూడ దీని స్వరమును మన మపసరింపఁజాలకున్నాము.

రామాయణము నవలంబముగ నే నీ విషయమును చూపించుటకు యత్నించితిని. మానవసాహిత్యమునం దొకానొక భావసృష్టి జరుగుచున్నది. దాని స్థితిగతుల క్షేత్ర మతివిశాలమైనది. అది చూచుట కాకస్మికము. ఈ చైత్రమాసమున నింత ఘనమైన వృష్టి పడినది. అదియు నాకస్మిక మనియే తోఁచును. కాని సుదూరపశ్చిమమునుండి కారణపరంపరద్వారా వాహితమగుచు నొకచో విశేషముగ, వేఱొకచో నిర్విశేషముగ, ఆ వృష్టి మన క్షేత్రము నభిషిక్త మొనర్చివేసినది.

భావప్రవాహము నట్లే ప్రవహించుచు వచ్చుచున్నది. అది చిన్నవియు పెద్దవియునైన యెన్ని కారణముల మూలమున

ఖండమునుండి యఖండమునకును, అఖండమునుండి శతథాభిన్న మగుచు నెన్ని రూపాంతరములుగ ప్రసారిత మగుచున్నది! సమ్మిళితమానవుల విపులమానసము, మనస్సునందలి నిగూఢ మును, నమోఘమునునైన నియమములందు కేవలము తన్ను తాను ప్రకాశింపఁజేసికొని, అపురూపమానసస్పష్టిని సమస్తపృథ్వి యందును వ్యాపృత మొనర్చుచున్నది. దానియం దెన్ని రస ములు! ఎన్ని రూపములు! ఎంత విచిత్రగతి!

రచయితను మన మత్యంతసమీపమున ప్రత్యక్షముగ చూచినప్పుడు రచనాసంబంధముమాత్రమే మనయెడల ప్రబలమై కనుపట్టును. అప్పు డేక మనము గంగోత్రియే గంగను సృష్టించిన దని భావింతుము. ఇందువలన జగత్తునందలి కావ్యరచయిత లంద రెవరో, వారి చరిత్ర లెట్టివో తెలియదు. కావ్యము లన్నియు వాని కవియే సృష్టింపఁబడుచు వచ్చినవి. ఐనను వేని సూత్ర మవిచ్ఛిన్నమై నిల్చిపోయినదో యా కావ్యము లన్నిఁటి దృష్టాం తమునుండి నేను భావసృష్టియొక్క విపులమైన స్వభావమునై పు నకు మీ మనస్సుల నాకర్షింప యత్నించితిని.



# సాహిత్యతత్త్వము

ఉపనిషత్తు బ్రహ్మస్వరూపమును మూఁడు విధములుగ చెప్పినది - సత్యమ్, జ్ఞానమ్, అనంతమ్. చిరంతనమైన యీ మూఁడు స్వరూపముల నాశ్రయించుకొని మానవాత్మకును నిశ్చయముగ మూఁడురూపము లున్నవి. వానియం దొకటి 'నేము న్నాము' వేఱొకటి 'మేమెఱుఁగుదుము' ఇంకొకటి 'మేము వ్యక్త మొనర్తుము' అను నవి. ఆంగ్లమున దీనినే చెప్పవలె ననిన I am, I Know, I Express, అనవలసి యుండును. మానవుని కివి మూఁడు దిక్కులు. ఈ మూఁటితోనే యొక యఖండసత్యము. సత్యముయొక్క యీ మూఁడు భావములు నానాకార్యము లందును ప్రవర్తనలందును నిరతము మనల నుద్యతుల నొనర్చు చుండును. జీవించవలసి యుండును గనుక అన్నము కావలెను, వస్త్రములు కావలెను, వాసస్థానము కావలయును, స్వాస్థ్యము కావలయును. దీనిని పురస్కరించుకొనియే అతని నానావిధము లైన సంగ్రహరక్షణములును ఘటనాకార్యములును. 'నే నున్నా ను' అను సత్యమునకు సంబంధించిన యీ భావ మతనిని నానా కార్యముల నొనర్చునట్లు చేయును. దీనితోనే 'నే నెఱుఁగుదును' అన్నది కలిసియున్నది. దీనియొక్క జ్ఞప్తికూడ తక్కువది కాదు. మానవునికి తెలిసికొనుటయందలి యత్న మతివిపుల మైనది. తాను కేవలము పెరిగిపోవుచున్నాఁ డను దాని విలువ మనుష్యుని కెంతటిదో చెప్పఁజాలము. దీనితోపాటు మానవసత్యము

నందు వేఱొక దిక్కున్నది. 'నేను ప్రకాశ మొనర్తును' అను నది. 'నే నున్నాను' - అనునది బ్రహ్మముయొక్క సత్యస్వరూపమునం దంతర్గతము. 'నే నెఱుంగుదును' - అనునది బ్రహ్మముయొక్క జ్ఞానస్వరూపాంతర్గతము. 'నేను ప్రకాశ మొనర్తును' - అనునది బ్రహ్మముయొక్క యనంతస్వరూపాంతర్గతము.

నే నున్నా నను సత్యమును రక్షించుకొనుట యెట్లు మానవుని కాత్మరక్షయో, 'నే నెఱుగుదు' నను సత్యమును రక్షించుకొనుటయు నట్లే మానవుని కాత్మరక్ష. ఎందుచే నన, మానవుని స్వరూపమే జ్ఞానస్వరూపము గనుక. మానవుఁడు కేవలము తెలిసికొనును. దేనినుండి ? దేనిని భుజించుటద్వారా తనకు పుష్టి కలుగును ? ఇట్టివి కావు. అతఁడు జ్ఞానస్వరూపి యగుటచే దివారాత్రము లెడ తెగకుండ జిజ్ఞాస యొనర్పవలసి యుండును. కుజగోళములో నున్న చిహ్నము లన్నియు నేమి ? ఇట్టి జిజ్ఞాసలో తన కైనందిన జీవనయాత్రలో మిక్కిలి బాధపడవలసికూడ రావచ్చును. అందువలన మానవుఁడు జ్ఞానవిజ్ఞానములను తన జ్ఞానమయప్రకృతితో సంగత మొనర్చి తెలిసికొనుటయే సరియైన తెలిసికొనుట. తన ప్రాణమయప్రకృతితో యుక్త మొనర్చి తెలిసికొనుట సరిగా తెలిసికొనుట కానేరదు.

నే నున్నాను, నేను జీవింపవలసియున్నది, యీ విషయ సంకీర్ణ వలయమున నాబద్ధమై యున్నప్పుడు శరీరరక్షయు, వంశరక్షయు మన అహమునుమాత్రమే కేవలము పెనవేసికొని యుండును. కాని యే పరిమాణమునందు మానవుఁడు, యితరులు

జీవించుటయందే నా జీవన మున్నదని చెప్పఁజాలునో, ఏ పరిమాణమునం దతఁడు స్వీయజీవనమునం దనంతుని పరిచయము నిచ్చునో, ఆ పరిమాణమునందే అతనిలో 'నే నున్నాను' మఱియు 'ఇతరు లందఱు నున్నారు' అను నీ వ్యవధాన మంతరించును. ఈ యన్యులతోనైన నైక్యబోధముద్వారా ఏ మహాత్మ్యము ఘటించునో యదియే యాత్మైశ్వర్యము. ఆ మిళనప్రేరణముననే మానవుఁడు తన్ను తాను నానాప్రకారములుగ ప్రకాశ మొనర్చుకొనుచుండును. ఎచ్చట మానవుఁ డేకాంతుఁడో అచ్చట నతనికి ప్రకాశము లేదు. బ్రతికియుండుటయందలి నిరవధికతను అనగా 'తానుండుట యితరుల యుండుటలో'– అను నీ యనుభూతిని మానవుఁడు తనదైన వ్యక్తిగతక్షుద్రదైనికవ్యవహారమునందు ప్రచ్ఛన్నముగ నుంచుకొనఁజాలఁడు. అప్పుడా మహాజీవనము యొక్క ప్రయోజనసాధనోద్దేశమున నానావిధమైన సేవలో, త్యాగములో, నాతఁడు ప్రవృత్తుఁ డగును. ఆ మహాజీవనానందమును, ఆవేగమును అతఁడు నానాసాహిత్యములందును, స్థాపత్యమూర్తులందును, చిత్రములందును, గానములందును ప్రకాశ మొనర్చుచుండును.

కేవలము తనంతటతా నేకాంతమున బ్రతుకుట యను వ్యాపారమునందును జ్ఞానమునకు ప్రయోజన మున్నది. కాని యా జ్ఞానమునందు దీప్తి లేదు. జ్ఞానరాజ్యమున నెచ్చట యనంతుని ప్రేరణ యున్నదో యచ్చట మానవుని శిక్షణలో నెంత యుద్యోగము, ఎన్ని పాఠశాలలు, ఎన్ని విశ్వవిద్యాలయములు,

ఎన్ని వీక్షణలు, ఎన్ని పరీక్షణలు, ఎన్ని యావిష్కారములు, ఎన్ని యుద్భావనలు! అచ్చట మానవజ్ఞానము సర్వజనీనమును, సర్వకాలీనమునై మానవాత్మకు సర్వత్ర ప్రకాశాధికారమును పోషించును. ఈ యధికారముయొక్క విస్తృతమైన ప్రయత్నము విజ్ఞానమునందు, దర్శనమునందు విస్తృత మగుచుండును. కాని, ఆతని విశుద్ధమైన యానందరసము నానారచనలందును సాహిత్యమునందును, కళయందును ప్రకాశితమగును.

ఎట్లు, పశువులవలెనే మానవునికిని తాను జీవించుయుండుటకైన యిచ్ఛ ప్రబలమో, పశువులవలెనే మానవునికిని ప్రయోజనీయవిషయములందు కౌతూహలము సర్వదా జాగరితమో, అట్లే మానవునియందు పశువులలో లేని వేఱొకవిషయ మున్నది. అది క్రమాగతముగ నతనిని కేవలము ప్రాణధారణవలయమునుండి బయటికి తీసికొనిపోవును. ఇచ్చటనే ప్రకాశతత్త్వ మున్నది.

ప్రకాశ మొకానొక యైశ్వర్యవిషయము. మానవుఁ డెచ్చట దీనుఁడో యచ్చట ప్రకాశము లేదు. అచ్చట నాతఁ డేది తెచ్చునో యదియే తినును. దేనిని స్వయముగనే సంపూర్ణముగ శోషణమొనర్చి తీసికొని నిశ్శేష మొనర్పఁజాలమో దానినుండియే కదా ప్రకాశము! ఇనుము వేఁడి యెక్కు యెంతవఱకు దీప్తిమంత మగు తాపమును జెందదో యంతవఱకు దానికి ప్రకాశము లేదు. వెలుఁగు తాపమున కైశ్వర్యము. మానవుని యే సకలభావములును స్వకీయప్రయోజనమునందే భుక్తములు కాకుండునో, వేని ప్రాచుర్యమును తనయందే తాను నిలుపుకొనఁజాలఁడో, ఏది

స్వభావముగనే దీప్యమానమో, దానిద్వారానే మానవునియొక్క ప్రకాశోత్సవము.

ధనమునం దీ ప్రకాశ మెచ్చట నున్నది? ఎచ్చట అది నా స్వీయప్రయోజనమునమాత్రమే యుత్తీర్ణమైపోవునో, ఎచ్చట అది నా పేటికయందే ప్రచ్ఛన్నమైయుండునో, ఎచ్చట దాని రశ్మిచేత నా మట్టిపుట్టువునందలి మలినాంశము సంపూర్ణముగ శోషింపఁజేయబడుట లేదో, అచ్చటనే దానిలో అనంతునియొక్క యావిర్భావము. ఈ అనంతమే నానారూపముల ప్రకాశమానము. ఆ ప్రకాశముయొక్క ప్రకృతియే మన మందఱము మానవీయమై నపుడు 'ఇది నాదే' నని చెప్పఁజాలినదై యుండును. అది యెప్పు డనంతమును స్వీకరించునో అప్పుడే యది యెవరో యొక విశిష్ట వ్యక్తియొక్క భోగమునకైన మలినసంబంధమునుండి ముక్త మగును. అనంతముయొక్క ప్రసాదమునుండి వంచితమైన యా వ్యక్తిమాత్రభోగ్యమైన ధనము యొక్క బర్బరతయందు వసుంధర పీడింపఁబడును. దైన్యభారమును మించిన భారము లేదు. ధనము దైన్యమునకు వాహన మైనప్పుడు దాని చక్రతలమున నెందఱు మానవులు ధూళిధూసరితులై పోరు? ఆ దైన్యము యొక్క నామమే ప్రతాపము. అది వెలుఁగు కాదు. కేవలము దాహము - అది యెవరిదో కేవలము వారిదే. ఇందుచే దాని ననుభవింపవచ్చును, స్వీకరింప వలనుపడదు. నిఖిలముయొక్క స్వీకార మొనర్చుటనే ప్రకాశ మందురు.

ఈ ప్రతాపముయొక్క రక్తపంకిలాశుచిస్పర్శను ప్రకృతి తన శ్యామలామృత ధారచే ప్రక్షాళన మొనర్చివేయుచున్నది. పుష్పములు సృష్ట్యంతఃపురమునుండి సౌందర్యపు పళ్లెరములను మోసికొనివచ్చి ప్రతాపకలుషితపదచిహ్నసమూహమును లజ్జతో కేవలము మూసివైచుచు వెడలిపోయినవి. అవి తెలియఁజేయున దేమన 'మేము చిన్నవారము, మేము కోమలమైనవారము. కాని మేము చిరకాలమునకుఁ జెందినవారము. ఎందువలన నన సర్వులును మమ్ములను వరించి గ్రహించినారు.' ఇఁక నే యుద్యత ముష్టిబిభీషిక జాతిపై జాతి నతికి తన కోట నభ్రభేది యొనర్చి మించినదో, అది యేమియు కాదు. ఎందుచేత నన దాని నది కాక ఒరు లెవ్వరును స్వీకరించరు. మాధవీ వితానమునందలి సుందరియొక్క ఛాయయేని దానికంటె సత్యమైనది.

ఇదుగో తాజ్‌మహాల్. ఇట్టి తాజ్‌మహాల్‌కు హేతువు షాజహాన్ హృదయమునందలి ప్రేమ. అతని వేదనయొక్క యానంద మనంతమును స్పృశించెను. అతని సింహాసనము నాతఁడే మహాలునందైన నుంచనిమ్ము, అతఁడు తన తాజ్‌మహాల్‌ను తనలోనుండి ముక్త మొనర్చి యొసఁగిపోయినాఁడు. దాని కిఁక స్వపరభేదము లేదు. అది యనంతుని వేదిక. షాజహానుని ప్రతాపము దస్యువృత్తి నవలంబించినప్పు డతని దోపిడిధన మెంత ప్రభూతమైన కావచ్చును. దానితో తన పళ్లెరముయొక్క యుదరము కూడ నిండదు. అందుచే క్షుధతో నంధకారమధ్యమునఁ బ్రవేశించి లుప్తమైపోవును. ఇఁక పరిపూర్ణోపలబ్ధి యాతని చిత్తమున

నావిఖ్యాతమగు చోట నాతఁడా దైవవాణిని, స్వీయకోశాగార మున, స్వకీయమైన విపుల సామ్రాజ్యమునం దెచ్చటను పట్టి యుంచఁ జాలక పోయెను. సర్వజనులయొక్కయు నిత్యకాలము యొక్కయు హస్తములందు దానిని సమర్పించుట కాక వేఱుగతి లేకపోయెను. దీనినే ప్రకాశ మందురు. మనము సమస్తమైన మంగళానుష్ఠానములందును 'ఓం' - అను మంత్రమును గ్రహింతుము. తాజ్‌మహాల్ ఆ నిత్యోచ్చారితమైన 'ఓం' - వంటిది. సర్వేశ్వరుని యీ గ్రహణమంత్రము మూర్తిమంతమైనది. షాజహాను సింహాసనమునమునం దా మంత్రము పఠింపఁబడ లేదు. ఒక కాలమున దాని కెంతటి శక్తియైన నుండుగాక, నే డది యభావమై ఎచ్చట జారిపోయినదో! అట్లే యనేకులైన ప్రఖ్యాతనాముల యొక్క యభావసమూహము నేఁడు దంభభరమున విలుప్తమైపోయినది. వారి శతఘ్నీకాగర్జనములతో, బంధితులైనవారి శృంఖలాఝుంకృతకలరవములతో కర్ణములు బధిరములైపోయినవి. కాని వారు మాయాస్వరూపులు. వారు స్వీయమృత్యునైవేద్యములను తీసికొని కాళరాత్రి పారావారముయొక్క కాళీఘట్టమున నందఱును యాత్ర కేగినారు. కాని యీ షాజహాన్ కుమార్తె జహనారాయొక్క యొకానొక దుఃఖగానము? దానిని పురస్కరించుకొనియే నే ననినది 'ఓం' - అని.

అయిన, మనము దాన మొనర్తు మనుకొని నంతనే దానము చేయగలమా ? 'తుభ్య మహమ్ సంప్రదదే' అనినంత మాత్రముననే పరము మనకు కరతలామలక మగునా ? నిత్య

కాలమును, నిఖిలవిశ్వమును ఈ మాటనే చెప్పును. 'యదేతత్ హృదయం మమ.' దానితో నీ సంప్రదానముయొక్క మిళన ముండవలయును. నీ యనంత మేది యొసఁగునో దానినే నేను తీసికొనఁజాలుదును. ఆయన మేఘదూతను గ్రహించినాఁడు. అది యుజ్జయినియొక్క విశేషసంపత్తి కాదు. నాఁటి విక్రమాదిత్యుని కావలివారు పహరా యిచ్చి యాయన యంతఃపురము నందలి హంసపదికల మహాలునందు దానిని బంధించియుంచఁ జాలక పోయిరి. అది క్రీస్తు శతాబ్దమునకు ఐదువందల వత్సరములకు పూర్వమున రచింపఁబడినదా, పరముననా? అను విషయమున పండితులు జుట్లు జుట్లు పట్టుకొందురుగాక! దాని దేహమునందు సకలమైన తారీఖుల ముద్ర లున్నవి. అది శిప్రాతీరమున రచింపఁబడినదా, గంగాతీరముననా? అను విషయమును పండితులు తర్కించిన తర్కింతురుగాక! దాని మందాక్రాంత వృత్తములందు పూర్వవాహినీ, పశ్చిమవాహినీ, సకలనదీనదముల యొక్క కలధ్వని ముఖరిత మగుచున్నది. వేఱొక పక్షమున, అనుప్రాసచ్ఛటాస్ఫులింగవర్షణమున సభాస్తారులైన వేనవేల జనులను ముగ్ధ మొనర్చివేసిన, పాంచాలులు [వంగదేశకావ్యప్రక్రియ] ఎన్నో యున్నవి. వానియందలి విశుద్ధమైన స్వదేశీయతయందు మన మెంత యుత్తేజితుల మగుదుమో కామో యటుంచుము. ఆ పాంచాలుల సంబంధమైన దేశకాలములు సునిర్దిష్టములు; కాని సర్వదేశమును, సర్వకాలమును వానిని వర్జించుటవలన అవి కులీనులయ్యుం దనూఢయువతులవలె వ్యర్థకులగౌరవమును కదలీ

వృక్షసమీపమున సమర్పణ మొనర్చి నిస్సంతానలై వెడలి పోయినవి.

ఉపనిషత్తెచ్చట బ్రహ్మవిషయమున 'అనంతమ్'- అని చెప్పినదో, అచ్చట నాయన ప్రకాశమునుగూర్చి యేమి చెప్పినది? 'ఆనందరూప మమృతం య ద్విభాతి'- అని చెప్పినది. ఇచ్చట మనకుఁ గావలసిన యసలు విషయ మున్నది. ప్రపంచ మొక కారాగార మగుచో కావలివా ఱందఱును కలసి రాజదండముయొక్క యధికారముతో మనలను దానినుండి విచలితులను చేయఁజాలకపోయి యుందురు. మనము హరతాళ మొనర్చి కూర్చుండిపోయెడివారము. 'మా కాహారపానీయములు లే'వని చెప్పెడివారము. కాని నేను స్పష్టముగ దర్శించుచున్న దేమన కేవలము మనము దానిని కోరుటమాత్రమే లేదు.

పలుమారులు మన హృదయము ముగ్ధ మగుచున్నది. దీని కేమి యవసర ముండెను? టిటాఘుర్ నందలి జ్యూట్ మిల్లులందు కూలీలు అవిరతశ్రమ యొనర్చి చనిపోవుచున్నారు. వారికి కూలి లభించును. కాని వారి హృదయములకొఱ కెవరును తల చించుకొనుట లేదు. అందుచే యంత్రము బాగుగనే నడచుచున్నది. లక్షలాది లాభము నార్జించు మిల్లుల యజమానులు కూలీల పిండివంటలకై యొక పైసాయైన యపవ్యయ మొనర్పరు. కాని జగత్తునందు కానవచ్చుచున్న దేమన మనోరంజకవిషయములకొఱ కెంతో వెచ్చింపఁబడుచున్నది! అనగా నీ జగత్తు కేవలము బోపదేవుని ముగ్ధబోధ వంటి వ్యాకరణము

కాదు, ఇది యొక కావ్యము. అనఁగా వ్యాకరణము దాసినలె వెనుకనే యుండిపోయినది. రసలక్ష్మి ముందే నడచుచున్నది. జగత్తుయొక్క ప్రకాశమధ్యమున దండించువారి దండముమాత్రమే యున్నదా ? లేక కవియొక్క యానందముకూడ నున్నదా ?

ఈ సూర్యోదయాస్తమయములు, యాకాశమునుండి భూమిపర్యంతము గల సౌందర్యప్లావనము, వీనిలో నేదో దురధికారము, పహారా నిచ్చువారి చిహ్నములును కనబడుట లేదే! ఆకలియం దొక జులు మున్నమాట సత్యమే, కాని యది స్పష్టముగ 'లేదు' అను ముద్రగల యొక వస్తువు. క్షుధ తీర్చుకొనుట యను సఫలతయందు రసన దేనిని సరసముగ నాతురతతో నాత్మీయముగ నభ్యర్థించునో యదకూడ స్పష్టముగనే కనఁబడుచున్నది. అయిన దేనిని సమ్ముఖమున దర్శించుట, దేనిని పరోక్షమున దర్శించుట ? వ్యాకరణమునా ? లేక కావ్యమునా ? పాకశాలనా ? భోజనముకొఱకైనా నిమంత్రణమునా ? గృహయజమానియొక్క యిచ్ఛ యెచ్చట ప్రకాశ మగును ?- ఎచ్చట నిమంత్రణపత్రమును చేత నుంచుకొని తలపై ఛత్రముతో నడిచివచ్చినామో అచ్చటనా ? లేక నా కాసనము వేయఁబడిన తావుననా ? సృష్టి యనినను సర్జన మనినను నొకటే. ఆయన తన్ను తాను సంపూర్ణముగ సర్జన మొనర్చుకొనినాఁడు. వితరణ మొనర్చుకొనినాఁడు, కనుకనే మన ప్రాణములను చుట్టుకొని యున్నాఁడు- కనుకనే మన హృదయము 'ఆహా ! బ్రతికినాము'- అనును.

శుక్లపక్షమునందు సంధ్యాకాలమున నాకాశము జ్యోత్స్నామయమై యున్నది. సంఘసమావేశములో తర్క-వితర్కములు జరుగుచున్నప్పు డీ విషయమును మఱచిపోగలను, కాని తరువాత రాత్రి పదిగంటలవేళ మైదానముముందుగా నింటికి తిరిగిపోవు సమయమున వ్యగ్రమైన యాలోచనలు లేనప్పుడు మనఃప్రాంగణమున ప్రవేశించి నిలిచిన ప్రకాశమును దర్శించినప్పు డేమందును? 'ఆనందరూప మమృతం య ద్విభాతి' యందును. ఆ యే 'యత్' కలదో, ఆనందరూపమున అది ఎవరి ప్రకాశమో ఆ పదార్థ మేది? అది శక్తిపదార్థమా?

వంటయింటియందు శక్తియొక్క ప్రకాశము ప్రచ్ఛన్నముగ నున్నది. కాని భోజనపాత్రయం దది శక్తిప్రకాశమా? మొగలు సమ్రాట్ శక్తిని ప్రకాశింపఁజేయ నెంచినాఁడు. ఆ విపులమైన దారునిర్మాణమునా మనము ప్రకాశ మనునది? దాని మూర్తి యెచ్చట? ఔరంగజేబ్ యొక్క యాధునికావతారములెందఱో రక్తరేఖయందు శక్తిని ప్రకాశింపఁజేయుటకు విపుల ప్రయత్న మొనర్చియున్నారు. కాని యెవఁడు 'ఆవిః', ఎవఁడు ప్రకాశస్వరూపియో, ఆనందరూపమున నెవ్వఁడు వ్యక్త మగుచున్నాఁడో అతఁడా రక్తరేఖపై రబ్బరుతో తుడుచుట కిప్పుడే యారంభించినాఁడు. ఇఁక నతని యాలోకరశ్మి యను సమ్మార్జని వారి ప్రయత్నము లను కసవుపై నిశ్చయముగ పడుట కారంభించినది. కేవల మాయన యానందమే కద, మఱి యాయన ప్రకాశము?

ఈ ప్రకాశము నాచ్చున్న మొదర్చి ఆయన శక్తినే ఆయన సమ్ముఖమున నుంచినచో ఆయనను మన్నించుటవంటి అవమానము మన మింకేమి చేయఁగలము ? నేను జపాను వెళ్ళి నప్పుడు ఓడలో నుండగా తుపాను వచ్చినది. నేను మీఁద కూర్చుండియుంటిని. నన్ను ముంచి చంపుటకు పవనముయొక్క సామాన్యమైన యుచ్ఛ్వాసము చాలును. కాని కాలసముద్ర హృదయముపై వెఱ్ఱి తుపానుయొక్క నృత్యప్రయత్నమునందు నాలోని వెఱ్ఱిమనస్సు మాదకత నందుచుండెను. ఆ విపులమైన సమారోహముద్వారానే వెఱ్ఱివానితో వెఱ్ఱివానియొక్క పరి చయములో రహస్యాలాపము జరుగ నారంభించెను. లేనిచో మునిఁగి చనిపోయియే యుండును. అది యింతకంటె గొప్పవిష యమా ? రుద్రవీణావాదకుఁడు తన రుద్రవీణాసాగరోదకమున ఫేనిలతరంగతాండవముమధ్య నొండురెండు ఘూర్ణవాయువుల ద్రుతతాళములయొక్క తానమును వినిపింపఁజేయు చుండెను. అచ్చట చెప్పఁజాలినాను, 'నీవు స్వయముగ నావాడవు' అని.

అమృత పదమునకు రెండర్థము లున్నవి. ఒకటి మృత్యువు లేనివాఁడు, వేఱొక యర్థము పరమరసము. ఆనంద మే రూపము ధరించినదో, అదియే రస మైనది. అమృతముకూడ నదియే రసమైనచో రసవిషయమున పునరుక్తి ఘటిల్లును. కనుకనే యిచ్చట నమృతపదమున కర్థము మృత్యుహీన మనియే చెప్ప వలసియుండును. అనగా నానంద మెచ్చట రూపము ధరించెనో యచ్చటనే యది ప్రకాశమైన మృత్యువు నతిక్రమించిన దన్న

మాట. ఎల్లరకును కాలుని భయ మున్నది. కాలుని రాజత్వము నం దుండికూడ కాలునితో నెవనికి సహాయోగమో అత డెచ్చట?

ఇప్పు డింక మన విషయము. కావ్య మే ఛందమున నల్లఁబడునో, రూపదక్షుఁ డే రూపమున దానిని రచించునో, అది యానందప్రకాశ మగుచో నది మృత్యుంజయి అనవచ్చును. ఈ 'రూపదక్షుఁడు'- అనునది నేను నూతనముగ తెలిసికొనినది. ఒక ప్రాచీనలేఖనమునందు 'ఆర్టిస్ట్'- అను శబ్దమునకు ప్రతిశబ్దముగ చమత్కారముగ నీ శబ్దము లభించినది.

కావ్యమునకుఁ గాని, చిత్రమునకుఁ గాని, సమాప్తియందే సమాప్తి లేదు. మేఘదూత వినఁబడినది, చిత్రమును చూచి యింటికి తిరిగి వచ్చినాము, కాని మనస్సునం దొక యవసాదమును తీసికొనిరా లేదే! గానము సమస్థాయినిఁజెంది యాగినప్పుడు గొప్పయానందముతో తల నూపినాము. సమ అనిన ఆగుట యని యర్థము- దానియం దానంద మేల? కారణ మేమన నానందరూపము ఆగుటతో నాగదు. కాని డబ్బు పూర్తిగ నై పోయినప్పుడు, సమముగ తల నాడించి, ఆహా! బాగున్న దని చెప్పుము.

గాన మాగినది. అయినను అది శూన్యమువలె నంధకారమువలె నాగిపో లే దెందువలన? సమస్తవిశ్వవ్యాప్తముగ నున్న తత్త్వమువలెనే గానమునం దొక తత్త్వ మున్నది. అందుకే అది యా 'ఓం' ను ఆశ్రయించుకొని నిలిచిపోవును. ఈ గానమును నేను విందును, వినకపోవుదును, దానిని ప్రత్యక్షముగ నెవరైన స్వీకరింతురు. అది అమృతస్యందినియై శాశ్వతమైనది.

విశ్వసాహిత్యమాల, 72.

# కావ్యజగత్తు

రవీంద్రనాథ టాగూరు

శ్లో॥ ఇద మంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయం।
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే॥

విశ్వసాహిత్యమాల-రాజమండ్రి

ప్రథమముద్రణ 1959.

ప్రతులు వేయి.

వెల రు 2-25

మెజస్టిక్ ప్రెస్,
రాజమండ్రి.

## ఇందులో

# ప్రవేశిక

పరిణామదుఃఖఫలమైన ఈ సంసారవృక్షబహుశాఖలలో వెదకి వెదకి మనీషులు అమృతోపమములైన రెండు ఫలములను కనుగొనిరి. ఆ ఫలయుగళము మర్త్యులకు అమృతత్వమును ప్రసాదించునది. జన్మపరంపరయందువలె దినదినయాత్రయందును క్లేశావర్తనిమగ్నులై విపద్యమానులై పొడమాసి పోవుచున్న ప్రాణులకు నిరపాయమైన ఆశ్వాస మెచ్చట? తత్త్వదర్శనమున ముక్తి యందురు. తత్త్వనిరూపకములైన దర్శనములును సాధనామార్గములును ఆద్యులచేత నిర్దేశింపఁబడి యున్నవి. కావ్యమునకీ వైశిష్ట్య మెందువలన ? పై మార్గములు బహుళప్రయాససాధ్యములు. వానికి వలసిన ఆధికారికసంపత్తియు నరిది. కావ్యమునందు తత్త్వము అమృతరూపమునను, ఆర్యజనులయందు సద్రూపమునను ప్రతిష్ఠితమై యున్నది. పూర్వసాధనాపేక్షచేత కావ్యసేవయు, వృద్ధోపసేవయును సుగమములైన మార్గములు. వస్తుతః సహృదయతాసంపత్తి, వినయము అను నధికారములుకూడ సామాన్యములు కావు. అవి మహాసుకృతఫలములు. ద్రష్టృత్వసంపత్తి కల కవియొక్క శబ్దవ్యాపారము అమృతోపలబ్ధికి రమ్యమైన దర్శనము. ఈ శబ్దవ్యాపారము ఆనందవివశుఁడైన కవియొక్క సరస్వతీరూపమైన యుద్గారము, సహృదయహృదయస్పర్శియై తిరిగి ఆనందమునందే పర్యవసించుచున్నది. ఆర్యజనులయందు సత్పదార్థము నిత్యసన్నిహితమై యుండును. సత్సంగమనగా గోష్ఠిసమయములలో వారియందలి ఆ సత్పదార్థముతోడి కలయికయే. సుదీర్ఘమైన పురుషాయుషమునందు ఏ క్షణములు అట్టి కావ్యామృతానుభవముతో గళితవేద్యాంతరములై కడచుచున్నవో, ఏ క్షణములు ఇట్టి సజ్జనగోష్ఠియందు వేళానిస్సరణస్ఫురణనుగూడఁ గోల్పోవుచున్నవో అవియే అమృతక్షణములు. అట్టి క్షణముల ప్రాచుర్యమువలన మన జీవితమమృతమయ మగుచున్నది. కావ్యవిషయమున చింతనావ్యాపారమువలన సత్త్వము ఆనందరూపమున వ్యక్తమగు చున్నది. పరమపురుషార్థమైన కేవలానందమునకీ కావ్యజనితానందము సైదోడని యందురు. తత్ప్రాప్తికిదియు నొకప్రస్థానము. విశ్వశ్రేయమునందు కావ్య మిట్లు చరితార్థ మగుచున్నది.

లోకము రెండు తెఱఁగులు. ఇంద్రియసుఖార్థులు, మనస్సుఖార్థులు నని. ప్రాకృతు లింద్రియసుఖార్థులు, మనీషులు మనస్సుఖార్థులు. మొదటి సుఖము పరతంత్రమును క్షణికమును నై సుఖపదమాత్రవాచ్య మగుచున్నది. రెండవది స్వతంత్రమును నిత్యమును నై ఆనందపదవాచ్య మగుచున్నది. మొదటిది పరతంత్రమును, క్షణికము నగుటచేత దుఃఖమునందును; రెండవది స్వతంత్రమును, నిత్యము నగుటచేత ఆనందమునందును పర్యవసించుచున్నవి. ప్రాకృతులు వెలుపలి లోకమునందును, మనీషులు లోపలి లోకమునందును సంసక్తులై యుందురు. దుఃఖపర్యవసాయములైన క్షణికసుఖఫలములతో ప్రచురమై యున్నది కావున సంసారము విష వృక్షముగ రూపింపఁబడినది. అమృతార్థియైనవాఁడీ వెలుపలి లోకమునుండి లోపలి లోకమునకు మరలును. ఈ జగత్తునుండి కావ్యజగత్తునఁ బ్రవేశింప నుత్సుకుఁ డగును. కావ్యముగూడ సంసారతరువున ఫలించిన ఫలమే. కాని యిందలి విశేష మేమనగా నిది యమృతఫలము. విషవృక్షము పండిన అమృతఫలము. యమ నియమ ధ్యానధారణాదిక్లేశము లేక సులభముగా నమృతము నందిచ్చు ఫలము. ఈ ఫలరసాస్వాదనాధికారమునకు వలసిన సుకృతమును అసామాన్యము. అందఱకు ప్రసాదింపఁబడునది కాదు. ధన్యులైన కతిపయులకు మాత్రమే. వారే సహృదయులు. శబ్దార్థమాత్ర పరిజ్ఞాత లెల్లరును కావ్యానుశీలనమున కధికారులని కాని సహృదయులని కాని చెప్పుటకు వలనుపడదు. నిజమైన కవులకన్న నిజమైన సహృదయులు మిక్కిలి యరుదు. "కర్తార స్సులభా లోకే విజ్ఞాతర స్తు దుర్లభాః" అతివిచిత్రమైన కావ్య సంసారమునందు కాళిదాసాదు లిరువురు ముగ్గురు మాత్రమే కవులని పేర్కొనఁదగినవా రున్నట్లు పర్యాప్తసహృదయలక్షణులును మిక్కిలి విరళముగా నుందురు. అట్టి శ్రేణికి చెందిన సహృదయశేఖరుడని ప్రకృత కాళిదాసకావ్యానుశీలనవిషయమునందలి రవీంద్రకవీంద్రుని ఆనందఘనమైన భావుకతాలక్షణమునుపట్టి గోచరించును. సహృదయుఁ డనఁగా కవితో సమానమైన హృదయము కలవాఁడని యర్థము. కవిహృదయము నందలి ఏ నిరతిశయానందము భారతీరూపమున నిస్సృత మగుచున్నదో అది తుల్యవేదనావేదితమై సహృదయహృదయమునందు మరల నిరతిశయానందస్వరూపమున పర్యవసించుచున్నది. ఆనందనిస్సృతమైనసృష్టికి ఆనందపర్యవసానమే చరితార్థత. ఔపనిషదమైన అద్వ్యసుపర్ణమువలె

కవి కేవలము సాక్షి. ఫలరసభోక్త్తయైన ద్వితీయసుపర్ణము సహృదయుఁడు. జీవేశ్వరుల సంబంధ మెట్టిదో నాయికానాయకుల సంబంధ మెట్టిదో సహృదయుని యొక్క కవియొక్క సంబంధ మట్టిది. సహృదయుని విడిచి సరస్వతీ తత్త్వ మసంపూర్ణమును, అకృతార్థమును నగుచున్నది.

"సరస్వత్యా స్తత్త్వం. కవిసహృదయాఖ్యం విజయతే."

అట్టి సహృదయుడు కవియై కావ్యానుశీలనము చేయుట సంభవించి నపుడు వాని యనుశీలనముకూడ నవశ్యముగా కావ్యస్వరూపమును ధరించు చున్నది. ఇది కావ్యధర్మవివేచకమైన శాస్త్రచర్చ కాదు. అనుభూతిపరవశ మైన ఆనందగుంజనము. ఇది అపూర్వమైన విలక్షణమైన సన్నివేశము. ఈ ప్రక్రియలో మూలకావ్యశోభ ద్విగుణితమై పాఠకహృదయములను ముగ్ధ మొనర్చుచున్నది. ప్రశాంతసరఃప్రతిబింబితశారదజ్యోత్స్నవలె కవికుల గురువుయొక్క భావనాశోభ రవీంద్రకృతానుశీలనమునందు మనోనయ నోత్సవముగా నున్నది. నిజముగా కవికులగురువుయొక్క వాణి మంత్రమ యాహ్వానము! దేశకాలావరణములను దాటి పరస్సహస్రవర్షముల దూర మున నున్న భారతవర్షమునందలి అలనాటి ఉదయనకథాకోవిదులైన గ్రామ వృద్ధుల గోష్ఠిలో పోయి కూర్చుందుము! ఇట్టి భావోన్మత్తత లేనివారికి కావ్యమునం దధికార మెట్లు సిద్ధించును? "ఆ గ్రామవృద్ధులు నేఁ డెచ్చటికి పోయి" రని రవీంద్రుడు పర్యుత్సుకుడైనాడు. ఎవ్వరివలన నిన్ని చరిత్ర సంక్షోభముల నడుమ, నిన్ని పరిణామముల నడుమ, నీ కావ్యవ్యవస్థ నేటికి నిట్లు నిలిచియున్నదో పరస్సహస్రవర్షములనుండి వచ్చుచున్న ఆ సారస్వత సిద్ధులైన కాళిదాసకావ్యభావుక పరంపర, అవిదితనామమై నేటి కెచ్చట నిర్వాసితమైనదో యను పర్యుత్సుకత మనకు జనించును.

కవియొక్క వాణి స్వయంభువు. అది యెట్టి వేదనమునుండి నిస్సృతమో సృష్టియందలి ప్రత్యణువును అట్టి సమానవేదనముతో కదలి ఆనంద ఘనముగ పరిణమించు శాశ్వతసమలవఅకును ఆ వాణిని సహృదయు డావ ర్తించుచుండును. కవినుండి నిస్సృతమైన వేళ వాణి కేవలమైన ఆవిష్కృతి. ఆ యావిష్కృతి సహృదయహృదయముఖరితమై కావ్యత్వము నందు చున్నది. వాల్మీకియొక్క ప్రథమసరస్వతీనిష్యందము శ్రుతిగోచరమైన ముహూర్తమున భరద్వాజునియందు సహృదయధర్మము ప్రప్రథమమున

నుద్బుద్ధమై ఆ నిష్యందము నావర్తించెను. ఆశ్రమమునందలి మునిశిష్యు లందఱును పౌనఃపున్యముగ దాని నావర్తించిరి.

శ్లో॥ తస్య శిష్యా స్తత స్సర్వే జగు శ్లోక మిమం పునః ।
మహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః ॥

ముహుర్ముహుః ప్రీతియును, నిరతిశయవిస్మయమును, మననశీలురైన సహృదయుని కావ్యానుభవమునందలి విశిష్టలక్షణములు. ఈ అనువ్యాహరణమువలననే వాల్మీకియొక్క శ్లోకము శ్లోకత్వసిద్ధి నందినది. కావ్యత్వసిద్ధి నందినదని యర్థము.

సోఽనువ్యాహరణా ద్భూయ శ్లోక శ్లోకత్వ మాగతః ।

సహృదయుని వ్యాపార మిట్లు నిరంతరమును, శాశ్వతమును, కల్యాణాభిముఖమునై లోకమునందు ప్రతిష్ఠితమై యున్నది. వాల్మీకికి భరద్వాజాదులవలె కాళిదాసునకును ప్రథమసహృదయు లుండియుందురు. సరస్వతీతత్త్వమును పరిపూర్ణమును, చరితార్థము నొనర్చిన ఆ సహృదయశ్రేణి నేఁ డెచ్చటికి నిర్వాసితమైపోయినదో! వీరికి ఋణగ్రస్తుఁడైన కాళిదాసు తన మేఘసందేశమునందు పరోక్షముగ వీరి నిట్లు కీర్తించియున్నాడు.

దృష్టోత్సాహః చకితచకితం ముగ్ధసిద్ధాంగనాభిః ।

ఈ సహృదయులు దేవతలవలె పరోక్షకీర్తనప్రియులు. తమ నామములు నిలువవలె నను క్షుద్రమైన కాంక్ష వీరికి లేదు. లోకమునందు కావ్యమహిమ నుపబృంహితమును, సుప్రతిష్ఠితము నొనర్చుటయందే వీరి అస్తిత్వము చరితార్థ మగుచున్నది. వీరి నామములకై మన యాక్రోశము వ్యర్థము. వీరు నిర్మించిన కావ్యవ్యవస్థయొక్క ఫలోపభోగమునకు మనము దాయాదులము. శాశ్వతకాలమునందు వీరి సంప్రదాయ మవిచ్ఛిన్నమై కొనసాగుచుండు ననుటకు కావ్యామృతరసోన్మత్తుఁడై యిట్టి యనుశీలన మొనర్చిన రవీంద్రుఁడే ప్రబలనిదర్శనము.

పరపరిపాలనద్వారమున నొరసికొని వచ్చిన విజాతీయసంస్కారము వార్షుకనదివలె వర్తమానభారతవర్షమును ముంచివైచినది. ఈ ప్రవాహవేగమునకు చిరంతనవ్యవస్థాకూలములు నిపన్నములై భగ్నప్రాయములైనవి. ప్రేయోలక్ష్యమైన పరధర్మమునందలి వ్యామోహముచే స్వధర్మ

భ్రష్టమై ఆత్మవిస్మృతి నంది జాతి ప్రళయాభిముఖమైన యాత్రను సాగించుచున్నది. జాతికి ప్రాణధాతువులైన తత్త్వమతసారస్వతాది సర్వవిషయములు బహుసిద్ధాంతవిదూషితములై విచారమార్గమున అవ్యవస్థ యేర్పడినది. పరధర్మవ్యామోహమువలని ఆత్మవిస్మృతి, స్వధర్మభ్రంశము, అవిశ్వాసము, సంశయము, స్వప్రవృత్తివిరుద్ధలక్ష్యాభిముఖమైన యీ యాత్రను భయానక మొనర్చుచున్నవి. మన సంస్కారమునుండి మనము నిర్వాసితులమై పోయినాము. మన మేలిమిని మనము గమనించుటకు వైదేశికానుమోదము పరమప్రమాణము కావలసినంత దుస్థితికి వచ్చినాము. కవికులగురువు "ఇండియను షేక్స్పియరు" అనిపించుకొని కాని మన పరిగణనమునకు రాఁజాలఁడు. జర్మనీ కవియొక్క "సిఫారసును" పట్టి కాక అతని కావ్యముపై మన దృష్టి ప్రసరించదు. సనాతనమైన భారతవర్షసంస్కృతి నేఁడు స్వభూమిపై అశోకవనమధ్యమునందలి సీతాదేవివలె నున్నది. ఆసన్నప్రళయమైన యీ యాత్రను శ్రేయోలక్ష్యాభిముఖముగ మరలించి, యుద్ధరింపఁగల మనీషులు నేడు మనకుఁ గావలసియున్నారు. వైదేశికానుమోదమును పట్టిగాక రవీంద్రుని సంస్కారపరిణతిని, ప్రాణనాడీస్పందమును అవగాహన మొనర్చికొనఁగలిగినవారు నేటి విద్యాధికులలో నెంద ఱున్నా రన్నది ధీరమైన సంప్రశ్నము. ఆయన సంస్కారము నూటికి నూఱుపాళ్లు భారతవర్షీయ మైనది. దైవికముగా ఆయనకు లభించిన వైదేశికానుమోదము ఆయన వచనమునందు మనకు ప్రామాణ్యభావ మేర్పడుటకుఁ దోడ్పడుచున్నది. ఇదియును గొంత మేలే. ఒకరి వచనమునందలి యర్థగౌరవమును మననరూఢ మొనర్చికొని, స్వసంవేదనము నందిన పిమ్మట ఆ వచనమునందును తద్వక్తయందును సహజముగా ప్రమాణబుద్ధి యేర్పడును. ప్రామాణ్య మేర్పడిన కాని విననేరని స్థితిలో నున్నవారికి రవీంద్రుని విశ్వవిఖ్యాతి తోడ్పడఁగలదు. ఎట్లైనను సద్విషయశ్రవణము, తదర్థమననము ప్రకృతము మనకుఁ గర్తవ్యములు. మనకుఁ గావలసినది ఆభ్యాసికసుఖము కాని, ఆభిమానిక సుఖము కాదు.

భారతవర్షసంబంధి సంస్కారసర్వస్వావగాహిగా రవీంద్రకవి చేసిన యీ పూర్వకావ్యానుశీలనము, తత్కృతకావ్యసృష్టికంటె సమధికముగా శ్రేయోలక్ష్యమునందు పర్యవసించుచున్న దని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

వాల్మీకి కాళిదాసుల మహోదారదర్శనమును వారి కావ్యసృష్టిప్రయోజనమును, ఆ ప్రయోజనము యొక్క త్రైకాలికస్థితియు శ్రేయోలక్ష్యము నందలి పరమోదాత్తతయును ఈయన విచారధారాతీర్థమునందు మనకు ప్రసన్నపుణ్యదర్శనము నొసఁగుచున్నవి. ప్రాచీనభారతవర్షము యొక్క సాక్షాత్కృతి నందఁగోరువారు వైదేశికభావమాలిన్యక్షాళనమున కీ తీర్థమునందు నిమగ్నులు కావలయును. ఉదారలలితమైన కావ్యఫణితిలో ఈ కావ్యానుశీలనము ప్రాణమున కమృతప్రహ్లాదావగాహసౌఖ్యమును కల్పించుచున్నది. నేటి యువసమాజమునకు రవీంద్రునివంటి కావ్యజ్ఞుని శిక్ష యెంత పరమావశ్యకమో చెప్పలేము. ఈ శిక్షానుసరణమున మన కావ్యముల నెట్లు సమీపింపవలెనో, మననపద్ధతి యెట్టిదియో, ఏది సారస్వతపరమప్రయోజనమో ఒక విస్పష్టదర్శన మేర్పడఁగలదు.

వంగమాతృకనుండి యనూదితమయ్యును నిది మూలకర్తయే తెనుఁగున వ్రాసిన నిట్లుండు ననిపించుచున్నది. ఇందతిశయోక్తి యేమియును లేదు. గ్రంథమును చదువుచున్నంతసేపు మూలకర్త సాన్నిధ్యమును ప్రతిపదము ననుభవింతుము. అనువాదము యొక్క కృతార్థత కింతకన్న నిదర్శన మక్కఱలేదు.

ఈ గ్రంథమును ప్రకటించిన విశ్వసాహిత్యమాల యొక్క కల్యాణారంభము శ్రేయమునందు పర్యవసించుగాత మని ఆశంసించుచున్నాను.

కార్తిక బహుళైకాదశి
రాజమహేంద్రవరం

మల్లంపల్లి శరభయ్య.



# రామాయణము

కావ్యమును స్థూలముగ రెండు విధములుగ నూహింప వచ్చును. ఒకటి, కావ్య మొక కవియొక్క ఉక్తి. వేఱొకటి, సంప్రదాయమునకుఁ జెందిన ఉక్తి. ఒక కవియొక్క ఉక్తి అని నంతనే యది మఱి యితరుని కెవ్వనికి నధిగమ్యము కాని దని కాదు. అట్లగుచో దాని నున్మాద మనవలసియుండును. దాని యర్థ మేమన, కవియం దొక సామర్థ్యమున్నది. ఆ సామర్థ్య ముచే తనవైన సుఖదుఃఖములను స్వీయకల్పనచే, స్వీయజీవనము నందలి యభిజ్ఞతనుండి విశ్వమానవుని చిరంతనమైన హృదయా వేగమును, మర్మవృత్తాంతమును, తానై ధ్వనించును.

ఇట్టి దొక శ్రేణి కవు లున్నట్లే వేఱొక శ్రేణికిఁ జెందిన కవు లున్నారు. వారి రచనలనుండి యొక సమగ్రదేశము, ఒక సమగ్రయుగము, తన హృదయమును, తన యభిజ్ఞతను వ్యక్త మొనర్చి, దానిని మానవుని చిరంతనసామగ్రిగ నొనర్చివేయును.

ఈ ద్వితీయశ్రేణికిఁ జెందిన కవిని మహాకవి యనఁ జెల్లును. సమగ్రదేశముయొక్క, సమగ్రజాతియొక్క సరస్వతి వీరి నాశ్రయింపఁగలదు. వీ రేది రచింతురో యది యొక వ్యక్తి విశేషసంబంధిమైన రచనగా తోఁచదు. అది యొక మహావనస్పతి వలె దేశముయొక్క భూతలజఠరమునుండి యుద్భూతమై యా దేశమునకే యాశ్రయచ్ఛాయాదాన మొసఁగును. కాళిదాసు

శాకుంతలకుమారసంభవములయం దాతని హస్తనైపుణ్యము యొక్క పరిచయమును పొందుదుము. కాని రామాయణమహాభారతములు జాహ్నవీహిమాచలములవలె భారతజాతికిఁ జెందినవి. వ్యాసవాల్మీకు లుపలక్షకమాత్రు లని అనిపించును.

వస్తుతః వ్యాసుఁడు, వాల్మీకి, వ్యక్తినామమాత్రములై యుండలేదు. అవి యొక యుద్దేశముతోనైన నామకరణములు మాత్రమై యున్నవి. ఇంతటి మహాగ్రంథద్వితయము, మన సమస్తభారతవర్షము నాక్రమించిన రెండు మహేతిహాసములు. అవి రచయితల నామములను పోగొట్టుకొని కూర్చుండినవి. కవి తన కావ్యమున కెంతో యంతరాళమున పడిపోయినాఁడు.

మన దేశమునందు రామాయణమహాభారతము లెట్లో ప్రాచీన గ్రీస్ దేశమున నట్లే ఇలియడ్, ఒడిస్సే లుండెను. అవి సమస్త గ్రీస్ దేశముయొక్క హృత్పద్మసంభవములును హృత్పద్మవాసులునై వెలసినవి. హోమర్ మహాకవి తన దేశకాలముల కంఠమునందు భాషాదాన మొనర్చియుండెను. ఈ కావ్యము ప్రవాహమువలె స్వస్వదేశమునందలి నిగూఢాంతఃస్థలమునుండి యుత్సారితమై, చిరకాలమునుండి దానిని ప్లావిత మొనర్చినది.

ఆధునికమైన యే కావ్యమునందు నిట్టి వ్యాపకత కనిపించుటలేదు. మిల్టన్‌యొక్క పారడైజ్ లాస్ట్ నందు భాషాగాంభీర్యము, ఛందోమాహాత్మ్యము, రసగభీరత యెంతయైన నుండుఁగాక, అది దేశముయొక్క ధనము కాఁజాలదు. అది గ్రంథాలయము లాదరించవలసిన సామగ్రిమాత్రమే.

అందుచే నత్యల్పసంఖ్యాకములైన ప్రాచీనకావ్యముల నే కొన్నిటినో యొకే శ్రేణిలో చేర్చి యొకే నామమున వ్యవహరింపవలె ననినచో "మహాకావ్యము" లని కాక వానికి మఱే నామ ముంచగలము? ఇవి ప్రాచీనకాలమునందలి దేవదానవుల వలె మహాకాయములై యుండెను. వీని జాతి యిప్పుడు లుప్తమైపోయినది.

ప్రాచీనార్యసభ్యతయొక్క యొక ధార యూరోపునందును, వేఱొక ధార భారతవర్షమునందును ప్రవాహితమైనది. యూరోపునందలి ధార రెండు మహాకావ్యములందును, భారతవర్షముయొక్క ధార రెండు మహాకావ్యములందును తమ యుదంతమును, సంగీతమును రక్షించుకొనెను.

మనము విదేశీయుల మగుటచే గ్రీస్ తన సమస్త ప్రకృతిని తన రెండు కావ్యములందును ప్రకాశ మొనర్పఁగలిగినదో లేదో నిశ్చయముగఁ జెప్పఁజాలము. కాని భారతవర్షము రామాయణ మహాభారతములందు తన్ను తాను నిరవశేషముగ ప్రకాశింపఁ జేసికొనె ననునది మాత్రము నిశ్చయము.

శతాబ్దములపై శతాబ్దములు జరిగిపోవుచున్నవి. కాని రామాయణమహాభారతముల స్రోతస్సులు భారతవర్షమున లేశ మాత్రమైనను శోషితములగుట లేదు. ప్రతిదినము గ్రామగ్రామమున, నింటింట పఠింపఁబడుచున్నవి. పచారీవర్తకుని దుకాణము నుండి రాజప్రాసాదమువఱకు సర్వత్ర వానికి సమానాదరము. ఆ కవియుగళమునకు ధన్యవాదములు. కాలమహాప్రాంతరమునందు

వారి నామములు అనన్వేషణీయములై పోయినవి. కాని వారి వాణి యనేకకోట్ల స్త్రీపురుషుల ద్వారద్వారములయందు నేటి కిని అజస్రధారగా శక్తిని, శాంతిని ప్రవహింపఁజేయుచున్నది. శతశతాబ్దముల ప్రవాహపు టొండ్రును, అహరహముఁ గొని తెచ్చుచు భారతవర్షముయొక్క చిత్తభూమిని నేడును ఉర్వరగా నొనర్చియుంచు చున్నది.

రామాయణమహాభారతములను కేవలము మహాకావ్యము లనినఁ జాలదు. అవి యితిహాసములుకూడ నై యున్నవి. కాని యవి ఘటనాసమూహేతిహాసములు కావు. కారణ మేమన నట్టి యితిహాసములు సమయవిశేషము నవలంబిన మొనర్చి కొని యుండును. రామాయణమహాభారతములు భారతవర్షము యొక్క చిరంతనేతిహాసములు. ఇతరేతరేతిహాసములు కాల వాహినిలో నెన్ని విధములుగ పరివర్తితములైనవో కాని యీ యితిహాసములకు పరివర్తన జరుగలేదు. భారతవర్షముయొక్క సాధన, ఆరాధన, సంకల్పములయొక్క యితిహాసమే యీ విపుల కావ్యహర్మ్యద్వితయమునందును చిరస్థాయియైన సింహాసనము నందు విరాజమానమైనది.

ఈ కారణమున రామాయణమహాభారతములయొక్క సమాలోచన మన్యకావ్యసమాలోచనాదర్శమునుండి స్వతంత్రమైనది. శ్రీరాముని చరిత్ర మచ్చమో, నీచమో, లక్ష్మణుని చరిత్రము మనకు బాగుగనుండునో, ఓగుగనుండునో యీ యాలోచనయే యిందు నభీష్టము కాదు. సమస్తభారతవర్షము

సహస్రసహస్రవత్సరములు వీని నే రూపభావమున గ్రహించుచు వచ్చినదో ఆ విషయమును నిస్తబ్ధులమై, శ్రద్ధాన్వితులమై విచారింపవలయును.

రామాయణమునందు భారతవర్షమేమి చెప్పుచున్నది? రామాయణమునందు భారతవర్షమే యాదర్శమును మహత్తుగ స్వీకరించినది? ఇదియే ప్రకృతమున మనము సవినయముగ విచారించఁదగిన విషయము.

వీరరసప్రధానమైన కావ్యమునే 'ఎపిక్' అందురు. ఇది సాధారణుల యభిప్రాయము. దీనికి హేతు వేమన, ఏ దేశమునందే కాలమున వీరరసముయొక్క గౌరవము ప్రాధాన్యము నొందినదో, ఆ దేశమునం దా కాలమున స్వభావముగనే 'ఎపిక్' వీరరసప్రధానమై తల యెత్తినది. రామాయణమునందును యుద్ధవ్యాపారము కావలసినంత యున్నది. రాముని బాహుబలమును సామాన్యము కాదు. ఐనను రామాయణమునందే రస మన్నింటిని మించి ప్రాధాన్యము వహించినదో యది వీరరసము కాదు. దానియందు బాహుబలగౌరవమే ఘోషితము కాలేదు. యుద్ధఘటనయే దానికి ముఖ్యముగ వర్ణనీయవిషయము కాలేదు.

భగవానుని యవతారలీలలను తీసుకొని యీ కావ్యము రచితమైన దనిన నదియు కాదు. వాల్మీకి దృష్టియందు రాముఁడవతారమే నైయుండలేదు. ఆయన మానవుఁడే నైయుండెను. పండితులే దీనిని ప్రమాణీకరింతురు. ఈ భూమికయందు పాండిత్యమున కవకాశము లేదు. ఇచ్చట సంక్షేపముగ చెప్పఁదలచిన

దేమనిన, కవి రామాయణమునందు మానవచరిత్రమును వర్ణించ కుండ దేవచరిత్రను వర్ణించియుండెనేని రామాయణముయొక్క గౌరవము హ్రాస మయ్యెడిది. అందువలన నది కావ్యాంశమున క్షతిగ్రస్త మయ్యెడిది. మానవుఁడగుటచేతనే రాముని చరిత్రము మహిమాన్వితము.

ఆదికాండమునందలి ప్రథమసర్గమునందు వాల్మీకి తన కావ్యోపయుక్తుఁడగు నాయకుని సంధాన మొనర్చి, బహుగుణ ముల నుల్లేఖించి, నారదు నడిగెను.—

'సమగ్రా రూపిణీ లక్ష్మీః క మేకం సంశ్రితా నరమ్'

'సమగ్రమైన లక్ష్మి రూపగ్రహణ మొనర్చి ఏ యొక్క మానవు నాశ్రయించెను ?'

అప్పుడు నారదుఁ డనినాడు.

'దేవేష్వపి న పశ్యామి కంచి దేభి ర్గుణైర్యుతమ్
శ్రూయతాం తు గుణై రేభి ర్యో యుక్తో నరచన్ద్రమాః'

'ఇన్ని గుణములతోఁగూడిన పురుషుఁడు దేవతలయందు సైతము కానరాఁడు. ఏ నరచంద్రమునియం దీ గుణము లన్నియు నున్నవో ఆయన కథను వినుము.'

రామాయణ మీ నరచన్ద్రముని కథ, దేవతాకథ కాదు. రామాయణమునందు దైవము తన్ను తాను హ్రస్వీకరించుకొని మనుష్యుఁడు కాలేదు. మానవుఁడే స్వీయోత్తమగుణములచే దేవతయై ప్రకాశించినాఁడు.

మానవుని చరమాదర్శమును స్థాపించుటకై భారతవర్ష కవి మహాకావ్యమును రచించినాఁడు. నాటినుండి నేటివఱకు మానవుని యీ యాదర్శచరిత్రవర్ణనమును భారతీయపాఠక మండలి యత్యుత్సాహముతో పఠించుచునే వచ్చుచున్నారు.

రామాయణమునందలి ప్రధానమైన విశేష మేమనిన అది గృహవృత్తాంతమునే మహోదాత్తముగఁ జూపించినది. పితాపుత్రులందు, అగ్రజానుజులయందు, భార్యాభర్తలందుఁ గల ధర్మబంధనమును, ప్రీతిభక్తిసంబంధములను రామాయణ మెంత మహోదాత్త మొనర్చివేసినది! అది యతిసహజముగనే మహాకావ్యమున కుపయుక్తమైపోయినది. దేశజయము, శత్రువినాశము, రెండు ప్రబలవిరోధిపక్షముల ప్రచండాఘాతసంఘాతములు, యీ సమస్తవ్యాపారములును సాధారణముగ మహాకావ్యమునందు ఆందోళనను, యుద్దీపనమును సంచార మొనర్చుచుండును. కాని రామాయణముయొక్క మహిమ రామరావణయుద్ధము నాశ్రయించుకొని కాదు. ఆ యుద్ధసంఘటనము సీతారాముల దాంపత్యప్రీతి నుజ్జ్వల మొనర్చి చూపుట కుపలక్ష్యముమాత్రమే. తండ్రియెడల పుత్రుని వశ్యత, సోదరునికై సోదరుని యాత్మత్యాగము, భార్యాభర్తలందు పరస్పరమైన నిష్ఠ, ప్రజలయెడల రాజు కర్తవ్యము ఎంతదూరము పోఁజాలునో రామాయణము దానినే ప్రదర్శించినది. ఈ రీతిగ వ్యక్తిసంబంధమైన, ప్రధానముగ గృహసంబంధమైన సంపర్కము లే దేశపు మహాకావ్యమునందును నింతటి వర్ణనీయవిషయముగ గణ్యత నొందలేదు.

దీనియందు కేవలము కవియొక్క పరిచయము మాత్రమే కాదు, భారతవర్షముయొక్క పరిచయము లభించును. గృహ మును, గృహధర్మమును భారతవర్షము విషయమున నెంతటివో దీనినుండి తెలిసికొననగును. మన దేశమునందు గృహస్థాశ్రమ మున కెంతటి యుచ్చస్థాన ముండెనో యీ కావ్యము దానిని ప్రమాణీకరించు చున్నది. గృహస్థాశ్రమము మన స్వీయసుఖము నకును, సౌకర్యముకొఱకును మాత్రమై యుండలేదు. ఈ యాశ్రమము సమస్తసమాజమును ధరించి యుంచెడిది. మాన వుని నిజమైన మానవునిగ నొనర్చెడిది. గార్హస్థ్యము భారత వర్షీయార్యసమాజమునకు మూలము. రామాయణ మహా గృహస్థాశ్రమమునకు జెందిన కావ్యము. ఈ గార్హస్థ్యధర్మమునే రామాయణము విసదృశావస్థలయందు పడవేసి వనవాసక్లేశముల యందు విశేషగౌరవదాన మొనర్చినది. మంథరయొక్క కూట నీతియందలి కఠినాఘాతమున, కైకేయిచే నయోధ్యయందలి రాజగృహమునే విశ్లిష్ట మొనర్చికూడ నీ గృహధర్మముయొక్క దుశ్ఛేదమైన దృఢతను రామాయణము చాటఁగలిగినది. బాహు బలము కాదు, జిగీష కాదు, దేశగౌరవము కాదు, శాంతరసా స్పదగృహధర్మమునే రామాయణము కరుణాశ్రుజలమునం దభి షిక్త మొనర్చి దృఢతరముగ ప్రతిష్ఠించెను.

ఇట్టి స్థితియందు చరిత్రవర్ణన మతిశయోక్తియందు పరి ణతమైపోవు నని శ్రద్ధావిహీనులైన పాఠకు లనఁజాలుదురు. యథాయథమైన సరిహ ద్దెచ్చట, కల్పనయొక్క యే సీమ నుల్లం

ఘించినచో కావ్యకళ యాతిశయ్యమునకుఁ దావలమగునో, ఒకే మాటలో దానిని మీమాంసింపఁజాలము. విదేశీయులైన సమాలోచకులు రామాయణమునందు చరిత్రవర్ణనము ప్రకృత్యతీతమైన దనినారు. వారికి నే నిచ్చు సమాధాన మిది. ప్రకృతి భేదము ననుసరించి యొకని కేది ప్రకృత్యతీతమో వేఱొకని కదియే ప్రాకృతికము. భారతవర్షము రామాయణమునందు ప్రకృత్యతీతముయొక్క యాతిశయ్యమును దర్శించలేదు.

ఎచ్చట నే యాదర్శము ప్రచలితమో నచ్చట దాని నతిరిక్తముగ వెదఁజల్లుచు పోయినచో నచ్చటి జనులు దానిని గ్రహించనే గ్రహించరు. మన శ్రుతియంత్రమునందు మన మెన్ని శబ్దతరంగముల యాఘాతము నుపలబ్ధ మొనర్చుకొనఁగలమో దాని కొక పరిమితి యున్నది. ఆ పరిమితిని మించి పై సప్తకమును స్వరారోహణ మొనర్చినచో మన కర్ణములు దానిని గ్రహించనేఁ గ్రహించవు. కావ్యమునందు చరిత్ర, భావపరికల్పన సంబంధమునను నిదియే వర్తించును.

ఇది సత్య మగుచో నిఁక రామాయణగాథ భారతవర్షమునందు, ఏ యంశమునను నతిమాత్రము గాక సహస్ర సహస్రవత్సరములనుండియు ప్రమాణితమై వచ్చుచున్న దనుట నిర్వివాదాంశము. ఈ రామాయణగాథనుండి భారతవర్షమునందలి యాబాలవృద్ధవనితలును, సామాన్యులైన పామరజనులును కేవల మధ్యయన మొనర్చినారని కాదు, ఆనందమును పొందినారు. కేవలము దీనిని శిరోధార్య మొనర్చుకొనినా రని

కాదు, దీనిని హృదయమునందు నిక్షిప్త మొనర్చుకొనినారు. ఇది వారికి కేవలము ధర్మశాస్త్ర మనికాదు, ఇది వారి కావ్యము.

రాముఁ డేకకాలమున మనకు దేవతయుమానవుఁడును నై, రామాయణ మేకకాలమున మన భక్తిని, ప్రీతిని పొందుట యను నది, యీ మహాగ్రంథమునందలి కవిత్వము భారతవర్షము విషయమున కేవలము సుదూరకల్పనాలోకసామగ్రియై, యది మన సాంసారికజీవనపరిమితులలో నొదిగిపోయియుండనిచో, నెన్నటికిని సంభవించెడిది కాదు.

ఇట్టి గ్రంథము నన్యదేశీయులైన విమర్శకులు వారి వారి కావ్యపరిశీలనాపద్ధతుఁ ననుసరించి ప్రకృత్యతీత మని నిర్ణయించినచో, ఆ దేశముతో సరిపోల్చి నప్పుడు భారతవర్షముయొక్క యొకానొక వైశిష్ట్య మింకను పరిస్ఫుటమై విరాజిల్లును. రామాయణమునందు భారతవర్షము దేనిని వాంఛించినదో దానిని పొందినది.

రామాయణమును, మహాభారతమును కూడ నేను విశేషించి యీ భావముననే చూచెదను. దీని సరళమైన యనుష్టుప్ ఛందమునందు భారతవర్షముయొక్క పరస్సహస్రవత్సరముల హృత్పిండము స్పందితమగుచు వచ్చినది.

సుహృద్వరులైన దినేశచంద్ర మహాశయులు 'రామాయణచరిత్రసమాలోచన' యను గ్రంథమున కొక భూమికను వ్రాసి యిమ్మని న న్ననురోధించినారు. అప్పటి నా యస్వాస్థ్య-

అసవకాశస్థితినిఁగూడ పాటింపక వారి మాటను కాదనఁజాలక పోయితిని. కవివిషయమును భక్తుని భాషయం దావృత్తియొనర్చి, ఆయన తన భక్తిని చారితార్థ్య మొనరించుకొనినారు. ఈ రూపమైన పూజావేగ మిశ్రిత వ్యాఖ్యానమే నా బుద్ధికి సహజ మైన సమాలోచన యనిపించును. ఈ యుపాయమునసే యొక హృదయమునందలి భక్తి వేఱొక హృదయమున సంచారిత మగును. నేటి మన సమాలోచనాసంబంధమైన బజారుధర యిష్టమువచ్చిన రీతిని నిర్ణయించుట యైయున్నది. కారణ మేమన ఈ దినములలో సాహిత్యము దుకాణమునందలి వస్తువై పోయి నది. వెనుకఁబడిపోవలసివచ్చు నని చాతుర్యముతో నచ్చిన రీతిని సమాలోచన యొనర్చు వ్యక్తి నాశ్రయించుట కెల్లరు నభిలషించు చున్నారు. ఈ రూపమైన యిచ్చవచ్చిన రీతి కనుకూలమైన యిట్టి వ్యాపారమున కవశ్యము ప్రయోజన మున్నది. ఐనను యథార్థ మైన సమాలోచనము పూజ యనియు, సమాలోచకుఁడు పురో హితుఁ డనియు, అతఁడు స్వీయమైన, లేక సర్వసామాన్యని భక్తివిగళితవిస్మయమునుమాత్రమే వ్యక్త మొనర్చు ననియు చెప్పవలసియున్నది.

భక్త దినేశచంద్రు లా పూజామందిరప్రాంగణమున నిలిచి హారతి నీయ నారంభించినారు. నా కాకస్మికముగ గంటను మ్రోయించు భారము నొసఁగినారు. ఒక పార్శ్వమునందు నిలిచి నే నా కార్యమునందు ప్రవృత్తుఁడనైనాను. నే నధికాడంబర ముతో వారి పూజ నాచ్ఛాదించుటకు సంకోచించుచున్నాను.

నే నింతమాత్రమే తెలియఁజేయఁ దలచుకొన్నాను. ఏమన వాల్మీకిరామాయణమును పాఠకులు కేవలము కవియొక్క కావ్యముగనే చూడకుఁడు. దానిని భారతవర్షముయొక్క రామాయణముగఁ దెలిసికొనుఁడు. అట్లగుచో రామాయణముద్వారా భారతవర్షమును, భారతవర్షముద్వారా రామాయణమును యథార్థభావమునఁ దెలియఁజాలుదురు. దీనిని జ్ఞప్తియం దుంచుకొనుఁడు. రామాయణ మేదో యైతిహాసికమైన వృత్తాంతము కాదు. పరిపూర్ణమైన మానవాదర్శచరిత్రమును భారతవర్షమాలకింపఁగోరి యుండెను. ఈ రోజువరకు దాని నశ్రాంతముగ నానందముతో నాలకించుచునే యున్నది. ఇది యతిమాత్రమగుచున్న దని యనలేదు. ఇది కావ్యముమాత్రమే నని భారతవర్ష మేనాఁడు ననలేదు. భారతీయులకు సీతారామలక్ష్మణు లెంత సత్యమో తమతమ గృహములందలి వ్యక్తులుగూడ నంత సత్యము కాదు.

పరిపూర్ణతయెడల భారతవర్షమున కొక ప్రాణతుల్యమైన యాకాంక్ష యున్నది. దీని నది వాస్తవసత్యమున కతీత మని యవజ్ఞ చేయలేదు, అవిశ్వాసమును ప్రకటింప లేదు. దీనినికూడ భారతవర్షము యథార్థసత్య మని స్వీకరించినది. దీనియందే యది యానందమును పొందినది. ఆ పరిపూర్ణతయందలి యాకాంక్షనే యుద్భావిత మొనర్చి, తృప్తిని కలుగజేసి, రామాయణ కవి భారతవర్షమునందలి భక్తహృదయములను శాశ్వతముగ కొనివేసి యుంచికొనెను.

ఏ జాతి ఖండసత్యమునకు ప్రాధాన్యము నిచ్చునో, ఎవరు వాస్తవసత్యానుసరణమునందు క్లాంతినిఁ జెందరో, కావ్యము నెవరు ప్రకృతికి దర్పణముగమాత్ర మూహింతురో, వారు జగత్తునం దనేక కార్యములను సాధించుచున్నారు. వారు విశేష భావమున ధన్యులైనారు. మానవజాతి వారికి ఋణపడి యున్నది. వేఱొకవైపున నెవరు 'భూమైవ సుఖమ్, భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః' అని చెప్పినారో, అనఁగా పరిపూర్ణ పరిణామమునందే సమస్త ఖండత్వముయొక్క పరమశోభను, సమస్త విరోధములయొక్క శాంతిని యుపలబ్ధ మొనర్చుకొనుటకు సాధన యొనర్చినారో; వారి ఋణ మెన్నటికిని తీరునది కాదు. వారి పరిచయము విలుప్తమగుచో, వారి యుపదేశములు విస్మృతము లగుచో మానవసభ్యత తనంత తానే, ధూమ్రధూమసమాకీర్ణ కర్మాగారమందలి జనసమూహమునందు నిశ్వాసకలుషితబద్ధాకాశమున క్షణక్షణము పీడితమగుచు కృశించి నశించును. రామాయణ మహాయఖండామృతపిపాసువులైన వారి చిరపరిచయమును వహించికొనుచు వచ్చుచున్నది. దీనియందే సౌభ్రాత్రము సత్యపరత, పాతివ్రత్యము, ప్రభుభక్తి వర్ణితములైనవో, వాని యెడల సరళమైన శ్రద్ధను, ఆంతరమైన భక్తిని రక్షించికొనఁ జాలితి మేని మన కర్మాగారవాతాయనములందు మహాసముద్ర సంబంధి యగు నిర్మలవాయువు ప్రవేశమార్గమును పొందును.



# మేఘదూత

రామగిరినుండి హిమాలయమునకు ప్రాచీనభారత వర్షముయొక్క యే దీర్ఘమైన యేకఖండముమధ్యనుండి మేఘదూతయందలి మందాక్రాంతఛందమున జీవనస్రోతస్సు ప్రవాహితమైపోయినదో యచ్చటినుండి కేవలము వర్షాకాలముననే కాదు, శాశ్వతముగ మనము నిర్వాసితులమై పోయినాము. ఆ యే యుపవనములకు కేతక్యావరణ ముండెనో, వర్షాప్రాక్కాలమున గ్రామచైత్యములందు బలిభుక్కులు గూళ్లు కట్టుకొనుట కారంభించుటలో సమారోహపూర్ణములై యుండెడివో, గ్రామప్రాంతములందు జంబూవనములయందు పండ్లు పండి మేఘములవలె నలుపై యుండెడివో, ఆ దశార్ణ మెచ్చటి కేగినది ? ఇకనే యవంతిలో గ్రామవృద్ధు లుదయనవాసవదత్తల కథలను చెప్పెడివారో వారైన నెచ్చట ? ఆ శిప్రాతటవర్తినియైన యుజ్జయిని ? దాని విస్మృతమైన సంపద, ఆ బహుళమైన యైశ్వర్యము నెచ్చట? కాని దాని విస్తారితమైన వివరణమునందు మన స్మృతి భారాక్రాంతము కాలేదు. మనము కేవలము హర్మ్యవాతాయనముల నుండి పురవధూజనసమూహముయొక్క యే కేశసంస్కారధూపమదృశ్యముగ నెగిరి వచ్చుచుండెడిదో దానిదైన అల్పాల్ప పరిమళము ననుభవించుచున్నాము. అంధకారమయమైన రాత్రియందు భవనశిఖరములపై పారావతములు తిరుగుచుండెడి సమయమున విశాలజనసంకులమైన నగరమునందలి పరిత్యక్తపథమును

గాఢసుషుప్తిలోని మనస్సులం దనుభవించుచున్నాము. ఆ రుద్ధ ద్వారమైన సుప్తసౌధయుతరాజధానియందలి నిర్జనపథమునం దంధకారములోనుండి కంపితహృదయముతో వ్యాకులచరణక్షేప ముతో నే యభిసారిక నడచిపోయినదో ఆమె నించుక ఛాయా మాత్రముగ దర్శించుచున్నాము. ఆమె పాదసమీపమున నికషము నందలి సువర్ణరేఖవలె కొంచెము కాంతిప్రసార మొనర్చుట కిచ్ఛ జనించుచున్నది.

ప్రాచీనభారతవర్షమునందలి నదులయొక్కయు, గిరుల యొక్కయు, నగరములయొక్కయు నామము లెంత సుంద రములు! అవంతి, విదిశ, ఉజ్జయిని, నిర్వింధ్య, కైలాసము, దేవ గిరి, రేవా, శిప్రా, వేత్రవతి, - నామములం దొకానొక శోభ, సంభ్రమము, శుభ్రతయు నున్నవి. అటుతరువాత కాలము క్రమ క్రమముగ హీనమైపోయినట్లు, దాని భాషావ్యవహారము, మనో వృత్తులందు జీర్ణత, యపభ్రంశము ఘటిల్లినట్లును తోచును. ఇప్పటి నామకరణములును వాని కనురూపములే. ఆ రేవా, శిప్రా, నిర్వింధ్యా నదీ తీరములందు, అవంతీ, విదిశలలో ప్రవేశించుట కేదైన మార్గ ముండినచో నప్పు డిక నేటి నలుదెసలందలి ఇతర మైన కాకలీధ్వనులనుండి పరిత్రాణ మొదవెడిదిగదా యని పించును.

యక్షునిదైన యే మేఘము నగనదీనగరములపై నుండి యెగిరిపోయినదో పాఠకుని విరహకాతరమైన దీర్ఘనిశ్వాసము దానికి సహచారియైనది. ఆ కవిపుంగవుని భారతవర్షమున నెచ్చట

జనపదవధువుల ప్రీతిస్నిగ్ధలోచనములు భ్రూవికారము నభ్యసించ లేదో, పురవధువుల భ్రూలతావిభ్రమముతో పరిచితములైన నిబిడపక్ష్మకృష్ణనేత్రములనుండి కౌతూహలదృష్టి మధుకరశ్రేణివలె నూర్ధ్వమున నుత్క్షిప్త మగుచున్నదో యచ్చటినుండి మనము విచ్యుతులమైనాము. ఇప్పుడు కవియొక్క మేఘమునుకాక నచ్చటి కెవరిని దూతగ పంపఁజాలకున్నాము.

ఒకానొక యాంగ్లకవి వ్రాసిన విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది. మానవు లొక్కొక్క రొక్కొక్క విచ్ఛిన్నద్వీపము వంటివారు. ఒకరొక్కరి మధ్య నపరిమేయ మగు నశ్రులవణాక్తమైన సముద్రము. దూరమునుండి పరస్పరము చూచుకొన్నచో మన మొక కాలమునం దొక మహాదేశమున నుంటిమి. ఇప్పు డెవరి యభిశాపముననో మనమధ్య విచ్ఛేదసంబంధమైన విలాప జలరాశి నురుగులై యెగయుచున్న ట్లనిపించును. మన యీ సముద్రవేష్టితమై క్షుద్రమైన వర్తమానకాలమునుండి కావ్యవర్ణితమైన యీ యతీతభూఖండతటమువైపునకు ఆతురతతో చూచినప్పుడు, ఆ శిప్రాతీరమునందలి యూథికావనమున నే పుష్పలావికలైన రమణులు పుష్పాపచయ మొనర్చెడివారో, అవంతీ నగర చత్వరములందు వృద్ధు లుదయనమహారాజు కథలను చెప్పెడివారో, ఆషాఢమునందలి ప్రథమమేఘమును దర్శించి యే పథికప్రవాసులు తమ తమ స్త్రీలకొఱకు విరహావ్యాకులితు లయ్యెడివారో, వారికిని మనకును మధ్య సంయోగ ముండితీర వలసిన దనిపించును. మనయందు మానవత్వముయొక్క నిబిడ

పైనఁ బ్రేమ్యైకత యున్నది. ఐనను కాలముయొక్క నిష్ఠురమైన వ్యవధానము! కవియొక్క సౌభాగ్యవశమున నిప్పుడా యతీత కాలము మఱల సౌందర్యోపమమైన యలకాపురియందు పరిణత మైనది. మనము మన విరహావిచ్ఛిన్నమైన యీ వర్తమాన మర్త్యలోకమునుండి యచ్చటికి కల్పనాసంబంధమైన మేఘ దూతను పంపించినాము.

కాని కేవల మతీతవర్తమానములే కాదు. ప్రతి మాన వునియందును నతలస్పర్శియైన విరహ మున్నది. మన మెవరితో మిళితము కాఁగోరుదుమో యామె తన మానససరోవరము యొక్క యగమ్యతీరమున నివసించుచున్నది. అచ్చటికి కేవలము కల్పననే పంపఁజాలుదుము. అచ్చట సశరీరముగ నుపనీతమగుట కెట్టి మార్గమును లేదు. నే నెచ్చట, నీ వెచ్చట! మధ్య నితాంత మనంతము. ఎవరు దానిని తరింపఁ జాలుదురు? నేఁడు కేవలము భాషలో, భావములో, అభ్యాసములో, యింగితములో, భ్రమ భ్రాంతులలో, వెలుఁగుచీకట్లలో, దేహమనస్సులలో, జననమరణ ముల ద్రుతతరస్రోతోవేగమున నా వ్యక్తియొక్క యించుకైన స్పర్శవాయువును మాత్రము పడయఁజాలుదుము. నీనుండి దక్షిణా నిలము నా కడకు వచ్చి చేరిన దన నది నా సౌభాగ్యము. అంతకు మించి యీ విరహాలోకమున నెవరు నెక్కువ యాశింపఁజాలరు.

శ్లో॥ భిత్త్వా సద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణామ్
యే తత్ క్షీరస్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః

ఆలింగ్యంతే గుణవతి! మయా తే తుషారాద్రివాతాః
పూర్వం స్పృష్టం యది కిల భవే దంగమేభి స్త్వవేతి.

ఈ చిరవిరహగాథ నుల్లేఖించి వైష్ణవకవి గాన మొనర్చి నాఁడు.

'దుఃహు కోలే దుఃహు కాఁదే విచ్ఛేద భావియా'

మనము ప్రత్యేకముగ నిర్జనగిరిశృంగమున నేకాకిగ నిలిచి యుత్తరాభిముఖముగ చూచుచున్నాము. మధ్య నాకాశము, మేఘము, సుందరమైన పృథ్వీసంబంధమైన రేవా, శిప్రా, అవంతి, ఉజ్జయినీ. సుఖసౌందర్యభోగైశ్వర్యముల చిత్రలేఖ, మనస్సు నందు భావింపనిచ్చును గాని సమీపించనీయదు. ఆకాంక్ష నుద్రేకింపఁజేయును కాని నివృత్తి నీయదు. ఇరువురు వ్యక్తులమధ్య నింతటి యంతరము!

కాని మన మొకప్పు డొకే చోట మానసలోకమునం దుంటిమనియు, అచ్చటినుండి నిర్వాసితులమైనట్లును, మనస్సునం దనిపించును. అందుకే వైష్ణవకవి యనినాఁడు.

'తోమార్ హియార్ భితర్ హారాయితే కే కొయిలో బాహిరే'

ఏమైనది? నా మనోరాజ్యమునందలి వ్యక్తియే నేఁడు బయటికి వచ్చిన దెందులకు? అచ్చట నీకు స్థానము లేదు. బలరామదా సనుచున్నాఁడు.

'తేఁ ఇ బలరామేర్ పహు, చిత నహే స్థిర్'

ఎవ రొక సర్వవ్యాపియైన మనస్సునం దొకటియై యుండిరో వారు నేఁడు పూర్తిగ బయటపడిపోయినారు. అందు వలననే పరస్పరము చూచుకొని చిత్తము స్థిరము కాఁజాలకున్నది. విరహమున విధురులు, వాసనలయందు వ్యాకులితులై పోవు చున్నారు. తిరిగి హృదయమునం దైక్యమగుటకు ప్రయత్నించు చున్నారు. కాని మధ్య విశాలమైన పృథ్వి.

నిర్జనగిరిశిఖరమునందలి ఓ విరహీ! స్వప్నమునం దెవరి నాలింగన మొనర్చుకొనుచున్నావో మేఘముఖమున నెవరికి సం దేశము నంపుచున్నావో ఒక యపూర్వసౌందర్యలోకమున, శరత్పూర్ణిమారాత్రియం దామెతో చిరమిళన మగునని నీ కెవ్వ రాశ్వాస మిచ్చినారు? నీ కేమో చేతనాచేతనముల మధ్య పార్థక్యజ్ఞానము లేదు. సత్యకాల్పనికముల మధ్య కూడ ప్రభేద మును పోగొట్టుకొని యుంటివేమో నా కేమి తెలియును?



# కుమారసంభవము - శాకుంతల.

కాళిదాసు ముఖ్యముగ సుఖసౌందర్యాభిలాషియైన కవి యను భావము లోకమునందు ప్రసిద్ధమై యున్నది. అందుచే లౌకికమైన కథలయందును, జనశ్రుతియందును కాళిదాసుచరిత్రమునందు కళంక మేర్పడినది. సాధారణజనులచే చేయబడు కాళిదాసుయొక్క కావ్యసమాలోచనలే ఈ గాథలైనవి. దీని నుండి గ్రహింపఁదగిన దేమన సామాన్యజనులయెడల నింక నే యితరవిషయములందైన నాస్థ యుంచవచ్చును గాని సాహిత్య విచారము సంబంధమున అంధులపై నంధులు ఆధారపడుట చెల్లదు. శతాంధాః కూపం ప్రవిశంతి యన్నట్లగును.

మహాభారతమున నొక విపులమును కర్మసంబంధియు నగు నాందోళన కాననగును. దానియం దొకానొక మహావైరాగ్యము స్థిరమై యనిమేషభావమున నొప్పియున్నది. మహాభారతమునందు కర్మయందే కర్మకు సమాప్తి కాదు. దాని సమస్త శౌర్య, వీర్య, రాగద్వేష, హింసాప్రతిహింస, ప్రయాససిద్ధుల మధ్య స్మశానమునుండి మహాప్రస్థానముయొక్క భైరవసంగీతము నినదితమై యొప్పుచున్నది. రామాయణమునందును నట్లే. పరిపూర్ణమైన యత్నము వ్యర్థమై పోవును. కరాయత్తమైన సిద్ధి స్ఖలితమై పోవును. అంతకును పరిణామమున పరిత్యాగము. ఐనను ఈ త్యాగమున దుఃఖముయొక్క నిష్ఫలత్వమునందే కర్మమహా

త్వమును, పౌరుషప్రభావమును, రజతగిరివలె నుజ్జ్వలమై, యభ్రభేద్యమై నిలిచినవి.

అదే విధమున కాళిదాసుని సౌందర్యచాంచల్యముల మధ్య భోగవైరాగ్యములు స్థిరములై యున్నవి. మహాభారతము నేకవాక్యమున కర్మవైరాగ్యములకు సంబంధించిన కావ్య మని నట్లే, కాళిదాసునికూడ సౌందర్యభోగమునకును, భోగవిరతికిని సంబంధించిన కవి యని చెప్పవచ్చును. ఆయన కావ్యములు సౌందర్యవిలాసములందే పూర్తి కాలేదు. వాని నతిక్రమించిన మీదటనే కవి తృప్తుఁడైనాఁడు.

కాళిదా సెచ్చట ఆగినాఁడు? ఎచ్చట నాగలే దనునదే యిప్పటి యాదర్శముతో పోల్చి యాలోచింపఁదగిన విషయము. మార్గమునం దేదో యొక యంశమున ఆగి, ఆయనను విచారించుట తగనిది. ఆయన గమ్యస్థాన మెచ్చట యనునది చూడ వలసియున్నది.

నా దృఢవిశ్వాస మేమన, పల్లెవాని చేతినుండి యంగుళీయకమును గ్రహించి దుష్యంతుఁ డెచ్చట తన భ్రమను తెలియఁ జాలినాఁడో, అచ్చటనే ఆ వ్యర్థమైన పరితాపమునందు యూరోపీయ కవి శకుంతలానాటకమునకు యవనికాపాత మొనర్చియుండును. శేషాంకమునందు స్వర్గమునుండి తిరిగివచ్చు మార్గమునందు దైవవశమువనైన శకుంతలాదుష్యంతుల కలయిక యూరోపీయనాట్యరీతి ననుసరించి యవశ్యఘటనీయము కాదు. కారణ మేమన, శకుంతలానాటకారంభమునం దే బీజావాపము జరిగి

నదో, యీ విచ్ఛేదమే దానికి చరమఫలము. శకుంతలాదుష్యం తుల పునస్మిళన మిక బాహ్యోపాయమున, దైవానుగ్రహమున ఘటింపఁజేయవలసి వచ్చినది. నాటకాంతర్గతమైన యే ఘటనా సూత్రమునను, శకుంతలాదుష్యంతుల యే వ్యవహారమునను, నీ సమాగమమును సంఘటింపఁజేయుట కెట్టి మార్గమును లేకుండెను.

అట్లే నేటి కవి, కుమారసంభవమునందును హతమనోరథ యైన పార్వతియొక్క లజ్జాదుఃఖములయందు కావ్యమును సమా ప్త మొనర్చును. అకాలవసంతముయొక్క రక్తవర్ణమైన యశోక పుంజమున మదనదహనమునం దుద్దీప్తమైన శివరోషాగ్నిచ్ఛటలో నతముఖియు లజ్జారుణయునైన గిరిరాజకన్య తన సమస్తమైన పుష్పాభరణములను వహించి పాఠకుని వ్యథితహృదయమునందలి కరుణారక్తపద్మముపై వచ్చి నిలిచెడిది. నేటి విమర్శకుల యభి ప్రాయమున నిచ్చటనే కావ్యముయొక్క యుజ్జ్వలతరమైన అస్త మయము. తరువాతనైన వివాహరాత్రి యత్యంతము వర్ణచ్ఛటా హీనము.

వివాహము ప్రాత్యాహ్నికసంసారమునకు భూమిక. అది నియమబద్ధసమాజమున కంగము. వివాహలక్ష్యము కేవలము సరళమైన యొకానొక పథమును నిర్దేశించును. దీనియందు విశ్రుం ఖలప్రవృత్తికిఁ జెందిన స్త్రీయభావమునకు ప్రబలనిషేధము ప్రాప్తిం చును. అందుచే నేటి కవులు వివాహవ్యాపారమును వారి కావ్య ములందు పెద్దఁజేసి చూపించుట కిచ్ఛగింపరు. ఏ ప్రేమ యుద్దామ వేగమున స్త్రీపురుషులను వారి చుట్టునున్న సహస్రబంధనల

నుండి విడఁదీయునో, వారిని ప్రపంచమునందు చిరకాలాభ్యస్త పథమునుండి బయటికి తీసుకొనిపోవునో, ఏ ప్రేమబలమున స్త్రీ పురుషులు, తమలో తామే సంపూర్ణుల మని మనస్సులందు భావింతురో, సమస్తప్రపంచమును విముఖమైనను వారికి భయము లేదని, యభావము లేదని భావింతురో, - ఏ ప్రేమోత్తేజనము నందు వారు ఘూర్ణితవేగమున విచ్ఛిన్నములును, విక్షిప్తము లును నైన గ్రహములవలె స్వతంత్రులై తమలో తామే ఘని ష్ఠులై పోయెదరో, ఆ ప్రేమయే ప్రధానముగ కావ్యమునకు విషయము.

కాళిదాసు అనాహూతప్రేమయొక్క యున్మత్తసౌందర్య ము నుపేక్షించ లేదు. దానిని తరుణలావణ్యోజ్జ్వలవర్ణములలో చిత్రించివైచినాఁడు. కాని యీ యత్యుజ్జ్వలతయందే ఆయన తన కావ్యమును ముగించివేయలేదు. ఏ ప్రశాంతవిరళవర్ణపరి ణామమునై పునకాయన కావ్యమును నడిపించుకొనిపోయెనో యచ్చటనే యాయన కావ్యమునకు పరిసమాప్తి. మహాభారత మునందలి సమస్తవృత్తాంతమును మహాప్రస్థానమున నెట్లు నిశ్శేష మైనదో, కుమారసంభవమునం దట్లే సమస్తప్రేమవేగమును కల్యాణమయసమాగమముననే పరిసమాప్తమైనది.

కుమారసంభవమును, శాకుంతలమును నొకేచోట పోల్చ కుండుట అసంభవము. ఉభయకావ్యవిషయమును నిగూఢభావ మున నొకటే యైయున్నది. ఉభయకావ్యములందును మదనుఁ డే సమాగమమును సాధింప యత్నించియుండెనో దానియందు

దైవశాపము తగుల్కొనినది. ఆ సమాగమ మసంపూర్ణమును, నసంపన్నమునునై విచిత్రశిల్పఖచితపరమసుందరమగు శయ్యలందు దైవోపహతమై యవసాన మొందినది. తదుపరి కఠిన, దుఃఖమయ, దుస్సహ విరహవ్రతద్వారమున ఏ మిళనము సంపన్నమైనదో దాని సహజరూపమే వేఱు. అది సౌందర్యముయొక్క సమస్తబాహ్యావరణములను పరిత్యజించి విశదనిర్మలవేషమున కల్యాణశుభ్రదీప్తియందు కమనీయమై విరాజిల్లినది.

స్పర్థితమదనుఁ డే సమాగమమునకు కర్తృత్వభారమును వహించియుండెనో దాని ప్రయత్న మతిప్రచురము. సమాజవేష్టనమునకు వెలుపల రెండు తపోవనములమధ్య అహేతుకమును నాకస్మికమును నైన నవప్రేమకు కవి యెట్టి కౌశలముతో, సమారోహముతో సుందరమైన యవకాశమును కల్పించినాడు!

యతీశ్వరుఁడైన కృత్తివాసుఁ డప్పుడు హిమాలయప్రాంతమున కూర్చుండి తపస్సు చేయుచుండెను. శీతలవాయువు మృగనాభిసౌరభమును, కిన్నరుల గీతికాధ్వనిని మోసుకొని, గంగాప్రవాహసించితదేవదారుశ్రేణి నాందోళిత మొనర్చుచుండెను. అచ్చట హఠాత్తుగ నకాలవసంతసమాగమము కాఁగా, సద్యఃపుష్పితాశోకనవపల్లవజాలము మర్మరితమై, దక్షిణదిగ్వధువు, యాతప్తదీర్ఘనిశ్వాస మొనర్చెను. భ్రమరయుగళ మొకే కుసుమపాత్రమునందు మధువును గ్రోలఁదొడఁగెను. కృష్ణసారమృగము స్పర్శనిమీలితాక్షియైన హరిణిని శృంగముతో కండూయన మొనర్చెను.

తపోవనమునందు వసంతసమాగమము. తపోనియమసం యమముల కఠినవేష్టనము మధ్య హఠాత్తుగ ప్రకృతియొక్క యాత్మవిస్తారము! ప్రమోదవనమధ్యమున వసంతముయొక్క వాసంతికత యింత యాశ్చర్యరూపమున దర్శన మొసఁగదు!

మహర్షి కణ్వుని మాలినీతీరవర్తియైన యాశ్రమము నందు నిల్లే. హుతహోమధూమముచే తపోవనతరుపల్లవములు వివర్ణములు. అచ్చటి జలాశయపథము లన్నియు మునులయొక్క సిక్తవల్కలస్రుతజలరేఖలచే నంకితములు. అచ్చటి విస్రబ్ధమృగము లన్నియు రథచక్రధ్వనిని, జ్యానిస్వనమును, నిర్భయముగ కుతూహలముతో నాలకించుచుండెను. కాని అచ్చటనుండికూడ ప్రకృతి దూరముగ పలాయనము కాలేదు. అచ్చటను రూక్షమైన వల్కలాంతరమునందుండి శకుంతలానవయౌవన మలక్ష్యముగ నుద్భిన్నమై దృఢపినద్ధబంధనమును నలుదెసలనుండి యొరసికొని వచ్చుచుండెను. అచ్చటను ననిలకంపితపల్లవాంగుళులతో చూతవృక్ష మొనర్చు సంకేతము సామమంత్రమున కనుగతము కాదు. నవకుసుమయౌవనయైన నవమాలిక సహకారతరువు నావేష్టించి ప్రియామిళనౌత్సుక్యమును ప్రచార మొనర్చెను.

నలుదెసలందును నకాలవసంతముయొక్క అజస్రసమారోహము. అందు గిరిరాజనందిని యెట్టి మోహనవేషమున దర్శన మొసఁగినది! అశోకకర్ణికారపుష్పభూషణములతో నామె యలంకృత. అంగమున బాలారుణవర్ణవసనము. కేసరమాలచేనైన మొలనూలు పునఃపునః స్రస్తమై పడిపోవుచుండెను. ఆమె భయ

చంచలలోచనములతో క్షణక్షణము లీలాపద్మసంచాలన మొనర్చి తృష్ణాకృష్టభ్రమరమును నివారించుచుండెను.

వేఱొక దెసయందు దేవదారుద్రుమవేదికపై శార్దూల చర్మాసనమున ధూర్జటి భుజంగపాశబద్ధమైన జటాకలాపమును, గ్రంథియుక్తకృష్ణమృగచర్మమును ధరించి ధ్యానస్తిమితలోచనములతో నిస్తరంగసముద్రమువలె నాత్మనిరీక్షణ మొనర్చికొను చుండెను.

అట్టి తాపునం దకాలవసంతమున మదనుఁ డీ విసదృశులైన స్త్రీపురుషులమధ్య సమాగమసాధనకొఱకై యుద్యతుఁడై యుండెను.

కణ్వాశ్రమమునందును నిట్లే. వల్కలవసనమైన తాపసకన్య యెక్కడ ? సాగరవేష్టితధరణీచక్రమున కధీశ్వరుఁడైన మహారా జెక్కడ ? దేశకాలపాత్రములను ముహూర్తకాలములో నిట్లువలీలగ విపర్యస్త మొనర్చెడి యా మీనకేతనుని శక్తి యెంతటిదో కాళిదాసు దానిని దర్శింపఁజేసినాఁడు.

కాని కవి యచ్చటనే యాగిపో లేదు. ఈ శక్తిసమ్ముఖముననే ఆయన తన కావ్యముయొక్క సమస్తసంపదను నిశ్శేష మొనర్చుకొన లేదు. ఆయన హఠాత్తుగ నెట్లే జయసంవాదమును తెచ్చిపెట్టినాఁడో అట్లే అనన్యమును దుర్జయమునైన శక్తిద్వారమున పూర్ణతరమైన చరమసమాగమమును ఘటింపఁజేసి యప్పుడు తన కావ్యమును ముగించినాఁడు.

దేవేంద్రునిచే ప్రేరితుఁడై, వసంతుని మోహినీశక్తి సాయముతో వచ్చిన మదనుని కేవలము పరాస్త మొనర్చి విడిచిపుచ్చలేదు. ఆ స్థానమునం దెవనిని జయింపవలసి యుండెనో యతనికేమియు పరిచ్ఛదము లేదు, సహాయము లేదు. అతఁడు తపస్సునందు కృశుఁడై యున్నాఁడు. స్వర్లోకమునందలి దేవరాజు దానిని యోజించనైన లేదు.

ఏ ప్రేమయం దెట్టి బంధమును లేదో, ఎట్టి నియమమును లేదో, ఏది యాకస్మికముగ స్త్రీపురుషుల నభిభూత మొనర్చి, సంయమదుర్గముయొక్క భగ్నప్రాకారముపై తన విజయధ్వజమును ప్రతిష్ఠించునో, కాళిదాసు దాని శక్తిని స్వీకరించినాఁడు. కాని దాని సమీపమున నాత్మసమర్పణ మొనర్చలేదు. ఏ యంధప్రేమ మనలను స్వాధికారప్రమత్తుల నొనర్చునో యది భర్తృశాపముద్వారా ఖండితము, ఋషిశాపమున ప్రతిహతము, దేవరోషమున భస్మీభూతము అగు నని యాయన మన కన్నులకు గట్టినట్లు చూపించినాఁడు. శకుంతలయం దెప్పుడు, ఆతిథ్యధర్మ మించుకయు లేదో, దుష్యంతుడే యామెకు సమస్తమో, అప్పుడు శకుంతలయొక్క యా ప్రేమయం దింక కల్యాణము మిగుల లేదు. ఏ యున్మత్తప్రేమ ప్రియజనుని వినా మిగిలిన దానినంతను విస్మృతికిఁ దెచ్చునో యది సమస్తవిశ్వనీతిని తనకు ప్రతికూల మొనర్చికొనును. అందులకే, ఆ ప్రేమ కొలఁదికాలములోనే దుర్భరమై పోవును. ఏ యాత్మసంవృతమైన ప్రేమ సమస్తజగత్తునకు ననుకూలమో, ఏది తన చుట్టునున్న చిన్న, పెద్ద, ఆత్మీయ, పరభావ

ములందు దేనినికూడ విస్మరించదో, ఏది ప్రియజనుని కేంద్రము నం దుంచి విశ్వపరిధిమధ్యమున స్వీయమంగళమాధుర్యమును వికీర్ణ మొనర్చునో, దాని ధ్రువత్వమునందు, దేవతలు గాని మానవులు గాని, ఎవ్వరు నాఘాతము కలుగఁజేయరు. ఆఘాత మొదవఁజేసినను నది దానివలన విచలితము కాదు. కాని యేది యతులతపోవనమున తపోభంగరూపమున, గృహస్థుయొక్క గృహాంగణమున సంసారధర్మమున కకస్మాత్పరాభవస్వరూపముగ నావిర్భూతమగునో యది ఝంఝువలె నితరుని నష్టపరచుటయే కాదు, స్వీయవినాశమును తానే మోసికొని తెచ్చును.

పర్యాప్త యౌవనపుంజమున నవనమితయైన యుమ సంచరించు పల్లవితమైన లతవలె వచ్చి గిరిశుని పదప్రాంతమున ప్రణమిల్లినది. ఆమె కర్ణమునుండి పల్లవమును, అలకలనుండి కర్ణికారమును విచ్యుతములై పడిపోయినవి. మందాకినీజలములందు స్ఫుటితములైన పద్మబీజములను సూర్యకిరణముల శుష్కమొనర్చి, స్వహస్తముతో గ్రుచ్చిన జపమాలను ఆమె తన తామ్రవర్ణకరపల్లవమునుండి శివహస్తమునందు సమర్పించెను. సమ్మోహనాస్త్రవిచలితచిత్తుఁడైన యోగి యొకమారు ఆమె బింబాధరమునందు తన త్రినేత్రములను వ్యాపృత మొనర్చెను. అప్పు డుమాశరీరము పులకాకులము నయనములు సాధ్వస పర్యస్తములు నైనవి. ఆమె ముఖము సాచీకృత మయ్యెను.

కాని భర్గుఁ డీ యపూర్వసౌందర్యమున నకస్మాత్తుగ నుద్భాసమానమైన మాన్మథాహ్వానమును మన్నించలేదు. కాము

దహన మొనర్చి అంతర్ధానము నందెను. ఉన్నతశిరస్కుడైన పితృమనోరథముతో సహా స్వీయమైన లలితసౌందర్య మవమానిత మైనదని తెలిసికొని లజ్జాకుంఠితయైన గిరిజను తండ్రి స్వగృహము నకుఁ గొంపోయెను.

కణ్వదుహితయు నట్లే యొక దినమున స్వీయయౌవన లావణ్యసంబంధి యగు సమస్తైశ్వర్యముతో నవమానితయై వెనుకకు మఱలవలసి వచ్చెను. దూర్వాసుని శాపము కవియొక్క రూపకము మాత్రమే, శకుంతలాదుష్యంతులయొక్క బంధనహీన మైన రహస్యమాగమము చిరకాలమువఱకైన యభిశాపముచే నభిశప్తమైనది. ఉన్మత్తతయొక్క యుజ్జ్వలోన్మేషము క్షణకాల వ్యాపిమాత్రమే. అటుపై విస్మృత్యవసాదముల యంధకార మాక్రమించును. ఇది శాశ్వతవిధానము. భిన్నభిన్న కాలము లందు, దేశదేశములందు, అవమానితలైన స్త్రీలు,–

('వ్యర్థం సమర్థ్యలలితం వపు రాత్మనశ్చ', తమ లలితమైన-దేహలావణ్యమును వ్యర్థముగ భావించి, 'శూన్యా జగామ భవనాభిముఖీ కథంచిత్' – శూన్యహృదయముతో నెట్లో గృహాభిముఖులైరి. లలితమైన దేహసౌందర్యమే స్త్రీలకు పరమ గౌరవకరమైన చరమలక్ష్యము కాదు.)

అందులకే ('నినింద రూపం హృదయేన పార్వతీ' పార్వతి రూపమును మనస్సులో నిందించుకొనెను. మఱియు 'ఇయేష సా కర్తు మవంధ్యరూపతామ్,' ఆమె తన రూపమును సఫల మొనర్చు కొనుటకు వాంఛించెను.) రూపమును సఫల మొనర్చుకొను

ఔష్ట్లు? వేషభూషాలంకరణములతోనా? ఆ పరీక్ష వ్యర్థమై పోయినది.

(‘సమాధి మాస్థాయ తపోభి రాత్మనః’ ఆమె తపస్సుచే స్వీయరూపము నవంధ్య మొనర్చికొన నెంచెను.) ఈ పర్యాయము గౌరి తరుణార్కరక్తవసనమున శరీరమును మండిత మొనర్చుకొన లేదు. కర్ణమునందు చూతపల్లవమును, అలకలయందు నవ కర్ణికారమును ధరించలేదు. ఆమె కఠోరమైన మౌంజీమేఖలతో నంగమున బభ్రువల్కలమును బంధించుకొనెను. ధ్యానాసనమున నుపవిష్టయై దీర్ఘాపాంగమును కజ్జలశూన్య మొనర్చెను. వసంత సఖుఁడును, పంచశరుఁడునైన మదనుని సాహాయ్య మిచ్చుట లేదు. కఠినసమాధినే యామె ప్రేమకు సహాయముగ నొనర్చి కొనెను.

శకుంతలయు దివ్యాశ్రమమున మదనుని మాదకతాసం బంధమైన గ్లానిని దుఃఖతాపమునందు దగ్ధ మొనర్చి కల్యాణకర మైన తపస్వినీవేషమున సార్థకమైన ప్రేమకై ప్రతీక్షించుచుండెను.

వసంతకుసుమాభరణయైన గౌరి నొక క్షణములో ప్రత్యా ఖ్యాన మొనర్చిన త్రిలోచనుఁడు దివసమునందలి శశిరేఖవలె కర్శితయు, శ్లథలంబితపింగళజటాధారిణియు నైన తపస్విని ప్రేమాల సంశయరహితమైన సంపూర్ణహృదయముతో స్వయంసమర్పణ మొనర్చికొనెను. లావణ్యపరాక్రాంతమైన యౌవనమును పరా కృత మొనర్చి, పార్వతియొక్క నిరాభరణమును, మనోమయియు నైన కాంతి, అమలమైన జ్యోతిర్లేఖవలె నుదితమైనది. ప్రార్థితుని

నామె సౌందర్యము విచలితు నౌనర్ప లేదు, చరితార్థ నొన
ర్చెను. అందు లజ్జ, ఆశంక, ఆఘాతాలోడనలు. మిగులలేదు.
ఆ సౌందర్యబంధనమును, ఆత్మ సాదరముగ వరించెను. దాని
యందు స్వీయపరాజయము ననుభవించలేదు.

ఇంతకాలమైన పిదప,

శ్లో॥ ధర్మేణాపి పదం శర్వే కారితే పార్వతీం ప్రతి।
పూర్వాపరాధభీతస్య కామస్యోచ్ఛ్వసితం మనః॥

ధర్మ మెప్పుడు మహాదేవుని మనస్సును పార్వతీదేవి కభి
ముఖముగ నాకర్షించెనో అప్పుడు పూర్వాపరాధభీతుఁడైన
కాముని మనస్సు ఆశ్వాసమున నుచ్ఛ్వసితమై పోయినది. ధర్మ
మెచ్చట రెండు హృదయముల నేకస్థ మొనర్చునో యచ్చట
మదనునితో నెవరికి నెట్టి విరోధమును లేదు. అతఁ డెప్పుడు ధర్మ
విరుద్ధముగ విద్రోహ మొనర్ప నెంచునో అప్పుడే విప్లవ ముపస్థిత
మగును. అప్పుడే ప్రేమయందు ధ్రువత్వమును, సౌందర్యమునందు
శాంతియు నుండవు. కాని ధర్మాధీనమున నతని కే నిర్దిష్టస్థాన
మున్నదో యచ్చట నతఁడును పరిపూర్ణత కంగస్వరూపము.
అచ్చట నిలిచి యతఁడు శోభను భంగ మొనర్పఁడు. కారణ
మేమన ధర్మమున కర్థమే సామంజస్యము. ఈ సామంజస్యము
సౌందర్యమును రక్షించును. మంగళమును రక్షించును. సౌందర్య
మునకును సౌభాగ్యమునకును నభేద మొనర్చి యుభయమునకు
నొక యానందమయమైన సంపూర్ణతను సమకూర్చును. సౌందర్య
మెచ్చట నింద్రియాతీతమై భావమునందు లీన మగునో యచ్చట

బాహ్యసౌందర్యమునకు తావు లేదు. దాని కిఁక భూషణముల ప్రయోజన మేమున్నది? ప్రేమ, మంత్రబలమున నే మనస్సౌం దర్యమును సృష్టించునో దానిని బాహ్యసౌందర్యనియమమున విచారించుటయే కూడనిది. శివునివంటి తపస్వికి గౌరివంటి తరుణి బాహ్యసౌందర్యముయొక్క నియమము యుక్తరీతిని సంగతము కాఁజాలదు. శివుఁడు తానై ఛద్మవేషమున నీ విషయమును తపస్యారతయైన యుమ కెఱింగించియే యుండెను. ఉమ సమా ధాన మొసఁగినది.

"మమాత్ర భావైకరసం మన స్థితమ్" అని.

నా మన స్సాతనియందే భావైకరసమై యవస్థిత మైనది. ఈ రసము భావముయొక్క రసము. అందుచేత దీని యం దిఁక మాటలు సాగవు. మన స్స్వచ్ఛట బహిర్విషయములను జయించి నది. అది స్వీయానందమును తానే సృష్టించుచున్నది. శంభుఁడును నొక దినమున బాహ్యసౌందర్యమును ప్రత్యాఖ్యాన మొనర్చి యుండెను. కాని ప్రేమదృష్టి, మంగళసృష్టి, ధర్మసృష్టి ద్వారా నే సౌందర్యమును దర్శించినదో యది తపస్యాకృశమును, నాభ రణహీనము నైనను, ఆయనను జయించినది. కారణ మేమన నా విజయమునం దాయనకు స్వీయమైన మనస్సే సహకరించినది. మనస్సుయొక్క కర్తృత్వము దానియందు నష్టము కాలేదు.

ధర్మ మెప్పుడు తాపసతపస్వినుల సమాగమసాధన మొనర్చి నదో, అప్పుడు స్వర్గమర్త్యము లీ ప్రేమకు సాక్షులై సహాయ రూపమున నవతీర్ణములై నవి. ఈ ప్రేమాహ్వానము సప్తర్షి బృంద

మును స్పృశించెను. ఈ ప్రేమోత్సవము లోకలోకాంతరము లందు వ్యాప్త మయ్యెను. దీనియం దెట్టి గూఢమైన ప్రతారణ గాని, అకాలవసంతావిర్భావము గాని, మదనుని శరపాతము గాని లేదు. దీనియందలి యమ్లానమైన కల్యాణశ్రీ సమస్తప్రపంచముయొక్క యానందసామగ్రి యయ్యెను. సమస్తవిశ్వమును నీ శుభసమాగమనిమంత్రణమున ప్రసన్నముఖమున పాల్గొని దీనిని సుసంపన్న మొనర్చివై చెను.

సమస్తసర్గమున నా విశ్వవ్యాపియైన యుత్సవ మభివర్ణితమైనది. ఈ వివాహమహోత్సవమునందే కుమారసంభవము యొక్క యుపసంహారము.

శాంతియందే సౌందర్యమునకు పూర్ణత్వము, విరోధము నందు కాదు. కాళిదాసు తన కావ్యరసప్రవాహమును, ఆ స్వర్గమర్త్యవ్యాపియు, సర్వాంగసంపన్నమునైన శాంతియందు మిళిత మొనర్చి దానిని మహాపరిణామమున వితరణ మొనర్చెను. దానిని మార్గమధ్యమున 'న యయౌ న తస్థౌ' గ నొనర్చి నిలిపియుంచ లేదు. మధ్య దాని నొకమారు విక్షుబ్ధ మొనర్చివేయుట కేవల మీ పరిణతసౌందర్యముయొక్క ప్రశాంతిని గాఢతర మొనర్చి చూపుటకుమాత్రమే యైయున్నది. దీని స్థిరశుభ్రశోభనమూర్తిని విచిత్రవేషియైన యుద్భ్రాంతసౌందర్యముతో పోల్చి యుజ్జ్వల మొనర్చుటకే యైయున్నది.

మహేశ్వరుఁ డెప్పుడు సప్తర్షుల మధ్య మహాపతివ్రతయైన యరుంధతిని చూచెనో అప్పు డాయన పత్నీసౌందర్య మన నెట్టిదో దర్శింపఁజాలెను.

శ్లో॥ తద్దర్శనా దభూత్ శమ్భో ర్భూయాన్ దారార్థ మాదరః ।
క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణమ్ ॥

'ఆమెను చూచిన శంభునికి దారగ్రహణముకొఱ కత్యంత మైన యాదర మొదవెను. సత్పత్ని యే సమస్తధర్మకార్యములకును మూలకారణము.'

ప్రతివ్రతయొక్క ముఖకాంతియందు ఏ గౌరవశ్రీ యంకిత మైనదో యది నియతాచరితకల్యాణకర్మయొక్క స్థిరసౌందర్యము. శంభుని కల్పనానేత్రమునం దా సౌందర్య మెప్పు డరుంధతి సౌమ్య మూర్తినుండి ప్రతిఫలితమై నవవధూమూర్తియైన గౌరీలలాట మును స్పృశించినదో అప్పుడు శైలసుత పొందిన లావణ్యమును, అకాలవసంతసంబంధమైన సమస్తపుష్పసంభారముకూడ నామెకు నొసంగఁజాలక పోయెను.

వివాహదినమునందు గౌరి,—

శ్లో॥ సా మంగళస్నానవిశుద్ధగాత్రీ గృహీతప్రత్యుద్గమనీయవస్త్రా ।
నిర్వృత్తపర్జన్యజలాభిషేకా ప్రఫుల్లకాశా వసుధేవ రేజే ॥

గౌరి, మంగళస్నానమున నిర్మలగాత్రియై, ధవళవసనపరి ధాన మొనర్చి నప్పుడు వర్షాజలాభిషేకావసానమున కాశసుమము లతో ప్రఫుల్లమైన వసుంధరవలె ప్రకాశింపసాగెను. ఈ మంగళ కాంతి, నిర్మలశోభ, వీనియం దేమి శ్రీ, ఏమి సంపూర్ణత! దీని యందు సమస్తక్రియలకు నవసానము, సమస్తాలంకరణములకు శేషపరిణతి. దీనియందు నింద్రసభ కెట్టి ప్రయాసమును లేదు, మదనుని మోహమున కెట్టి స్థానమును లేదు. వసంతుని యెట్టి

యానుకూల్యమును లేదు. ఇప్పు డిది స్వీయమైన నిర్మలత్వములో మాంగళ్యములో స్వయ మక్షుబ్ధము, స్వయంసంపూర్ణము.

జనసీపదము మన దేశమునందలి స్త్రీల కత్యంతగౌరవ ప్రదమైనది. సంతానావిర్భావము మన దేశమునం దొక పవిత్రమైన పరమమంగళవ్యాపారము. అందుకే మనువు స్త్రీల విషయమున, 'ప్రజార్థం హి మహాభాగాః పూజార్హా గృహదీప్తయః' వారు సంతానమునకు జన్మ నిచ్చెదరు గాన మహాభాగాః పూజనీయాః, గృహదీప్తయః యైనారు. కుమారసంభవ కావ్యమంతయు కుమారజన్మరూపమైన మహావ్యాపారోపయుక్తమైన భూమిక. మదనుఁడు గోపనముగ శరనిక్షేప మొనర్చి ధైర్యబంధనమును తెగగొట్టి యే కలయికను ఘటింపఁజేయుచుండునో యది పుత్రజన్మమునకు యోగ్యమైనది కాదు. ఆ కలయిక పరస్పరకామనకే దోహద మొనర్చును. అందు పుత్రకామన లేదు. కవి యందులకే మదనుని బూది యొనర్పఁజేసి, గౌరిచే తపస్సు చేయించెను. కవి ప్రవృత్తియొక్క చాంచల్యస్థానమునందు ధ్రువనిష్ఠాసంబంధమైన యేకాగ్రతను, సౌందర్యమోహస్థానమునందు కల్యాణకమనీయద్యుతిని, వసంతవిహ్వలవనభూమియందు ఆనందనిమగ్నవిశ్వమును నిలిపెను. అంతట కుమారసంభవమునకు సూచన జరిగినది. కుమార సంభవ వ్యాపార మేమో తెలియఁజేయుటకే కవి మదనుని శివరోషానలమున నాహుతి యొనర్చి, యనాథయైన రతిని విలపింపఁజేసెను.

శాకుంతలమునందును ప్రథమాంకమున ప్రేయసితో దుష్యంతుని వ్యర్థప్రణయమును, శేషాంకమున భరతజననితో ఆయనకు సార్థకసమాగమమును కవి యంకిత మొనర్చెను.

ప్రథమాంకము చాంచల్యముచే, నౌజ్జ్వల్యముచే పూర్ణ మైనది. దానియం దుద్వేలయౌవనయైన ఋషికన్య, కౌతుకోచ్ఛ లితలైన సఖీద్వయము, నవపుష్పితయైన వనజ్యోత్స్న, సౌరభ భ్రాంతమైన మూఢభ్రమరము, తర్వంతరాళవర్తియైన ముగ్ధరాజు, తపోవనమునందలి యొక్క నిభృతప్రాంతము నాశ్రయించుకొని సౌందర్యమదమోదితమైన యొక యపురూపదృశ్యము నుద్ఘాటిత మొనర్చెను. ఈ ప్రమోదస్వర్గమునుండి దుష్యంతప్రేయసి అప మానమున నిర్వాసితయై పోయెను. కాని కల్యాణరూపిణి, భరత జనయిత్రి యే దివ్యతపోభూమియం దాశ్రయమును పొందెనో యచ్చటి దృశ్యము వేఱొకరూప మైనది. అచ్చట తాపసకన్య లాలవాలములందు జలసేచన మొనర్చుట లేదు. కృతకపుత్రుఁ డైన మృగశిశువును నీవారముష్టిప్రదానము ద్వారా పాలన మొనర్చుట లేదు. లతాభగినిని స్నేహదృష్టితో నభిషిక్త మొన ర్చుట లేదు. అచ్చట తరులతాపుష్పపల్లవముల సముదయచాం చల్యమున కొకానొక బాలకుఁ డధికారము వహించి కూర్చుండి యుండెను. సమస్తవనభూమియొక్క యంకము నతఁ డాక్రమించు కొనినాఁడు. అచ్చట సహకారశాఖలు మొగ్గ తొడుగునా లేదా, నవమాలికయందు పుష్పమంజరులు వికసించునా లేదా, యను విషయ మెవరి కంటను బడదు. స్నేహవ్యాకులలైన తపస్వినీ మాతలు దుర్విनీతబాలకునితో నస్థిరలై యుండిరి.

ప్రథమాంకమునందు శకుంతలతో పరిచయ మేర్పడుటకు పూర్వము దూరమునం దుండి యామె నవయౌవనలావణ్యలీల దుష్యంతుని ముగ్ధునిఁజేసి యాకృష్టు నొనర్చినది. శేషాంకము నందు శకుంతలాతనయుఁ డామె లావణ్యాస్థానమును వశపఱచు కొని రాజుయొక్క యంతరతమమైన హృదయము నార్ద్రి మొనర్చివేసెను.

ఈ సమయమున-

'వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణిః'

మలినధూసరవసనయు, నియమనిష్ఠలచే క్షామముఖియు, ఏకవేణీధరయు, విరహవ్రతచారిణియు, శుద్ధశీలయు నగు శకుంతల ప్రవేశించెను. ఇట్టి తపస్సున కనంతరమున నక్షయవరలాభ మొద వదా? సుదీర్ఘవ్రతచారణమున ప్రథమసమాగమమునందలి గ్లాని దగ్ధమై, పుత్రశోభయందు పరమభూషితమైన కరుణకల్యాణ కాంతి జననీమూర్తి వికసితమైనది. ఆమె నెవరు ప్రత్యాఖ్యాన మొనర్తురు!

ధూర్జటియందు గౌరి యెట్టి యభావమును, యెట్టి దైన్య మును చూడలేదు. ఆమె ఆయనను భావచక్షువుతో దర్శించి యుండెను. ఆ దృష్టియందు ధన, రత్న, రూప, యౌవనముల కెట్టి గణ్యతయు లేకుండెను. శకుంతల ప్రేమ తీవ్రమైన యవ మానము జరిగిన మీదట కూడ పునస్సమాగమకాలమునందు దుష్యంతునియం దెట్టి యపరాధమును దర్శించ లేదు. దుఃఖితు రాలి నేత్రద్వయమునుండి కేవల మశ్రువులు రాలఁజొచ్చెను.

ప్రేమ లేనిచోట సద్భావమునకు, దైన్యమునకు, కురూపమునకు నంత ముండదు. ప్రేమ లేనిచోట నడుగడుగునను నపరాధమే. గౌరియొక్క ప్రేమ స్వీయసౌందర్యమునందు, సంపదయందు సన్న్యాసిని సుందరునిగ, సీశ్వరునిగ నొనర్చి దర్శించినది. శకుంతల ప్రేమయు నట్లే స్వీయమంగళదృష్టియందు దుష్యంతుని సమస్తాప రాధముల దూరీకృత మొనర్చి దర్శించెను. యువతీయువకుల మోహముగ్ధమైన ప్రేమయం దింత క్షమ యెక్కడ? భరతజనని పుత్రకు నెట్లు గర్భమున ధరించియుండెనో సహిష్ణుతామయ మైన క్షమనుకూడ నట్లే తపోవనమున నుపవిష్టయై స్వీయాంతర్య మునందు పరిపూర్ణ మొనర్చుకొనెను. బాలుడైన భరతుడు దుష్యంతుని చూపి యడిగినాడు.— 'తల్లీ! నన్ను పుత్రుం డను చున్న యీాయన యెవరు?' అని. శకుంతల సమాధాన మిచ్చినది: 'బిడ్డా! నీ భాగ్యము నడుగుము' అని. దీనియం దెట్టి యభి మానమును లేదు. దీని యర్థ మేమన, భాగ్యము ప్రసన్న మగుచో దీనికి సమాధానమును పొందుదువు! అని చెప్పి, రాజు యొక్క ప్రసన్నత నపేక్షించియుండెను. దుష్యంతుం డామెను ప్రత్యాఖ్యాన మొనర్చుట లేదని తెలిసినంతనే నిరభిమానిని యైన స్త్రీ విగళితచిత్తమును దుష్యంతచరణతలమున పుష్పాంజ లిగ సమర్పించెను. తన దురదృష్టము వినా మఱి యెవరి దే యప రాధము నామె చూడలేదు. ఆత్మాభిమానముతో నితరుని విశ్లే షించి చూచినచో నతని దోషము, నపరాధము పెద్దదై కను పట్టును. భావముద్వారా, ప్రేమద్వారా సంపూర్ణ మొనర్చి చూచినచో నది యంతయు నెచ్చటికో యదృశ్యమై పోవును.

శ్లోకమునందలి యొక చరణ మన్యచరణము నపేక్షించు నట్లే శకుంతలాదుష్యంతుల ప్రథమసమాగమము సంపూర్ణతా సిద్ధికై ఈ ద్వితీయసమాగమము నత్యంత మాకాంక్షించును. శకుంతలయొక్క యింతటి దుఃఖమును నిష్ఫల మొనర్చి శూన్యమునం దాందోళితముగ నుంచుట పొసఁగనిది. యజ్ఞప్రయత్నమునందు కేవల మగ్నిమాత్రమే ప్రజ్వరిల్లుచో, దానియం దన్నపాకము జరుగనిచో, నిమంత్రితు లేమయ్యెదరు ? శాకుంతలానాటకము నందలి శేషాంకము బాహ్యరీతి ననుసరించి కాక అంతకంటెను గభీరతరమైన నియమప్రవర్తననుండి యుద్భూతమైనది.

కుమారసంభవ శాకుంతలములందలి కావ్యవిషయ మొకటే యైనట్లు గమనింపఁబడినది. ఉభయకావ్యములందును కవి మోహమునం దేది యకృతార్థమో, మంగళమునం దది పరిసమాప్త మని; ధర్మము ధారణ చేసి యుంచిన సౌందర్యమే ధ్రువమైన దని; ప్రేమయొక్క శాంతసంయతకల్యాణరూపమే శ్రేష్ఠరూప మని; బంధనమునందు యథార్థమైన శ్రీయును, ఉచ్ఛృంఖలతయందు సౌందర్యమునకు శీఘ్రవికృతియు నని చూపినాఁడు. భారతవర్షమునందలి పురాతనకవి ప్రేమనే ప్రేమకు చరమగౌరవస్థానముగ స్వీకరించ లేదు, మంగళమునే ప్రేమకు పరమార్థముగ ఘోషించినాఁడు. ఆతని బుద్ధియందు స్త్రీపురుషుల మధ్య ప్రేమ వంధ్యమైనచో, అది తనయందే తాను సంకీర్ణమై యుండిపోయినచో, కల్యాణప్రాదుర్భావమునకు దోహద మీయనిచో, ప్రపంచమునందు పుత్రపుత్రికలు, అతిథిఅభ్యాగతులు,

ఇరుగుపొరుగు మొదలైన వారలయందు విచిత్రసౌభాగ్యరూప మున వ్యాప్తము కానిచో నది సుందరమును కాదు, దానికి స్థాయిత్వమును లేదు.

ఒకవైపున గృహధర్మముయొక్క కల్యాణబంధనము, వేఱొకవైపున నిర్లిప్తమైన యాత్మబంధనమోచనము, నీ రెండును భారతవర్షమునందలి విశేషభావములు. ప్రపంచమునందు భారత వర్షము బహుజనులతో, ననేకసంబంధములలో వ్యాపృతమై యున్నది. ఎవ్వరి నది పరిత్యజింపఁజాలదు. తపస్సుయొక్క యాస నమునందు భారతవర్షము ఏకాకి. రెంటియందును సమన్వయ భావ మున్న దని, రెండిటి మధ్యను గమనాగమనమార్గము, ఆదానప్రదానసంపర్క మున్న దనియు కాళిదాసు తన శాకుంతల కుమారసంభవములందు స్పష్ట మొనర్చినాఁడు. ఆయన తపో వనమునందు సింహశాబకములు మానవశిశువుతో నెట్లు ఖేలన మొనర్చుచున్నవో యట్లే ఆయన కావ్యతపోవనమునందు యోగి యొక్క భావము, గృహస్థునియొక్క భావము సంశ్లిష్ట ములై యున్నవి. మన్మథుఁ డేతెంచి యా సంబంధములను విచ్ఛిన్న మొనర్ప యత్నించియుండుటచే కవి యాతనిపై వజ్రి నిపాత మొనర్చి, తపస్సుద్వారా కల్యాణమయమైన గృహముతో ననాసక్త తపోవనముయొక్క పవిత్రసంబంధమును పునః స్థాపించి నాడు. ఋష్యాశ్రమకుడ్యములపై నాయన గృహస్థుల పట్టణము లను నిర్మించినాఁడు. స్త్రీపురుషసంబంధమును కాముని హఠా దాక్రమణమునుండి యుద్ధరించి తపఃపూతమై నిర్మలమైన యోగా

సనముపై ప్రతిష్ఠిత మొనర్చినాఁడు. భారతవర్షీయసంహితల యందు స్త్రీపురుషుల సంయతసంబంధము కఠినమైన యనుశాస నాకారమున నాదిష్టము. కాళిదాసుకావ్యములం దదియే సౌం దర్యోపకరణములతో నిర్మితమైనది. ఆ సౌందర్యము శ్రీ, హ్రీ, కల్యాణములం దుద్భాసమానమైనది. అది గభీరతాదృక్పథము నుండి నితాంత మేకాగ్రము, వ్యాప్తిదృష్ట్యా విశ్వమున కాశ్రయ స్థానము. అది త్యాగముద్వారా, సంపూర్ణమైన దుఃఖము ద్వారా చరితార్థమును, ధర్మముద్వారా ధ్రువమును నై యున్నది. ఆ సౌందర్యమునందే స్త్రీపురుషుల దుర్నివార, దురంతప్రేమ యొక్క ప్రళయవేగము స్వయముగ సంయతమై కల్యాణమహో దధియందు స్తబ్ధతాలాభము నందినది. అందుచేతనే యది బంధన హీనమైన దుర్ధర్షప్రేమకంటే మహత్తరమును విస్మయకరమును నై విరాజిల్లుచున్నది.



# శాకుంతలము

(ఆంగ్లకవి షేక్స్పియర్ రచించిన టెంపెస్ట్ నాటకముతో మహాకవి కాళిదాస విరచితమైన శాకుంతలమునకు గల సాదృశ్యము సహజముగనే మనస్సునకు తట్టుచున్నది. వీనియందలి బాహ్య సాదృశ్యమును, ఆంతరమైన యనైక్యమును యనుశీలన మొనర్చి చూడఁదగి యున్నది.

నిర్జనప్రదేశమున లాలితయైన మిరాండాతో రాజకుమారుడైన ఫెర్డినాండ్ యొక్క ప్రణయము, తాపసకన్యయైన శకుంతలతో దుష్యంతుని ప్రణయమున కనురూపమైనది. ఘటనాస్థల సాదృశ్యముకూడ నున్నది. ఒక పక్షమున సముద్రవేష్టిత ద్వీపము, వేఱొక పక్షమున మహారణ్యామధ్యమందలి తపోవనము.)

ఈ రీతిగ నీ రెండు ఆఖ్యానముల మూలమునందును యైక్యమును దర్శింతుము. కాని కావ్యరసాస్వాదమున విభిన్నములని చదివినంత మాత్రముననే మనస్సునకు స్ఫురించును. ఐరోపీయ కవికులగురువైన గోథే యొకే యొక్క గీతమునందు శకుంతలా నాటకమును సమాలోచన మొనర్చియుండెను. ఆయన కావ్యమును ఖండఖండములుగ విచ్ఛిన్న మొనర్చి యుండలేదు. ఆయన గీత మొకే దీపవర్తికయొక్క శిఖవలె నున్నది. కాని యది దీపశిఖవలెనే సమగ్ర శాకుంతలనాటకము నొకే ముహూర్తమున నుద్భాసిత మొనర్చి చూపించు నుపాయము. 'తరుణ

వత్సరమునందలి పుష్పమును, పరిణతవత్సరమునందలి ఫలమును నొక్కచో నెవరేని దర్శింప నెంచుచో, స్వర్గమర్త్యములు నొక్కచో దర్శింప నెంచినచో శాకుంతలనాటకమునందు మాత్ర మే యది సాధ్య' మని ఆయన యొక్క వాక్యములో తెలియఁ జేసియుండెను.

అనేకు లీ మాటను కవియొక్క భావావేగముగ భావించి, లఘుభావమునఁ జూతురు. అతిస్థూలభావమున నట్టివారు గోథే మహాకవి యభిప్రాయమున శాకుంతల పరమోపాదేయ మని మాత్రమే భావింతురు. కాని యథార్థమున నంతియే కాదు. గోథే దృష్టియందీ గీత మానందమున కత్యుక్తిమాత్రమే కాదు. ఇది రసజ్ఞుని యనుశీలనము. దీనియందు విశేష మున్నది. శకుంతలమునం దొకానొక గభీరమైన పరిణతికి సంబంధించిన భావ మున్నదని కవి విశేషభావముననే తెల్పియున్నాఁడు. ఆ పరిణతి పూవునుండి ఫలమునకైన పరిణతి. మర్త్యమునుండి స్వర్గమున కైన పరిణతి. మేఘదూతమునందు పూర్వమేఘము, ఉత్తర మేఘము వలెనే పూర్వమేఘమున విచిత్రసౌందర్యమున పర్య టించి, ఉత్తరమేఘమున నలకాపురియొక్క నిత్యసౌందర్యమునం దుత్తీర్ణము కావలసియున్నట్లే, శాకుంతలమునం దొకటి పూర్వ సమాగమమును, వేఱొకటి యుత్తరసమాగమమును నై యున్నవి. ప్రథమాంకనిర్దిష్టమైన యీ మర్త్యసంబంధియగు చంచలసౌంద ర్యమయవిచిత్ర పూర్వమిళనమునుండి స్వర్గతపోవనమునందలి శాశ్వతానందమయ ఉత్తరమిళనమునకైన యాత్రయే యభి

జ్ఞానశాకుంతల నాటకము. ఇది విశేషించి కేవల మెట్టి భావావతరణమును కాదు. ఎట్టి చారిత్రకవికాసమును కాదు. ఇది సమగ్రకావ్యము నొక లోకమునుండి వేఱొక లోకమునకు తీసికొనిపోవును. ప్రేమ్నను స్వభావసౌందర్యసీమనుండి కల్యాణమయ సౌందర్యముయొక్క అక్షయస్వర్గధామమునం దుత్తీర్ణ మొనర్చివేయును.

స్వర్గమర్త్యముల యీ సమ్మేళనమును, కాళిదా సత్యంత సహజముగ నిర్వహించినాఁడు. పుష్పము నాయన అతిస్వాభావికముగ ఫలములోనికిఁ బరిణమింపఁ జేసినాఁడు. మర్త్యసీమ నాయన యిట్టె స్వర్గధామముతో కలిపివేసినాఁడు. రెండిఁటిమధ్య నెట్టి వ్యవధానము నెవరి కన్నులకును పొడఁగట్టదు. ప్రథమాంకమున శకుంతలా దుష్యంతముసందు కవి మర్త్యలోకసంబంధియైన మృత్తికను గుప్తముగ నుంచలేదు. దానియందు వాసనాప్రభావ మెంతదూరము విద్యమానమో దానిని శకుంతలాదుష్యంతుల యుభయుల వ్యవహారమునందును కవి స్పష్టముగ ప్రదర్శించి యున్నాఁడు. యౌవనమత్తతయందలి హావభావలీలాచాంచల్యములు, పరమమైన లజ్జతో ప్రబలమగు నాత్మప్రకాశమునకైన సంగ్రామమునంతను కవి సువిదిత మొనర్చెను. ఇది శకుంతల సరళతకు నిదర్శనము. అనుకూలపరిస్థితులయం దీ భావావేశము యొక్క యాకస్మికావిర్భావముకోఱ కామె మొదటినుండియు సిద్ధముగ లేదు. ఆమె తన్ను తాను నిగ్రహించుకొనుటకు, గోపన మొనర్చుకొనుటకు నుపాయమును పన్ని యుంచికొన

లేదు. వ్యాధు నెఱుఁగని హరిణి విద్ధ యగుటయందు విలంబ మగునా! శకుంతల పంచశరుని బాగుగ నెఱుఁగదు. అందువల ననే యామె హృదయస్థాన మరక్షితమై యుండెను.

ఆమెకు కందర్పునియందు గాని, దుష్యంతునియందు గాని, యవిశ్వాసము లేదు. మృగయావిహారమున కాస్పదమైన యరణ్యమునందు వ్యాధుఁ డెట్లు విశేషించి యాత్మగోపన మొనర్చికొనవలసియుండునో యట్లే సహజముగనే బహుజను లతో సంసర్గమున కానుకూల్యము సర్వదా యేర్పడుచుండు సమాజమునందు మీనకేతనుఁ డత్యంతసావధానముగ తన్నుఁ దాను ప్రచ్ఛన్న మొనర్చికొని మసలవలసి యుండును. తపో వనమునందు హరిణి యెట్లు అశంకితయో తపోవనమునందలి బాలికయు నట్లే యశంకిత.

శకుంతలా పరాభవ మెట్లతిసహజముగ చిత్రితమైనదో యట్లే పరాభవమైన మీఁదటకూడ నామె చరిత్రమునందలి గభీర తరమైన పావిత్ర్యము, స్వాభావికాక్షుణ్ణసతీత్వము నత్యనాయాస ముగనే పరిస్ఫుటమైనవి. ఇదికూడ నామె సరళతకు నిదర్శనమే. గృహాలంకారమైన కృతకపుష్పమున ధూళి నొక్కదినమున నైన దులపకపోయిన నడువదు. కాని యరణ్యకుసుమముయొక్క ధూళిని దులుపుటకై సేవకులను నియోగించ నక్కరలేదు. అది యనా వృతమై యుండును. దాని దేహమునందు ధూళి యంటుకొనును. ఐనను అది సహజముగ తన సౌందర్యమును, నిర్మలత్వమును రక్షించుకొనుచునే యుండును. శకుంతలకును ధూళి యంటుకొని

యుండెను. దాని నామె తెలిసికొనఁజాలకయే యుండెను. ఆమె యరణ్యమునందలి సరళయైన మృగివలె, నిర్ఝరజలధారవలె మలినతాసంసర్గమునందును నశ్రమముగనే నిర్మల యైనది.

కాళిదాసు తన యీ యాశ్రమపాలితయు, యుద్భిన్న యౌవనయునైన శకుంతలను సంశయవిరహితస్వభావపథమునందు వదలివేసెను. తుదిదాఁక నెచ్చటను నామె కాటంక మొదవించ లేదు. వేఱొక దెస నామె నప్రగల్భగను, దుఃఖశీలగను, నియమ చారిణినిగను, సతీధర్మములకు నిదర్శనరూపిణిగను నిలిపి వికసింపఁ జేసెను. ఒకవైపున తరులతాఫలపుష్పములవలె నామె యాత్మ విస్మృతస్వభావధర్మానుగత. వేఱొకవైపున నామె యంతరతర మైన నారీప్రకృతి సంయతము, సహిష్ణువును. ఆమె యేకాగ్రతపః పరాయణ. కల్యాణధర్మశాసనమున నేకాంతనియంత్రిత. కాళి దాసు అపురూపకౌశలమున తన నాయికను లీలాధైర్యముల యొక్కయు, స్వభావనియములయొక్కయు, నదీసముద్రముల యొక్కయు మనోహరత్వముపై స్థాపించి చూపించినాడు. ఆమె తండ్రి ఋషి, తల్లి యప్సరస. వ్రతభంగమునం దామె జననము, తపోవనమున నామె పాలనము. తపోవనస్థానమున నిఁక స్వభా వము, తపస్సు, సౌందర్యము, సంయమము నేకత్ర మిళితమైనవి. అచ్చట సమాజముయొక్క కృత్రిమవిధానము లేదు, ఐనను ధర్మముయొక్క కఠోరనియమము విరాజమానమై యున్నది. గాంధర్వవివాహవిషయము నట్టిదే. దానియందు స్వభావము నందలి యుద్దామత యున్నది. ఐనను వివాహమునందలి సామా

జికబంధనము నున్నది, బంధనాబంధనముల సంగమస్థానమున స్థాపితమై శకుంతలానాటక మొక విశేషమైన యపూర్వత్వమును సంపాదించుకొనఁ జాలినది. దానియందలి సుఖదుఃఖముల మిళన విచ్ఛేదములు సమస్తము నీ యుభయముయొక్క ఘాతప్రతిఘాత మునందే. గోథే తన సమాలోచనమునం దెందులకు శాకుంతల మున రెండు విసదృశముల కేకత్ర సమావేశములను ఘోషించి యుండెనో, దాని నభినివేశపూర్వకముగ చూచినచే తెలియఁ గలదు.

టెంపెస్టునం దీ భావము లేదు. ఎందు కుండును? శకుంత లయు సుందరియే, మిరాండాయు సుందరియే. అందుల కని యుభ యుల తీరుదీయములం దవికలసాదృశ్యము నెవరు ప్రత్యాశింపఁ గలరు? ఉభయులయందును స్థితిగతులలో సంఘటనలలో ప్రకృ తిలో సంపూర్ణప్రభేద మున్నది. మిరాండా శైశవమునుండి యెట్టి నిర్జనత్వమునందు పాలింపఁబడినదో శకుంతల కట్టి నిర్జన త్వము లేకుండెను. మిరాండాకు ఏకమాత్రమైన పితృసాహచర్యమే గొప్పగా నుండెను. అందుచే నామె ప్రకృతి స్వాభావికముగ విక సించుట కానుకూల్యమును పొందలేదు. శకుంతల సమానవయ స్కలైన సఖీజనముతో వర్ధిల్లినది. వారు పరస్పర ముత్తాపము నందును, అనుకరణమునందును, భావవినిమయమునందును, హాస పరిహాసములందును, కథోపకథనమునందును, స్వాభావికవికాస మును పొందియుండిరి. శకుంతల యహరహము కణ్వ మహర్షి వెనువెంటనే యుండిపోయినచో నామె యున్మేషమున కంతరాయ

మొదవియుండెడిది. అప్పుడామె సరళత యజ్ఞతకు నామాంతరమై, యామెను స్త్రీరూప ఋష్యశృంగునిగ నొనర్పజాలి యుండెడిది. వస్తుతః శకుంతలయొక్క సరళత స్వాభావగతము, మిరాండా సరళత బహిర్ఘటనాసంబంధి. ఉభయులమధ్య గల యవస్థాప్రభేదమువనే యిది సంగతమైనది. మిరాండా యందువలె శకుంతల యందలి సరళత యజ్ఞానముద్వారా నలుదెసలందును పరిరక్షితము కాదు. శకుంతల యౌవనము సద్యోవికసిత మైనది. కౌతుకాన్వితలైన సఖీమణులా సంబంధమున నామె నజ్ఞాతయౌవననుగ నుండనీయ లేదు. దీనిని మనము ప్రథమాంకముననే చూడజాలుదుము. ఆమె లజ్జించుటను గూడ నేర్చికొనెను. కాని యిది యంతయు బహిర్విషయము, ఆమె సరళత గభీరతరము, ఆమె పవిత్రత తలస్పర్శి. బాహిరమైన యెట్టి యభిజ్ఞతయు నామెను స్పృశింపఁజాలక పోయెను. కవి యీ విషయమును తుదిదాఁక చూపించినాఁడు. శకుంతలా సరళత యాభ్యంతరము. ఆమె ప్రపంచమునం దేమియు తెలియనిది కాదు. కారణ మేమన తపోవనము సమాజమునకు పూర్తిగ బహిర్వర్తి కాదు. తపోవనమునందును గృహధర్మము పాలింపఁబడెడిది. బహిస్సంబంధమున శకుంతల యనభిజ్ఞయే కాని యజ్ఞ కాదు. కాని యామె యంతరమునందు విశ్వాసముయొక్క సింహాసనము ప్రతిష్ఠితము. ఆ విశ్వాసనిష్ఠాసంబంధమైన సరళత యామెను క్షణకాలముకొఱకు చ్యుత నొనర్చెను, కాని చిరకాలమువఱకు నుద్ధరించెను. దారుణతమమైన విశ్వాసఘాతుకతయొక్క యాఘాతమునందు సైత

మూమె నది ధైర్యక్షమాకల్యాణములందు స్థిరముగ నిలిచెను. మిరాండా సరళత కగ్నిపరీక్ష జరుగలేదు. సంసారజ్ఞానముతో పాటు ఆమె కాఘాతము ఘటిల్ల లేదు. మన మూమెను కేవలము ప్రథమావస్థయందే చూచినాము. కవి శకుంతలను ప్రథమస్థితి నుండి చరమస్థితివఱకు చూపించినాఁడు.

ఇట్టి తావునందు సాదృశ్యసమాలోచన వ్యర్థముగనే తోచును, మనము దానిని స్వీకరింతము. ఈ కావ్యద్వితయము నొకదాని ప్రక్క నొకదాని నుంచినచో నుభయమునందలి యైక్యముకంటె యనైక్యమే యెక్కువగ తోచును. ఆ యనైక్యమును గూర్చిన యాలోచనయందుసైతము రెండు నాటకము లను పరిష్కరించి తెలిసికొనుటకు సహాయము లభింపఁగలదు. మన మీ యాశతోనే యీ వ్యాసమునందు ప్రసక్తులమైతిమి.

మిరాండాను మనము తరంగాఘాతముఖరితమై శైల బంధురమును జనహీనమును నైన ద్వీపమునందు చూచినాము. కాని యీ ద్వీపమునందలి ప్రకృతితో నామె కెట్టి ఘనిష్టసంబం ధము లేదు. ఆమెకు శైశవమునుండి మాతృతాసంబంధమైన యీ భూమినుండి విశ్లేష మొదవినచో మఱేప్రదేశమునం దామె కీక యాకర్షణయే లేదు. మిరాండా యచ్చట మానవసంసర్గమును పొందలేదు. ఈ భావముమాత్రమే యామె చరిత్రమునందు కేవ లము ప్రతిఫలిత మైనది. కాని యచ్చటి సముద్రపర్వతములతో నామె యంతఃకరణమున కెట్టి భావాత్మకమైన యోగముసు మనము గుర్తించలేము. నిర్జనద్వీపమును మనము ఘటనా వ్యాప దేశమున కవి వర్ణనయందు మాత్రమే చూచెదము. కాని మిరాం

డాలోనుండి చూడలేము. ఈ ద్వీపము కేవలము కావ్యమునందలి యాఖ్యానసంబంధముగనే యావశ్యకము, కథాసంబంధముగ నంత యావశ్యకము కాదు.

శకుంతల విషయమున నిట్లు చెప్పఁజాలము. శకుంతల తపోవనమున కంగీభూతమై యున్నది. తపోవనమును దూరమున నుంచి నచో కేవలము నాటకమునందలి యాఖ్యానభాగము మాత్రమే కాదు, స్వయముగ శకుంతలయే యసంపూర్ణ యగును. శకుంతల మిరాండావలె స్వతంత్ర కాదు. ఆమె తన పరిసరములతో నేకాత్మ భావమున సంశ్లిష్టమైనది. ఆమె మధురచరిత్ర మరణ్యాచ్ఛాయ యందును, మాధవీలతాపుష్పమంజరులలోను వ్యాప్తమై వికసన ముఁ జెందినది. పశుపక్షుల యకృత్రిమసౌహార్దముతో ఘనిష్ట భావమున నాకృష్టమైనది. కాళిదాసు తన నాటకమునందు వర్ణించిన బహిఃప్రకృతి నచ్చటనే పడవేసి యుంచలేదు. దానిని శకుంతలాచరిత్రమునం దున్మేషిత మొనర్చెను. శకుంతలను కావ్యగత పరివేష్టనమునుండి బయటికి తీసుకొనివచ్చుట యసంభవమైన విషయము.

ఫెర్డినాండ్ తో ప్రణయవ్యాపారమునందే మిరాండా యొక్క ప్రధానపరిచయము. ఇఁక తుపానులో నౌకాభంగమున హతభాగ్యులైన వారికొఱకు వ్యాకులతఁ జెందుటయం దామె వ్యధితహృదయముయొక్క కారుణ్యము ప్రకటమైనది. శకుంతలా పరిచయ మింకను మెక్కువ వ్యాపకమైనది. దుష్యంతుఁడు కనఁబడకుండినను నామె మాధుర్యము విచిత్రభావమున ప్రకాశితమై

కన్నులకు గట్టెడిదే. ఆమె హృదయలతిక చేతనాచేతనముల నన్నిం టిని స్నేహలలితమైన వేష్టనమునందు సుందరముగ నొనర్చి బంధించినది. ఆమె తపోవనతరుసమూహమునకు జలసేచన మొనర్చుట పితృనిర్దేశమునసే కాదు. వానియం దామెకు సోదర స్నేహము గలదు. ఆమె నవకుసుమయౌవన యగు వనజ్యోత్స్నను స్నిగ్ధదృష్టితో తన కోమలహృదయమున నెలకొల్పుకొనెను. శకుంతల తపోవనమును వీడి పతిగృహమున కేగునప్పు డడుగడుగు నను నామె యాకర్షణమే, అడుగడుగునను నామె వేదనయే. వనముతో మానవవిశ్లేష మింతటి కరుణజనకమైన విషయము కాగల దనునది జగత్తునందలి సమస్తసాహిత్యమునం దొక్క- యభిజ్ఞానశాకుంతలమునందలి చతుర్థాంకమునందే కన్పట్టును. ఈ నాటకమునందు స్వాభావధర్మనియమముల కెట్టి కలయిక యొద వినదో, మనుష్యునికిని ప్రకృతికిని యట్టి కలయికయే యొదవినది. విసదృశమునం దిట్టి యైక్యము భారతవర్షమునందు కాక నితర దేశములం దెచ్చటను సంభవింపని దని తోఁచును.

టెంపెస్ట్ నందు బహిఃప్రకృతి 'ఏరియల్'నందు మానవా కారమును ధరించినది. కాని అప్పటికిని మానవుని యాత్మీయత నుండి దూరమునసే నిలిచిపోయినది. మానవునితో నతనికి యని చ్ఛాపూర్వకమైన భృత్యునియొక్క- సంబంధము. అతడు స్వతం త్రుఁడు కాగోరును. కాని మానవ శక్తి ద్వారా పీడితుఁడును, ఆబద్ధుఁడునునై దాసునివలె పనిచేయును. అతని హృదయము నందు స్నేహము లేదు. కన్నులం దశ్రులు లేవు. మిరాండా

యొక్క నారీహృదయము సైతము మాతని యెడ స్నేహమును విస్తరింపఁజేయ లేదు. ద్వీపమును వీడి వెడలు నప్పుడు 'ప్రాస్పెరో' 'మిరాండా' లతో ఏరియల్‌నకు స్నిగ్ధమైన వియోగసంభాషణ జరుగలేదు. టెంపెస్ట్‌నందు పీడనము, శాసనము, దమనము; శాకుంతలమునందు ప్రీతి, శాంతి, సద్భావము నున్నవి. టెంపెస్ట్ నందు ప్రకృతి మానవాకారమును ధరించికూడ అతనితో హృదయసంబంధమున ఆబద్ధము కాలేదు. శాకుంతలమునందు చెట్టుచేమలు పశుపక్ష్యాదులు నాత్మభావమును రక్షించుకొని గూడ మానవునితో మధురమైన యాత్మీయభావమున మిళితమై పోయినవి.

శాకుంతలమునం దారంభముననే, ధనుర్బాణధారియైన రాజు నుద్దేశించి 'భో! భో! రాజన్! ఆశ్రమమృగోఽయం న హంతవ్యో న హంతవ్యః' అను కరుణాజనకమైన నిషేధ ముత్థిత మైనప్పుడే కావ్యమున నొక మూలస్వరము ధ్వనితమై యొసఁగి నది. ఈ నిషేధ మాశ్రమమృగముతో పాటు తాపసకన్యయైన శకుంతలనుకూడ కరుణాచ్ఛాదనమున నావృత మొనర్చుచున్నది. ఋషి యనుచున్నాఁడు.

శ్లో॥ నఖలు నఖలు బాణ స్సన్నిపాత్యోఽయ మస్మిన్ ।
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః ।
క్వ బత! హరిణకానాం జీవితం చాతిలోలమ్ ।
క్వ చ! నిశితనిపాతా వజ్రసారా శ్శరాస్తే॥

ఈ మాట శకుంతలయెడలను వర్తించును. శకుంతలయెడలను రాజుయొక్క ప్రణయశరనిక్షేపము దారుణము. ప్రణయ వ్యాపారమునందు రాజు పరిపాకము నొందినవాఁడును, కఠినుఁడును. ఎంత కఠినుఁడో యన్యత్ర దానికి వివరణ మున్నది. ఇక నీ యాశ్రమపాలితయైన బాలికయొక్క యనభిజ్ఞతయు, సరళతయు నతిసుకుమారమును, సకరుణమును. కాతరవాక్యమునందు మృగ మెట్లు రక్షణీయమైనదో శకుంతలయు నట్లే రక్షణీయ— 'ద్వా అపి ఆరణ్యకౌ.'

మృగము నుద్దేశించిన యీ కరుణవాక్యముయొక్క ప్రతిధ్వని విలీనమైనదో లేదో అంతలోనే వల్కలవసనయైన తాపస కన్య సఖులతో నాలవాలమున జలప్రారణ మొనర్చుటయందు నియుక్తయై కనుపట్టును. తరుసోదరలతాసోదరీమణులం దామె ప్రత్యాహ్నికస్నేహమయమైన సేవాకర్మయందు ప్రవృత్త. కేవలము వల్కలవసనమునందే కాదు, భావభంగిమమందును, శకుంతల తరులతలయం దొక్కతెవలె తోఁచును. అందుకే దుష్యంతుఁడనినాఁడు:

శ్లో॥ అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ ।
కుసుమ మివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్ ॥

నాటకారంభమునందే శాంతిసౌందర్యసంవలితమైన యొకానొక సంపూర్ణజీవనము, నిభృతపుష్పపల్లవముల మధ్య ప్రాత్యాహ్నికాశ్రమధర్మము, అతిథిసేవ, సఖీస్నేహము, విశ్వవాత్సల్యములను గ్రహించి, మన సమ్ముఖమున కన్నులకుఁ గట్టిన

ట్లగుపడును. అది యెంత యఖండమో, ఎంత యానందకరమో గాని యాఘాత మెదవ్పుచో నిట్టె పగిలిపోవు నేమో యను శంక మనకు కలిగితీరును. దుష్యంతుని, యుద్యతబాహుద్వయముతో ప్రతిరోధించి చెప్పుట కిచ్ఛ జనించును. 'బాణము వేయకుము, వేయకుము! ఈ పరిపూర్ణసౌందర్యమును భంగించకుము!'

చూచుచుండగనే శకుంతలాదుష్యంతుల ప్రణయము ప్రగాఢమైపోవును. ప్రథమాంకమునందు తుదిభాగమున నప్పుడు నేపథ్యమున నకస్మాత్తుగ నార్తారావ మగును.

'భో భో స్తపస్విసన్నిహితా స్తపోవనసత్త్వరక్షాయై భవత ప్రత్యాసన్నః కీల మృగయావిహారీ పార్థివో దుష్యంతః.'

ఇది సమస్తతపోవనభూమియొక్క యాక్రందనము. ఆ తపోవనప్రాణులందు శకుంతలయు నొకతె. కాని ఆమె నెవరును రక్షింపఁజాలక పోయిరి.

ఆ తపోవనమునుండి శకుంతల వెడలిపోవుచున్నప్పుడు కణ్వుఁ డెలుగెత్తి యనినాఁడు.- భోభోః సన్నిహితా స్తరవః.

శ్లో॥ పాతుం నః ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతాం ॥

చేతనాచేతనము లన్నింటితో నింతటి యంతరంగాత్మీయత, యింత ప్రీతి, యింత కల్యాణమయబంధనము !

శకుంతల యనినది,- 'హలా ప్రియంవదే! సన్వార్యపుత్ర దర్శనోత్సుకాయా అప్యాశ్రమం పరిత్యజంత్యా దుఃఖేన మే చరణౌ పురతః ప్రవర్తేతే!

ప్రియంవద చెప్పినది: 'నీవే కేవలము తపోవనవిరహాకాతరవు కావు, నీ యాసన్నవియోగమున తపోవనమునకును నట్టిదేయైన దశ!'

శ్లో॥ 'ఉద్గళితదర్భకబళా మృగాః పరిత్యక్తనర్తనా మయూరాః।
అపసృతపాండుపత్రా ముంచన్త్యశ్రూణీవ లతాః॥

శకుంతల కణ్వునితో ననును. 'తాత! ఈ కుటీరప్రాంత చారిణి, గర్భమంథరయైన మృగవధువు నిర్విఘ్నముగ ప్రసవించి నప్పు డా ప్రియవార్తను నివేదించుటకు నావద్ద కెవరినైన పంపుము.'

'ఏషా ఉటజపర్యంతచారిణీ గర్భమంథరా మృగవధూ ర్యదానఘప్రసవా భవతి తదా ఏకమపి ప్రియనివేదయితారం విసర్జయిష్యథ!'

కణ్వు డనినాఁడు- 'వత్సే!

శ్లో॥ 'యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే।
శ్యామాకముష్టిపరివర్ధితకో జహాతి
సోఽయం న పుత్రకృతకః పదవీం మృగస్తే॥

శకుంతల మృగముతో ననును. 'ఓసీ బిడ్డా! సహవాస పరిత్యాగినినైన నన్ను ఇంకను ఏల యనుసరించెదవు? ప్రసవించి

నీ తల్లి చనిపోయి నప్పటినుండి నేనే నిన్ను పెంచి పెద్దఁజేసితిని. ఇప్పు డేక నేను వెళ్ళిపోవుచున్నాను. నిన్ను జనకులు చూచెదరు. నీవు వెనుకకు మరలుము.'

ఈ రీతిగ సమస్తతరులతామృగవిహంగములయొద్దనుండి సెలవు తీసుకొని యేడ్చుచు నేడ్చుచు శకుంతల తపోవనమును విడిచిపెట్టెను. లతతో పూవున కెట్టి సంబంధమో, తపోవనముతో శకుంతల కట్టి సంబంధము.

అభిజ్ఞానశాకుంతలమునందు, అనసూయాప్రియంవద లెట్లో, కణ్వుఁ డెట్లో, దుష్యంతుఁ డెట్లో, తపోవనప్రకృతియు నట్లే యొకానొక విశేషమైన పాత్రమై విలసిల్లినది. ఈ మూక ప్రకృతి కే నాటకమునందును నింత ప్రధానమైన, యావశ్యకమైన స్థాన మీయఁజాలు టనునది సంస్కృతసాహిత్యమునందు వినా వే ఱెచ్చటను కనుపించదు. ప్రకృతిని మనుష్యునిగా నొనర్చివైచి, దాని ముఖమున సంభాషణను నిలిపి, రూపకము రచితము కావచ్చును. కాని ప్రకృతిని ప్రకృతిగానే యుంచి దాని నింత సజీవముగ నింత ప్రత్యక్షముగ నింత వ్యాపకముగ నింత యాంతరంగికముగ నొనర్చి మించుట, దానిద్వారా నాటకమునం దింత కార్యసాధన యొనర్చికొనుట, యన్యత్ర నెచ్చటను చూడలేదు. ఎచ్చట బహిఃప్రకృతిని దూర మొనర్చి శత్రువునిగ భావించునో, ఎచ్చట మానవుఁడు తన చుట్టును కుడ్యమును నిర్మించుకొని జగత్తునందు సర్వత్ర కేవలము వ్యవధానమును రచించుచుండునో యచ్చటి సాహిత్యమునం దీరూపమైన సృష్టి యసంభవము.

ఉత్తరరామచరితమునందును ప్రకృతితో మానవునికి యాత్మీయవత్సౌహార్ద మీ రూపమున వ్యక్త మయ్యెను. రాజ ప్రాసాదమునందుండికూడ సీత ప్రాణ మా యరణ్యసీమకొఱకు తపించుచున్నది. అచ్చటి తమసా నదియు, వసంతవనలక్ష్మియు నామెకు ప్రియసఖులు. అచ్చటి మయూరమును, కరిశిశువును నామెకు కృతకపుత్రులు, తరులత లామెకు పరిజనవర్గము.

టెంపెస్ట్ నాటకమునందు మానవుఁడు తన్ను తాను విశ్వమునందు మంగళకరభావమున, ప్రీతియోగమున ప్రసారిత మొనర్చుకొని 'పెద్దయై' పోలేదే! విశ్వమును ఖర్వ మొనర్చి, దీనున మొనర్చి, తా నధిపతి యగుటకు వాంఛించెను. వస్తుతః యాధి పత్యమును తీసుకొనిన ద్వంద్వవిరోధప్రయాసములే టెంపెస్టునందలి మూలభావము. అందు 'ప్రాస్పెరో' స్వరాజ్యాధికారమునుండి విచ్యుతుఁడై మంత్రబలమున ప్రకృతిరాజ్యముపై కఠోరాధిపత్య మును విస్తరింపఁజేసికొనెను. అం దాసన్నమృత్యుహస్తమునుండి యెట్లో రక్షింపఁబడిన కొలఁదిమందియు తీరమునం దుత్తీర్ణులైరి. శూన్యప్రాయమైన యా ద్వీపమున నాధిపత్యమును పురస్కరించి కొని వారలయందును కూటనీతి, విశ్వాసఘాతుకత, రహస్య హత్యలు నడచినవి. పరిణామమున వానికి నివృత్తి యొదవినది, కాని పూర్తిగ నివృత్తి యైన దని యెవ్వరు ననఁజాలరు. దానవ ప్రకృతి భయమువలనను, శాసనమువలనను, అవసరమెుక్క యభావముచేతను, పీడితుఁడైన 'క్యాలిబన్' వలె స్తబ్ధమై యుండెను, కాని యాతని దంతమూలమునను నఖాగ్రమునందును

విషము మిగిలియే యుండెను. ఎవని కేది ప్రాప్తసంపత్తియో వాఁడు దానినే పొందెను. కాని సంకల్పలాభ మిఁక బాహ్యాలాభమే కద! అది వైషయికప్రవృత్తులకు లక్ష్యము కావచ్చును, కావ్యము నకుమాత్ర మది చరమపరిణామము కాదు.

టెంపెస్ట్ నాటకముయొక్క నామమువలెనే విషయము నట్టిది. మానవునికి ప్రకృతికిని విరోధము, మానవునికి మానవునికిని విరోధము. ఆ విరోధమునకు మూలమునందు క్షమతాలాభమున కైన ప్రయాసము. దీనికి మొదలుచివరలందుకూడ విక్షోభమే!

మానవుని దుర్దమప్రవృత్తి యిట్టి తుపానులను లేవఁదీయు చుండును. శాసనదమనపీడనములద్వారా నీ సకలప్రవృత్తులను హింస్రపశువునువలె సంయత మొనర్చి యుంచవలయును. కాని యీ రూపమైన బలముతో బలమును త్రోసియుంచుట కేవ లము సామయికమైన పద్ధతిని కార్యమును చక్కఁబెట్టుకొనుట కైన ప్రణాళికమాత్రమే యగును. మన యాధ్యాత్మిక ప్రకృతి దీని నే పరిమాణమునను స్వీకరింపఁజాలదు. సౌందర్యముద్వారా, ప్రేమద్వారా, మంగళముద్వారా పాపము పూర్తిగ లోపలినుండి విలుప్తమై విలీనమైపోవును. ఇదియే మన యాధ్యాత్మికప్రకృతి యొక్క యాకాంక్ష. ప్రపంచమునందు దీనికి సహస్రమైన యవరోధములు, వ్యతిక్రమము లుండినను దీనియందు మానవుని కంతర తరమైన లక్ష్య మొకఁ డున్నది. సాహిత్య మా లక్ష్యసాధన యొక్క నిగూఢప్రకాశమును వ్యక్త మొనర్చుచుండును. అది ప్రేయమును సుందరముగను, శ్రేయమును ప్రియముగను, పుణ్య

మును హృదయధనముగను పరిణమింపఁజేయును. ఫలాఫలనిర్ణయ బిభీషికద్వారా మనలను కల్యాణమయపథమునందు ప్రవృత్తుల నొనర్చుట బాహిరముయొక్క పని. కాని యున్నతమైన సాహిత్య మంతరాత్మయొక్క యాంతరమైన మార్గ మవలంబింపఁగోరును. అది స్వభావనిస్సృతమైన యశ్రుజలముతో కళంకమును ధౌతన మొనర్చును. ఆంతరమైన యవంచకతతో పాపమును దగ్ధమొన ర్చును. సహజమైన యానందముతో పుణ్యము నభ్యర్థించును.

కాళిదాసుకూడ తన నాటకమునందు దురంతప్రవృత్తి యొక్క దవానలమును తప్తమానసముయొక్క యశ్రువర్షణ మున నిర్వాపిత మొనర్చెను, కాని ఆయన వ్యాధినిగూర్చి యెక్కువగ యోచించలేదు. ఆయన దాని యాభాసమునుమాత్ర మిచ్చెను. దానిపై నొక యాచ్ఛాదనమును లాగివైచెను. ప్రపం చమునం దిట్టి తావులందు స్వభావతః కాఁజాలెడి దాని నాయన దుర్వాసుని శాపమున సంఘటింపఁజేసెను. లేనిచో నది యెంత నిష్ఠురమును, క్షోభజనకము నయ్యెడిదో చెప్పఁజాలము. దీనివలన సమస్తనాటకమునందలి శాంతిసామంజస్యములు భంగ మయ్యె డివి. శాకుంతలమునందు కాళిదాసే రసముపై లక్ష్య ముంచెనో, అది యిట్టి యుత్కటమైన యాందోళనమున రక్షింపఁబడెడిది కాదు. దుఃఖవేదనలను రెండిఁటి నాయన సమానముగనే నిలి పెను. బీభత్సఘృణాభావములను మాత్రమే కవి యావృత మొనర్చెను.

కాని కాళిదా సా యావరణయం దుంచిన చిన్ని ఛిద్ర మున పాపముయొక్క యాభాసమును మనము దర్శింపఁగలము. పంచమాంకమునందు శకుంతలాప్రత్యాఖ్యానము, ఆ యంక ప్రారంభమునందే కవి, రాజుయొక్క ప్రణయరంగభూమియందు యవనికను, ఒక్కపరి యించుక యపసరించి చూపించెను. రాజ ప్రేయసియైన హంసపదిక నేపథ్యమునందు సంగీతశాలలో కూర్చుండి స్వేచ్ఛగా గాన మొనర్చుచుండెను.

శ్లో॥ అభినవమధులోలుప స్త్వం తథా పరిచుంబ్య చూతమంజరీమ్।
కమలవసతిమాత్రనిర్వృతో మధుకర విస్మృతో౽స్యేనాం కథమ్ ॥

రాజాంతఃపురమునుండి వ్యథితహృదయోద్గతమైన యీ యశ్రుసిక్తగానము మన మనస్సుల కెంతో యాఘాతము నిచ్చును. ఏలయన, అంతకు కొంచెముపూర్వమే శకుంతలతో దుష్యంతుని దైన ప్రేమలీల మన మనస్సుపై నధికారము వహించియున్నది. దీనికిఁ బుర్వాంకమునందే శకుంతల ఋషివృద్ధుఁడైన కణ్వుని యాశీర్వాదమును, యరణ్యానియొక్క మంగళాచరణమును గ్రహించి స్నిగ్ధమైన కరుణతో, పవిత్రమైన మధురభావములతో పతిగృహమునకు యాత్ర సల్పెను. ఆమెయొక్క ప్రేమసంబంధి యైన గృహచిత్రము మన యాశాపటమునం దంకితమైయుండెను. పరవర్తియంకమునందే యా చిత్రమున కళంక మేర్పడును.

'ఈ గానముయొక్క యక్షరార్థమును తెలిసికొంటివా ?' యని విదూషకుఁడు రాజు నడిగి నప్పుడు, ఆయన యించుక

మందహాసముతో 'సకృత్ కృతప్రణయోఽయం జనః' అని సమా ధాన మిచ్చెను. 'మన మొకమారుమాత్రము ప్రణయ మొనర్చి తదుపరి వదలివేయుదుము. అందులకై దేవి వసుమతివిషయమున నే నీమె మహదుపాలంభమునకు యోగ్యుడనై తిని. మిత్రమా! మాధవ్యా! నీవు నా మాటగ హంసపదికతో, ఎంతో నైపుణ్యా ముతో నీవు నన్ను మందలించినావని చెప్పుము. వెళ్లుము, మంచి నాగరికవృత్తితో నీ మాట నామె కందించుము.'

పంచమాంకప్రారంభమునందు రాజుయొక్క చపలప్రణయ మును గూర్చిన యీ పరిచయము నిరర్థకము కాదు. దీనియందు కవి నిపుణమైన కౌశలముతో తెలియఁజేసినాడు. దుర్వాసుని శాపమున నేది ఘటించినదో స్వభావమునందే దానికి బీజ ముం డెను. కావ్యమర్యాదయందు దేని నాకస్మికముగ చూపించుట యైనదో యది ప్రాకృతికము.

చతుర్థాంకమునుండి పంచమాంకమున మనము మరియొక వాతావరణములో పడిపోయినాము. ఇంతవరకు మన మొక మానసజగత్తునం దున్నట్లుంటిమి. అచ్చటి నియమము లిచ్చటి నియమములు కావు. ఆ తపోవనమునందలి స్వైర మిచ్చటి స్వైర ముతో మేళగింపఁబడు టెట్లు? అచ్చట నే వ్యాపార మతిసహజ సుందరభావమున ననాయాసముగ ఘటిల్లియుండెనో, యిచ్చట దాని కెట్టి దశ యొదవునో యోజించిన నాశంక వొడమును. అందువలననే పంచమాంకప్రారంభముననే నాగరికవృత్తియందు, 'ఇచ్చట హృదయము మిక్కిలి కఠినము, ప్రణయ మత్యంతకుటి

లము, మిళనమార్గము సహజము కాదు' అని మనము గ్రహించి నప్పుడు, మన యీ వనమునందలి సౌందర్యస్వప్నము భగ్నమై పోవు నన్నట్లైనది. ఋషిశిష్యుడు శార్ఙ్గరవుడు రాజభవనమునఁ బ్రవేశించి 'అగ్నివేష్టితగృహమునందు వచ్చిపడినట్లున్నాము' అని చెప్పగా, శారద్వతుఁడు 'నూనె పూసికొనిన వానినిఁ జూచిన సుస్నాతునికిని, అశుచినిఁ జూచిన శుచికిని, నిద్రితునిఁ జూచిన జాగ్రత్తయందున్న వ్యక్తికిని, బద్ధునిఁ జూచిన స్వాధీనపురుషునికిని నెట్టి భావము మనస్సునందు వొడమునో, యీ విషయలంపటు లను జూచిన నా మనస్సునం దదియే భావము తోఁచుచున్నది' యనినాడు-- ఒకానొక ప్రత్యేకమైన సంపూర్ణస్వేచ్ఛాలోకమున వచ్చిపడితి మని ఋషికుమారులు సహజముగనే తెలిసికొనఁ జాలిరి. పంచమాంకప్రారంభమునందు కవి యనేకయాభాసముల మూలమున మనకు శకుంతలాప్రత్యాఖ్యానవిషయ మాకస్మికా ఘాత మీయకుండునట్లు మనలను సిద్ధముచేసి యుంచెను.

ప్రత్యాఖ్యాన మకస్మాత్తుగ వజ్రపాతమువలె శకుంతల మస్తకముపై విఱిగిపడి నప్పు డీ తపోవనదుహిత విశ్వసించిన హస్తమునుండి బాణాహతమైన హరిణివలె విస్మయముతో, భయముతో, వేదనతో విహ్వలయై, వ్యాకులనేత్రములతో చూచుచుండెను. తపోవనపుష్పరాశిపై నగ్ని వచ్చిపడినది. శకుం తల యంతరమునను బాహిరమునను ఛాయలో సౌందర్యములో నాచ్ఛన్న మొనర్చిన యే యొకానొక తపోవనము లక్ష్యమునను, అలక్ష్యమునను విరాజిల్లుచుండెనో, యీ వజ్రాఘాతమున నది

శకుంతలకు నలుదెసలనుండి చిరముగ విశ్లిష్టమైపోయెను. శకుంతల సంపూర్ణముగ ననావృత మైపోయినది! తండ్రియైన కణ్వుం డెక్కడ? ధాత్రియైన గౌతమి యెక్కడ? అనసూయాప్రియం వద లెక్కడ? ఆ సమస్తమైన తరులతలతో, పశుపక్షులతో స్నేహసంబంధము, మాధుర్యయోగము, ఆ సుందరమైన శాంతి, ఆ నిర్మలజీవనము, యీ యొక్క ముహూర్తమునందలి ప్రశ్ర యాభిఘాతమున శకుంతల కెంతగా విలుప్తమైపోయినదో చూచి నప్పుడు మనము స్తంభితుల మైపోయెదము. నాటకమునందలి మొదటి నాలుగంకములలో నే సంగీతధ్వని యుద్గమించియుం డెనో యది యొక్క ముహూర్తమునందే నిశ్శబ్ద మైపోయినది.

అటుతరువాత శకుంతలకు నలుదెసల నెంతటి నిస్తబ్ధత! ఎంతటి విరళత! ఏ శకుంతల తన కోమలహృదయప్రభావముచే చుట్టునున్న విశ్వమునందలి యెల్లరను తనవారినిగ నొనర్చుకొని యుండెడిదో, ఆమె నే డెంతటి యేకాకిని! ఈ బృహత్ శూన్య తను శకుంతల తన దుఃఖముద్వారా పూర్ణ మొనర్చుకొని శోభించుచున్నది. కాళిదాసామెను తిరిగి కణ్వుని తపోవనము నకు తీసికొనిపోలేదు. ఇది యాయన యసామాన్య కవిత్వము నకు పరిచయము. పూర్వపరిచితతపోవనభూమితో నామె పూ ర్వానుబంధము సంభవ మగునది కాదు. కణ్వాశ్రమమును వీడి యరుగుసమయమున తపోవనముతో శకుంతలకు కేవలము బాహ్యావిచ్ఛేదముమాత్రము ఘటిల్లినది. దుష్యంతభవనమునుండి ప్రత్యాఖ్యాత యగుటలో నా విచ్ఛేదము సంపూర్ణమైనది. ఆ

శకుంతల యిఁక లేదు. ఇప్పు డీక విశ్వముతో నామెకుఁగల పరి చయము పరివర్తిత మైపోయినది. ఇప్పు నామె నామె పురాతన సంబంధమునందు స్థాపించినచో నసమంజసమైన యుత్కటనిష్ఠుర భావమునఁ బ్రకాశిత మయ్యెడిది. ఇప్పు డీ దుఃఖిని కామె దుఃఖై కాంతికతయే యావశ్యకము. సఖీవిహీనమైన నూతనతపోవన మున కాళిదాసు శకుంతలావిరహదుఃఖమునకు ప్రత్యక్షావతరణ మొనర్చలేదు. కవి నీరవముగ నుండి శకుంతలయొక్క నలుదెసల యందలి నీరవతను, శూన్యతను మన చిత్తములందు ఘనీభూత మొనర్చి యొసఁగెను. కవి యొకవేళ శకుంతలను కణ్వాశ్రమము నకు తీసుకొనిపోయి యిట్లు నీరవముగ నుండిపోయినను నా యాశ్రమ మశ్రుజలపూర్ణ మయ్యెడిది. అచ్చటి తరులతాక్రంద నము, సఖీజనవిలాపము, తామై మన యంతరమునందు ధ్వనితమై యుండెడివి, కాని యపరిచితుఁడైన మారీచుని తపోవనమునందు సమస్తమును మనకు స్తబ్ధము, నీరవము. కేవలము విశ్వవిరహిత యైన శకుంతలయొక్క నియమసంయతధైర్యగంభీరమైన యపరి మేయదుఃఖము మన మనోనేత్రసమ్ముఖమున ధ్యానాసనమున విరాజమానమై యున్నది. ఈ ధ్యానమగ్నమైన దుఃఖము సమ్ము ఖమున కవి యేకాకిగ నిలిచి తన యధరోష్ఠముపై తర్జనీనిక్షేప మొనర్చుకొనెను. ఆ నిషేధసంకేతమున సమస్తప్రశ్నలకును మౌనమే సమాధానముగ సమస్తవిశ్వమును దూరముగ నపస రించియుంచెను.

దుష్యంతుఁ డిప్పు డనుతాపముతో దగ్ధుఁ డగుచున్నాఁడు. ఈ యనుతాపము తపస్య. ఈ యనుతాపమునుండి శకుంతలను పొందలేకపోయినచో శకుంతల లభించిన దనుటయం దెట్టి గౌరవమును లేకుండెను. చేతిలోనికి వచ్చినదే పొందుట యనునది పొందుట కాదు. పొందు టంత సహజము కాదు. యౌవనమత్తతయందలి యాకస్మికమైన తుపానులో శకుంతల నొకక్షణములో నెగురఁగొట్టి గ్రహించినవో నామెను సంపూర్ణముగ పొందజాలకపోయి యుండును. పొందుటకు ప్రకృష్టమైన ప్రణాళి, సాధన, తపస్సు ఏది యనాయాసముగ హస్తగతమై యుండెనో యది యనాయాసముననే పోగొట్టుకొనఁబడినది. ఏది యావేశపూర్ణమైన పిడికిటియం దాహృతమైనదో యది శిథిలభావముననే స్ఖలితమై పడిపోవును. అందులకే కవి, పరస్పర మొకరినొకరు యథార్థభావమున, చిరంతనభావమున పొందుటకొఱకు శకుంతలా దుష్యంతులను దీర్ఘమును దుస్సహమును నైన తపస్సునందు ప్రవృత్తుల నొనర్చెను. రాజసభయందు ప్రవేశించినంతమాత్రమున దుష్యంతుఁడు తత్క్షణము శకుంతలను గ్రహించియుండినచో నామె యప్పుడు హంసపదికాసమూహమును వృద్ధినొందించి యాయన యవరోధమునం దొక ప్రాంతమున స్థానము నాక్రమించెడిది. బహువల్లభుఁడైన రాజింత సుఖలబ్ధయైన ప్రేయసియందు క్షణకాలీనసౌభాగ్యస్మృతిని తీసికొని యనాదరాంధకారమున యనావశ్యకజీవనమును గడుపుచుండెడివాఁడు! 'సకృత్ కృతప్రణయోఽయం జనః'

శకుంతలసాభాగ్యవశముననే దుష్యంతుఁడు నిష్ఠురమైన కఠోరతతో నామెను పరిహరించియుండెను. తనపై తనదే యైన యీ నిష్ఠురప్రత్యభిఘాతమునందే దుష్యంతుని శకుంతలాసంబంధమున నచేతనుఁడుగ నుండనీయ లేదు. అహరహము పరమవేదనాకరమైన యుత్తాపమునందు శకుంతల యాయన విగళితహృదయముతో మిశ్రితము కాఁజొచ్చెను. ఆయన బహిరంతరముల నోతప్రోతముగ నొనర్చెను. ఇట్టి యభిజ్ఞత రాజు జీవితమునం దెన్నడును ఒదవలేదు. ఆయన యథార్థమైన ప్రేమ కుపాయమును, అవసరమును పొందనే లేదు. కనుకనే రాజీ సంబంధమున హూతభాగ్యుఁడు. ఆయన యిచ్ఛ యనాయాసముగనే నెరవేరును. కనుకనే సాధనయొక్క ధన మాయనయం దాయత్తమై యుండ లేదు. ఈ మారు విధాత కఠినమైన దుఃఖమునకు గుఱిచేసి రాజును ప్రకృతప్రేమ కధికారిగ నొనర్చెను. ఇప్పటినుండి యాతని నాగరికవృత్తి పూర్తిగ కట్టువడినది.

ఈ రీతిగ కాళిదాసు పాపమును హృదయాంతరాళము నుండి స్వీయానలమునందే దగ్ధ మొనర్చెను. వెలుపలనుండి దానిని బూదితో కప్పియుంచ లేదు. సమస్తమైన యమంగళములను నిశ్శేషముగ నగ్నిసాత్కృతి యొనర్చివైచి తదుపరి నాటకమును ముగించినాఁడు. పాఠకుని చిత్త మొకానొక సంశయహీనమైన పరిపూర్ణపరిణతియందు శాంతిలాభము నొందినది. బయటనుండి యకస్మాత్తుగ బీజము పడి విషవృక్షము జన్మించినచో, లోనుండి దానిని నిర్మూలన మొనర్చనిచో దాని యుచ్ఛేదమే కాదు. కాళి

దాసు శకుంతలాదుష్యంతుల బహిర్మిళనమును దుఃఖనిర్మితమైన పథమునఁ దీసికొనిపోయి యాభ్యంతరమిళనమున సార్థక మొనర్చి వేసెను. అందుకే 'గోథే' కవి యనినాఁడు. 'తరుణవత్సరము నందలి పుష్పమును, పరిణతవయస్సునందలి ఫలమును, స్వర్గ మర్త్యములను, ఎవరేని యొకే స్థానమునఁ జూడ నెంచినచో శాకుంతలమునందు మాత్రమే యట్టిది సాధ్య మగును,' అని.

టెంపెస్ట్ నందలి ఫెర్డినాండ్ యొక్క ప్రేమను, ప్రాస్పెరో కృచ్ఛ్రసాధనద్వారా పరీక్షించి గ్రహించినాఁడు. కాని యది బాహ్యక్లేశము. కేవలము కఠోరమైన భారమును వహించిన పరీక్షయైపో లేదు. ఆభ్యంతరమైన యే యుత్తాపమున, నే పేషణమున నంగారము హీరకముగఁ బరిణమించునో కాళిదాసు దానిని స్పష్టముగ దర్శింపఁజేసినాఁడు. ఆయన కాలిమమును, దానిలో నుండియే యుజ్జ్వల మొనర్చివైచెను. శకుంతలయందు మన మప రాధముయొక్క సార్థకతను దర్శింతుము. ప్రపంచమునందు విధాతృ విధానమున పాపముసైత మెట్టి శుభకర్మయందు నియుక్తమై యున్నదో, కాళిదాసుని నాటకమునందు మనము దానికి సుపరి ణతదృష్టాంతమును చూడఁగలము. అపరాధముయొక్క యభిఘాతము వినా శుభము శాశ్వతదీప్తిని, శక్తిని పొందఁజాలదు.

శకుంతలను మనము కావ్యారంభమునం దొక నిష్కలుష మైన సౌందర్యలోకమునఁ జూచినాము. అచ్చట సరళానందమున నామె తన సఖీజనముతో తరులతామృగములతో కలిసిమెలిసి యున్నది. ఆ స్వర్గమునం దలక్ష్యమున నపరాధము వచ్చి ప్రవే

శించినది. సౌందర్యము కీటదష్టపుష్పమువలె విశీర్ణమై ప్రస్తమై పడిపోయినది. అటుపై లజ్జ, సంశయము, దుఃఖము, విచ్ఛేదము, అనుతాపము. శకుంతల నొక స్వర్గచ్యుతి [Paradize lost], మరియు [Paradize Regained] స్వర్గప్రాప్తియు నని చెప్ప నగును.

ప్రథమస్వర్గ మెంతో మృదువును నరక్షితమును. అది సుందరమును, సంపూర్ణమును. నిజమే. కాని పద్మపత్రమునందలి శిశిరబిందువువలె నది సద్యఃపాతి. ఈ సంకీర్ణ సంపూర్ణతయొక్క సౌకుమార్యమునుండి ముక్తిని పొందుటయే మేలు. ఇది శాశ్వత మైనది కాదు. దీనియందు మనకు సర్వాంగీణమైన తృప్తి లేదు. అపరాధము మత్తగజమువలె నరుదెంచి యచ్చటి పద్మపత్రవేష్ట నమును విచ్ఛిన్న మొనర్చివేసినది. ఆలోడనవిక్షోభమున చిత్తము నంతను కలంచివై చినది. సహజస్వర్గ మీ తీరున సహజముగనే నశించిపోయినది. మిగిలిన దీక్ష సాధనాస్వర్గము. అనుతాపము ద్వారా, తపస్సుద్వారా, నా స్వర్గము జయింపబడి నప్పుడీక నెట్టి శంకయు మిగులలేదు. ఈ స్వర్గము శాశ్వతము.

మానవజీవన మిట్టిది. శిశు వే సరళమైన స్వర్గమునం దుం డునో యది సుందరమైనది, సంపూర్ణమైనది, కాని అల్పమైనది. మధ్యవయస్సునందలి సమస్త విక్షేపమును విక్షోభమును సమస్తాప రాధములయొక్క యాఘాతమును, అనుతాపవహ్నియు, జీవిత మునందు పూర్ణవికాసము విషయమున నావశ్యకములు. శైశవ మునందలి శాంతియందుండి బయటపడి ప్రపంచమునందలి విరోధ

విప్లవముల నెదుర్కొనకపోయినచో పరిణతవయస్సంబంధి యగు సంపూర్ణమైన శాంతియొక్క యాశ వృథయగును. ప్రభాతము నందలి స్నిగ్ధతను మధ్యాహ్నతాపమున దగ్ధ మొనర్చిన తరువాతనే సాయాహ్నమునందు లోకలోకాంతరసాక్షికి విరామము. పాపమునను, నపరాధమునను క్షణభంగురమును భంగించును. అనుతాపమునను, వేదనయందును చిరస్థాయిత్వమును నిర్మాణించును. శకుంతలానాటకమునందు కవి యీ స్వర్గచ్యుతినుండి స్వర్గప్రాప్తి పర్యంతము సమస్తమును వివృత మొనర్చెను.

విశ్వప్రకృతి బాహ్యమున నెట్లు ప్రశాంతసుందరమో, ఐనను దాని ప్రచండశక్తి యహరహము నభ్యంతరమున నెట్లు పనిచేయుచుండునో యభిజ్ఞానశాకుంతలమునందు మనము దాని ప్రతిరూపమును దర్శింపఁగలము. ఇట్టి యాశ్చర్యకరమైన సంయమమును మన మింక నే నాటకమునందును చూడఁజాలము. ప్రవృత్తియొక్క ప్రబలతా ప్రకాశమున కవసరమును పొందిన మాత్రముననే, యూరోపీయకవు లుద్దాములై పోయెదరు. ప్రవృత్తి యెంతదూరమువఱకు పోఁజాలునో దాని నతిశయోక్తి ద్వారా ప్రకాశ మొనర్చుటను వా రభిలషింతురు. షేక్స్పియర్ యొక్క రోమియో, జ్యూలియట్ ప్రభృతి నాటకములందు దీనికి గొప్పగొప్ప దృష్టాంతములు కానన గును. శకుంతలవంటి యింత ప్రశాంతగంభీరమును యింత సంయమపూర్ణమునునైన నాటకము షేక్స్పియర్ నాటకావళియం దొక్కటియు లేదు. శకుంతలాదుష్యంతులమధ్య జరిగిన సంభాషణ చాల సంక్షిప్తము.

అం దెక్కువ భావ మాభాసేంగితములయందు వ్యక్త మైనది. కాళిదా సెచ్చటను నీ రాణిని వెలుపరచలేదు. అన్యకవు లెచ్చట లేఖనిని పరుగెత్తించు నవసరము నన్వేషింతురో కాళిదా సచ్చట తన లేఖనిని సంయత మొనర్చెను. దుష్యంతుఁడు తపోవనము నుండి రాజధానికి తిరిగి వెళ్ళి శకుంతలనుగూర్చి విచారింపకయే యుండిపోయెను. ఈ సందర్భమున విలాపపరితాపము లెంతగనో జరిగియుండెడివి. కాని శకుంతలముఖమున కవి యొక్క మాట నైన నుంచలేదు. కేవలము దుర్వాసుని యాతిథ్యమునం దైన యనవధానమును లక్షించి యా హతభాగి స్థితిని మనము యథా సంభవముగ నవగత మొనర్చుకొనఁగలము. శకుంతలయెడల కణ్వునికిఁగల యనన్యస్నేహము ప్రస్థానకాలమున నెంతటి సకరుణ గాంభీర్యసంయమములతో, నెంత తక్కువమాటలలో వ్యక్త మైనది! అనసూయాప్రియంవదల సఖీవిశ్లేషణసంబంధమైన వేదన క్షణక్షణ మొకటిరెండు మాటలలో బంధనము నతిక్రమించు యత్న మొనర్చి, వెంటనే తిరిగి యంతరముననే నిరస్తమైపోవు చున్నవి. ప్రత్యాఖ్యానదృశ్యమునందు, భయము, లజ్జ, అభి మానము, అనునయము, భర్త్సన, విలాపము నన్నియు నున్నవి. కాని యెంత యల్పమైన సంభాషణయం దిమిడిపోయినవి! ఏ శకుంతల సుఖసమయమునందు సరళమైన యసంశయస్థితిలో తన్నుతాను త్యాగ మొనర్చుకొనెనో, దుఃఖసమయమునందు దారుణావమానకరపరిస్థితులందు, ఆ శకుంతలయే తన హృదయ వృత్తికిఁ జెందిన యప్రగల్భమర్యాద నింతటి యాశ్చర్యకరమైన

సంయమముతో రక్షించుకొను నని యెవ రూహించగలరు ? ఈ ప్రత్యాఖ్యానమునకు పరవర్తియైన సీరవత యెంత వ్యాపకమును గభీరమును నైనది ! కణ్వుఁడు మానము, మాలినీతీరమునందలి తపోవనము మానము, అందరికంటెను మానము శకుంతల. హృదయస్పృత్తి నాలోచన మొనర్చివేయు నిట్టి యవసర మే నాటకమునందైన నింత నిశ్శబ్దముగ నుపేక్షింపఁబడినదా ? దుష్యంతుని యపరాధమును దుర్వాసుని శాపాచ్ఛాదనమున నావృతమొనర్చి యుంచుట, యదికూడ కవియొక్క సంయమమే. దుష్టప్రవృత్తిప్రేరితమైన దురంతాచరణము నవారితముగ నుచ్ఛృంఖలముగ చూపుటయందలి ప్రలోభనమునుగూడ కవి సంవరణ మొనర్చుకొనెను. ఆయన కావ్యశ్రీ యాయనను నిషేధించి చెప్పెను.

'న ఖలు న ఖలు బాణః సన్నిపాత్యోయ మస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశావివాగ్నిః'

దుష్యంతుఁ డెప్పుడు కావ్యమునందు 'విపులవిక్షోభకారణుఁడై, మత్తుఁడై ప్రవేశించెనో యప్పుడే కవి యంతరమునం దీ ధ్వని మెగసినది.

'మూర్తో విఘ్న స్తపస ఇవ నో భిన్నసారంగయూథో
ధర్మారణ్యం ప్రవిశతి గజః స్యందనాలోకభీతః'

మూర్తీభవించిన తపోవిఘ్నమువలె గజరాజు ధర్మారణ్యమునందు ప్రవేశించెను. ఈ మారు మనము కావ్యమునకు శాంతి భంగ మగునని తెలిసికొందుము. కాళిదా సప్పుడే ధర్మారణ్యము

యొక్క, కావ్యకాననముయొక్క యీ మూర్తిమంతమైన విఘ్నమును శాపబంధమున సంయత మొనర్చెను. దీనిద్వారా, ఆయన తన పద్మవనమునందలి పంకము నాలోడిత మొనర్చుట కవకాశ మీయలేదు.

ఐరోపీయ కవి యగుచో నిచ్చట ప్రాపంచికసత్యమునకు నకలుగ నొనర్చియుండును. ప్రపంచమునం దెట్లో నాటకమునం దట్లే ఘటింపఁజేసి యుండును. శాపము లేక యలౌకికవ్యాపారము ద్వారా నించుకయు నావృత మొనర్చెడువాఁడు కాఁడు. కేవలము వారిపై నధికారము ప్రపంచమునకే యున్నట్లును, కావ్యమున కట్టి దేమియు లేనట్లును వ్యవహరించువాఁడు. కాళిదాసు ప్రపంచమునకు కావ్యమునకంటె నెక్కువ గౌరవ మీయలేదు. సర్వత్ర నేది ఘటించుచుండునో దాని ననుకరించియే తీరవలయు నను పత్రమున నాయన యేరికిని వ్రాసి యీయ లేదు. కాని కావ్యశాసనమును కవి మన్నించియే తీరవలయును. కావ్యము నందలి ప్రత్యేకసంఘటనను సమస్తమైన కావ్యముతో నాయన సుసంలగ్న మొనర్పవలసియే యున్నది. ఆయన సత్యముయొక్క యాభ్యంతరికమూర్తి నక్షుణ్ణముగ నుంచి, బాహ్యమూర్తిని తన కావ్యసౌందర్యముతో సంగత మొనర్చెను. ఆయన యను తాపమును, తపస్సును సముజ్జ్వల మొనర్చి ప్రదర్శించెను. కాని పాపమును తిరస్కరణిద్వార నించుక ప్రచ్ఛన్నముగ నుంచెను. శకుంతలానాటక మారంభమునుండి యంతమువఱకును శాంతి సౌందర్యసంయమములద్వారా పరివేష్టితము. ఇట్లు కానిచో నది

విపర్యస్తమై పోయెడిది. ప్రపంచానుకరణము సమగ్రరూపముగ
నుండెడిది కాని కావ్యలక్ష్మికి కళాఘాత మొదవెడిది. కాళి
దాస మహాకవియొక్క కరుణానిపుణమైన లేఖినిద్వారా నట్టి దెన్న
టికి సంభవింపదు.

కవి యీ తీరున బాహ్యమునందలి శాంతిసౌందర్యముల
నెచ్చటను నతిమాత్రముగ క్షుబ్ధ మొనర్పక తన కావ్యమునందలి
యాభ్యంతరికశక్తిని నిస్తబ్ధతయందు సర్వదా క్రియాన్వితమును
సరళము నొనర్చియుంచెను. ఇంత యెందుకు? ఆయన తపోవనము
నందలి బహిఃప్రకృతియు సర్వత్ర నాంతరకార్యములందే
వ్యాప్తమైయుండెను. ఒక్కొక్కప్పుడది శకుంతల యౌవనలీలయందు
తన లీలామాధుర్యము నర్పణ చేసికొనెను, ఒక్కొక్కప్పుడు
మంగళాశీర్వాదములతో తన కల్యాణమర్మరమును మిశ్రిత మొన
ర్చెను, ఒక్కొక్కప్పుడు విచ్ఛేదకాలీనమైన వ్యాకులతతో తన
మూకస్వస్తివాక్యములతో జడీభూత మొనర్చెను. అపూర్వమం
త్రబలమున శకుంతలాచరిత్రమునం దొకానొక పవిత్రమైన నిర్మ
లతను, ఒకానొక స్నిగ్ధమాధుర్యరశ్మిని, నియతము వికీర్ణ మొనర్చి
యుంచెను. ఈ శకుంతలానాటకమునందు కావలసినంత నిస్తబ్ధత
యున్నది. కాని అందఱికంటెను నిస్తబ్ధభావమున కవియొక్క
తపోవన మీ కావ్యమునందు పని చేసినది. ఆ పని టెంపెస్ట్
నందలి 'ఏరియల్' వలె న్యాయశాసనబద్ధమైన దాసత్వమునకుం
జెందిన బాహ్యవ్యవహారము కాదు; అది సౌందర్య వ్యవహారము,

ఆత్మీయవ్యవహారము, అభ్యంతరమునకుఁ జెందిన నిగూఢ వ్యాపారము.

టెంపెస్టునందు శక్తి, శాకుంతలమునందు శాంతి. టెంపెస్టునందు బలము ద్వారా జయము, శాకుంతలమునందు మంగళముద్వారా సిద్ధి. టెంపెస్టునం దర్థమార్గమున ఛేదము, శాకుంతలమునందు సంపూర్ణతయం దవసానము. టెంపెస్టులో మిరాండా సరళమాధుర్యమున నిర్మితము, కాని యా సరళతయొక్క ప్రతిష్ఠ యజ్ఞతానభిజ్ఞతలపై ప్రతిష్ఠితము. శకుంతల సరళత, అపరాధమునందు, దుఃఖమునందు, ధైర్యమునందు, క్షమయందు, పరిపక్వమును, గంభీరమును, స్థాయియు నై యున్నది. గోథే యొక్క సమాలోచనము ననుసరించి తిరిగి చెప్పుచున్నాను. శాకుంతలమునందు ఆరంభమునందలి తరుణసౌందర్యము మంగళాన్వితమైన పరిణతియందు సాఫల్యము నొంది, మర్త్యమును స్వర్గముతో సమ్మిళిత మొనర్చివేసినది.



# కాదంబరీ చిత్రము

ప్రాచీనభారతవర్షమునం దనేకవిషయములలో నసామా న్యత యుండెడి దనుటలో సందేహము లేదు. ఇతరదేశములందు సభ్యతాసృష్టి నగరములనుండి జరిగినది. మన దేశమునం దర ణ్యములనుండి జరిగినది. వసనభూషణసౌందర్యముల గౌరవము సర్వత్ర యున్నది. కాని వివసననిర్భూషణభిక్షాచరణములయొక్క గౌరవము కేవలము భారతవర్షసంబంధి మాత్రమే. ఇతరదేశము లందు ధర్మవిశ్వాసము శాస్త్రాధీనము. ఆహారవిహారాచారములు స్వాధీనములు. భారతవర్షము విశ్వాసమునందు బంధనరహితము. ఆహారవిహారాచారములందు సర్వవిధముల శాస్త్రానుగతము. సాధారణమానవప్రకృతినుండి భారతవర్షీయమైన ప్రకృతి పలు విషయములందు స్వతంత్రమైన దని యనేకదృష్టాంతముల ద్వార మున చూపవచ్చును. ఆ యసామంజస్యమునకు వేఱొక లక్షణ మును చూపవచ్చును. పృథియందలి సమస్తజాతులవారును కథ లను వినుట కభిలషింతురు. కాని భారతవర్షమునందు మాత్రమే కథలు వినుటయం దెట్టి యౌత్సుక్యము నుండియుండ లేదు. సభ్యదేశము లన్నియు స్వీయసాహిత్యమునందు, ఇతిహాసమును, జీవితచరిత్రమును, నవలను నత్యంతాసక్తితో సంచయ మొనర్చు చుండును. భారతవర్షసాహిత్యమునందు వాని చిహ్నముకూడ కనిపించదు. భారతసాహిత్యమునం దొకవేళ నితిహాసమును నవ

లయు నున్నను వానియం దంతగా యాసక్తిమాత్రము లేదు. వర్ణనము, తత్త్వాలోచనము, అవాంతరప్రసంగములయందు, దాని కథాప్రవాహ మడుగడుగునను ఖండితమైనను, ప్రశాంత భారతవర్షమునందు సహనశక్తి కొఱవడినట్లు తోఁచదు. అవి మూలకథ కంగములా లేక ప్రక్షిప్తములా యను యాలోచనయే నిష్ఫలము. కారణ మేమన ప్రక్షేపమును సహించుకొను జనులు లేకుండినచో ప్రక్షిప్తము మనఁజాలదు కదా! పర్వత శృంగమునుండి శైవాలమును వహించి తీసికొనిరాకున్నను ప్రవాహవేగము క్షీణ మగుచో దానియందు శైవాలము జనించు నవకాశ మొదవును. భగవద్గీతయొక్క మాహాత్మ్యము నెవరును స్వీకరింపకుండ నుండఁజాలరు. కాని కురుక్షేత్రమునందు సంకుల సమర మాసన్నమై నప్పుడు, భగవద్గీతనంతను నవహితచిత్తముతో శ్రవణ మొనర్పఁగలుగుట భారతవర్షము వినా వేఱొక దేశమునం దెచ్చటను సాధ్యము కానిది. కిష్కింధాసుందరకాండములయందు సౌందర్యాభావము లేదను విషయము నంగీకరింతును. అయినను రాక్షసుడు సీత నపహరించి తీసికొనివెళ్ళినప్పుడు కథపై నంత పెద్ద రాతిని మూసియుంచిన సహిష్ణువైన భారతవర్షముమాత్రమే కేవలము దానిని క్షమింపఁగలదు. అది యెందుకు క్షమింపఁ గలదు? కథయందలి చివరభాగ మేమో విన వలయు నను సత్వరత లేదు గావున. ఆలోచించుచు నాలోచించుచు, ప్రశ్నించుచుఁ బ్రశ్నించుచు, చుట్టుపట్ల పరిదర్శన మొనర్చుచు నొనర్చుచు, భారతవర్ష మేడు ప్రకాండమైన కాండల

యందును, పదునెనిమిది విపులాయతనము గల్గిన పర్వములందును సహిష్ణుచిత్తమున మృదుమందగతితో పరిభ్రమించుటయం దించుకైన క్లాంతి ననుభవించ లేదు.

అదిగాక కథను వినుటయందలి యాసక్తి ననుసరించి కథాప్రకృతియు, భిన్నరూపములై యుండును. ఆరుకాండల యందే కథ వేదనయందును, ఆనందమునందును పరిపూర్ణమై వెలసినదో యొక్క యుత్తరకాండమున దానిని అసంకోచముగ చూర్ణ మొనర్చివేయుట సహజవ్యాపారమా? మనము యుద్ధ కాండపర్యంతము చూచుచువచ్చిన దేమన అధర్మాచారుఁడును నిష్ఠురుఁడును నైన రాక్షసుఁడు, రావణుఁడే సీతకుఁ బరమశత్రుఁ డని. అసాధారణమైన శౌర్యముతో విపులప్రయత్నమున నా భయంకరుఁడైన రావణుని హస్తములనుండి సీత పరిత్రాణమును బడసినప్పుడు, సమస్తవిచారములును దూరమైనవి. మన మానం దముకొఱకు సిద్ధమైనాము. ఇట్టి సమయమున ముహూర్తకాల ములో సీతకు చరమశత్రువు అధార్మికుఁడైన రావణుఁడు కాడు, ఆ శత్రువు ధర్మనిష్ఠుఁడైన రాముఁడే యని కవి చూపియుండెను. నిర్వాసమునం దామెకు రాజాధిరాజైన తన భర్తృగృహమున సంఘటించిన సంకట మెన్నఁడు ఘటించనేలేదు. ఏ స్వర్ణతరణి దీర్ఘకాలము ముగ్ధమై జలప్రళయము చేతులనుండి యుద్ధరింపఁ బడెనో, యది యొడ్డునందలి పాషాణమునకుఁ దగిలినంతనే యొక్క క్షణములో పగిలి రెండై పోయెను. కథపై నెవరి కించు కేని మమత యున్నదో వా రిట్టి యాకస్మికోపద్రవమును సహిం

చుకొనఁజాలుదురా ? ఏ వైరాగ్యప్రబోధమున మనము కథ యొక్క నానావిధములైన యప్రాసంగికప్రాసంగికముల బాధను సహించికొనినామో, యా వైరాగ్యమే కథ యందాకస్మికమైన దుర్ఘటనామృత్యువునుండి మన ధైర్యమును రక్షించుచుండును.

మహాభారతమునందు నిల్లే. ఒక స్వర్గారోహణపర్వము నందే కురుక్షేత్రయుద్ధమునకు స్వర్గప్రాప్తి యైనది. కథాప్రియు లైన వ్యక్తులకు కథావసాన మెచ్చట జరిగిన నిష్టమో మహా భారత మచ్చట నాగిపో లేదు. అంత పెద్దగాథను వాలుకా నిర్మితమైన ఖేలనగృహమువలె నొక్క క్షణమునందు పడఁగొట్టి వెడలిపోయెను. ప్రపంచమువిషయములోను, కథావిషయము నందును విరాగులైనవారు దీనియందు సత్యలాభమును పొంది నారు. విచలితులు కాలేదు. మహాభాతమును ఏ వ్యక్తి కేవలము కథారూపమున మాత్రమే చదువుటకు యత్నించునో యతఁ డర్జునుని శౌర్య మమోఘ మనియు, శ్లోకముపై శ్లోకమును రచించి మహాభారతకారుఁ డర్జునుని జయస్తంభము నభ్రభేదిగ నొనర్చి మించెననియు మనస్సునం దూహించును. కాని కురు క్షేత్రసంగ్రామ మంతయు ముగిసిన తదుపరి హఠాత్తుగ నొక దినమున నొకచో నత్యంతాల్పమైన మాటలలో నతిసామాన్యు లైన దస్యులు శ్రీకృష్ణుని రమణుల నర్జునుని చేతులనుండి లాగు కొనిపోయిరి. ఆ నారీసమూహము శ్రీకృష్ణసఖుఁడైన పార్థు నాహ్వానించి యార్తస్వరముతో విలపింపఁ దొడఁగిరి. అర్జునుఁడు గాండీవము నెత్తఁజాలకపోయెను. అర్జునుని కిట్టి యభావనీయ

మైన యవమానము మహాభారతకారుని కల్పనయందు స్థానమును పొందఁగల దని తొలిపర్వములం దెచ్చటను ఎవ్వరును ఊహింపఁ జాలరు. కాని యెవరియందును కవికి మమకారము లేదు. ఎచ్చట శ్రోత విరాగియో, లౌకికమైన శౌర్యధైర్యమహత్త్వముల యొక్క యవశ్యంభావియైన పరిణామమును స్మరించుటయం దనాసక్తుఁడో నచ్చట కవియును నిర్మముఁడు. కథయు కేవలము కౌతూహలమును చరితార్థ మొనర్చుటకొఱకు సర్వమైన భార మును త్యజించివేసి ద్రుతవేగము నవలంబించ లేదు.

తదుపరి మధ్యకాలమున నతిదీర్ఘమైన విచ్ఛేదము నతిక్ర మించి కావ్యసాహిత్యమునందు సరాసరి కాళిదాసుని వఱకు వచ్చి యాఁగిపోవలసియున్నది. ఇతఃపూర్వము భారతవర్షము చిత్తరంజనమునకై యే యుపాయము నవలంబించియుండెనో యది నిశ్చయముగఁ జెప్పఁజాలము. ఉత్సవసమయములందు మృణ్మయకర్పరములయందు సుందరమైన దీపమాలలు రచింపఁ బడి, మఱునాఁ డెవ్వరిచేతను జాగ్రతపరుపఁబడనట్లే భారతవర్ష మునందలి యానందోత్సవములో నిశ్చయముగ నిట్టి ప్రమిదల యందలి ప్రదీపము లనేకములు, అనేకక్షణికసాహిత్యములు, నిశీథమునందు తమ పనిని ముగించికొని, ప్రత్యూషమున లోక విస్మృతిని పొందిపోయినవి. కాని ప్రథమమైన తైజసప్రదీపమును కాళిదాసునందు దర్శించినాము. ఆ పైతృకప్రదీప మిప్పటికిని మన గృహములం దుజ్జ్వలముగ విరాజిల్లుచునే యున్నది. ఉజ్జ యినీవాసులైన మన పితామహుల ప్రాసాదశిఖరములం దది

ప్రథమమున జ్వలించియుండెను. ఇప్పటికిని దానియందు కళంక మేర్పడలేదు. కేవల మానందమును వితరణ మొనర్చుట కుద్దే శించిన కావ్యరచన సంస్కృతసాహిత్యమున ప్రథమమున కాళి దాసునందే మనకు కానవైనది. (ఇచ్చట ఖండకావ్యముల విషయ మని తెలియవలయును. నాటకముల విషయము కాదు.) మేఘ దూత మందుల కొక దృష్టాంతము. ఇట్టి దృష్టాంతము సంస్కృత సాహిత్యమున మఱిలే దనుకొందును. ఏదైన నున్నచో నది మేఘ దూతమున కాధునికమైన యనుకరణము మాత్రమే. పదాంకదూత మొదలైనవి పౌరాణికములు. కుమారసంభవరఘువంశములును పౌరాణికములే యైనను యవి పురాణములు కావు, కావ్యములు. అవి ఆనందముకొఱకు వ్రాయఁబడినవి. వాని పఠనమునందు స్వర్గ ప్రాప్తిప్రలోభము లేదు. భారతవర్షీయమైన యార్యసాహిత్య మునందలి ధర్మప్రాణతాసంబంధమున నెవ రెట్టి యభిప్రాయము నైనఁ బ్రచార మొనర్పనిండు. ఋతుసంహారమును పఠించుటలో మోక్షప్రాప్తి యగునను నుపదేశ మెవ్వరు నీఁజాలరు.

కాని కాళిదాసుని కుమారసంభవమునందు కథ లేదు. ఏ కొంచె మున్నదో దాని సూత్ర మతిసూక్ష్మమును, ప్రచ్ఛన్న మును. అదియు నసమాప్తము. దేవతలు దైత్యుల హస్తముల నుండి పరిత్రాణము నే యుపాయముననైన పొందినారా, లేదా? ఆ సంబంధమున కవి కించుకేని యాత్సుక్య మున్నట్లు గోచ రించదు. ఆయనను నిరోధించు జనులును లేరు. కాని విక్రమా దిత్యుని కాలమున శక, హూణ వంశీయులైన శత్రువులతో

భారతవర్షమునకు గొప్పయుద్ధము జరుగుచుండెను. స్వయముగ విక్రమాదిత్యుఁడు దానియం దొక నాయకుఁడై యుండెను. అందువలన దేవదానవయుద్ధము, స్వర్గపునరుద్ధరణమును గూర్చిన ప్రసంగ మా కాలమునందలి శ్రోతలకు మిక్కిలి యౌత్సుక్య జనక మగునని యాశింపవచ్చును. కాని ఎక్కడ ? రాజాస్థానము నందలి శ్రోతలు దేవతలయొక్క విపత్పాతమునం దుదాసీనులు. మదనభస్మీకరణము, రతివిలాపము, ఉమాదేవి తపస్సు, దేని యందును త్వరాన్వితుఁ డగుట కెట్టి యుపరోధమును కాన రాదు. ఎల్లరును 'కథ నట్లుంచుము, ఇప్పుడా వర్ణనమునే నడువ నిమ్ము' అనుచున్న ట్లుండును. రఘువంశమును విచిత్రవర్ణనముల కుపలక్ష్యము మాత్రమే.

రాజశ్రోతలు కథాలోలుపులై యుండినచో కాళిదాసుని లేఖనినుండి యా కాలమునందలి కొన్ని చిత్రములు లభ్యములై యుండెడివి. ఆహా ! అవంతీరాజ్యమున నూత్నవత్సరదినమున నుదయనకథాకోవిదులైన గ్రామవృద్ధు లే కథలను చెప్పుచుండు వారో వారంద ఱెచ్చటి కేగినారు ? అసలు విషయము గ్రామ వృద్ధులు కథలు చెప్పుచుండువా రనునది. కాని యది గ్రామ్య భాషయందు. ఆ భాషయందు కవు లే రచనస ల్పినారో వారు యథేష్టముగ నానందము నీయఁజాలిరి. కాని యటుతరువాత నమరత్వలాభము నందఁజాలకపోయిరి. వారి కవిత్వ మల్పిష్ఠమై యున్నందువలన వారు వినాశమునంది రని చెప్పను. వారియందు నిస్సందేహముగ ననేక మహాకవు లుద్భవించియుండిరి. కాని

గ్రామ్యభాష ప్రాదేశికముగ బద్ధమైనది. విద్వల్లోకముచే నుపే క్షితమై కాలక్రమమున పరివర్తితమగుచు వచ్చినది. ఆ భాష యం దెవరు రచన సల్పిరో వారికి స్థిరమైన పునాది యలవడ లేదు. నిస్సందేహముగ ననేకసాహిత్యనికేతనములు చలనశీలము లైన పులినసీమలయందు నిహితములై పూర్తిగ నదృశ్యములై పోయినవి.

సంస్కృతభాష వ్యావహారికభాషగ నుండకపోవుటచే దానియందు భారతవర్షమునందలి కోటికోటి హృదయములకు సంబంధించిన విషయము సంపూర్ణముగ చెప్పఁబడలేదు. ఆంగ్ల భాషాలంకారములం దే శ్రేణికిఁ జెందిన కవిత్వమును (Lyrics) లిరిక్స్ అందురో యవి యప్రచలితభాషయందు సంభవము కాఁ జాలవు. కాళిదాసుని విక్రమోర్వశీయమునం దే సంస్కృతగాన మున్నదో, దానియందును గానముయొక్క లఘుత్వమునను సర ళతయందును, అనిర్వచనీయమాధుర్యమును పొందలేము. వంగీ యుఁడైన జయదేవుఁడు సంస్కృతభాషయందును రచన చేయఁ జాలియుండెను. కాని వంగీయవైష్ణవకవులయొక్క పదావళితో నది తుల్యము కాదు.

అప్రచలితభాషయందు కథయు నడవదు. కారణ మేమన, కథయందు లఘుత, గతివేగము నావశ్యకములు. భాష యెప్పుడు తేల్చి తీసికొనిపోదో, భాష నెప్పుడు భారమువలె మోసికొని పోవలసి యుండునో అప్పుడు దానియందు గానమును, కథయు సంభవమే కావు.

కాళిదాసుని కావ్యము స్రోతస్సువలె సర్వాంగముగ నడువదు. అందలి ప్రతి శ్లోకమును దాని కదె సమాప్తము. ఒక్కసారి యాగి నిలిచి యా శ్లోకము నాయత్త మొనర్చుకొని గ్రహించి యటుపిమ్మటనే తరువాతి శ్లోకముపై చేయి వేయవలసి యున్నది. ప్రతి శ్లోకము నొక స్వతంత్రమైన వజ్రపు తునుకవలె నుజ్జ్వలము. సమస్తకావ్యమును హీరకహారమువలె నతిసుందరము. కాని నదివలె దానియం దఖండమైన కలధ్వనియు, అవిచ్ఛిన్నమైన ధారయు లేదు.

అదిగాక సంస్కృతభాషయం దెంతయో స్వరవైచిత్ర్యము, ధ్వనిగాంభీర్యము స్వాభావికాకర్షణమును గలవు. దానిని నైపుణ్యమున నడుపఁజాలిన యెడల దానియందు నానాజంత్రములతో గూడిన మధురమైన స్వరసమ్మేళనము ధ్వనిత మగును. దానియం దంతర్నిహితములైన రాగిణులయం దెంతటి యనిర్వచనీయత గలదో విద్వత్కవులు వాజ్నైపుణ్యముచే పండితశ్రోతలను ముగ్ధుల నొనర్చు ప్రలోభనమున దానిని సంవరణ మొనర్చుకొనఁజాలకుండిరి. అందువలన నెచ్చట కావ్యమును సంక్షిప్తమొనర్చి విషయమును వేగముగ ముందునకు నడుపుట యత్యావశ్యకమో యచ్చటను భాషాప్రలోభనమును సంవరణ మొనర్చుకొనుట దుస్సాధ మగును. వాక్యము విషయమును ప్రకాశింపఁజేయక యడుగడుగునను నాచ్ఛన్న మొనర్చి నిలుచును. విషయముకంటె వాక్యమే యెక్కువ యధికారమును తీసికొన యత్నించును. అందు సఫలత్వమును జెందును. మయూరపింఛనిర్మితములైన

యతిసుందరములగు ననేకవ్యాజనము లున్నవి. వానినుండి మంచి గాలిమాత్రము రాదు. కాని వీచుట యను నుపలక్ష్యమును మాత్రము పురస్కరించుకొని రాజసభలయందు కేవలము శోభ కొఱకై వానిని సంచాలన మొనర్చుచుందురు. రాజాస్థానము లందలి సంస్కృతకావ్యములును ఘటనావిన్యాసము కొఱ కంత యధికముగ వ్యగ్రతఁ జెందవు. వానియందలి వాగ్విస్తృతి, ఉపమా కౌశలము, వర్ణనానైపుణ్యము, రాజసభను ప్రతి పదక్షేపమునను చమత్కృత మొనర్చుచుండును.

సంస్కృతసాహిత్యమున గద్యమునందు రెండో మూడో యాఖ్యాయిక లున్నవి. వానిలో కాదంబరి యన్నిటిని మించి ప్రతిష్ఠను పొందినది. రమణీకవలెనే పద్యమునకును నలంకారము లపై నాకర్షణ మెక్కువ. గద్యముయొక్క పరిచ్ఛదములు స్వభావముగనే కర్మక్షేత్రమున కనువైనవి. అది తర్కించవలయును. అనుసంధాన మొనర్చవలయును. ఇతిహాసమును చెప్పవలయును. అది విచిత్రవ్యవహారమునకు సిద్ధమై యుండవలయును. అందుచే దాని వేషభూష లత్యంతాల్పములు. దాని కరచరణము లనావృతములు. దౌర్భాగ్యవశమున సంస్కృతగద్యము సర్వదా వ్యవహారముకొఱకే నియుక్తమై యుండలేదు. అందుచే బాహ్య శోభాబాహుళ్యము దానియం దల్పము కాదు. మేదస్స్ఫీతుఁడైన విలాసజనునివలె దానియందలి సమాసబహుళవిపులాయతనమును చూచినచో సర్వదా వ్యవహరించుటకొఱ కది కానే కాదని సహజముగనే తెలిసిపోవును. గొప్పగొప్ప టీకాకారులును, భాష్య

కారులును నైన పండితులు దానిని తమ శిరములపై మోసికొని పోయి యుండని యెడల దానికి గమనమే యసాధ్య మయ్యెడిది. అచలమే యగుగాక. కిరీటకుండలకంకణములతో కంఠమాలలతో అది రాజువలె విరాజిల్లుచుండును.

అందువలన బాణభట్టు స్పష్టముగ కథను చెప్పుట కుపక్రమించుచుండెను గనుక తుండయినను భాషయొక్క విపులగౌరవమును లాఘవ మొనర్చి కథను పరుగెత్తించలేదు. సంస్కృతభాష ననుచరపరివృతుండైన సమ్రాట్టువలె నడిపించినవైచి కథను దానివెనుక ప్రచ్ఛన్నప్రాయ భావమున ఛత్రధారిణిగ నడిపించెను. భాషయొక్క రాజమర్యాదాభివృద్ధికై కథ కొంకెంచుక ప్రయోజన మున్నది. గనుక నది యున్నది. కాని కథావిషయమున నెవరికిని దృష్టి లేనే లేదు.

శూద్రక రాజు కాదంబరీ చరిత్రమునందు నాయకుండు కాండు. ఆయన కథను మినుచుండె నంతియు. కనుక నతని పరిచయము సంక్షిప్త మగుచో నష్ట మేమియులేదు. ఆఖ్యాయిక యందలి బహిరంశము యథోపయుక్తముగ హ్రస్వము కానిచో మూలాఖ్యానమునందలి పరిమాణసామంజస్యము నష్ట మగును. మన దృష్టిశక్తివలె మన కల్పనాశక్తియు పరిమితము. మన మే వస్తువును సంపూర్ణముగ నొకేపరి సమానముగ చూడంజాలము. – సమ్ముఖభాగమును పెద్దదిగ చూచెదము, పశ్చాద్భాగమును చిన్నదిగ చూచెదము. పృష్ఠదేశమును చూడంజాలము, అనుమానమున స్వీకరింతుము. ఇందులకే శిల్పి తన సాహిత్యశిల్పమున నే యంశమును ప్రధానముగ ప్రదర్శింపనెంచునో దానిని విశేష

రూపమున గోచరించునట్లు చేసి మిగిలిన యంశములను పార్శ్వము నందు, పశ్చాద్భాగమున ననుమానక్షేత్రమునం దుంచివేయును. కాని కాదంబరీకారుఁడు ముఖ్యగౌణభావవిరహితముగ నెట్టి కథ నైనను వంచిత మొనర్ప నిచ్ఛగించలేదు. దానివలన కథాభాగము నకు నష్టము కలుగును. మూలప్రసంగము దూరవర్తి యైపోవును. కాని దానియం దాయన గాని యాయన శ్రోతృగణము గాని యించుకయు కుంఠితులు కాలేదు. ఐనను కథను కొంచెము తగ్గించిన నడువదు. కారణ మేమన కథ చాల నిపుణమైనది, సుశ్రావ్య మైనది. కౌశలమునందును మాధుర్యమునందును గాంభీర్యము నందును ధ్వనియందును ప్రతిధ్వనియందును పూర్ణ మైనది.

అందుచేత మేఘమంద్రమృదంగధ్వనివలె కథ యారంభ మైనది. 'ఆసీ దశేషనరపతిశిరస్సమభ్యర్చితశాసనః పాకశాసన ఇవాపరః' – కాని ఆహా! మన దురాశ! కాదంబరినుండి సమగ్ర పదము నుద్ధరించి కావ్యరసము నాలోచించెద మనిన మన క్షుద్రాయతనప్రబంధమున నింత శక్తి లేదు. మనము జన్మించిన కాల మతిచంచల మైనది. ఇట్టి కథాసర్వస్వమును చెప్పు ప్రలోభన మడుగడుగునను సంయత మొనర్చుకొనవలసి యున్నది. కాదంబరికాలమున కవి కథావిస్తారమునకు విచిత్రమైన కౌశలము నవలంబించినాఁడు. ఇప్పుడు మనము కథాసంక్షేపమునకు సమగ్ర కౌశలము నభ్యసింపవలసియున్నది. ఆ కాలములో మనోరంజనమునకొఱకు ఏ విద్య ప్రయోజనకరమై యుండెనో నేటి కాలమున మనోరంజనముకొఱకు సరిగా దానికి వ్యతిరేకమైన విద్య యావశ్యకమైనది.

కాని యొక కాలమునందలి మధులోభి యన్యకాలము నందలి మధువును సంగ్రహించుటకు వాంఛించుచో తాను తన కాలప్రాంగణమున కూర్చుండి దానిని పొందఁజాలఁడు. అన్యకాల మునం దాతఁడు ప్రవేశింపవలసి యుండును. కాదంబరి ననుభవింప నెంచిన వ్యక్తి, కార్యాలయమునకు వేళ యగుచున్న దను మాటను విస్మరింపవలసియుండును. తాను కావ్యరసవిలాసివైన రాజ్యేశ్వరుఁడని భావించికొనవలయును. రాజసభామధ్యమున సమాసీనుఁడై 'సమానవయోవిద్యాలంకారైః అఖిలకళాకలా పాలోచనకఠోరమతిభిః అతిప్రగల్భైః అగ్రామ్యపరిహాసకుశలైః కావ్యనాటకాఖ్యానాఖ్యాయికాలేఖ్యాదిక్రియానిపుణైః వినయ వ్యవహారిభిః ఆత్మనః ప్రతిబింబైరివ రాజపుత్రైః సహ రమ మాణః' ఇట్టి రసచర్చయందు రసికజనపరివృతుఁడై యుండినచో లోకమున ననుదినసుఖదుఃఖసమాకులయుధ్యమానధర్మసిక్తకర్మ నిరతసంసారమునుండి విచ్ఛిన్నుఁడై పోవును. త్రాగుబోతెట్లు ఆహారమును విస్మరించి మద్యపాన మొనర్చుచుండునో వారును నట్లే జీవితమునందు కఠినాంశములను పరిత్యజించి భావమునందలి తరళరసపానముచే విహ్వలులై యుందురు. అప్పుడు సత్యము యొక్క యాథాతథ్యవిషయమును పరిమాణమునైపు దృష్టియు నుండదు. కేవల మాదేశ మగుచునే యుండును. 'పోయుము, పోయుము, ఇంకను పోయుము!' ఈ కాలమున మనుష్యుల విష యమున మన కాకర్షణ మెక్కువ మైనది. ఆ వ్యక్తి యెవరు? అతఁడేమి చేయుచున్నాఁడు? వీనియెడల మన కత్యంత కౌతూహల

మున్నది. ఇందుకే గృహమునందును, వెలుపలను, చుట్టుపట్లను మానవుని క్రియాకలాపజీవనవృత్తాంతమును మనము తిరిగి తిరిగి పర్యాలోచించికూడ పరితృప్తిని జెందకున్నాము. కాని యా కాల మున పండితు లనుము, రాజు లనుము, మానవు నంతగా మనస్సు నం దుంచుకొనెడివారు కారు. స్మృతివిహితనిత్యనైమిత్తికక్రియా చరణమునం దేకాంతమున నివిష్టభావమునను, శాస్త్రాదుల యాలోచనమునందును నిమగ్నులై, వారు ప్రపంచవిషయము లం దెక్కువభాగము నిర్లిప్తులై యుండెడివా రనిపించును. విధి విధానములందును నియమసంయమశాసనములందును వ్యక్తిగత స్వాతంత్ర్యమున కంతగా పెద్ద ప్రశ్రయ ముండెడిది కాదని తోచును. అందుచే రామాయణమహాభారతములకు తరువాత సంస్కృతసాహిత్యమునందు మానవచరిత్రసృష్టియు ప్రపంచవర్ణన ప్రాధాన్యమును గోచరించదు. భావరసములే దానికి ప్రధానా వలంబములు. రఘువుయొక్క దిగ్విజయవ్యాపారమున ననేకఉపమ లును సరసవర్ణనలును ప్రకాశితము లయ్యెను, కానిరఘువుయొక్క వీరత్వ సంబంధముగ నొక చరిత్రగతచిత్రము పరిస్ఫుట మొనర్చు యత్నము కానరాదు. అజఇందుమతుల విషయమున వా రిరు వురును నుపలక్ష్యములు మాత్రమే. వారి వ్యక్తిగతవిశేషముల మూర్తి సుస్పష్టము కాలేదు. కాని పరిణయ, ప్రణయవిచ్ఛేద శోకములను గూర్చిన యొగానొక సాధారణభావమును రసమును ఆ సర్గమునం దుచ్చస్థానము నందుకొనుచున్నవి. కుమారసంభ వమునందు హరపార్వతుల నవలంబన మొనర్చికొని ప్రేమసౌంద

క్షేపమావర్ణనలు తరంగితములై నవి. మానవునియందును ప్రపంచ విశేషత్వమునందును ఆ నాఁ డెక్కువ యౌదాసీన్య ముండుటచే వర్ణనములు మానవుని సంఘటనలను సర్వత్ర నాచ్ఛన్న మొనర్చి రసవిస్తార మొనర్చెను. ఈ విషయమును జ్ఞప్తియం దుంచికొని యాధునికకాలమునందలి విశేషత్వమును విస్మరించి కాదంబరీ రసాస్వాదనమున ప్రవృత్తులైనచో నానందమునకేమి కొఱత నవశ్య ముండదు.

కల్పనయం దూహించి చూతుము. గాయకుఁడు గాన మొనర్చుచున్నాఁడు. 'చ. ల. త. రా. జ. ఆ. ఆ. ఆ.' తిరిగి మరల 'చ. ల. త. ర. ఆ. ఆ. ఆ!' సుదీర్ఘమైన తానము. శ్రోత లా తానఖేలనమునం దున్మత్తులై పోయినారు. ఇచ్చట గానము నందలి సాహిత్యము 'చలతరాజకుమారి' యను నది. కాని తాన మునందలి యుపద్రవముచే వేఁగ యతిక్రమించుచున్నది. రాజ కుమారి గమనమే కాలేదు. విజ్ఞుఁడైన శ్రోతను బ్రశ్నించినచో 'రాజకుమారి కదలకున్న కదలకుండెను గాక, కాని తానమును నడువనిమ్ము,' అనును. అవశ్యము రాజకుమారి యేదో మార్గ మున వెడలుచుండెను. ఆ వార్తకొఱకు కెవరికి విశేషోద్వేగ మున్నదో వారి విషయమున తానము దుస్సహము. కాని యుప స్థితక్షేత్రమునందు రసోపభోగము ననుభవింప నెంతువేని రాజ కుమారి గమ్యస్థాననిర్ణయముకొఱకు నిరతిశయముగ నస్థిరుఁడవు గాక తానమును వినవలసినదే. కారణ మేమన నే తావునందు వచ్చిపడినావో అచ్చటి కుతూహలమున నస్థిరుఁడ వగుచో ఫలము

లేదు. ఇది రసమునం దున్మత్తు లగుటకు స్థానము. అందుచే స్నిగ్ధ
జలదనిర్ఘోషమునం దాపాతతః శూద్రకరాజువర్ణన మాలకింతువు
గాక. ఆ వర్ణనమునందు మనము శూద్రకరాజుయొక్క చిత్ర
విచిత్రములను ప్రత్యాశింపము. చిత్రవిచిత్రములం దొక ప్రాంతర
రేఖ నంతకే మొనర్పవలయును. దీనియందు తుది లేదు. భాష
కల్లోలముఖరితసముద్రమువలె నెంత దూర ముద్వేలమైనదో దాని
నడ్డుపెట్టుట కెవరును లేరు. సత్యానురోధమున శూద్రకుడు విది
శానగరమునకు ప్రభు వని చెప్పవలసివచ్చినను, అప్రతిహతగామిని
యైన భాషయు, భావానురోధమున చెప్పవలసివచ్చిన దేమన,
ఆయన 'చతురుదధిమాలామేఖలాయా భువో భర్తా!' శూద్రకుని
మహిమ యెంతటిదై యుండెనో యా వ్యక్తిగతమైన స్వల్ప
సత్యాలోచనమునందు ప్రయోజనము లేదు. కాని రాజకీయ
మహిమ యెంత దూరమువఱకుఁ బోఁజాలునో యా విషయము
యథోచితసమారోహసహాకారమున ఘోషింపఁబడు గాక!

భావము సత్యమువలె కృపణము కాదను న దందఱెఱిఁ
గిన విషయమే. సత్యదృష్టియందే బాలుఁడు గ్రుడ్డివాఁడో భావము
నం దాతఁడు పద్మలోచనుఁ డగుటలో నించుకయు విచిత్రము
లేదు. భావమునం దట్టి రాజకీయాపరిమేయత కుపయోగించు
భాష కాదంబరియందు పూర్ణవర్షాస్రోతస్వినివలె నావర్తములతో
తరంగములతో గర్జనములతో నాలోకచ్ఛటలతో విచిత్రమై
వర్ధిల్లినది. కాని కాదంబరియందలి విశేషమైన మాహాత్మ్య
మేమన, భాషాభావముల విశేషవిస్తారమును రక్షించుకొనుచునే

దానియందలి చిత్రములు జాగరితములై నిలిచినవి. అన్నియు ప్లావితములై యేకాకృతిని జెందలేదు. కాదంబరియొక్క ప్రధాన మైన యారంభచిత్రమే దానికిఁ బ్రమాణము.

అప్పుడు భగవానుఁడైన యాదిత్యుఁడు దూరమున నుదయించ లేదు. నూత్నపద్మపత్రపుటము లోకించుక విచ్చుకొనెను. వాని పాటలకాంతి కొంచె మున్ముక్తమైనది.

ఈ విధముగ వర్ణన మారంభమైనది. ఈ వర్ణనమునకు వేఱుద్దేశ్య మేమియు లేదు. కేవలము శ్రోతృచక్షువులం దొకానొక కోమలవర్ణమును వ్రాసి యాతని సర్వాంగములందు నొక స్నిగ్ధసుగంధవ్యజనమును వీచుటమాత్రమే !- 'ఏకదా తు నాతి దూరోదితనవనళినదళసంపుటభిది కించిదున్ముక్తపాటలిమ్ని భగవతి మరీచిమాలిని'- మాట లెంత మోహజనకములు ! అనువాద మొనర్పఁబోవుచో కేవల మీమాత్రమే వ్యక్త మగును. 'తరుణసూర్యునివర్ణ మీషద్రక్తమము.' కాని భాషయొక్క యింద్రజాలమునందు కేవలమైన యీ విశేష్యవిశేషణముల విన్యాసమునం దొకానొక సురమ్యసుగంధసువర్ణసుశీతలమైన ప్రభాతకాల మనతివిలంబముగ హృదయము నాచ్ఛన్న మొనర్చివేయును. ఈ ప్రాభాతవర్ణనమువలెనే వేఱొక కథయందు తపోవనమునందలి సంధ్యాసమాగమవర్ణనము నెత్తి చూపెదను. 'దివావసానే లోహితతారకా తపోవనధేనురివ కపిలా పరివర్తమానా సంధ్యా'-దివసావసానమున తపోవనమునందలి రక్తచక్షువైన ధేను వెట్లు గోష్ఠమునకు తిరిగివచ్చునో కపిలవర్ణయై సంధ్య

యట్లే తపోవనమునం దవతీర్ణమైనది. కపిలధేనువుతో సంధ్యా వర్ణమును సాదృశ్య మొనర్పఁబోయి సంధ్యయందలి సమస్తమైన శాంతిని, ధూసరచ్ఛాయను కవి ముహూర్తములో మనస్సునందు గాఢ మొనర్చివేయు చుండెను. ప్రాతఃకాలవర్ణనయం దెట్లు కేవలము తులనావ్యాజమున నున్ముక్తప్రాయమైన నవపద్మ పుటముయొక్క సుకోమలమైన యాభాసమును వికాస మొనర్చి, మాయావియైన చిత్రకారుడు సమస్తప్రభాతమును సౌకుమార్య మునందును సుస్నిగ్ధతయందును పరిపూర్ణ మొనర్చివైచునో యట్లే వర్ణముయొక్క తులనావ్యాజమున తపోవనగోష్ఠమునకు తిరిగివచ్చిన యరుణచక్షువైన కపిలవర్ణధేనువు మాటనెత్తి సంధ్య యందలి యెంతెంత భావములను నిశ్శేషముగ నభివర్ణించెను!

ఇంతటి వర్ణసౌందర్యక్షమత నే యితరకవియు చూపఁ జాలకపోయెను. సంస్కృతకవు లెఱుపురంగు నెఱుపురంగుగనే వర్ణించి నిరస్తులైరి. కాని కాదంబరీకారుని యెఱుపురం గెన్ని విధములైనదో దాని కంతులేదు. ఒకానొక యెఱుపు లాక్షా లోహితము. ఒకానొక యెఱుపు పారావతపదతలము వంటిది. ఒకానొక యెఱుపు రక్తాక్తమైన సింహముఖమునకు తుల్యమైనది. 'ఏకదా తు ప్రభాతసంధ్యారాగలోహితే గగనతలే కమలినీమధు రక్తపక్షసంపుటే వృద్ధహంస ఇవ, మందాకినీపులినా దపరజలనిధి తటమవతరతి చంద్రమసి, పరిణతరంకురోమపాండుని వ్రజతి విశాలతామ్ ఆశాచక్రవాలే గజరుధిరరక్తహరిసటాలోమలోహి నీభిః, ఆతప్తలాక్షికతంతుపాటలాభిః, ఆయామినీభి రశిశిరకిరణ

దీధితిభిః, పద్మరాగశలాకాసమ్మార్జనీభి రివ సముత్సార్యమాణే గగనకుట్టిమకుసుమప్రకరే తారాగణే'- ఒక దినమున నాకాశ మెప్పుడు ప్రభాతసంధ్యారాగమున లోహితమో, చంద్రుఁ డెప్పుడు కమలినీమధురక్తవర్ణపక్షపుటశాలి యగు వృద్ధహంసము వలె మందాకినీపులినమునుండి పశ్చిమసముద్రతటమునఁ దనపరిణ మొసర్చుచుండెనో, దిక్చక్రవాళముఁ వృద్ధరంకుమృగమువలె నాకానాక పాండుత క్రమశః విస్తృతమయ్యెనో, గజరుధిరరక్త సింహజటాలోమములవలె లోహితమును, ఈషత్తప్తతామ్రతం తువువలె పాటలవర్ణసుదీర్ఘసూర్యరశ్మిసమూహము సరిగ పద్మ రాగశలాకలచేనైన సమ్మార్జనివలె గగనకుట్టిమమునుండి నక్షత్ర పుష్పసమూహమును సముత్సారిత మొనర్చివేయు చుండెను.

రంగులను దిద్దుటయందు కవి కెంతటి యానందము! శాంతి లేనట్లు, తృప్తియే లేన ట్లున్నది. అది కేవలము చిత్రపట మునందలి రంగు కాదు. దానియందు కవిత్వంపు రంగు, భావము యొక్క రంగు ఉన్నది. అనగా నే రం గెట్టిదో కేవల మా వర్ణన మాత్రమే కాదు. దానియందు హృదయాంశ మున్నది. దీనికొక దృష్టాంతము నెత్తి చూపినచో విషయము పరిష్కారమగును. విషయ మేమన వ్యాధుఁడు చెట్టుపై నెక్కి గూటినుండి పక్షిపిల్ల లను క్రింద పడవేయుచుండెను. ఆ యనుపజాతఉత్పతనశక్తులైన శాబకసమూహముల రం గెట్టిది? 'కాంశ్చి దల్పదివసజాతాన్ గర్భచ్ఛవిపాటలాన్ శాల్మలీకుసుమశంకా ముపజనయతః, కాంశ్చి దుద్భిద్యమానపక్షతయా నళినసంవర్తికానుకారిణః, కాంశ్చి

దరోర్కోపలసదృశాన్, కాంశ్చి ల్లోహితాయమానచంచుకోటీన్, ఈషద్విఘటితదళపుటపాటలముఖానామ్ కమలముకుళానామ్ శ్రియ ముద్వహతః, కాంశ్చి దనవరతశిరఃకంపవ్యాజేన నివారత ఇవ ప్రతీకారాసమర్థాన్, ఏకైకశః ఫలానీవ తస్య వనస్పతేః శాఖాసంధిభ్యః కోటరాభ్యంతరేభ్యశ్చ శుకశాబకా నగ్రహీత్, అపగతాసూంశ్చ కృత్వా క్షితా వపాతయత్'- కొన్ని యల్ప దివసజాతములు, వాని నవప్రసూతిపాటలకాంతి శాల్మలీకుసుమ ములవలె, కొన్నిఁటి రంగు పద్మమునందలి నూత్నసంవర్తికలవలె చిన్నిచిన్ని రెక్కలు గలిగినవి. కొన్నిటిది పద్మరాగమువంటి వర్ణము! కొన్నిఁటిది లోహితాయమానమైన చంచ్వగ్రభాగము; ఒకదాని ఈషదున్ముక్తముఖము కమలమువలె నుండును. వేఱొక దాని మస్తక మనవరతము కంపిత మగుచుండెను. అది వ్యాధుని నివారించుచున్న ట్లున్నది. ఈ సమస్తమైన ప్రతీకారాసమర్థము లైన శుకశాబకములను వ్యాధుడు వనస్పతియొక్క శాఖాసంధి నుండియు కోటరాభ్యంతరమునందుండియు నొక్కొక్క ఫలము వలె గ్రహించి గతప్రాణుల నొనర్చి క్షితితలమున నిక్షేపింప మొదలిడెను.

దీనియందు కేవలము వర్ణవిన్యాసమే కాదు. దానితో పాటు కరుణ మిళితమై యున్నది. అయినను కవి యది హాహా కార మొనర్చి వర్ణించలేదు. వర్ణనయందు కేవలము సాదృశ్య సౌకుమార్యమున నవి స్వయముగనే వికసించి యుద్గమించినవి.

కాని యిట్లొనర్చిన కావ్యము పూర్తి యగుట కష్టము. కారణ మేమన కాదంబరియందు ప్రలోభనము గుట్టలు గుట్టలుగ నుండును. ఈ కుంజవనమునందు వీథివీథియును నవనవవర్ణములతో పుష్పించిన లతావితానము. ఇచ్చట సమాలోచకుడు మధుపానమునందు ప్రమత్తుడైనచో నాతని గుంజనధ్వని యాగిపోవును. వాస్తవముగ నాకు సమాలోచన మొనర్చు నుద్దేశ్య ముండియుండ లేదు. కేవలము ప్రలోభనమునకు వశుడనై పోయి యీ పథమునం దాకృష్టుడనైనాను. ఏ యుపలక్ష్యమున నీ వ్యాసమును వ్రాయుట కుద్యమించినానో, వెంటనే యా ప్రసంగమున కాదంబరీసౌందర్యము నాలోచించి యానందము నందగల నని మనస్సునందు అనుకొనినాను. కాని యించుకదూరము ముందున కేగి తెలిసికొనిన దేమన నీ పథ మంత సంక్షిప్తము కాదు. ఈ రసస్రోతమునం దాత్మసమర్పణ మొనర్చుచో లక్ష్యపథమున కేక మరలజాల నని తెలిసికొనుచున్నాను. వర్తమాన 'సంఖ్యాకప్రదీప' మను పత్రికయం దే చిత్రము ముద్రితమైనదో యా చిత్ర మాధారముగ కొంచెము వ్రాయుట కుద్యమించినాను. దీని మూలపట మొక తైలవర్ణచిత్రము, విషయము కాదంబరినుండి గ్రహించినది. చిత్రకారుడు నాకు స్నేహాస్పదుడైన తరుణ వయస్కుడు, యామినీప్రకాశ గంగోపాధ్యాయుడు.

ఇదిమాత్రము నిశ్చయము. సంస్కృతసాహిత్యమునందు చిత్రించుట కనువగు విషయముల కభావము లేదు. కాని శిల్ప విద్యాలయమున మనము గత్యంతరము లేక యైరోపీయచిత్ర

ముల ననుకరించి చిత్రించుట నేర్చుకొనవలసి వచ్చుచున్నది. అందువలన హస్తమును మనస్సును వైదేశికచిత్రముల కనుకూలముగ తయారగును. దీని కెక వే ఉపాయము లేదు. ఆ యభ్యస్త మార్గమునుండి ప్రత్యావృత్తమై దేశీయచక్షువులతో దేశీయచిత్ర విషయములను దర్శించుట మన విషయమున నతికఠినమైనది. యామినీప్రకాశుఁ డల్పవయస్సునందే యీ కఠినవ్రతమును గ్రహించెను. ఆతని ప్రథమప్రయత్నమున యథేష్టమైన సాఫల్యమును చూచియే 'ప్రదీప పత్రిక'కుఁజెందిన శిల్పానురాగులైన మిత్రులును పత్రికాధిపతులును నత్యంతాసక్తితో నీ చిత్రముల ప్రతికృతులను ముద్రించుటయందు ప్రవృత్తులైరి. నన్ను దీనికి భూమికను వ్రాయుటకై యభ్యర్థించిరి.

కాదంబరియం దే ప్రసంగము చిత్రమునందు వివృతమైనదో, యది సంస్కృతమునుండి వంగభాషలో వ్యాఖ్యానించినచో దీనికి తగిన భూమిక యగును. ఆ ప్రసంగము సరిగ కాదంబరియందలి ప్రవేశద్వారసంబంధి యైనది. ఆలోచించగా నాలోచించగా సరిగ నంతవరకే వచ్చియుంటిని. కాని లోభవశమున నానాదిక్కులకును విక్షిప్తుఁడనై పోయినాను. తిరిగి యచ్చటికే చేరెదను గాక.

నవప్రభాతమున శూద్రకరాజు సభాస్థలియం దుపవిష్టుఁడయ్యెను. అట్టి తఱి ప్రతీహారి వచ్చి క్షితితలనిహితజానుకరకమలియై నివేదించుకొనెను. 'దక్షిణాపథమునుండి చండాలకన్య యొక్కతె పంజరస్థమైన చిలుకను తీసికొని వచ్చుచున్న దేమన

'మహారాజులు సముద్రమువలె సకలభువనములందలి సర్వరత్నములకు నాధారమైనవారు. ఈ విహంగ మొక పరమాశ్చర్య రత్నవిశేష మని దేవర పాదమూలమున ప్రదాన మొనర్చుటకు నేను వచ్చినాను. అందులకై దేవదర్శనసుఖము ననుభవించుటకు వాంఛించుచున్నాను' అని.

ప్రతీహారి యింత సంక్షేపముగ నిష్కృతిని పొందె నని పాఠకు లూహించకుందురు గాక! అకృపణమైన కవి ప్రతిభ యామెయెడలను నజస్రమైన కల్పనావర్షణ మొనర్చెను. ఆయమ వామపార్శ్వమున నంగనాజనవిరుద్ధమైన చంద్రహాసము క్రేలాడు చుండుటచే ఆమెను విషధరముచే చుట్టుకొనఁబడిన చందనలత వలె భీషణముగను రమణీయముగను చూడవలసి వచ్చెను. శరల్లక్ష్మివలె కలహంసశుభ్రవసనయు, వింధ్యవనభూమివలె వేత్రలతావతియు నైన యామె, మూర్తిమతియైన రాజాజ్ఞవలె నున్నది, మూర్తికట్టిన రాజ్యాధిదేవతవలె నున్నది.

సమీపవర్తులైన రాజసమూహాముఖావలోకన మొనర్చి యుపజాతకుతూహలుఁడైన రాజు ప్రతీహారితో ననినాఁడు. 'ఆమెను ప్రవేశింపనిమ్ము.' ప్రతీహారి యప్పుడా చండాలకన్యను సభాస్థలి యందు ప్రవేశపెట్టెను.

అచ్చట నశనిభయముతో గుంపుగూడిన శైలశ్రేణీ మధ్యగతమైన కనకశిఖరములుగల మేరువువలె నరపతిసహస్ర మధ్యవర్తియైన రా జుండెను. నానారత్నాభరణకిరణజాలమున అవయవము లాచ్ఛన్నప్రాయము లగుటచే మనస్సునం దనిపించు

చున్నది; సహస్రఇంద్రాయుధములతో సప్తదిగ్విభాగ మాచ్ఛాదిత మొనర్చి వర్షాకాలమునందలి ఘనగంభీరమైన దినము విరాజమానమైనట్లు, లంబితమైన స్థూలముక్తాకలాపమును, స్వర్ణశృంఖలములందు బద్ధమైన మణిదండచతుష్టయమునందు అమలశుభ్ర అనతిబృహద్దుకూలవితానవిస్తృతమును. దాని యధోభాగమునసే ఇందుకాంతమణిపర్యంకమున రాజు నిషణ్ణుఁడు. ఆయన పార్శ్వమునందు కనకదండచామరకలాప ముద్ధూయమాన మగుచుండెను. పరాభవప్రణతమైన శశివలె విశదోజ్జ్వలపాదపీఠమునం దాయన వామపాదము విన్యస్తము. అమృతఫేనమువంటి ఆయన లఘుశుభ్రదుకూలవసనప్రాంతమున గోరోచనముతో హంసమిథునమాలలంకితములు. అతిసుగంధచందనానులేపమున నాయన యురస్థలము ధవళితము. అవయవములయందలి రక్తచందనచర్చలచే నచ్చటచ్చట నిపతితప్రభాతకిరణములచే నంకితమైన కైలాసశిఖరమువలె నాయన శోభాయమానుఁడై యుండెను. ఇంద్రనీలాంగదయుగళమున నాయన బాహుద్వయమునందు చపలమైన రాజ్యలక్ష్మిని బంధించి యుంచినాఁడన్న ట్లున్నది. ఆయన కర్ణోత్పల మించుక యాలంబితము. మస్తకమునందు సువాసనలఁ జిమ్ము మాలతీమాల, ఉషఃకాలమునం దస్తాచలశిఖరమున తారకాపుంజము పర్యస్తమైన ట్లున్నది. సేవాసంగతలైన యంగనాగణము దిగ్వధువులవలె నాయనను పరివేష్టించి యుండిరి.

అప్పుడు ప్రతీహారి నరపతిని ప్రబోధించుటకై రక్తకువలయదళకోమలహస్తమున వేణులతను గ్రహించి యొక్కమారు సభా

కుట్టిమమున నాఘాత మొనర్చెను. తత్క్షణమే తాళఫలపతనశబ్దమున వనకరియూథములవలె రాజసమూహము ముఖముల నావలిత మొనర్చి తదభిముఖముగ దృష్టిపాత మొనర్చిరి.

ఆర్యవేషధారియైన, ధవళవసనములను ధరించిన యొకానొక వృద్ధచండాలుని పురస్కరించుకొని, కాకపక్షధారియైన బాలకుఁ డొకఁడు స్వర్ణశలాకానిర్మితమైన పంజరమునందలి విహంగమును మోసికొని వచ్చుచుండుటను వారు గాంచిరి. మఱియు నతనివెంట నిద్రవలె లోచనగ్రాహిణియు, మూర్ఛవలె మనోహారిణియునైన నొక తరుణవయావనయైన కన్య. — అసురగృహీతమైన యమృతము నపహరించుటకై కపటపటువిలాసినీవేషధారియైన విష్ణునివలె నామె శ్యామవర్ణ. ఒకానొక సంచరణశీలియైన నింద్రనీలమణినిర్మితపుత్తలికవలె నున్న దామె. ఆగుల్ఫవిలంబితమైన నీలకంచుకముతో నామె శరీర మాచ్ఛన్నమై యుండెను. దానిపై రక్తాంశుకావగుంఠనమున నామె నీలోత్పలవనమునందు సంధ్యాలోకము పడినట్లున్నది. ఒక కర్ణముపై ఉదయోన్ముఖేందుకిరణచ్ఛటవలె నొక శుభ్ర కేతకీపత్రి మాసక్తమై యుండెను. లలాటమునం దామెకుగల రక్తచందనతిలకము కిరాతవేషమున నున్న త్రిలోచన యగు భవానినిఁ దలఁపించుచుండెను.

మన సమాలోచ్యచిత్రవిషయము నించుక సంక్షేపముగ ననువదించితిని. సంస్కృతకవులలో చిత్రాంకణమునందు బాణభట్టుని కీడైనవా రెవరును లేరని సాహసముతో చెప్పఁగలము. కాదంబరీకావ్యమే యొక చిత్రశాల. సాధారణముగ లోకులు

ఘటనలను వర్ణించి కథలను నిర్మింతురు. బాణభట్టు పై పై చిత్ర ములు నలంకరించి కథలను చెప్పినాఁడు. - అందుచే నాయస కథలు గతిశీలములు కావు. అవి వర్ణచ్ఛటలయం దంకితములు. చిత్రములై నను ఘనసంలగ్నములై న ధారావాహికములు గావు; ఒక్కొక్క చిత్రమునకు నలుదెసలను ప్రచురమును, కారుకార్య విశిష్టమును, బహువిస్తృతమును నైన భాషయొక్క సువర్ణమయ మైన చట్రము బిగింపఁబడినది. చట్రముతోఁగూడిన యా చిత్ర ముల సౌందర్యాస్వాదనమునుండి యెవరు వంచితులో వారు అదృష్టహీనులు.



# ధమ్మపదము

జగత్తునందలి శ్రేష్ఠగ్రంథములలో ధమ్మపద మొకటియై యున్నది. బౌద్ధులదృష్టిలో యీ ధమ్మపదమునందలి మాట లన్నియు కేవలము బుద్ధదేవుని ముఖనిస్సృతము లనియు, ఆయన మృత్యువునకు ముం దనతికాలములోనే యవి గ్రంథాకారమున నాబద్ధమైన వనియు వారి విశ్వాసము.

ఈ గ్రంథమునందలి యుపదేశము లన్నియు బుద్ధుని స్వీయరచనలో కావో నిస్సంశయముగ చెప్పుట కష్టము. కాని యీ నీతివాక్యము లన్నియు భారతవర్షమునందు బుద్ధుని కాలమునను అంతకు పూర్వమందు నుండి ప్రచలితములై వచ్చుచుండిన వనుట తప్పక స్వీకరించవలసిన విషయము. దీనియందలి యనేక శ్లోకముల కనురూపమైన శ్లోకములు మహాభారతమునందును పంచతంత్రమునందును మనుసంహిత మొదలైన గ్రంథములందును కానవచ్చుచున్నవి. ఇచ్చట నీక యెవ రెవరినుండి సంగ్రహించి యొనర్చినా రను విషయమును తీసికొని తర్కించుట నిరర్థకము. ఈ సమస్తభావముల స్రోతస్విని భారతవర్షమునం దెంతకాలము నుండియో ప్రవహించుచు వచ్చుచున్నది. మన దేశ మీ విధముగనే చింతించుచు వచ్చుచున్నది. బుద్ధుడు వీనిని నలుదెసలనుండి సహజముగ నాకర్షించి, తనవిగ నొనర్చుకొని సుసంబద్ధ మొనర్చి వీనికి చిరంతనరూపమున స్థాయిత్వ మొసంగి పోయెను. ఏవి విక్షిప్తములుగ నుండెనో వాని నైక్య

సూత్రమున గూర్చి మానవునికి వ్యవహారయోగ్యములుగ నొస
ర్చెను. అందువలన భగవద్గీతయందు భారతవర్ష మెట్లు తన్ను
తాను ప్రకాశ మొనర్చికొనినదో, గీతోపదేష్ట భారతీయభావమున
కొకే స్థానమున నొక సమష్టిమూర్తిని నిర్మించి యొసఁగినాఁడో,
ధమ్మపదమునందును భారతవర్ష మొకానొక హృదయపరిచయ
మును వ్యక్త మొనర్చినది. ఇందులకే ధమ్మపదమునందేమి, గీత
యందేమి భారతవర్షమునం దితరగ్రంథములందు కానసగు ననేక
విషయములకు ప్రతిరూపములు లభ్య మగుచున్నవి.

ధర్మగ్రంథముల నెవ్వారు ధర్మగ్రంథములుగనే గ్రహిం
తురో, వా రిందువలన నెట్టి ప్రయోజనమును గాంచెదరో దానిని
గూర్చి నే నిచ్చట యాలోచించుట లేదు. ఇచ్చట మనము ఇతి
హాసమువైపునుండి విషయమును దర్శించుచున్నాము. అందుచే
ధమ్మపదమును విశ్వజనీనభావమున స్వీకరింపక మనము దానితో
భారతవర్షమునకుఁ గల సంబంధమునుగూర్చియే విశేషించి వివ
రింపవలసియున్నది.

మానవు లందఱి జీవితచరిత్రములందువలెనే యన్ని దేశ
ముల యితిహాసము లొకేరీతి నుండవు. ఇందుచేత, భారతేతిహాస
మున కుపకరణములు లభింపవనుటలో నైరోపీయరీతి ననుసరించిన
యితిహాసోపకరణములు లభింప వని యర్థము. అనగా భారత
వర్షేతిహాసము రాష్ట్రీయేతిహాసము కాదు. భారతవర్షమున
నొకటి లేక నంతకన్న యెక్కువ జాతులు (నేషన్స్) ఎన్నఁడును,
ఎల్లరను ఐక్యపరచి యొకేయొక యాధిపత్యమున నిలుపఁజాలక

పోయెను. అందుచే నీ దేశమున నెవ్వఁ డెప్పుడు రాజయ్యెను? ఎంతకాలము పరిపాలించెను? వీనిని లిపిబద్ధ మొనర్చి నిలిపియుంచుట కెవరికిని ఉత్సాహము జనింపలేదు.

భారతవర్షముయొక్క మనస్సు రాష్ట్రసంఘటనమునందు లిప్తమై యుండెనేని యితిహాసమునకు ప్రబలమైన యుపకరణములు లభించియుండెడివి. ఐతిహాసికుల గవేషణయు నెంతో సహజముగా జరిగెడిది. కాని యిట్లని భారతవర్షముయొక్క మనస్సు తన యతీతభవిష్యత్తుల నొకానొక యైక్యసూత్రమున గ్రథిత మొనర్ప లేదనరాదు. ఆ సూత్రము సూక్ష్మమైనది. కాని దాని ప్రభావము సామాన్యమైనది కాదు. అది స్థూలభావమునకు గోచరించునది కాదు. కాని యది నేటివఱకు మనలను విచ్ఛిన్నమును, విక్షిప్తమును కానీయకుండ నిలిపినది. సర్వత్ర వైచిత్ర్యహీనసామ్యమును నిల్పినదని కాదు. కాని సమస్తవైచిత్ర్యముల, వైషమ్యముల లోలోపల నొక మూలగతమును సత్రసత్యాత్మమును నైన యోగసూత్రమున నుంచివేసెను. అందుకే మహాభారతమునందు వర్ణితమైన భారతదేశమునకును వర్తమానశతాబ్దమునందలి భారతదేశమునకును ననేక గొప్పగొప్ప విషయములలో విభిన్నత యేర్పడినను రెంటియందును నాడీయోగము విచ్ఛిన్నము కాలేదు.

ఆ యోగమే భారతవర్షమున నన్నిటికంటెను సత్యమైనది. ఆ యోగసంబంధమైన యితిహాసమే భారతవర్షముయొక్క యథార్థేతిహాసము. ఆ యోగము దేనిని పురస్కరించుకొని? రాష్ట్రీయస్వార్థమును పురస్కరించికొని కాదని ముందే తెలియఁజేసితిని.

ఒకే మాటలో చెప్పవలె ననిన చెప్పఁదగిన దేమన 'ధర్మమును పురస్కరించుకొని' యని.

అట్లైనను తప్పక తెలిసికొనవలసిన దేమన, పరివర్తన మనిన విచ్ఛేదము కాదని. శైశవమునుండి యౌవనమునకుఁ బరివర్తనము విచ్ఛిన్నతనుండి పొసఁగదు. యూరోపీయ ఇతిహాసము నందును రాష్ట్రీయప్రకృతిలో బహుతరమైన పరివర్తన ఘటిల్లినది. ఆ పరివర్తనలోనుండి పరిణతియొక్క రూపమును దర్శింపఁ జేయుటయే యైతిహాసికుల కార్యము.

యూరోపీయ జాతు లనేకయత్నములద్వారా ననేకపరివర్తనములనుండి ముఖ్యముగ రాష్ట్రనిర్మాణమునకు యత్నమొనర్చినవి. భారతవర్షీయులు నానాక్రియలనుండి, నానాపరివర్తనలనుండి ధర్మమునకు సమాజమునం దాకృతి నొసఁగుటకు యత్నించినారు. ఈ ఒక్క యత్నమునందే ప్రాచీనభారతమున కాధునికభారతముతో నైక్యము.

యూరోపునందు ధర్మప్రయత్న మాంశికభావమున పనిచేసినది, రాష్ట్రప్రయత్నము సర్వాంగీణభావమున కార్యనిర్వాహణ మొనర్చినది. ధర్మ మచ్చట స్వతంత్రభావమున నుద్భూతమైకూడ రాష్ట్రమున కంగ మైపోయినది. ఎచ్చట దైవవశమున నట్లు కాలేదో అచ్చట రాష్ట్రముతో ధర్మమునకు చిరస్థాయియైన విరోధము నిలిచిపోయినది.

మన దేశమునందు మొగలుల రాజ్యకాలమున శివాజీ నాశ్రయించికొని రాష్ట్రవిప్లవము తలయెత్తియుండి నప్పుడు, ఆ

యత్నము ధర్మమును లక్ష్యమునందుంచికొనుటను విస్మరింపలేదు. శివాజీ గురువైన రామదాసస్వామి ఈ ప్రయత్నమునందు ప్రధానావలంబనముగ నుండెను. అందుచే తెలియుచున్న దేమనగ, రాష్ట్రనిర్మాణ యత్నము భారతవర్షమున ధర్మమున కంగీభూతమై యొప్పిన దని.

పాలిటిక్స్, నేషన్ అను మాటలు యూరోపున కెట్లో, ధర్మ మను మాటయు భారతవర్షమున కట్లే. పాలిటిక్స్, నేషన్ యను మాటల కనువాదము భారతవర్షమున మన భాషలందు సంభవము కానట్లే ధర్మ శబ్దమునకు ప్రతిశబ్దము యూరోపీయ భాషలందు వెదకి కనుగొనుట యసాధ్యము. ఇందుకే ధర్మమును ఇంగ్లీషునందలి 'రెలిజియన్' రూపమున కల్పించుకొని మనము తఱచు పొఱపాటు పడుచుందుము. కనుకనే ధర్మప్రయత్నము యొక్క యైక్యమే భారతవర్షముయొక్క ఐక్య మనిన దో నది యస్పష్టముగ వినఁబడును.

మానవుఁడు ముఖ్యముగ నే భావమున నెట్టి ఫలితము నపేక్షించి కర్మపరుఁ డగునో యదియే యతని పరిచయము నొసఁగును. 'లాభము గడింతును' - ఈ లక్ష్యముతోను ధనము సంపాదింపవచ్చును. 'కల్యాణమును చేకూర్చెదను'-ఈ లక్ష్యము తోను ధనార్జన యొనర్పవచ్చును. ఏ వ్యక్తి కల్యాణమును లక్షించునో ధనార్జనయం దాతని కనేకములైన యప్రాసంగిక బాధలు సంభవించును. ఏ వ్యక్తి లాభమునుమాత్రమే లక్షించునో యతని పక్షమున నట్టి బాధల కెన్నడు తావే లేదు.

ఇప్పు డీక విషయ మేమన కల్యాణమును మన మేల మన్నింతుము ? అంతతః భారతవర్షము లాభముకంటె కల్యాణము నెక్కుడుగ, ప్రేయముకంటె శ్రేయము నెక్కుడుగ ఏల తెలిసికొని గౌరవించినదో యది భావించి తెలిసికొనవగిన విషయము.

ఏ వ్యక్తి కేవల మేకాకియో వానికి మంచిచెడు కర్మ లేవియు లేవు. ఆత్మానాత్మయోగముననే మంచిచెడు కర్మలన్నియు నుద్భవించుచున్నవి. అందువలన మొదటనే యీ యాత్మానాత్మ సత్యసంబంధనిర్ణయ మావశ్యక మగును. ఈ సంబంధనిర్ణయమును, జీవితమునందలి వ్యవహారమునం దీ సంబంధమును స్వీకరించి నడచుట,యిదియే చిరకాలాగతమగు భారతవర్షముయొక్క సర్వప్రధానమైన ప్రయత్నవిషయమై యుండెను.

భారతవర్షమునం దాశ్చర్యకరమైన విషయమేమన నిచ్చట భిన్నభిన్న సంప్రదాయము లీ సంబంధమును భిన్నభిన్న రూపములుగ నిర్ణయించినవి. కాని వ్యవహారమునం దొకే తావునకు వచ్చి శ్రమైక్యముఁ జెందినవి. భిన్నభిన్న స్వతంత్రదృష్టులనుండి భారతవర్ష మొకే విషయమును చెప్పినది.

ఒక సంప్రదాయము, ఆత్మానాత్మల మధ్య నెట్టి సత్యప్రభేదమును లేదని చెప్పినది. ఏ ప్రభేదము ప్రతీయమాన మగుచున్నదో దాని మూలమునందు 'అవిద్య' యున్న దని యీ సంప్రదాయముయొక్క సిద్ధాంతము.

కాని ఒక్కటిమాత్రమేయై రెండవది లేనేలేనిచో మంచిచెడ్డల కెట్టి స్థానము నుండనే యుండదు. కాని పరిష్కృతి యింత

సహజముగ లేదు. ఏ యజ్ఞాన మొకటిని కెంపుగా నొనర్చినదో దానిని వినాశ మొనర్పవలయును, లేనిచో మార్గ-చక్రమునం బడిపోయిన నిరత దుఃఖమున కంతముండదు. ఈ లక్ష్యము నైపు దృష్టినుంచి కర్మయొక్క మంచిచెడ్డలను స్వీకరింపవలయును.

మఱియొక సంప్రదాయము చెప్పునదేమనగా: 'ఇదిగో ఈ సంసారావర్తమున మనము వాసనలమూలమునం జిక్కుకొని దీని యందాబద్ధులమై తిరుగుచున్నాము, దుఃఖించుచున్నాము. ఒక కర్మద్వారా వేఱొక కర్మ, మఱియు నిట్లే అనంతకర్మశృంఖలలను రచించికొనుచు వచ్చుచున్నాము - ఈ కర్మపాశమును ఛేదించి ముక్తుడగుటయే మానవుని కేకమాత్రమైన శ్రేయము' అని.

కాని, మఱి కర్మ యంతయు ముగిసిపోవలెను గదా! అది కాదు. నిష్కృతి యంత సహజము కాదు. కర్మయొక్క దుర్భేద బంధనములు క్రమముగ శిథిలము లగుచుండునటుల కర్మను నియమించవలసియున్నది. ఈవైపు లక్ష్యముంచి ఏ కర్మ శుభమైనది, ఏ కర్మ అశుభమైనది, దానిని స్థిర మొనర్చికొనవలయును.

మఱియొక సంప్రదాయము చెప్పునదేమనిన, యీ సంసారము భగవానుని లీల. ఈ లీలకు మూలమునం దాయన ప్రేమను, ఆనందమును అనుభవింపగల్గినచో మాత్రమే మనకు సార్థకత యని. ఈ సార్థకతయొక్క యుపాయముకూడ పూర్వోక్తమైన సంప్రదాయద్వితయోపాయములనుండి వస్తుతః భిన్నము కాదు. నిజవాసనలను ఖర్వ మొనర్చికొనఁజాలనిచో భగవానుని

యిచ్ఛ ననుభవమునకుఁ దెచ్చికొనఁజాలము. భగవానుని యిచ్ఛ యందు నిజేచ్ఛకు ముక్తిదానమే నిష్కృతి. ఆ ముక్తి వైపు లక్ష్యమునుంచియే కర్మయందలి శుభాశుభములను స్థిర మొనర్చి కొనవలసి యున్నది.

ఎవ రద్వైతవాదమును లక్ష్యమునం దిడుకొనినారో వారును వాసనామోహమును ఛేదన మొనర్చుటయం దుద్యతులే. ఎవరు కర్మయొక్క యనంతశృంఖలములనుండి ముక్తిని కోరుచున్నారో వారును వాసనల నుత్పాటిత మొనర్చుట కభిలషించుచున్నారు. భగవానుని ప్రేమయం దెవ్వరు తమ్ము తాము సమ్మిళిత మొనర్చికొనుటయే శ్రేయ మని భావించుచున్నారో, వారును విషయవాసనలు తుచ్ఛములని, విసర్జింపఁదగిన వనియే వాక్రుచ్చుచున్నారు.

ఈ భిన్నభిన్న సంప్రదాయములకుఁ జెందిన యుపదేశములు కేవలము మనకు జ్ఞానవిషయములుమాత్ర మగుచో మనలో పరస్పరము పార్థక్యమున కవధు లుండెడివి కావు. కాని యీ భిన్నభిన్న సంప్రదాయసమూహములు వాని భిన్నభిన్న తత్త్వములను కర్మ కనుసంధింపఁజేయుటకై యత్న మొనర్చినవి. ఆ తత్త్వ మెంత సూక్ష్మమైన నగుగాక, స్థూలమైన నగుగాక, ఆ తత్త్వమును వ్యవహారమునం దనుసరించుటకై యెంత దూరమైన పోవలసిన యవసర ముండుగాక, మన గురుజనసమూహము సమస్తమును స్వీకరించి, యా తత్త్వమును కర్మద్వారా సఫల మొనర్చుటకై యత్నించిరి. భారతవర్షమే గొప్పవిషయమును

అసాధ్య మని గాని, సంసారయాత్రతో నసంగతమైన దని గాని, యెన్నడును భీరుత్వముతో విషయము విషయముకొఱకని వదలి వేయ లేదు. అందుచే నొకకాలమున, ఏ భారతవర్షము మాంసా శిగ నుండెనో, ఆ భారతవర్షమే నే డించుమించు సర్వత్ర నిరా మిషాశియై వర్తిల్లుచున్నది. జగత్తునం దిట్టి దృష్టాంతము లితరత్ర నెచ్చటను లభింపవు. ఏ యూరోపు జాతిగతమైన సముదయపరి వర్తనమూలమునందు సౌకర్యమును మాత్రమే లక్షించునో, ఆ యూరోపువాసులు కృషివ్యాప్తిసహకారము నుద్దేశించి భారత వర్ష మార్థికకారణములవలన గోమాంసభక్షణమును మానివేసిన దనవచ్చును. కాని మనుధర్మశాస్త్రము మొదలైనవాని విధా నము లెట్లున్నను నితరవిధములైన మాంసాహారమును, యింత యెందుకు, మత్స్యభోజనముకూడ భారతవర్షమున ననేకప్రదేశము లందు లోపించిపోయినది. ఏ ప్రాణిని హింసింపకుము, - ఈ యుప దేశము జైనులలో నెంతగా పాలింపఁబడుచున్న దనిన అది కేవ లము సౌకర్యము దెసనుండి నితాంత మతిశయముగ భావించ కుండ నుండుటకు వీలే లేదు.

ఎట్లైనను, తత్త్వజ్ఞాన మెంత దూరము ప్రసరించినదో భారతవర్షము కర్మనుగూడ నంత పర్యంతము లాగికొని పోయి నది. భారతవర్షము తత్త్వముతో కర్మకభేదసాధనమును పాటిం చినది. అందువలన మన దేశమున కర్మయే ధర్మ మైనది. మన నిర్వాచన మేమన, మానవునియొక్క కర్మకు చరమలక్ష్యము కర్మ నుండి ముక్తి. ముక్తిలక్ష్యముగ కర్మ యొనర్చుటయే ధర్మము.

తత్త్వమునందు మన కెంతెంత పార్థక్య మున్నను కర్మ యందు మన కైక్య మున్నది. అద్వైతానుభూతియందు ముక్తి యనుము, లేక విగతసంస్కారనిర్వాణమునందే ముక్తి యనుము, లేక భగవానుని యపరిమేయప్రేమానందమునందే ముక్తి యనుము, ప్రకృతిభేదమున నే ముక్త్యాదర్శ మెవరి నెట్లాకర్షించినను, ఆ ముక్తిపథమున సంచరించు నుపాయములయందొక యేకత యున్నది. ఆ యైక్య మింకేమియు కాదు, సమస్త కర్మను నివృత్తి కభిముఖ మొనర్చుట. సోపాన మెట్లు సోపానాతిక్రమణమున కుపాయమో, భారతవర్షమున కర్మ యట్లే కర్మ నతిక్రమించుట కుపాయము. మన సమస్త శాస్త్రములందును, పురాణములందును, యిట్టి యుపదేశములే యున్నవి. మన సమాజ మీ భావములపైననే ప్రతిష్ఠితమై యున్నది.

యూరోపు కర్మను కర్మనుండి ముక్తికొఱకు సోపాన మొనర్చలేదు. కర్మనే లక్షించినది. అందుచే యూరోపునందు కర్మసంగ్రామమున కంతము లేదు; అచ్చట కర్మ క్రమశః విచిత్రమును, విపులము నై యెసఁగుచున్నది. కృతకార్యు లగుటయే యచ్చటి సర్వుల యుద్దేశ్యము. యూరోపు యితిహాసము కర్మ యొక్క యితిహాసము.

యూరోపు కర్మనే గొప్పగ చూచినది. కనుక కర్మ యొనర్చుటలో నది స్వాధీనత నభిలషించినది. మన కేది యిష్టమో మనము దాని నాచరింతుము; ఈ స్వేచ్ఛ యొచ్చట ఇతరుల కర్మ పరతయందలి స్వాధీనతను హనన మొనర్చునో కేవల మచ్చటనే

చట్టముయొక్క ప్రయోజన మున్నది. ఈ ధర్మశాసనమునకు వ్యతిరేకముగ సమాజమునందు ప్రత్యేకవ్యక్తికి యథాసంభవమైన స్వాధీనత యుండుటయే యసంభవము. అందుచే నైరోపీయసమాజములో సమస్తశాసనములును, శాసనాభావమును ప్రత్యేకవ్యక్తియొక్క యిచ్ఛను స్వాచ్ఛంద మొనర్చుటకై కల్పింపఁబడినవి.

భారతవర్షము స్వాచ్ఛందతను వాంఛించినది. కాని యీస్వాచ్ఛందత పూర్తిగ కర్మనుండి స్వాచ్ఛందత. ప్రపంచ మను దానియందు కర్మయే వస్తుతః కర్త యనియు, మనుష్యుఁడు కేవలము దానికి వాహకుఁ డనియు మనకు తెలియును. జన్మనుండి మృత్యువు వఱకు మన మొక వాసననుండి వేఱొక వాసనను, ఒకకర్మనుండి వేఱొక కర్మను మోసికొని పోవుదుము, విశ్రాంతి తీసికొను సమయము మనకు లేదు; అటుపై నా కర్మభారము నితరుల మెడకు చుట్టి, హఠాత్తుగ మృత్యువువాతఁ బడిపోవుచుందుము. ఈ వాసనాతాడనముచే జీవిత మంతయు నంతులేని కర్మ యొనర్చి యేగుట, దీనికి అవిరామదాసత్వ మొనర్చుటనే భారతవర్ష ముచ్ఛేద మొనర్ప నెంచెను.

ఈ లక్ష్యమునందలి పార్థక్యవశమువనే యూరోపు వాసనలకు యథాసంభవముగ స్వేచ్ఛ నొసఁగినది. మనము వాసనలను యథాసంభవముగ ఖర్వ మొనర్చినాము. వాసనయే నాటికిని శాంతి కాస్పదము కాదు. పరిణామహీనమైన కర్మప్రవృత్తినే ప్రేరేపించును, అను విషయమే కర్మయొక్క దౌరా

త్మ్యముగ భావించి మన మసహిష్ణుల మగుదుము. వాసన లెట్టి పరిణామమునకును తీసికొనిపోవు. అవి నియతము, మన ప్రయాసము నతిక్రమించి యుంచును. ఇదియే వాని గౌరవ మని యూరోపు అనును. ప్రాప్తి కాదు సంధానమే యానంద మని యూరోపు సూక్తి. మీరు ప్రాప్తి యను దానియం దానందము లేదు. కారణ మేమన నా ప్రాప్తియందు సంధానమున కంతము లేదని భారతవర్ష మనును. ఆ ప్రాప్తి మనలను మఱియొక సంధానము వైపునకు లాగికొనిపోవును. ప్రతి ప్రాప్తిని పరిణామ మని భ్రమపడుదుము. అటుతరువాత నది పరిణామమే కాదని గ్రహింతుము. ఏ ప్రాప్తియందు మనకు శాంతి యున్న దనియు, మన సంధానమున కంత ముండుననియు భ్రమింతుమో, ఆ భ్రమయే దానినుండి మనలను భ్రష్టుల నొనర్చును.— మన కే రూపముననను ముక్తి నీయదు. ఏ వాసన ముక్తికి విరోధమో, ఆ వాసననే మనము బలహీన మొనర్తుము. మనము కర్మను జయింపనీయము. కర్మపై విజయమును సాధింతుము.

మన గార్హస్థ్యము, సన్న్యాసము, మన యాహారవిహారములందలి నియమసంయమములు, మన బైరాగులు, భిక్షుకుల గానమునుండి తత్త్వజ్ఞానుల శాస్త్రవ్యాఖ్యానముల పర్యంతము, సర్వత్ర నీ భావముల యాధిపత్యమే. కృషీవలునినుండి పండితుని వఱకు నెల్లరును ‘మనము దుర్లభమైన మానవజన్మ మెత్తినాము. బుద్ధిపూర్వకముగ ముక్తిపథమును గ్రహించుటకొఱకు, సంసారమునందలి శాశ్వతావర్తముయొక్క యాకర్షణనుండి బయట పడుటకునే!’ అని చెప్పుచున్నారు.

సంస్కృతభాషయందు 'భవ'- శబ్దమునకు ధాత్వర్థము, 'అగుట' యనునది. భవబంధనము అనగా అగుట యను బంధ మున. దానిని మనము ఛేదింపఁగోరెదము. యూరోపు విశేషించి 'యగుటకు' వాంఛించును. మనము పూర్తిగ 'కాకుండుటకు' వాంఛింతుము.

ఇట్టి భయంకరమైన స్వచ్ఛందతాప్రయత్నముయొక్క మంచిచెడ్డలను గూర్చిన మీమాంస చాల కఠినమైనది. ఇట్టి యనాసక్తి యెవరిదో, స్వభావసిద్ధముగ నాసక్తులైనవారి సంసర్గ మునందు వారికి విపత్తు ఘటింపవచ్చును; ఇంత యేల, వారి యవసానమునకే దారి తీయ వచ్చును. అపరపక్షమున చావు బ్రతుకులే సార్థకతకు చరమపరీక్ష కాదని చెప్పఁదగియున్నది. ఫ్రాన్సు భీషణమైన రాష్ట్రవిప్లవములో స్వచ్ఛందత యను విశేష మైన యొకానొక యాదర్శమును సాధించుటకై యత్నించి యుండెను. ఆ యత్నము ఇంచుమించు దాని కాత్మహత్యాసదృశ మైనది - అది నశించిపోయి యుండినచో దాని గౌరవమున కేమైన లఘుత్వ మొదవెడిదా? ఒక మేధావియైన వ్యక్తి నుద్ధ రించుయత్నములో నొక వ్యక్తి ప్రాణమును కోల్పోయినాఁడు, వేఱొక వ్యక్తి తీరమున నిలిచియున్నాఁడు - అందువలన నుద్ధా రప్రయత్నమును మృత్యుపరిణామముద్వారా విచారించి ధిక్కార మొనర్పవలసినదా? నేఁడు పృథ్వియం దెల్లయెడలను వాసనాగ్నిని ప్రబల మొనర్చుటయును, కర్మదౌరాత్మ్యము నుత్కట మొన ర్చుటయు జరుగుచున్నది. నేఁడు భారతవర్షము జడభావమున

గాక, మూఢభావమున గాక జాగరితమైన సచేతనభావమున వాసనాబంధముక్తియొక్క యాదర్శమును, శాంతియొక్క జయ పతాకను, యీ పృథ్వీవ్యాపియైన రక్తాక్తవిక్షోభమున కూర్ధ్వ ముగ నవిచలితమైన దృఢహస్తముతో ధారణ మొనర్చి మర ణింపఁగలిగినచో నితరు లెల్లరు దాని నెంత ధిక్కార మొనర్చి నను, ఆ ప్రయత్నమునందు ఘటిల్లిన మృత్యువుకూడ శ్రేయమే యగును.

కాని యీ తర్క మిచ్చుట విస్తార మొనర్చుట కిది స్థానము కాదు. దరహామున చెప్పఁదగిన దేమన యారోపుచరి త్రతో మన చరిత్ర కైక్య మెన్నటికి పొసఁగ దను విషయమును మనము తిరిగితిరిగి విస్మరింతుము. ఏ యైక్యసూత్రమున భారత వర్షముయొక్క యతీతభవిష్యత్తులు సంఘటితములో దానిని యథార్థభావమున ననుసరింప నెంచినచో మన శాస్త్రములు, పురాణములు, కావ్యములు సామాజికానుష్ఠానములయందు ప్రవేశింపవలసి యుండును. రాజవంశావళికొఱకై వృథా కాల యాపన మొనర్చి సంచరించుచో విశేషలాభ మేమియు చేకూ రదు. ఐరోపీయేతిహాసాదర్శముతో భారతవర్షేతిహాసమును రచన యొనర్పవలయు నను విషయమును మనము పూర్తిగ విస్మరింపవలయును.

ఈ యితిహాసమున కెన్నో యుపకరణములు బౌద్ధశాస్త్ర ములం దాబద్ధమై యున్న వను విషయమున నెట్టి సందేహమును లేదు. మన దేశమునందు బహుకాలమునుండి యనాదృతమై

యున్న యీ బౌద్ధశాస్త్రము నైరోపీయ పండితు లుద్ధరించుటకై ప్రవృత్తులైనారు. మనము వారి పదానుసరణ మొనర్చు ప్రతీక్షలో కూర్చుండియున్నాము. ఇది మన దేశవిషయమున లజ్జింపఁదగినది. దేశముపట్ల మనకుఁగల సమస్తప్రేమయు రాచరిక ముద్వారా దేశమున కప్రవృత్తియందుమాత్ర మాబద్ధమైనది. ఇఁక యే దిక్కునను నెట్టి గతియు లేదు. ఇంత విశాలదేశమున నైదారుగురైన బౌద్ధశాస్త్రముల నుద్ధరించుటయే జీవితవ్రత స్వరూపముగ గ్రహింపఁజాలినవారు లేరా? ఈ బౌద్ధశాస్త్ర పరిచయ అలాభమున భారతవర్షేతిహాసము సమస్త మంధ ప్రాయమైపోయినది. ఈ మాటను భావించియైన దేశమునందలి యే కొలదిమందియేని తరుణోత్సాహముతో నీ మార్గమున పరుగిడుట కుద్యతులు కారా?



# కావ్యప్రపంచమున నుపేక్షితలు



వాల్మీకి తన కల్పనాప్రవాహమునందలి కరుణవారి నంతయు కేవలము జానకియొక్క పుణ్యాభిషేకమునందే నిశ్శేషమొనర్చివైచెను. కాని మఱియుక మ్లానముఖియు నైహికమైన సర్వసుఖములనుండి వంచితయు నైన రాజవధువు సీతాదేవియొక్క ఛాయాతలమున నవకుంఠితయై నిలచియున్నది. కవి కమండలము నుండి యభిషేకవారి యొక బిందువైనను నామె చిరదుఃఖాభితప్తనమ్రలలాటమున నెందుకు సించితము కాలేదు? ఆహా! అవ్యక్తవేదనాదేవీ! ఊర్మిళా! నీవు ప్రత్యూషతారవలె మహాకావ్యముయొక్క సుమేరుశిఖరమున నొక్కమారుమాత్ర ముదయించియుంటివి. అటుతరువాత నరుణాలోకమున నిఁక నిన్ను దర్శించుటే యసంభవ మైపోయినది. నీ యుదయాచల మెక్కడ? నీ యస్తాచల మెచ్చట? దాని నడుగుటకైనను అందఱు విస్మృతిఁ జెందినారు.

కావ్యప్రపంచమునం దొకరిద్దఱు రమణీమణు లున్నారు. వారు కవిచేత సంపూర్ణముగ నుపేక్షితలై కూడ యమరలోకము నుండి భ్రష్టలు కాలేదు. పక్షపాతకృపణమైన కావ్యము వారి కొఱకైన స్థానమును సంకోచింపఁజేసినది కావుననే పాఠకహృదయము ముందునకు వచ్చి వారి కాసనము నొసఁగినది.

కాని ఈకవిపరిత్యక్తలయం దెవరి కెవరు హృదయమున నాశ్రయ మిత్తు రనునది పాఠకుల ప్రకృతిపైనను, యభిరుచిపైనను నాధారపడి యుండును. సంస్కృతసాహిత్యమునందు కావ్యయజ్ఞశాలయొక్క ప్రాంతభూమియందే కొలఁదిమంది యనాదృతలైనవారితో నాకు పరిచయ మేర్పడినదో వారియం దూర్మిళకు నేను ప్రధాన స్థాన మొసఁగెదను.

అందుల కొక కారణ మేమన, యింత మధురనామము సంస్కృతకావ్యములందు ద్వితీయ మిఁక లే దనుకొందును. నామమును కేవలము నామమాత్రముగనే గ్రహించువారి జాతికి నేను జెందను. షేక్స్పియర్ చెప్పినాఁడు, గులాబిపుష్పమున కే నామమైన నుంచవచ్చును, అందుచే దాని సౌందర్యమునందు తారతమ్యము రాదు! అని. గులాబివిషయమున నది వర్తించవచ్చును! కారణము గులాబియొక్క సౌందర్యము సంకీర్ణసీమయం దాబద్ధము. అది కేవలము కొన్ని సుస్పష్టమైన ప్రత్యక్షగుణములపైనాధారపడి యుండును. కాని మానవుని మాధుర్యము సర్వాంశములందు నిట్లు సుగోచరము కానిది. అతనియం దనేకమైన సూక్ష్మములును, సుకుమారములును నైన యనిర్వచనీయములగు నుద్రేకము లున్నవి. వానిని మనము కేవల మింద్రియములతో నవగత మొనర్చుకొన లేము. కల్పనాద్వారమున సృష్టించికొందుము. నామ మా సృష్టికార్యమునందు సహాయ మొనర్చును. ఒక్కసారి మనస్సునందు భావించిచూచిన తెలియగలదు, ద్రౌపదియొక్క నామ మూర్మిళ యైయుండె నేని యా పంచవీర

పతిగర్వత యగు క్షత్రియనారియొక్క దీప్తతేజ మీ తరుణకోమల నామముద్వారా నడుగడుగున కంటబడెడిది.

అందువలన నామము కొఱకు వాల్మీకియెడల కృతజ్ఞుఁడనై యున్నాను. కవికులగురు వీమె విషయమున చాల నవిచారమొనర్చినాఁడు, కాని దైవికముగ నీమె నామము మాండవి లేక శ్రుతకీర్తిగ నుంచలేదు. అది యొక విశేషసౌభాగ్యము. మాండవీశ్రుతకీర్తుల సంబంధముగ మన కేమియుఁ దెలియదు, తెలిసికొనుటయందు కుతూహలమును లేదు.

ఊర్మిళను మనము విదేహనగరమునందలి వివాహమంటమున వధూరూపమున చూచినాము. అటుపై నామె రఘుకులమునందు సువిపులాంతఃపురమున ప్రవేశించిన తరువాత నింక నొక్క దినమున నైనను యీమెను చూచినట్లు జ్ఞాపకము లేదు. వివాహసభయందలి యీమె వధూవేషముయొక్క చిత్రమే మనస్సునం దంకితమై నిలిచినది. ఊర్మిళ చిరవధువు - నిరంతరావకుంఠిత, నిశ్శబ్దచారిణి. భవభూతియొక్క కావ్యమునందును ఆమె యీ చిత్రమే ముహూర్తమాత్రము ప్రకాశితమైనది. సీత కేవలము స్నేహకౌతుకమున నొకమారుమాత్ర మామె చిత్రముపై తర్జని నుంచి మఱఁదిని ప్రశ్నించెను: 'వత్సా! ఈమె యెవరు ?' అని. లక్ష్మణుఁడు లజ్జితహాసమున మనస్సునం దనుకొనెను. 'ఓహో! ఊర్మిళవిషయము పూజ్యురా లడుగుచున్నది' అని, తత్క్షణము లజ్జతో నా చిత్రపటమును మూసివేసెను. తరువాత నింక రామచంద్రుని యింత విచిత్రమైన సుఖదుఃఖచిత్రపటశ్రేణియం దిక

నొక్కమారును కౌతూహలముతో కూడిన యెవరి యంగుళియు నీ చిత్రముపై మఱి పడలేదు. ఆమెమాత్రము కేవలము వధువైన ఊర్మిళమాత్రమే!

తరుణశుభ్రఫాలభాగమున నే దినమున ప్రథమసిందూర బిందువును ధరించెనో కాని ఊర్మిళ చిరకాలము నానాటి నవ వధువే. కాని రామాభిషేకమంగళాచరణప్రయత్నమునం దే దినమున నంతఃపురస్త్రీలు నిమగ్నలై యుండిరో యా దినమున నీ వధువును సీమంతముపై నర్థావకుంఠన మొనర్చుకొని రఘుకుల లక్ష్ములతోపాటు ప్రసన్నకల్యాణవదనముతో మాంగళ్యరచనయందు నిమగ్న కాలేదా? ఇఁక నే దినమున నయోధ్య నంధకారమునఁ ద్రోసి రాజభ్రాత లిరువురును సీతాదేవిని వెంట నిడుకొని, తాపసవేషములతో గృహము వీడి బయలువెడలిరో యా దినమున నూర్మిళావధువు రాజహర్మ్యమునందలి యే నిభృతశయనాగారమునందు వివిక్తశయ్యపై వృంతచ్యుతముకుళమువలె లుంఠితయై పడియుండెనో దాని నెవ్వరైన ఎఱుఁగుదురా? ఆ దినమున నా విశ్వవ్యాప్తమైన విలాపమునం దీ విదీర్యమాణమైన చిన్ని కోమలహృదయమునందలి సహింపరాని శోకము నెవరు చూడఁ గల్గిరి? ఏ ఋషికవి క్రౌంచవిరహిణియొక్క వైధవ్యదుఃఖమును ముహూర్తమాత్రముకూడ సహింపఁజాలకపోయెనో ఆయనయైన ఆమెపై నొకమారు దృష్టిపాత మొనర్చి చూడలేదు.

లక్ష్మణుఁడు రామునికొఱ కాత్మత్యాగసాధన మొనర్చియుండెను. ఆ గౌరవము భారతవర్షమునందలి ప్రతిగృహము

నందును నేఁడుసైతము ఘోషింపఁబడుచునే యున్నది. కాని సీతకొఱకైన యూర్మిళ యాత్మత్యాగము కేవలము ప్రపంచము నందే కాదు, కావ్యమునందుకూడ స్పృశింపఁబడలేదు. లక్ష్మణుఁడు తన దేవతాయుగళముకొఱకు స్వాయముగఁ దన్ను తా నుత్సర్గమొనర్చికొని యుంఁడెను. ఊర్మిళ అంతకంటె నధికముగ తన భర్తనే దాన మొసఁగియుండెను. ఆ విషయము కావ్యమునందు వ్రాయఁబడ లేదు. సీతయొక్క యశ్రుజలమునం దూర్మిళ సంపూర్ణముగ కొట్టుకొనిపోయెను.

లక్ష్మణుఁడు పదునాలుగు సంవత్సరములు తన యుపాస్య ప్రియసోదరుని ప్రియకార్యసాధన యందు నియుక్తుఁడై యుండెను; నారీజీవితమునందలి శ్రేష్ఠమైన యా పదునాలుగు వత్సరము లెట్లు గడిచిపోయినవి! భర్తతోనైన ప్రథమతమ మధురతమమైన పరిచయారంభసమయమున లజ్జాయుతమైన నవప్రేమ యం దామోదితమై వికాసోన్ముఖమైన హృదయముకళమును తీసికొని ఆ ముహూర్తమునందే లక్ష్మణుఁడు సీతాదేవి యరుణ చరణక్షేపమునందు దృష్టినుంచి వనమున కేగెను. తిరిగి వచ్చు నప్పటికి నవవధువుయొక్క చిరప్రణయాలోకవంచితహృదయము నం దా నవీనత యుండియుండెనా? సీతాదేవి దుఃఖముతో నూర్మిళ దుఃఖము నేరైన పోల్చిచూచెద రని కాఁబోలు కవి సీతయొక్క స్వర్ణమందిరమునుండి యీ శోకోజ్జ్వలమైన మహాదుఃఖినిని సంపూర్ణముగ బయటకు పంపివేసెను! జానకీపాదపీఠ పార్శ్వమునందు సైతము కూర్చుండఁబెట్టుటకు సాహసించ లేదు.

సంస్కృతకావ్యములయందలి మఱి యిద్దరు తపస్వినులు మన చిత్తక్షేత్రమున తపోవనమును రచించికొని యందు నివసించుచున్నారు. వారిరువురు ప్రియంవదయు, అనసూయయు. వారు భర్తృగృహగామినియైన శకుంతలను సాగనంపి మార్గమధ్యమునుండి యేడ్చుచు నేడ్చుచు మరలి వచ్చిరి. నాటకమునం దిఁక ప్రవేశించ లేదు. సరాసరి మన హృదయములందుఁ బ్రవేశించి యాశ్రయగ్రహణ మొనర్చినారు.

కావ్యమునం దెల్లరకును సమానప్రవేశ ముండఁజాల దని యెఱుఁగుదును. కఠినహృదయుఁడైన కవి తన నాయికానాయకులకొఱ కెన్ని యక్షయప్రతిమలను నిర్మించి నిర్మించి, నిర్మమచిత్తముతో విసర్జన మొనర్చును! కాని యతఁడు, ఎచ్చట నెవరిని కావ్యమున కవసరమని తెలిసికొని నిక్షేప మొనర్చివేయునో యచ్చటనే వారి కంతమగునా? దీప్తరోషులైన ఋషిపుత్రద్వయమును, హతబుద్ధియైన గౌతమియు తపోవనమునకు తిరిగి వచ్చి, యుత్సుకలును నుత్కంఠితలును అగు నిరువురు సఖులకును రాజసభయందలి వృత్తాంతమును తెలియఁజేసి నప్పుడు వారి కేమైనదో యా విషయము శకుంతలానాటకము నెడల పూర్తిగా ననావశ్యకము. కాని అందుకని యా యకథితమును, యమేయమును నైన వేదన యచ్చటనే సమసిపోయినదా? మన హృదయకుహరములందు ఛందోహీనముగ, భాషాహీనముగ చిరకాల ముద్భ్రాంతమై తిరుగుచుండుట లేదా?

కావ్యము వజ్రపు తునుకవలె కఠినము. అనసూయా ప్రియంవదలు శకుంతల కెట్టివారో యాలోచించి చూచినప్పుడు, ఆ కణ్వాదుహితయొక్క పరమదుఃఖసమయమునందే యా సఖీద్వయమును, అనావశ్యక మను నపవాద మిచ్చి సంపూర్ణముగ వర్జించివేయుట కావ్యము విషయమున న్యాయవిచారసంగతము కావచ్చును, కాని యది నిరతిశయమైన నిష్ఠురము.

శకుంతలయొక్క సుఖ సౌందర్యములను గౌరవగరిమను వృద్ధినొందించుటకొఱకే యీ రెండు లావణ్యప్రతిమలును తమ సమస్తముతో నామెను వేష్టన మొనర్చియుండెను. ముష్వురు సఖీమణులును జలఘటములతో నకాలవికసితనవమాలతీతలము నకు వచ్చి నిల్చినప్పుడు దుష్యంతుఁడు ఒక్క శకుంతలను మాత్రమే ప్రేమించియుండెనా? ఈ యిరువురును తాపసీసఖులు. ఒక్క శకుంతల శకుంతలయందలి తృతీయాంశము మాత్రమే. శకుంతలయం దధికాంశములు ప్రియంవదా అనసూయలు. శకుంతలయే అందఱికంటెను తక్కువ. మూఁడువంతులు ప్రేమాలాపమును వా రిరువురే సంపన్న మొనర్చిరి. తృతీయాంకమునం దెచ్చట యేకాకినియైన శకుంతలతో దుష్యంతునిదైన ప్రేమాకులత వర్ణింపఁబడినదో యచ్చట కవి హీనబలుఁడై పోయెను. ఎట్లో త్వరపడి గౌతమిని ప్రవేశింపఁజేసి యతఁడు రక్షను పొందినాఁడు. కారణ మేమన శకుంతల నావృత మొనర్చి సంపూర్ణముగ నొసర్చినవా రచ్చట లేకుండిరి. వృంతచ్యుతకుసుమము దివాకాలమునందలి ప్రఖరమైన యాలోకమును సహించికొనఁ

జాలదు. వృంతబంధమును, ఈషత్పల్లవాంతరాళమును మించి యా యాలోకము దానిపై నంతగా కమనీయమైన కోమల భావమున ప్రసరింపదు. నాటకమునందలి యా కొన్నిపత్రము లలో సఖీవిరహితయైన శకుంతల యెంతో స్పష్టరూపమున నసహాయ, యసంపూర్ణ, యనావృతభావమున కంటఁబడును. ఆమె దెస బాగుగ చూచుటకు సంకోచ మొదవును. అవాంతర ముగ ఆర్యయైన గౌతమియొక్క యావిర్భావమున పాఠకుఁడు మాత్రమే మనస్సునందు విశ్రాంతిలాభము నొందును.

రాజసభయందు దుష్యంతుడు శకుంతలను పోల్చికోనఁ జాలకపోవుటకు ప్రధానకారణ మామె వెంట ననసూయాప్రియం వదలు లేకుండుటయే యనిపించును. ఈమె తపోవనమునకు వెలు పల, అందును శకుంతల ఖండిత- పోల్చుట కష్టమే కావచ్చును.

శకుంతల సమ్మానితురాలై ప్రస్థాన మొనర్చెను. తరు వాత సఖులు తపోవనమునకు మరలివచ్చిరి. అప్పు డీక వారికి శైశవసహచారిణియైన శకుంతలనుగూర్చిన విరహదుఃఖము మాత్రమేనా ? శకుంతల యభావముకాక నింతలో తపోవనము నం దీక నెట్టి పరివర్తనయు జరుగనే లేదా ? ఆహా, వారు జ్ఞాన వృక్షముయొక్క ఫలముల నారగించుచున్నారు. దేని నెఱుఁగరో దానిని తెలిసికొనినారు. కావ్యమునందలి కాల్పనికనాయికయొక్క వివరణమును పఠించికాదు, వారికి ప్రియతమమైన చెలికత్తె హృద యమునం దవతరణ మొనర్చినది ! ఇప్పటినుండి యపరాహ్ణమున నాలవాలమునందు జలసేచన మొనర్చుటను మధ్యమధ్య వారు

మరచిపోకుందురా ? వారిప్పుడు మధ్యమధ్య పత్రములయొక్క-మర్మరధ్వనికి చకితలై యశోకతరువు నంతరాళమున ప్రచ్ఛన్నమైన యొకానొక యూగంతుకుని యాశంకించరా ? మృగశిశువిఁక వారి పరిపూర్ణాదరమును పొందునా ?

ఇప్పుడా సఖీభావనిర్ముక్తలును, స్వతంత్రలును నగు ననసూయాప్రియంవదలను మర్మరితతపోవనమునందు తమ జీవనగాథాసూత్రమునం దన్వేషించి వచ్చెదను. వా రేమియు ఛాయలు కారుగదా! శకుంతల వెనువెంట నొక దిగంతమునుండి వేఱొక దిగంతమునకు వా రస్తంగతలు కాలేదుకదా. వారు సచేతనలు, మూర్తిమతులు. రచితమైన కావ్యమునకు వెలుపల, అనభినీత నాటకమునందలి నేపథ్యమునం దిప్పుడు వారు వృద్ధిఁ జెందినారు. అతిపినద్ధమైన వల్కలము లిప్పుడిఁక వారి యౌవనమును బంధించి యుంచఁజాల కున్నవి. ఇప్పుడిఁక వారి మధురహాసముపై నంతర్ఘనమైన భావావేగము నవవర్షాసమయప్రథమమేఘమాలవలె నశ్రుగంభీరచ్ఛాయను నిక్షేపించినది. ఇప్పుడిఁక నొక్కొక్క- దినమున నా యనన్యమనస్క-లయొక్క- యుటజప్రాంగణమునుండి అతిథులు వచ్చి తిరిగి పోవెదరు. మనమును తిరిగి వచ్చినాము.

సంస్కృతసాహిత్యమునందు మఱియొక యనాదృతవ్యక్తి యున్నది. ఆమెతో పాఠకులకు పరిచయమును కలుగఁజేయుటకు నేను సంకోచించుచున్నాను. ఆమె మఱెవరును కాదు, కాదంబరీ చరిత్రమునందలి పత్రలేఖ యామె. ఆమె యెచ్చట ప్రవేశించి

యత్యల్పస్థానము నాశ్రయించికొన్నదో అచ్చటి కామె వచ్చుట యం దెట్టి ప్రయోజనము నుండియుండ లేదు. స్థాన మామె పక్షమున నతిసంకుచితము. అడుగు కొంచె మిటో యటో వేసిన నిఁక సంకటమగును.

ఈ యాఖ్యాయికయందలి పత్రలేఖ ఏ సుకుమారమైన సంబంధసూత్రమున నాబద్ధమై నిలచినదో, అట్టి సంబంధము, ఏ సాహిత్యమునందు నిక చూడము. ఐనను కవి యతిసహజముగ సరళచిత్తముతో యీ యపూర్వమైన సంబంధబంధము నవతరింపఁజేసెను. ఒక్క క్షణములో ఛిన్నమై పోవు నను నాశంక వొడమకుండున ట్లీ యూర్ణతంతువునం దెచ్చుటను నిశ్వాసస్పందనమైన కాలేదు.

యువరాజైన చంద్రాపీడుఁ డధ్యయనమును పూర్తి గావించికొని ప్రాసాదమునకు తిరిగి విచ్చేసెను. అప్పు డొక దినమున ప్రభాతకాలమున నాయన గృహమునకు కైలాసు డను పేరుగల కంచుకి యొకఁడు వచ్చెను. ఆయన వెనుక నొక యనతియౌవనమైన బాలిక యున్నది. మస్తకముపై నింద్రగోపకీటము వలె రక్తాంబరావకుంఠనముతో, లలాటమునందు చందనతిలకముతో, కటియందలి హేమమేఖలతో, కోమలతనురేఖలయందు ప్రతిదియు నా క్షణముననే నూత్నముగ నంకితమైనట్లుగ నున్న యా తరుణీమణి లావణ్యప్రభాప్రభావమున భవనమును నింపి వేయుచు క్వణితమణినూపురాకులితచరణములతో కంచుకి ననుగమించి వచ్చినది.

కంచుకి ప్రణామ మొనర్చి క్షితితలమున దక్షిణహస్తము నుంచి జ్ఞాపన మొనర్చెను. 'కుమారా, తమ జనయిత్రి మహాదేవి విలాసవతి తెలియఁజేయు చున్నది: ఈ కన్య పరాజితుండైన కులూతేశ్వరుని కుమార్తె. ఈమె బంది, యీమె పేరు పత్రలేఖ. ఈ యనాథ రాజదుహితను నేను దుహితృనిర్విశేషముగ నింతకాలము పోషించితిని. ఇప్పు డీమెను తాంబూలకరండవాహిని నొనర్చి నీయొద్దకు పంపుచున్నాను. ఈమెను సామాన్య పరిచారికవలె చూడకుము. బాలికనువలె లాలించి స్వీయచిత్తవృత్తినివలె చాపల్యమునుండి నివారించికొనుము. శిష్యురాలివలె చూచికొనుము. మిత్రునివలె సమస్తమైన స్వాచ్ఛందవ్యాపారములందును నాంతర్యములోనికి దీసికొమ్ము. ఇఁక నీ కల్యాణి నెట్టి కార్యములందు నియుక్త మొనర్చిన నీకు చిరపరిచారికగ నుండఁజాలునో యట్టి కార్యములందే నియోగింపుము.' అని.

కైలాసుఁ డీ వాక్యములు పలుకుచుండగనే పత్రలేఖ యతనికి యభిజాతప్రణామ మాచరించెను. చంద్రాపీడుఁ డామె ననిమేషలోచనముల నెంతయో కాలము నిరీక్షించి, 'అమ్మగారి యాజ్ఞానుసారము వర్తించెదను' అని వచించి దూతకు సెల వొసంగి పంపెను.

పత్రలేఖ పత్ని కాదు, ప్రణయినియు కాదు, కింకరియు కాదు. పురుషుని సహచరి. ఈ రూపమైన యపూర్వసఖీత్వము సముద్రద్వయమధ్యవర్తియైన వాలుకాతటము వంటిది. దానికి రక్షణ యే తీరున నగును? నవయౌవనులైన యువతీయువకుల

యం దనాదికాలసంబంధి యగు నే చిరంతనమైన ప్రబలాకర్షణ మున్నదో యది రెండువైపులనుండియు యీ సంశ్లిష్టబంధము నించుక శిథిలింపఁజేసి యతిక్రమింపఁజాలకుండుట యేలనో!

కాని కవి యీ యనాథయైన రాజకన్యను చిరస్థాయిగ నీ యప్రశస్తమైన యాశ్రయమునందు కూర్చుండబెట్టెను. ఈ యవధినుండి బయటి కేనాడును రేఖామాత్రమైన నామెను రప్పించలేదు. హతభాగినియైన బంధితురాలియెడల కవి కింతకు మించిన యుపేక్షాభావ మింకేమి యుండగలదు? అతి సూక్ష్మమైన యొక యవనికాంతరాళమున వసించియు నామె తన స్వాభావికస్థానమును పొందఁజాలక పోయినది. పురుషుని హృదయ పార్శ్వమున నామె జాగరిత, కాని యంతరమున పదార్పణ మొనర్పలేదు. ఏనాఁడు నే వసంతసమీరమునందును యీ సఖీత్వపు యవనికయొక్క యంచలమైనను యెగిరిపడలేదు.

ఐనను సఖీత్వమునందు లేశమాత్రమైన యంతరాళ మొదవలేదు. కవి వచించుచున్నాఁడు. 'పత్రలేఖ యీ ప్రథమ దినసమునుండియు చంద్రాపీడుని దర్శనమాత్రముననే సేవారస సముపజాతానంద యగుచు, పగ లనక, రేయి యనక, ఉపవేశన మునను, ఉత్థానమునందును, భ్రమణమునందును ఛాయవలె రాజపుత్రుని పార్శ్వమును పరిత్యజించ లేదు. చంద్రాపీడునికిని ఆమెను చూచినప్పటినుండియు ప్రతిక్షణమును క్రమోన్నతమైన మహాప్రీతి యీమెయందు జనించెను. ప్రతిదినము నీమెయందు ప్రసన్నభావమును నిల్పికొనెను, సమస్తమైన యాంతరికవ్యవ

హారములందును యీమెను స్వీయముగ గ్రహించి నడచుకొను చుండెను.

ఈ సంబంధ మపూర్వరమణీయము. కాని దీనియందు నారీత్వాధికారమునకు పూర్ణత లేదు. స్త్రీవిషయమున స్త్రీ కెట్టి లజ్జాబోధహీనమైన సఖీసంపర్క ముండునో పురుషునితో నామె కట్టి యసంకోచమును, ననవచ్ఛిన్నమునైన నైకట్యమునందు పత్రలేఖయొక్క నారీమర్యాదవిషయమున కాదంబరీకావ్యమున నెట్టి యవజ్ఞ ప్రకటితమైనదో, యది పాఠకుని మనస్సున కాఘాతము నిచ్చుట లేదా? ఎట్టి యాఘాతము? ఆశంకాసంబంధమైనది కాదు, సంశయసంబంధియు కాదు. కారణ మేమన, కవి యొకవేళ నాశంకాసంశయములకైనను లేశమాత్రము స్థానమిచ్చియున్నచో, దానిని పత్రలేఖయొక్క నారీత్వమునెడల నేదో విధమైన సన్మానముగ గ్రహించియుందుము. కాని యీ యిరువురు యువతీయువకులమధ్య లజ్జాశంకాసందేహములందు దోదూయమానమైన స్నిగ్ధచ్ఛాయయు గోచరించదు. పత్రలేఖ తన యపూర్వసంబంధవశమున నంతఃపురమును త్యజించియే వేసెను. కాని స్త్రీపురుషులు పరస్పరము సమీపవర్తు లగుచో స్వాభావముగనే యొకానొక సంకోచము సంభ్రమమున, నింత యేల హాస్యవ్యాజమున నొక లీలాన్విత కంపమానమానసికాంతరాళము, తనంతన విరచితము కాఁజాలునో, వీరిమధ్య నట్టిదియు కాలేదు. ఆ కారణముననే యీ యంతఃపురవిచ్యుతమైన యంతఃపుర పరిచారికకొఱకు సర్వదా క్షోభము జనించుచుండును.

చంద్రాపీడునితో పత్రలేఖయొక్క నైకట్యమును యసామాన్యమైనది. దిగ్విజయయాత్రాసమయమునందు, ఒకే యేనుగుపై పత్రలేఖను సమ్ముఖమునందు కూర్చుండఁబెట్టుకొని రాజపుత్రుఁ డాసీనుఁడగును. శిబిరమునందు నిశాసమయమున చంద్రాపీడుఁడు తన శయ్యాసమీపమున నుపవిష్టుఁడైన పురుషసఖుఁడు వైశంపాయనునితో సంభాషించు నప్పుడు, తత్సమీపమునందే నేలపై విన్యస్తమైయున్న తివాసిపై పత్రలేఖ నిద్రించుచుండును.

తుదకు చంద్రాపీడునితో కాదంబరికి పరిణయసంఘటనయైనప్పుడుసైతము పత్రలేఖ తన సంకీర్ణస్థానమునందే యవ్యాహతముగ నుండిపోయెను. కారణ మేమన పురుషుని చిత్తమునందు స్త్రీ యెంత స్థానమును పొందఁజాలునో దానియందలి సంకీర్ణతమప్రాంతమును మాత్రమే నామె యాక్రమించుకొనియుండెను; అచ్చట మహామహోత్సవముకొఱకు స్థాన మీయవలసి వచ్చినప్పుడు యీ యించుకస్థానమునుండి మాత్ర మామె వంచితురా లగుట కవసర మేర్పడలేదు.

పత్రలేఖవిషయమున కాదంబరికి యీర్ష్యయాభాసమాత్రముగఁగూడ నుండలేదు. ఇంతయేల, చంద్రాపీడునితో పత్రలేఖకు ప్రీతికరమైన సంబంధ మున్నది గనుకనే కాదంబరి యామెను ప్రియసఖిభావమున సాదరముతో స్వీకరించినది. కాదంబరీకావ్యమునందు పత్రలేఖ యే యపురూపమైన భూఖండమునం దున్నదో యచ్చట యీర్ష్య, సంశయము, సంకటము, వేదన, యేమియు

లేవు. అది స్వర్గమువలె నిష్కంటకము, ఐనను స్వర్గమునందలి యమృతబిందు వెచ్చట ?

ప్రేమయొక్క యుచ్ఛ్వసితమైన యమృతపాన మామె సమ్ముఖముననే జరుగుచున్నది. దాని నాఘ్రాణించుటకైన నామె దేహమునందలి యొక్క రక్తబిందువేని యేనాడును చాంచల్యము నొందలేదు. ఆమె యేమైన చంద్రాపీడుని ఛాయయా ? రాజపుత్రుని తప్తయౌవనమునందలి తాపమైన నామెను స్పృశించలేదా ? కవి యీ ప్రశ్నకు సమాధాన మొసఁగుటనైతె ముపేక్షించినాఁడు. కావ్యసృష్టియం దామె యింతటి యుపేక్షిత.

పత్రలేఖ కొంతకాలము కాదంబరితో నేకత్ర వసించిన పిమ్మట నొక వార్తను తీసికొని చంద్రాపీడుని సమీపమునకు తిరిగి వచ్చెను. మందహాసముతో దూరమునం దుండియే చంద్రాపీడుని యెడల ప్రీతిని ప్రకాశింపఁజేసి యామె నమస్కరించి నప్పుడు, పత్రలేఖ స్వభావముగ ప్రణయిని యయ్యును కాదంబరి యొద్దనుండి ప్రసాదముగ లభించిన వేఱొక సౌభాగ్యమువలె చంద్రాపీడుఁ డామె నతితరమైన యాదరముతో నాసనమునుండి లేచి యాలింగన మొనర్చికొనెను.

చంద్రాపీడుని యీ యాదరపూర్వకమైన యాలింగనము ద్వారా పత్రలేఖ కవిచేత ననాదృతి నందినది. మన మనుఁనది కవి యంధుఁ డని. కాదంబరీమహాశ్వేతల వైపే క్రమాగతముగ నొకే దృష్టిని లక్షించుటఁజేసి యాయన నేత్రము లా యౌజ్జ్వల్యమునం దంధములైనవి. ఈ సామాన్యమైన బందీని ఆయన

చూడనే లేదు. ఈమెయందు ప్రణయతృష్ణార్తమును, చిరవంచితమును నగు నొకానొక నారీహృదయము మిగిలిపోయిన దను విషయము నాయన పూర్తిగ విస్మరించెను. బాణభట్టు కల్పనయందు ముక్తహస్తుఁడు. అస్థానమునందును అపాత్రయందును సైతము ఆయన యజస్రముగ కవితావృష్టి నొనర్చుచు పోయెను. కేవల మాయన కృపణత్వ మంతయు నీ యనాథయైన రాజదుహితయందే ప్రకటమైనది. ఆయన పక్షపాతదూషితమైన యంధతవలన పత్రలేఖ హృదయమునందలి నిగూఢతమవిషయము నించుకేనియు నెఱుఁగజాలఁడయ్యెను. తరంగలీల నాయన యెంతవఱకు వచ్చుట కనుమతించెనో అది యంతవఱకే వచ్చి యాఁగిపోయిన దనుకొనినాఁడు. పూర్ణచంద్రోదయమునందు సైతము అది ఆయన యాదేశము నగ్రాహ్య మొనర్పలేదు. అందుచేత, కాదంబరి చదివి నప్పుడు– ఇతరనాయికల వృత్తాంత మనావశ్యకమైనంత విపులముగ వర్ణితమైన దనియు, పత్రలేఖవృత్తాంత మించుకయు చెప్పఁబడనే లేదనియు తోఁచును.



# ఉత్తమ గ్రంథములు



**జ్ఞానం : విజ్ఞానం** – ఇలిన్ & సెగాల్; అనువాదం : మహీధర జగన్మోహనరావు – గ్లేజుకాగితం – 510 పుటలు – చక్కని బైండు – రెండురంగుల జాకెటుతో రు. 6=50

**జనులు : మహాజనులు** – ఇలిన్ & సెగాల్; అనువాదం : మహీధర జగన్మోహనరావు – రఫ్ కాగితం –516 పుటలు చక్కనిబైండు రెండురంగుల జాకెటుతో రు. 6=00

**మానవులు : మహీధరములు** – ఇలిన్ & సెగాల్ – అనువాదం : మహీధర జగన్మోహనరావు – రెండోకూర్పు – 120 బొమ్మలతో గ్లేజుకాగితం 532 పుటలు చక్కనిబైండు జాకెటుతో రు. 7=50

**యక్ష ప్రశ్నలు** – పిల్లలకు పనికివచ్చు శాస్త్రీయగ్రంథం – రచన మహీధర జగన్మోహనరావు – నాల్గవకూర్పు – 67 బొమ్మలతో – గ్లేజుకాగితం – హాఫ్ క్యాలికో బైండుతో రు. 3=00

**దక్షిణపవనం** – స్టాలిన్ ప్రైజు నవల – రచన – ఎల్మర్ గ్రీన్ – అనువాదం – మహీధర జగన్మోహనరావు – ఫిన్లాండుదేశపు యితివృత్తము – రఫ్ పేపరు – బైండుగలది – 390 పుటలు రు. 4=50

**నా బాల్యం** – రష్యన్ కవి గోర్కీ ఆత్మకథ – అనువాదం – మహీధర జగన్మోహనరావు – రఫ్ కాగితం – 510 పుటలు – చక్కని బైండు – జాకెటుతో రు. 5=00

**నాడు-నేడు** – రష్యను నవల – సామాజిక యితివృత్తం – అతిమనో హరమైన రచన – రచయిత : అడయంకో – అనువాదం : మహీధర రామమోహనరావు – రెండోకూర్పు – మెకానికల్ గ్లేజుకాగితం – చక్కనిబైండు 352 పుటలు రు. 5=00

**విద్య** – హెర్బర్టు స్పెన్సర్ – అనువాదం : ఖండవల్లి బాలేందుశేఖరం ఎం. ఏ. – పాశ్చాత్యవిద్యావిధాన మూలసిద్ధాంతాలు తెలుపు గొప్ప రచన – సరళమైన గ్రాంథికభాషలో అనువదించబడినది – గ్లేజు కాగితం – 410 పుటలు పూర్తిక్యాలికోబైండు – జాకెటుతో రు. 6=00

**రథచక్రాలు** – ఆంధ్రదేశపు రాజకీయనవల – రచన : మహీధర రామ మోహనరావు – పత్రికాలోకం ప్రశంసించిన చక్కని రచన – రెండవ ముద్రణ – గ్లేజుకాగితం-510 పుటలు బైండుతో రు. 5=00

**టాల్‌స్టాయ్ కథలు** – రష్యనుకవి టాల్‌స్టాయ్ కథలలో అత్యుత్తమమైనవి, నీతిబోధకమైనవి పది కథలుగల సంపుటి – అనువాదం మహీధర జగన్మోహనరావు – విమర్శకుల పొగడ్తలనందిన చక్కని వ్యావహారికశైలి నాలుగోకూర్పు – టాల్‌స్టాయి ముఖచిత్రముతో-గ్లేజు కాగితము – 210 పుటలు రు. 2=00

**టాల్‌స్టాయ్ జీవితం** – రచన మహీధర రామమోహనరావు-రష్యన్ కవి, బోధకుడు, మహాపురుషుడునైన టాల్‌స్టాయ్ జీవిత చరిత్ర – రెండోకూర్పు- రఫ్ కాగితం–100 పుటలు టాల్‌స్టాయ్ ఫొటోతో రు. 1=00

**వ్యవసాయ సామెతలు** – సేకరణ నేదునూరి గంగాధరం–24 పుటల పీఠికతో – రెండోకూర్పు – సుమారు 1200 తెలుగు వ్యవసాయ సామెతలు – అనేక యితరదేశాల సామెతలలోగూడిన అనుబంధముతో – రెండోకూర్పు – రఫ్ కాగితం – రెండురంగుల చక్కని ముఖచిత్రంతో – 100 పుటలు రు. 1=00

**సాహిత్యజగత్తు & కావ్యజగత్తు** - విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ వ్యాసముల సంపుటి. విడిగా ప్రచురించబడిన ఈ రెండు ఉత్తమ సాహిత్య విమర్శనా గ్రంథములను కలిపి బైండు చేయబడినది. గ్లేజు కాగితం. చక్కని బైండు - జాకెటుతో - 180+144 పుటలు.
రు. 6=00

**గోర్కీ కథలు** - మాగ్జిం గోర్కీ రచనకు మహీధర జగన్మోహనరావు గారి అనువాదం - చక్కని ఆరు కథలు - రెండో కూర్పు - గ్లేజు కాగితం - 160 పుటలు
రు. 1=50

**చెకోవ్ కథలు** - ఆంటన్ చెకోవ్ - అనువాదం మహీధర జగన్మోహనరావు - అతిమనోహరమైన కథల సంపుటి - 13 కథలు - 240 పుటలు - రఫ్ కాగితం
రు 2=50

**మపాసా కథలు** - గై - డీ - మపాసా - అనువాదం మహీధర జగన్మోహనరావు 19 కథలు - 240 పుటలు-రఫ్ కాగితం రు 2=00

**వినోదమూ : విజ్ఞానమూ** - ప్రయోగములద్వారా విజ్ఞానశాస్త్ర మూల సూత్రాలను విశదపరచు సుబోధక రచన - మహీధర నళినీ మోహనరావు ఎమ్. ఎస్‌సి., 50 బొమ్మలతో - రెండో కూర్పు రఫ్ కాగితం - 100 పుటలు
రు. 1=50

**ప్రపంచపు ఆఖరిఘడియలు** - ఖగోళశాస్త్ర విజ్ఞానమును ఆసక్తి జనకంగా కథలవలె చెప్పు శాస్త్రీయ గ్రంథము - రచన "మహీధర" సుమారు 30 బొమ్మలతో - గ్లేజు కాగితం - 190 పుటలు - అట్ట బైండు
రు 3=00

**గ్రీకు పురాణగాథలు** - రచన ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు గ్రీకు పౌరాణిక దేవతలు, వీరులు మొదలైనవారి చరిత్రల సంకలనము - గ్లేజు కాగితం - 144 పుటలు-రెండురంగుల చక్కని ముఖ చిత్రముతో
రు. 2=00

| | | |
|---|---|---|
| ప్రకృతి : గతితర్కం - | ఫ్రెడరిక్ ఏంజిల్స్ | 0=63 |
| వానరుడు - నరుడు : పరిణామక్రమంలో కర్మపాత్ర | ,, | 0=50 |
| గోర్కీ జీవితం - జగన్మోహనరావు | రెండో కూర్పు | 2=00 |
| ఇండియా - మార్క్సు, ఏంజిల్సు లేఖలు | ,, | 1=00 |
| ఆంధ్రగాయకుల చరిత్రలు - | ఎమ్. రామలింగశాస్త్రి | 1=00 |
| ఆంధ్రుల చరిత్ర — | ఖం. బాలేందుశేఖరం M. A., | 2=00 |
| యూదుల చరిత్ర | ,, | 1=50 |
| శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్ర - | కె. రామచంద్రరావు | 1=50 |
| ఛాయ — 10 నాటికలు — | ముద్దా విశ్వనాథం | 2=00 |
| లెనిన్ జీవిత కథలు - బొమ్మలతో — | రెండో కూర్పు | 1=00 |
| ప్రతీకార జ్వాలలు - నవల - | ,, | 1=00 |
| చీనా కథలు - ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్ - | ,, | 1=00 |
| విజ్ఞాని పౌలోవ్ - మహావిజ్ఞాని జీవితం | | 2=50 |
| డిప్యూటీ చైర్మన్ - చీనా విప్లవ కథలు | | 1=00 |
| విప్లవ సందేశం - నాలుగో కూర్పు | | 0=50 |
| బలిదాన్ - నాటకం - లియోనిద్ లియోనోవ్ | | 1=00 |
| ఆచరణ - | మావో | 0=37 |
| ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం | ,, | 0=50 |
| వైరుధ్యములు - | ,, | 0=75 |
| రాజ్యాంగ యంత్రం - మూడో కూర్పు | లెనిన్ | 0=25 |
| రష్యా విప్లవం - 1905 - రెండో కూర్పు | ,, | 1=25 |
| కారల్ మార్క్సు - ఉపదేశాలు | ,, | 1=00 |
| వామపక్ష కమ్యూనిజం - బాల్యారిష్టం | ,, | 2=00 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర - రెండో కూర్పు | | 1=25 |
| ఓనమాలు — నవల — మహీధర రామమోహన్ | | 3=00 |
| నూరేళ్ళక్రితం — 1857 విప్లవ కథ | ,, | 2=00 |
| మహోదయం - నేపథ్య గేయ నాటిక — జమదగ్ని | | 1=50 |
| మధువీచి — గేయసంపుటి — మల్లాది రామచంద్రశాస్త్రి | | 1=50 |
| విశ్వవీణ ,, | ,, | 1=50 |

| | |
|---|---|
| శబ్ద సింధు — హిందీ — తెలుగు నిఘంటు 1300 పుటలు<br>1/8 డెమ్మీసైజు, గ్లేజుకాగితం — కాలికో బైండు | 12=00 |
| పారిజాతం — వివిధ కథల సంపుటి | 1=25 |
| తెర మెరుగులు — వివిధ నాటికల సంపుటి | 1=50 |
| బూచి — నవల — బలివాడ కాంతారావు | 1=25 |
| ఎమర్సన్ వ్యాసావళి — బి. వి. శ్రీనివాసాచారి | 1=88 |
| జమదగ్ని కథలు — చిలకా గోరింకా | 1=50 |
| తెనుగుజాతీయముల కథలు | 1=00 |
| బుద్ధభగవానుడు — చర్ల గణపతిశాస్త్రి | 2=00 |
| ఆంధ్రమహనీయులు — చిలుకూరి వీరభద్రరావు | 1=00 |
| కాదంబిని — నవల — తారాశంకర్ బెనర్జీ | 2=50 |
| న్యాయాధిపతి — నవల ,, | 2=50 |
| గౌరి — నవల — భట్టిప్రోలు కృష్ణమూర్తి | 3=00 |
| జర్మను అబ్బాయి కథ — Dr. వి యస్ శర్మ | 3=00 |
| జానపదగేయవాఙ్మయం — నేదునూరి గంగాధరం | 2=00 |
| మాధవీ కంకణం — నవల — రమేశచంద్రదత్తు | 2=25 |
| ఇచ్ఛినీకుమారి — నవల — కేతవరపు వేంకటశాస్త్రి | 1=50 |

మా పూర్తి కేటలాగుకై నేడే జాబు వ్రాయండి. తెలుగులో మీకే గ్రంథము కావలసినను మాకు వ్రాయుడు. పది రూపాయలకు మించిన మా పుస్తకములు తెప్పించువారికి పోస్టేజీ ఉచితము.




మహీధర ... నరావు

సంపాదకుడు.

విశ్వసాహిత్యమాల — రాజమండ్రి.